





శ్రీరస్తు

శుభమస్తు　　　　　　　　అవిఘ్నమస్తు



# పొడవుకు పొడవైన పురుషోత్తమా

## ఎన్నుకొన్న
## అన్నమయ్య సంకీర్తనలకు
## అవతారిక మరియు భావ వివరణ

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
**M.Tech.**

# పొడవుకు పొడవైన పురుషోత్తమా

మొదటి ప్రచురణ

**జనవరి 2013**

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

వెల : **అమూల్యం**

**ప్రతులకు :**

**ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం. 61, సిద్ధార్థ నగర్,**

**హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360**

**డి.టి.పి. ప్రింటింగ్ :**

**కె. వి. ఆర్**

**98495 79345**





**అంకితము**

# శ్రీహరి శరణాగతులకు

**భక్తితో**



ఈ ప్రపంచంలో మనస్ఫూర్తిగా హరినామ సంకీర్తన చేసే మహానుభావులకు, నాకు స్ఫూర్తియై నన్ను హరిదారిలో నడిపిన అసంఖ్యాకులలకు, పేరుపేరునా కృతజ్ఞతలు చెప్పుకోలేని తరుగని హరి శరణాగతులకు దీనిని అంకితమిస్తున్నాను. వారందరికీ తిరుమలేశుడు శ్రీవేంకటేశ్వరుని కరుణా కటాక్ష వీక్షణ లభించుగాక.

కం॥ పొడవుకు పొడవైన హరిన్

విడువక పురుషోత్తముండు వీడని కొలుతున్

వడి కృతినంకితమిత్తును

జడియక హరి కీర్తనంబు సలుపుఘనులకున్

# పొడవుకు పొడవైన పురుషోత్తమ

## ఎన్నుకొన్న అన్నమయ్య సంకీర్తనలకు అవతారిక మరియు భావవివరణ

## వర్ణానుసారముగ విషయసూచిక


| క్ర.సం. | కీర్తన | పేజి |
|---|---|---|
| 1. | అందరి బ్రతుకులునాతనివే | 27 |
| 2. | అక్కడనెక్కడ నరకము | 285 |
| 3. | అతడు లోకోన్నతుడాదిమపురుషుడు | 319 |
| 4. | అతడే యెఱుగును మముబుట్టించిన | 155 |
| 5. | అతి సులభంబిదె శ్రీపతిశరణము | 195 |
| 6. | అతిశోభితేయం రాధా | 45 |
| 7. | అదె చూడు తిరువేంకటాద్రి నాలుగు | 1 |
| 8. | అప్పుడు వేంకటరాయడలమేల్మంగ | 128 |
| 9. | అలసితిని పుణ్యపాపముల | 291 |
| 10. | అల్లవాడే వాడల్లవాడే | 35 |
| 11. | ఆనతియ్యగదవే అందుకేకాచుకొన్నాడ | 310 |
| 12. | ఆమూరితియే యీమూరితి | 242 |
| 13. | ఇంచుకంతధర్మములోనున్నది | 328 |
| 14. | ఇంతయు నీమాయామయమేగతి | 95 |







| | | |
|---|---|---|
| 15. | ఇందరిలో నేనెందుబోలుదు | 101 |
| 16. | ఇందుకంటె మరి ఇకలేదు | 261 |
| 17. | ఇతరములన్నియు నడమంత్రములే | 164 |
| 18. | ఇతని మరచితిమి యెదుటనె | 279 |
| 19. | ఇదినీమాయా యింద్రజాలమో | 227 |
| 20. | ఇదియే కావలెనని తాగైకొని | 230 |
| 21. | ఇదియే ఉపాయమికనాకు | 236 |
| 22. | ఇదెనీ చిత్తంబింక నా భాగ్యము | 300 |
| 23. | ఇరవుగ నిన్నెరిగిరి యిదివోనీదాసులు | 152 |
| 24. | ఇప్పుడే నేనొడబడమరవగ | 201 |
| 25. | ఇవిసేయగ నేనలసుడ | 81 |
| 26. | ఈతడే యీతడే సుండీయెంతయెంచి | 92 |
| 27. | ఉపకారిదేవుడు అపకారిగాడు | 207 |
| 28. | ఎంచి చూడరో ఘనులాల ఇందీవరాక్షుడు | 86 |
| 29. | ఎంతకాలంబైన తప్పదు యెవ్వరికి | 258 |
| 30. | ఎంతనినుతియింతు రామరామ ఇట్టి నీ ప్రతాపము | 137 |
| 31. | ఎక్కడ వోయనో జాతస్మరత్వము | 246 |
| 32. | ఎక్కడిది వివేకమెంత | 270 |

| | | |
|---|---|---|
| 33. | ఎట్టిదో మీమాయా విలాసము | 198 |
| 34. | ఎటువంటి భోగి వీడెటువంటి జాణ | 107 |
| 35. | ఎట్టుసేయగలవాడవో | 313 |
| 36. | ఎదురుమాటలాడితి నీకు | 322 |
| 37. | ఎన్నడు మానవు యీదుర్గుణములు | 176 |
| 38. | ఎన్నడు నేనిక బుద్ధెరిగేది | 192 |
| 39. | ఎన్నిబాధలుబెట్టి యేచెదవు నీవింక | 134 |
| 40. | ఎన్నిలేవు యీ యింద్రజాలములు | 340 |
| 41. | ఎప్పటి జీవుడే యెప్పటి జగమే | 140 |
| 42. | ఏకాత్మవాదులాల యిందుకేది వుత్తరము | 90 |
| 43. | ఏదిగతినేనొక్కడనే యెందరి కోపుదు | 334 |
| 44. | ఏమరజనదు బ్రతికేటి కాలము | 303 |
| 45. | ఏమనవచ్చును చెల్లుచున్నవివే | 167 |
| 46. | ఏమనిచెప్పుట మాయజ్ఞానము | 288 |
| 47. | ఏమిచెప్పెడినో శాస్త్ర రహస్యము | 186 |
| 48. | ఏలయ్యపరమాత్మ యేలికవు మాకునై | 143 |
| 49. | ఒక్కడవే లోకాన కొడయడవు | 53 |
| 50. | కటకటామీరితివి కలికాలమా | 63 |
| 51. | కనియు కానరు నీమహిమ కంస జరాసంధులు | 182 |
| 52. | కమ్మరను జీవునికిని యిది కారణమే | 276 |







| | | |
|---|---|---|
| 53. | కలదందేపో సర్వము గలదు | 120 |
| 54. | కలదిదివో సుఖము గలిగినను గర్భము | 72 |
| 55. | కలుగుట కలిగిననాడే నే ఘనపాపములకు | 213 |
| 56. | కాదనితోయగ నెంతటివారికి | 252 |
| 57. | కొండా చూతము రారో కొండుక తిరుమల కొండ | 219 |
| 58. | కొందరికివి సమ్మతమై కొందరికవి గావు | 39 |
| 59. | కోరుదు నామది ననిశము | 343 |
| 60. | ఘోరవిదారణ నారసింహా నీ | 10 |
| 61. | చల్లనైకాయగదో చందమామా నీ | 104 |
| 62. | చల్లరే హరిపై జాజర జాజ | 116 |
| 63. | చాలు జాలు నీ హరియే మాకును | 110 |
| 64. | చెలగి యధర్మము పుట్టింప నీకేల | 189 |
| 65. | జగన్మోహనాకార చతురుడ | 337 |
| 66. | జగన్నాథా నీ కొక్కనికి శరణుజొచ్చితి | 249 |
| 67. | జీవాతుమైయుండు చిలుకా నీ | 13 |
| 68. | జీవుని కేకాలము నీహరి చేరువ బంధువు | 210 |
| 69. | తందనానా అహా తందనానా పురే | 78 |
| 70. | తతిగొని యీపాటు దైవమా | 48 |
| 71. | ధర గడపట నే జంతువుకైనా | 113 |
| 72. | దైవమా నా పెరరేపణ లివితప్పక | 316 |

| | | |
|---|---|---|
| 73. | దేవా నీవే యిన్ని చందముల తిరముగ | 170 |
| 74. | నారాయణ నేనస్వతంత్రుడ | 264 |
| 75. | నిత్యాత్ముడైయుండి నిత్యుడై వెలుగొందు | 6 |
| 76. | నిత్యులు ముక్తులు నిర్మలచిత్తులు | 294 |
| 77. | 'నిశ్చింతం పరమం సుఖ' మనుమాటే | 158 |
| 78. | నీవు సర్వగుణ సంపన్నుడవు | 325 |
| 79. | నీవొక్కడివే సర్వాధారము | 267 |
| 80. | నీకెటువలసెనటు సేయుము | 273 |
| 81. | పుట్టుమాలిన బరుబోకివి | 29 |
| 82. | పురుషుండనిశృతి వొగడీనట | 84 |
| 83. | పెరుగు బెరుగ బెద్దలుగాగా పెనువెట్టి | 32 |
| 84. | ప్రాణుల నేరమి గాదిది | 131 |
| 85. | బలమగు కర్మములివివో జీవుల | 6 |
| 86. | మలఘుని నిన్న పెరుమాళ్ళు వీడే | 66 |
| 87. | మానరా నవ్వు మానరా | 204 |
| 88. | మేడలెక్కి నిన్ను జూచి కూడెనన | 346 |
| 89. | రాధామాధవరతి చరితం | 147 |
| 90. | వినరయ్య నరసింహ విజయము జనులాల | 57 |




పొడవుకు పొడవైన పురుషోత్తమా


| | | |
|---|---|---|
| 91. | విన్నపమిదియే వేవేలకు గోవిందా | 255 |
| 92. | విచారించుకోరో యివికులాల | 173 |
| 93. | వెదకి వెదకి చొప్పులొత్తుచు | 239 |
| 94. | వెట్టిమానుపరెవ్వరు | 282 |
| 95. | వెలపల మరువక లోపలలేదు | 98 |
| 96. | వెరపు దెలుపు నీవేగిరమే | 42 |
| 97. | వెఱతు వెఱతు నిందువేడుకపడ | 5 |
| 98. | వేగిరమేటికిని వేసటలేటికి | 307 |
| 99. | సకలోపాసకులకు నందును సగుణంబే | 216 |
| 100. | సకల దేవతలు నీ శరీరమే | 233 |
| 101. | సత్యము సేయగవచ్చును సర్వేశ | 224 |
| 102. | సరిగాదు వీడన వలదు | 331 |
| 103. | సర్వజ్ఞత్వము వెదకగ నొల్లను | 297 |
| 104. | సర్వోపాయముల జగతి నాకితడే | 69 |
| 105. | శరణని బ్రతకరో జనులాల | 123 |
| 106. | శరణాగత వజ్రపంజర | 179 |
| 107. | హరిహరి నిను సకలాంతర్యామివి | 161 |
| 108. | హరి గోవిందా హరి గోవిందా | 75 |

# ప్రార్థన

కం॥ శ్రీ పురుషోత్తముడే కద!
భూపతి లక్ష్మీవిభుండు "పొడవుకు పొడవౌ"
ఈ 'పొడుగు' కీర్తనంబుల
నే పూనుచు గొల్తునయ్య! నిన్నిటుల హరీ!

చం॥ సరసపు భక్తి కీర్తనలు స్వామి మహత్త్వము జెప్పు కీర్తనల్
విరివిగ జెప్పెనన్నమయ పేర్చితినొక్కెడ నెంచి వేయి, నే
హరి! అవతారికల్ మరియు అన్నిటి భావము తెచ్చి పేర్చితిన్
తిరుమలనాథ! నీ కృపనుదీటుగ జెప్పితి వేయినిన్ పదిన్.

సీ॥ తొలినాళ్ళ నాకున్న తెలిసీ తెలియనట్టి
మిడిమిడి జ్ఞానాన మేటివైన
కీర్తనంబులు ప్రక్కకిన్ బెట్టితిని కొన్ని
"పెద్దవైనాయని" వీడియంటి
చరణాలు తగ్గించి సవరించితిని కొన్ని
పరులననుకరించి వదలియుంటి
ఆనాడు వదలిన అద్భుత కీర్తనల్
తిరుగదోడెదనయ్య! తిరుమలేశ!

ఆ.వె॥ పొడవుకు పొడవైన పురుషోత్తమాయని
పేరుబెట్టి నేను పిలిచినాను
భావవివరములను వదలక జెప్పితిన్
బుధ జనులకు గూర్ప ముదము ముక్తి.

తే॥ వేయి కీర్తనలెన్నితి విశద పరచ,
భావవివరణ, దానితో పాటు తొలుత
దాని అవతారికను చెప్పి దన్యుడైతి,
ఇపుడు ఇది కొండలయ్యకే యెంత పొడవౌ!!





ఉ॥ ఏమిది నాదు భాగ్యమిక నేమనిచెప్పను దేవదేవ! నీ
కేమని మ్రొక్కెదన్ తిరుమలేశ్వర! యేమని కోరుకొందురా
నేమపు భక్తినిచ్చితివి నీపదదాస్యము నాకు జాలురా
ఓ మధుసూదనా! మదినివుండుము వూపిరి ఆగునంతకున్

తరళము॥ పొడవుకే పొడవైనవో సురపూజ్యవోపురుషోత్తమా!
పుడమి భర్తవు ఆమెపుత్రికి వున్నతంబగు భర్తవున్
తడవి అంగము వందలాదికి తాళిగట్టిన గొల్లవున్
వడిగ కోరికలిచ్చు వేంకటపర్వతేంద్రుడవోవిభో!

శా॥ కంసారిన్ మధుకైటభాంతకుని శ్రీకాంతామనోవల్లభున్
పుంసామోహను సూర్యచంద్రనయనున్ మోదంబుతో గొల్చెదన్
ఈ సామాన్యునికిన్ని యిచ్చిన ఘనున్ ఈ నూత్న యత్నంబుతో
వాసిన్యెన్నితి నన్నమయ్య కృతులన్ బారైన సంకీర్తనల్.

సీ॥ ఇదియపూర్వంబైన సదమల యత్నంబు
పురుషోత్తముని గొల్చు పుణ్యక్రతువు
శరణన్న వారికి పరుగిడి తోడుండు
మధుసూదనుని మ్రొక్కు మంత్రవిద్య
కరుణ జాల్వారెడి కరుణాకరుని పూజ
సలుపంగ దక్కించు సకల సుఖము
తిరుమలేశుని వేడ దీనులై దిక్కంచు
దరిచేరి కాపాడు తథ్యమిదియె

ఆ.వె॥ అరసి కరివరదుని మురహరిని దొరని
నమ్మి గొలిచి మనుడు నయము కలుగు,
ఆర్తరక్షణంబె హరికున్న నియమంబు
నన్ను నమ్ముడయ్య! వెన్నుగొలువ.

# ముందుమాట

ఈ రచనకు **పొడవుకు పొడవైన పురుషోత్తమా** అని పేరు పెట్టడంలో నా అంతరార్థం ముందుగా వివరిస్తాను. పొడవైనవాడు అంటే యెత్తయినవాడు అని అర్థం. ఉన్నతుడు అన్నమాట. పొడవుకు పొడవు అంటే "ఉన్నతోన్నతుడు" అన్నమాట. పురుషోత్తముడంటే శ్రీమన్నారాయణమూర్తి. ఉన్నతోన్నతుడైన శ్రీమన్నారాయణుడు అని ఈ రచన నామకరణానికి అర్థము చెప్పుకోవచ్చును.

అన్నమాచార్యులవారి కీర్తనల ప్రత్యేకత యేమంటే ఆయన వుపయోగించిన తెలుగు మాండలికము ఆనాటి సామాన్య తెలుగువాడు మాట్లాడిన భాష. అద్దో, వోరీ, చెల్లబో, సుండీ, అమ్మరో వంటి మాటలు నేటి కాలంలో వాడుకలో లేవు. అందుచేతనే ఆ తెలుగు కీర్తనలకు కూడా వివరణ అవసరమైవున్నది. ప్రతి కీర్తనకు అవతారిక ఇవ్వటం దేనికంటే ఆ కీర్తన ప్రత్యేకతను తేటతెల్లము జేయుట.

అన్నమయ్య కీర్తనలలో నూటికి తొంబది తొమ్మిది పల్లవిలో రెండు పాదములు, మూడు చరణాలలో ఒక్కొక్కదానిలో నాలుగు పాదములు వెఱసి 14 పాదముల కీర్తన వుంటుంది. లఘు కీర్తనలలో రెండు పాదములున్న చరణాలలో కొన్ని కీర్తనలున్నాయి. కొన్ని కీర్తనలు మూడు చరణాలు కాక రెండే చరణాలతో వున్నాయి. మూడు పాదముల పల్లవిగల కీర్తనలు, ఒకే ఒక పాదం గల కీర్తనలు కూడా వున్నాయి. అన్నమయ్య, ఆయన పుత్రుడు పెదతిరుమలయ్య, మనుమడు చినతిరుమలయ్య "వేంకట" మకుటం ప్రతి కీర్తనకు చివరి చరణాలలో చేర్చి తాళ్ళపాకవారి ప్రత్యేకత చాటుకొన్నారు.

ఈ కీర్తనలను అజరామరం చేయటంలో పెనుగొండ యేలిక సాళ్వనరసింహరాయల కృషి యెనలేనిది. నిడుపాటి పలుచని రాగిరేకులు చేయించి వాటిపై కొన్ని వేల కీర్తనలు అందులోను ఆశువుగా పాడి





వినిపించిన కీర్తనలను మామూలుగ ఆరు వందల యేళ్ళనాటి ధోరణిలో తాటియాకులపై వ్రాయించడం సర్వసాధారణమే. కాని ఈ కీర్తనలు అజరామరంగా వుండాలని రాగిరేకులపై చెక్కించడం నిజంగా బృహత్తర యజ్ఞమే. రాగిరేకులపై చెక్కిన పనివారలలో కన్నడిగులు అధికులుగా వున్న ప్రాంతం అవటంవల్ల తెలుగు లిపి వచ్చిన కన్నడిగులు యెక్కువమంది ఈ కీర్తనలను చెక్కివుంటారని అందువలన మాటల మధ్యలో 'యీ' బదులు 'ఈ', పల్లవి ప్రారంభంలో "ఎక్కడ" బదులు "యెక్కడ" అని వ్రాయటం జరిగింది. ఇటువంటి యెన్నో సాధక బాధకములకోర్చి తిరుమల తిరుపతి దేవస్థానములవారు అన్నమాచార్య ప్రాజెక్టును నెలకొల్పి నరసింహరాయల కృషికి తగ్గని కృషి సలిపి ఆ సప్తగిరీంద్రునికి అన్నమయ్య పద నీరాజనాన్ని నాబోటి సామాన్యుడికి ఆలంబన అయ్యేట్లు చేశారు. వేయి కీర్తనలను వివరించడం నేను కలలో కూడా వూహించలేని దుస్సాహసమే. ఆ తిరుమల రాయడు యెంతమందిలో దూరి నాకు బాసటయై వలసిన సాయం చేశాడో చెప్పలేను.

నా ఈ ప్రస్తుత ప్రయత్నంలో, నేనింతవరకు "ఇవి పెద్ద కీర్తనలు వీటి వివరణ రెండు పేజీలలోకి తగ్గించడం సాధ్యం కాదని విడిచిపెట్టిన 'పొడుగాటి కీర్తనలను యెన్నుకొని, పేజీల నియంత్రణ పాటించకుండా సాధ్యమైనంత వివరణ ఇస్తూ అన్నమయ్య కీర్తనలకు భావవివరణ సమకూర్చాను. ఎన్ని కీర్తనలను వివరించగలనో ఆ తిరువేంకటేశ్వరునికే తెలియాలి. రోజుకొక్క కీర్తన చేయాలనే నియమం కూడా లేదు. సాధ్యమైనంత విపులంగా అవసరమైనంత క్లుప్తంగా చెప్పాలని నా ఆశ. ఇక ఆపైన శ్రీవేంకటేశ్వరుని దయ.

ఇక్కడ ఒక అతి ముఖ్యమైన విషయం ప్రస్తావించాలి. అన్నమయ్య కాలం నాటి తెలుగు నుడికారానికి నేటి తెలుగు నుడికారానికి చాలా

తేడావున్నది. ఆనాటి కొన్ని పద ప్రయోగాలు నేడు లుప్తమైనాయి. కొన్ని పద ప్రయోగాలు మార్పు చెందాయి. ఆనాడు తమిళ, కన్నడ భాషల ఒత్తిడి తెలుగుపై రాయలసీమలో యెక్కువగా వుండటం వలన కొన్ని వాడుక పదములకు అర్థములు నిఘంటువుల్లో దొరకవు. నేడు మనం "ఏమిటే?" అనే మాటను ఆ రోజుల్లో "ఏమిరే?" అనేవాళ్ళు. ఇది మనకు యెక్కడా అంతుచిక్కదు. ఉదాహరణకు ఈ రచనలోని ఒక కీర్తనలో "పుట్టుమాలిన బరుబోఁకివి అనే పదము ప్రయోగించారు. ఎన్ని నిఘంటువులు తిరగవేసినా ఫలితం సున్నా.

రాగి రేకులపై లిఖింపబడిన కీర్తనలలో కొన్ని చోట్ల "కిలుము" పట్టడంవల్ల వ్రాసిన పాఠ్యం సందిగ్ధంగా వుండే సందర్భాలు కోకొల్లలుగా వున్నాయి. కొన్ని పర్యాయములు ఆ కీర్తనలోని ఆ చరణం అసంపూర్తిగానే వుండిపోతుంది. ఒకటి రెండు అక్షరాలైతే వూహించవచ్చునుగాని అంతకెక్కువైతే కష్టమే కదా!

600 సంవత్సరాలనాటి తెలుగు పదనుడికారానికి ఇప్పటి తెలుగునుడికారానికి తేడా వుండటం వల్ల కొన్ని పదముల అర్థం మారిపోయే ప్రమాదం కూడా సాధ్యమే. ఇటువంటి సందర్భాలలో నేను ఆ వేంకటరమణునిపై భారంవేసి అప్పటికప్పుడు స్ఫురించిన భావార్థము వివరించడం జరిగింది.

ఇక్కడ ప్రస్తావిస్తున్న ఈ పొడవుకు పొడవైన పురుషోత్తమ రచనలో 108 అన్నమాచార్యులవారి సుదీర్ఘ కీర్తనలకు అవతారిక సహిత భావవివరణ అందించటం జరిగింది. కొన్ని తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారి కీర్తనలను కూడా రుచి చూపించగలగడం నా అదృష్టమే. ఈ 108లో రెండు కీర్తనలు "భావయామి వేంకటేశమ్"లో ప్రస్తావించబడినవే. కానీ అప్పుడు కీర్తనలు అంత పెద్దగావుంటే పాఠకులకు ఇబ్బందిగా వుంటుందని, నేనే రెండు కీర్తనలను కొంచెం





కుఱచ చేశాను. కానీ ఈ రచనలో వాటిని తిరిగి సుదీర్ఘ కీర్తనలుగా వివరించాను. అందుచేత ఈ అన్నమాచార్య కీర్తనా యజ్ఞంలో ఇది మూడవ పుస్తకంగా రూపుదిద్దుకొన్నది.

మొదటిపుస్తకం "భావయామి వేంకటేశమ్" దీనిలో 606 అన్నమాచార్య సంకీర్తనలు, మున్నుడి (ఉపోద్ఘాతము) భావామృతం (తాత్పర్యవివరణ) సహితముగా వివరించాను.

రెండవ పుస్తకం "హరినామమే కదా! అన్నమయ్య వరము". ఇందులో 404 అన్నమాచార్యులవారి కీర్తనలను అవతారిక (ఉపోద్ఘాతము) భావవివరణ (తాత్పర్య వివరణ) సహితముగా విరించాను. ఇదియెలా పూర్తిచేశానో ఆ ఏడుకొండలవాడికే తెలియాలి. దినదిన గండం నూరేళ్ళు ఆయుస్సులా అయింది నాపని. నాగుండెలో ఇది వరకే వున్న స్టంటుకు ఇంకొక రెండు తోడుగా వచ్చి చేరాయి. ఎన్నడు నా కలం ఆగిపోతుందో నాకే తెలియదు. అందుకనే 606 వ కీర్తన తరువాత ప్రతి 101 కీర్తనలు ఒక విడి పుస్తకంగా వేరువేరు పేర్లతో వెలువరించాను. ఆ విధంగా 4 పుస్తకాలు మళ్ళీ ఒక పుస్తకంలాగా చేయించి "హరినామమే కదా! అన్నమయ్య వరము" అని పేరుపెట్టాను. దీనితో 1010 అన్నమయ్య కీర్తనలు రెండు పుస్తకాల రూపంలో అవతరించాయి. నాశక్త్యానుసారం 30 సెట్లు తయారుచేయించాను. ఆర్థిక భారం మోయలేక టి.టి.డి. వారి సహాయం అర్థించాను. వారు సమ్మతించి దీనిని (ఈ రెండు పుస్తకాలనూ) వెలుగులోకి తెస్తామని అన్నారు. వారిపై, హరిపై భారం వేసి, ఈ నా మూడవ పుస్తకం కొనసాగించాను.

దీనితో 1116 అన్నమాచార్యులవారి సంకీర్తనా యజ్ఞం పూర్తి అయింది. శ్రీనివాస పరబ్రహ్మతోడులేక ఇది సాధ్యమయ్యేదా? అసంభవం. ఈ మూడవ పుస్తకం యెలా వెలుగులోకి వస్తుందో భారం ఆ శ్రీవేంకటేశ్వరుడికే వదలివేశాను.

ఇది ముగించేముందు నేను మనస్ఫూర్తిగా కృతజ్ఞతాపూర్వక పాదాభివందనలు చేయాల్సిన అసంఖ్యాకులలో కొందరినైనా ప్రస్తావించక ఆ అంతరాత్మకు నేను ద్రోహం చేయలేను.

1. తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి వారికి
2. సుజనరంజని - హైదరాబాద్-500 018 వారికి
3. ఈ యజ్ఞంలో నాకు ఆదినుండి వెన్నుదన్నువలె నిలిచిన నవరత్నాలకు
4. డి.టి.పి. చేయుటకు చేదోడు వాదోడైన
   శ్రీ మురళీకృష్ణ గారికి
   శ్రీ కె. వెంకటేశ్వరరావు గారికి
5. అడిగినదే తడవుగా సలహా సహాకరములందించిన
   అసంఖ్యాకులైన నా శ్రేయోభిలాషులకు
   అందరికీ తిరుమలనాథుని దీవెనలు లభించుగాక!







# ప్రత్యేక కృతజ్ఞతలు

సర్వశ్రీ...

**1.** డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ

**2.** డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారు

**3.** నేదునూరి కృష్ణమూర్తి గారు

**4.** గరిమెళ్ల బాలకృష్ణ ప్రసాద్ గారు

**5.** గరికపాటి వెంకట్ గారు

**6.** గురు కొండవీటి జ్యోతిర్మయి గారు

**7.** శోభారాజ్ గారు (అన్నమయ్య ప్రేరణ వీరివల్లనే)

**8.** ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారు

**9.** శంకర చంద్ర పవన్

ఇంకా ఎందరో, మరెందరో... వారందరికీ

## పొడవుకు పొడవైన పురుషోత్తమా

సంపుటి: 1 కీర్తన : అదె చూడు తిరువేంకటాద్రి నాలుగు యుగము
సంఖ్య : 227 పుట : 151 రాగం: మలహరి

### మలహరి

1 అదె చూడు తిరువేంకటాద్రి నాలుగుయుగము-
లందు వెలుగొందీ ప్రభ మీరఁగాను ॥ పల్లవి॥

తగ నూటయిరువై యెనిమిదితిరుపతులఁ గల-
స్థానికులును చక్రవర్తిపీఠకములును
అగణితంబైన దేశాంత్రులమఠంబులును
నధికమై చెలువొందఁగాను

మిగులనున్నతములగు మేడలును మాడుగులు
మితిలేనిదివ్యతపసులున్న గృహములును
వొగి నొరగుఁబెరుమాళ్ళవునికిపట్టయి వెలయు-
దిగువతిరుపతి గడవఁగాను ॥అదె॥

పొదలి యరయోజనముపొడవుననుఁ బొలుపొంది
పదినొండుయోజనంబులపరపుననుఁ బరగి
చెదర కేవంకచూచిన మహాభూజములు
సింహశార్దూలములును

కదిసి సురవరులు కిన్నరులు కింపురుషులును
గరుడ గంధర్వయక్షులును విద్యాధరులు
విదితమై విహరించువిశ్రాంతదేశముల
వేడుకలు దైవారఁగాను ॥అదె॥





యెక్కువలకెక్కువై యెసఁగి వెలసినపెద్ద-
యెక్కు డతిశయముగా నెక్కినంతటిమీఁద
అక్కజంబైన పల్లవరాయనిమటము
అలయేట్లపేడ గడవన్
చక్కనేఁగుచు నవ్వచరిఁ గడచి హరిఁ దలఁచి
మ్రొక్కుచును మోకాళ్లముడుగు గడచినమీఁద-
నక్కడక్కడ వేంకటాద్రీశుసంపదలు
అంతంతఁ గానరాఁగాను ॥అదె॥

బుగులుకొనుపరిమళంబులపూవుఁదోఁటలును
పొందైననానావిధంబులవనంబులును
నిగిడి కిక్కిరిసి పండినమహావృక్షముల-
నీడలను నిలిచి నిలిచి

గగనంబు దాఁకి శృంగారరసభరితమై
కనకమయమైనగోపురములనుఁ జెలువొంది
జగతీధరునిదివ్యసందలుగలనగరు
సరుగననుఁ గానరాఁగాను ॥అదె॥

ప్రాకటంబై నపాపవినాశనము లోని
భరితమగుదురితములు పగలి పారుచునుండ
ఆకాశగంగతోయములు సోఁకిన భవము-
లంతంత వీఁడి పారఁగను

యీకడనుఁ గోనేట యతులుఁ బాశుపతుల్ మును-
లెన్ననగ్గలమైవున్న వైష్ణవులలో
యేకమై తిరువేంకటాద్రీశుఁడాదరిని
యేప్రొద్దు విహరించఁగాను ॥అదె॥

**అవతారిక:**

అక్షరములలో ఆదియైన 'అ' అనే అక్షరము నేనే అన్నాడు పరమాత్మ శ్రీమత్భగవద్గీతలో. పొడవులకు పొడవైన ఆ పురుషోత్తముని 32000 సంకీర్తనలతో కీర్తించారు అన్నమాచార్యులవారు. ఆయనదారిలోనే నడిచారు ఆయన పుత్రుడు పౌత్రుడు. ఆ అన్నమయ్య అనుయాయులు వేల సంఖ్యలో ఆయన అడుగుజాడలలో హరిదాసులైనారు. అంతులేని ఆ హరి హారంలో నేనూ ఒక చిన్నపూసనై నాజన్మకొక సార్థకత దక్కించుకొన్నాను. వేయి కీర్తనలకు వివరణ వ్రాసి వేనామలవెన్నుని వినుతించాను. అన్నమయ్య కీర్తనలు పల్లవి, నాలుగు పాదములు గల మూడు చరణములు వెరసి పూర్తి కీర్తనగా వుంటుంది. ఈ కీర్తనలో కొన్ని రెండు చరణాలవీ వున్నాయి. కాని అంతకు యెక్కువ చరణాలు లేక అతి పొడవైన చరణాలు గలవి వున్నాయి. అట్టి పొడవైన కీర్తనల మణిహారమే మీరు చదువుతున్న "పొడవులకు పొడవైన పురుషోత్తమా!"

ఈ హారంలో ఇది మొదటి పూసవంటి కీర్తన. శ్రీవేంకటాద్రి వైశిష్ట్యాన్ని, తిరుపతి ఘనతను, శృంగారవనాల వసంతశోభను, సురులు మునులు గొలిచెడి శ్రీవేంకటేశ్వరుని తిరుమల శిఖరాల విహారము, వైష్ణవ శరణాగతులు దాసభక్తి, ఈ కీర్తనలో తనువు పులకరించేటట్లు వర్ణించబడినది. ఆ రోజుల్లో తిరుమల కొండ యెక్కుతుంటే ఎలా వుంటుందో చెప్పగలవాళ్ళు యేరీ యెక్కడున్నారు? అన్నమయ్య ఆ లోటు తీరుస్తున్నారు.

**భావ వివరణ:**

అదె చూడు (అదిగో చూడండి) నాలుగు యుగాలనుండి వెలుగొందుతున్న శ్రీవేంకటాద్రి ప్రభమీరగాను (వైభవము అతిశయించగా) శోభిల్లుచున్నది.

ఈ దేవదేవుని సేవించుటకు నూట ఇరవై ఎనిమిది తిరుపతులలోగల





స్థానికులందరూ విచ్చేసినారు. చక్రవర్తి పీఠమునధిరోహించిన అనేకులు విచ్చేశారు. లెక్కలేనంతమంది దేశాంతరమఠాధిపతులు అధికముగా కిక్కిరిసినట్లు విచ్చేశారు, ఇక ఆ తిరుమలకొండ దిగువన తిరుపతి పట్టణమున్నది. అక్కడ మేడలు మిగులనున్నతములు (చాలా యెత్తయినవి), చక్కని మాడుగులు (సౌధములు) వున్నవి. తరగని దివ్యతపస్సులను చేసే అనేక గృహములు ఆ వూరిలో వున్నాయి. ఒగి నౌరగు (వినమ్రులై ఒంగి నమస్కరించు) పెరుమాళ్ళకు (వేంకటేశ్వరస్వామికి) వునికిపట్టయిన (ఆవాసమై) వెలసివున్నదా తిరుపతి.

ఇక ఆ తిరుమల కొండయెలావున్నదంటే... అది పొదిలి అరయోజనము పొడవున పొలుసందును (అడ్డముగా ఆ కొండ వెడల్పు అరయోజనము అనగా నాలుగుమైళ్ళు వుంటుంది). ఆ కొండ చుట్టుకొలత దాదాపుగా పదకొండు యోజనాలు లేక ఎనభై ఎనిమిది మైళ్ళు వుంటుంది. ఆ కొండపై యేవైపు చూచినా, మహాభూజములు (గొప్ప వృక్షములు కనబడతాయి). అనేక సింహములు పులులు కూడా ఆ కొండపై వున్నాయి. కదిసి (చేరువయై) ఆ కొండ మీద అనేక సురవరులు (దేవతాప్రముఖులు) వుంటారు. కాకపోతే వారు మనవంటి మానవులకు కనుపించరు. ఆ దేవగణములలో అనేక మంది కిన్నరులు, కింపురుషులు, గరుడులు, గంధర్వులు, యక్షులు విద్యాధరులు విదితమై (బాహాటంగా) విశ్రాంతి ప్రదేశములలో విహరిస్తుంటారు. వారంతా వేడుకలదైవారుతుంటారు (మునిగి తేలుతుంటారు).

ఎక్కువలకెక్కువై (ఎక్కుటకు యెంతో ప్రయాసకరమై) అతిశయముగా వెలసినదా కొండ. ఎట్లాగో శ్రమలకోర్చి దానినెక్కినంత, దానిమీద ఆశ్చర్యకరమైనట్టి పల్లవరాజుల మఠము దర్శనమిస్తుంది. ఆ ప్రాంతాన్ని ఏట్లపేడగడప అంటారు. అక్కడనుంచి తిన్నగా వెళ్ళితే 'నవ్వచరి' అనే ప్రాంతం వస్తుంది. దాన్ని దాటి గోవిందా! ఏడుకొండలవాడా! వేంకటరమణా! గోవిందా! అని హరినామ సంకీర్తన చేస్తూ, మొక్కుతూ మోకాళ్ళముడుగు (మోకాళ్ళపర్వతం) చేరుతాం. దాన్ని గడచిన మీదట (యెక్కిన తరువాత)

అక్కడక్కడ వేంకటేశ్వరుని ఆలయ ఘోష లీలగా వినబడుతుంటుంది. ఆలయ వైభవం అంతంత (అక్కడల్లంతదూరాన్నుంచే) గానరాగా (కనబడుతుంటే) ఆనందంతో ఒళ్ళు పులకరిస్తుంటుంది. శ్రమ ఫలించబోతున్నదే అనే ఆనందంతో ఉత్సాహం ఉరకలు వేస్తుంటుంది.

అక్కడ, బుగులుకొను పరిమళంబులు (వ్యాపించెడి సువాసనలను) వెదజల్లు పూలతోటలు కనువిందు చేస్తాయి. పొందుగా శోభిల్లుతున్న నానావిధములైన తోటు కనువిందు చేస్తాయి. పెద్దపెద్ద పండ్లు బాగా పండిన ఫలములు కిక్కిరిసి దట్టముగానున్న వృక్షములు అటు ఆకలినీ తీరుస్తాయి, ఇటు సేదతీరే నీడను ప్రసాదించి యెండను తట్టుకొనేట్లు చేస్తుంది. అక్కడ కనువిందు చేసే విధంగా ఆకాశమునంటు శృంగార రసభరితమైన బంగారు గోపురములు దర్శనమిస్తాయి. అక్కడనుంచి శోభాయమానమైన జగతీవరుని (భూకాంతుని) దివ్యసంపదల వైభవాన్ని చాటే తిరుమల నగరి దర్శనమిస్తుంది. సరుగున ఆ విధముగా వర్ధిల్లుతూ ఆయల దర్శనము కలుగుతుంది.

ఆచోట, ప్రాకటంబై (ప్రసిద్ధమై) పాపవినాశనము అను జలపాతము పరమపునీతమై ప్రవహించుచుండును. అందులో స్నానము చేసినవారి పాపములన్నియు పటాపంచలైపోవును. ఆ ప్రాంతాలలోనే కల ఆకాశగంగ అను యెత్తైన జలధారలో పవిత్రస్నానమాచరించిన కలిగే పుణ్యం చెప్పనలవికాదు. ఆ నీరు మనవంటిని సోకినంతనే భవములన్నియు (పుట్టుకలకు మూలకారణమైన పాపములన్నియు) పటాపంచలైపోవును. ఇదిగో ఈ దివ్యమైన స్వామి పుష్కరిణి అనే కోనేరు. ఆనందనిలయమున కెదురుగానున్న దీనిలో యతీంద్రులు, పాశుపతి (పరమశివుడు) మునులు, అగ్గలమై (అధికముగావున్న) వైష్ణవులతోపాటు మేమును, యేకమై స్నానాదికములాచరించి తరించితిమి.

అదిగో ఆనందనిలయ స్వర్గశిఖరము. శ్రీవేంకటేశ్వరుని పవిత్ర నివాసమదియే. ఆ దరిని (ఆ తావులో) ఆయన యెప్పుడూ విహరిస్తుంటాడు.





సంపుటి: 1   కీర్తన : నిత్యాత్ముడైయుండి నిత్యుడై వెలుగొందు
సంఖ్య : 75   పుట : 51   రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

2 నిత్యాత్ముఁడై యుండి నిత్యుఁడై వెలుఁగొందు
సత్యాత్ముఁడై యుండి సత్యమై తానుండు
ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం-
స్తుత్యుఁ డీతిరువేంకటాద్రివిభుఁడు ॥ పల్లవి॥

ఏమూర్తి లోకంబులెల్ల నేలెడునాతఁ-
డేమూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడునాతఁ-
డేమూర్తి నిజమోక్షమియ్యఁజాలెడునాతఁ-
డేమూర్తి లోకైకహితుఁడు
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియునుఁగాఁడు
యేమూర్తి త్రైమూర్తు లేకమైనయాతఁ-
డేమూర్తి సర్వాత్ముఁ డేమూర్తి పరమాత్ముఁ-
డామూర్తి తిరువేంకటాద్రివిభుఁడు ॥నిత్యా॥

యేదేవుదేహమున నిన్నియును జన్మించె
నే దేవుదేహమున నిన్నియును నణఁగె మరి
యే దేవువిగ్రహం బీ సకల మింతయును
యేదేవునేత్రంబు లినచంద్రులు
యేదేవుఁ డీజీవులిన్నింటిలో నుండు
నేదేవుచైతన్య మిన్నిటికి నాధార-
మేదేవుఁ డవ్యక్తుఁ డేదేవుఁ డద్వంద్వుఁం-
డాదేవుఁ డీవేంకటాద్రి విభుఁడు ॥నిత్యా॥

**యేవేల్పుపాదయుగ మిలయునాకాశంబు**
**యేవేల్పు పాదకేశాంతం బనంతంబు**
**యేవేల్పు నిశ్వాస మీమహామారుతము**
**యేవేల్పునిజదాసు లీపుణ్యులు**
**యేవేల్పు సర్వేశుఁ దేవేల్పు పరమేశుఁ-**
**దేవేల్పు భువనైకహితమనోభావకుఁడు**
**యేవేల్పు కడుసూక్ష్మ మేవేల్పు కడుఘనము**
**ఆవేల్పు తిరువేంకటాద్రివిభుఁడు ॥నిత్యా॥ 75**

**అవతారిక:**

శ్రీ వేంకటాద్రి విభునిపై మధురాతిమధురమైన కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈ కీర్తన వివరణ ఇదివరలో నేను "భావయామి వేంకటేశమ్‌లో ఇవ్వటం జరిగింది. ఇప్పుడు మళ్ళీ ఇట్లా ప్రస్తావించటానికి కారణమేమంటే అప్పుడు దానినెంపిక చేసిన సంకలనంలో ఈ కీర్తన పొడుగు యెక్కువైనదని ఒక చరణం తీసివేయబడినది. అది ఈ సంకలనంలోని ఈ కీర్తనలో జతపరచి పెద్ద కీర్తననందిస్తున్నాను. ఎందుకంటే, దీనిపేరే పొడవుకు పొడవైన పురుషోత్తముడు కదా! ఇది ఎంత మధురమైన కీర్తన అంటే కొంతమంది సినీరచయితలు ఈ బాణీని వుపయోగించుకొన్నారు. ఒకసారి పరిశీలించి చూస్తే నేను చెప్పేది మీకే అర్థమవుతుంది. అవతల శ్రోతను అంతగా ఆకర్షించగల కీర్తన ఇది. ఈ వేంకటేశ్వరుడు నిత్యుడు. ఆత్మస్వరూపంలో మన అంతరాత్మలో నిత్యమూ మన వెంటనే వుండి నడిపిస్తున్నాడు. మనందరి చేత సంస్తుతి చేయబడుచున్న ఈ ప్రత్యక్షదైవమే త్రిమూర్తుల మూలమైన పరబ్రహ్మ. ఈయనే విశ్వరూపుడు. ఈయనే త్రివిక్రముడు. ఈయన కనుగవ సూర్యచంద్రులు. అణురూపుడూ ఈయనే దశావతారమూర్తీ ఈయనే.





**భావ వివరణ:**

నిత్యమూ మన అంతరాత్మరూపంలో మనలో వుండే ఈ దేవదేవుడు నిత్యుడు (భూత భవిష్యద్వర్తమానకాలములలో వుండేవాడు). ఈ సత్యాత్ముని లక్షణమే సత్యము. ఈయనే ప్రత్యక్ష దైవమైన పరబ్రహ్మ. ఈ తిరువేంకటాచలపతి, అశేష శరణాగతుల చేత బాగుగా స్తుతించబడుతున్న సంస్తుత్యుడు.

ఈ మూర్తి లోకములన్నింటిని పరిపాలిస్తాడో ఆతడీయనే. ఏమూర్తిని బ్రహ్మాది దేవతలు యేమిటి యెంత వెదకినా కనబడదేమని ఆతృతతో వెదుకుతారో ఆతడీయనే. ఏమూర్తి జీవులకు నిజమైన ముక్తి నొసగు సమర్థత కలిగియుంటాడో ఆతడీయనే. ఏమూర్తి అన్ని లోకములకు రక్షణరూపంలో హితము నొసగుతాడో ఆతడీయనే.

ఏమూర్తి నిజమైన మూర్తియో ఆతడీయనే. ఏమూర్తియునూకాని నిరాకార పరబ్రహ్మ కూడా ఈయనే. త్రైమూర్తులు (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు) ఏకమైన మూర్తి యెవడో ఆతడీయనే. ఏమూర్తి సర్వ ఆత్మలలో నెలకొని యున్నాడో ఆతడీయనే. ఏమూర్తిని అంతా పరమాత్మ అని కీర్తించెదరో ఈయనే ఆ మూర్తి. నేడు మనకనుల యెదుట తిరువేంకటేశ్వరునిగా కనుపించుచున్న ఈ మూర్తియే ఆమూర్తులన్నిటికీ మూలపుమూర్తి.

ఏ దేవుని యొక్క దేహము నుంచి ఈ సృష్టిలోని ప్రతి యొక్కటి ఆవిర్భవించెనో ఆతడీయనే. ఏదేవుని దేహములో ఆపుట్టినవన్నీ తిరిగి అణగారి పోతున్నాయో ఆతడునూ ఈయనే. ఏదేవుని విగ్రహములో నుండి సనక సనందనాది ఋషులవంటి వారే కాక సమస్త జీవకోటి పుట్టినదో ఆతడీయనే. ఏదేవుని కన్నులలో ఒకటి సూర్యుడు ఇంకొకటి చంద్రునిగా వెలుగొందుతున్నాయో ఆదేవుడితడేయని గ్రహించండి.

ఏదేవుడీ జీవులన్నింటిలోనూ వున్నాడో ఆతడీతడే. ఏదేవుని యొక్క చైతన్యమీ జీవులన్నిటికీ కదలికనిచ్చుచున్నదో ఆతడితడే. ఏదేవుడు అవ్యక్తుడో (స్పష్టముగా ఇది అని చెప్పలేమో) ఆతడీయనే. ఏదేవుడు అద్వంద్వుడో (ద్వంద్వభావము లేక ఎప్పుడూ ఒకే భావముతో వుంటాడో) ఆతడీయనే. ఆదేవుడే నేడు మన కన్నులయెదుట పురుషోత్తముడై దర్శనమిస్తున్న తిరువేంకటాచలాధిపుడు.

త్రివిక్రముడైనప్పుడు ఏ వేల్పు యొక్క పాదయుగము (పాదముల జంట) ఒకటి ఆకాశమంతయూ ఆవరించి ఇంకొకటి భూమినంతయు యేమాత్రమూ సందులేక ఆక్రమించినదో ఆతడీయనే. విరాట్పురుషుడై విశ్వరూపం చూసినప్పుడు ఏవేల్పు యొక్క పాదకేశములయొక్క అంతరములు (వివిధ కేశములు) ఒక్కొక్క విశ్వముగా వెలసి అనంతకోటి విశ్వములు ఒకే మూర్తిలో కనబడినవో ఆ వేల్పు ఇతడే. ఏవేల్పు యొక్క నిశ్వాసమే అనంతప్రళయ ఝుంఝూమారుతమై జీవకోటిని అల్లకల్లోలము చేయగలడో ఆతడీయనే. గొప్ప పుణ్యులైన ఈ సమస్త హరిదాసులు యేవేల్పుని నిజదాసులో ఆతడీయనే. సర్వేశ్వరుడు, పరమేశ్వరుడు అని యేవేల్పు పిలువబడుచున్నాడో ఆతడీయనే. ఏవేల్పు భువనముల కన్నింటికీ ఒకే ఒక్క హితుడైయున్నాడో ఆతడితడే. ఏవేల్పు కడు సూక్ష్మమైన అణురూపుడుగానూ కడఘనమైన అనంతరూపునిగానూ వున్నాడో ఆవేల్పు ఇదిగో మన కన్నులయెదుటనున్న తిరువేంకటాచలపతి అయిన శ్రీవేంకటేశ్వరుడు. ఈయనను శరణనండి.





సంపుటి: 1 కీర్తన : ఘోరవిదారణ నారసింహ నీ-
సంఖ్య : 67 పుట : 46 రాగం: నాట

**నాట**

**3 ఘోరవిదారణ నారసింహ నీ-**
**వీరూపముతో నెట్లుండితవో ॥ పల్లవి॥**

**ఉడికెడికోపపుటూర్పులఁ గొండలు**
**పొడివొడియై నభమునకెగయ**
**బెడిదపురవమున పిడుగడులు దొరుగఁగ**
**యెడనెడ నీ వపు డెట్టుండితివో. ॥ఘోర॥**

**కాలానలములు గక్కుచు నయన-**
**జ్వాలల నిప్పులు చల్లుచును**
**భాలాక్షముతో బ్రహ్మాండకోట్ల-**
**కేలికవై నీ వెట్లుండితివో. ॥ఘోర॥**

**గుటగుటరవములు కుత్తికఁ గులుకుచు**
**గిటగిటఁ బండ్లు గీఁటుచును**
**తటతటఁ బెదవులు దవడలు వణఁకఁగ**
**ఇటవలె నీ వపుడెట్లుండితివో ॥ఘోర॥**

**గోళ్ళ మెఱుఁగుల కొంకుల పెదపెద-**
**వేళ్ళ దిక్కులు వెదకుచును**
**నీళ్ళతీగెలు నిగుడఁగ నోర ను-**
**చ్చిళ్ళు గమ్మఁగ నెట్లుండితివో. ॥ఘోర॥**

**హిరణ్యకశిపునినే పడcచి భయం-**
**కర రూపముతోc గడుమెరసి**
**తిరువేంకటగిరి దేcవుడు నీవిcక**
**యిరవు కొన్ననాcడెట్లుండితివో ॥ఘోర॥**

**అవతారిక:**

విదారణము అంటే వధించుట అని అర్థం. ఘోరవిదారణ అంటే అతి భయంకరగా వధించువాడని అర్థం. ఓ నరసింహా! ఇంత భయంకరమైన యీ రూపముతో యెట్లావున్నావయ్యా! అంటున్నారు అన్నమాచార్యులవారు. ఆ భీకరాకారుని వర్ణన వర్ణనాతీతమనిపిస్తున్నది కదా! తొలి పాదం చూడిండి "సలసల కాగిపోయే కోపము వలన వెలువడిన నిస్వాసములు కొండలను కూడా నుగ్గునుగ్గు చేయగ ఆ పొడి ఆ నిట్టూర్పు వేగానికి ఆకాశానికెగసిపడుచున్నది". ఇట్లాంటివి ఇంకా పదివున్నాయి, ఈ కీర్తనలో ఆయన నోరు తెరిస్తే చొంగ తీగలుగా సాగి వ్యాపించిందిట. నోటినిండా వుమ్మికమ్ముకుందట. అంతా ఇక్కడే చెప్తే కీర్తన స్ఫూర్తి తగ్గుతుంది. భావవివరణ చదివి పూర్తి ఆనందం మీ స్వంతం చేసుకోండి.

కొంత ఉపోద్ఘాతము ఇస్తే ఈ కీర్తన ఔచిత్యం ఇంకా పెరుగుతుందనిపిస్తోంది. తన ప్రియభక్తుడైన ప్రహ్లాదుని చిత్రహింసలకు గురిచేసిన హిరణ్యకశిపునిపై అలవిమాలిన కోపం వచ్చింది శ్రీహరికి. వాడిని వధించుటకు నృసింహుడై వాడి వరముల కనుగుణంగానే వాడిని తన తొడపై నిడుకొని, గడపలో నిలిచి, యే ఆయుధములూ లేక గోళ్ళతోనే చీల్చి విరజిమ్మే రక్తం క్రిందపడకుండా జుర్రి, సంధ్యాసమయంలో చంపివేశాడు. ఆయన అర్ధాంగి శ్రీలక్ష్మి కూడా





భయంతో బిత్తరబోయింది. ఆనాటి ఆ వధా సమయంలో నీవెట్లుండితివో అని మరీ వర్ణిస్తున్నారు అన్నమయ్య. మీకెవరికన్నా నవరసాలలో రౌద్ర రసం యెట్లా వుంటుందనే సందేహం వస్తే ఈ కీర్తన చదవండి.

**భావ వివరణ:**

ఓ ఘోర విదారణ నారసింహా! (భయంకరముగా వధించు ఉగ్రరూపముకల నరసింహదేవా!) నీవు ఈ రూపముతో ఇంత భయానకంగా యెట్లుంటివయ్యా?

కోపముతో వుడికిపోవుచున్న నీవూర్పుల (వేడి నిశ్వాసములలో) కొండలు (కులపర్వతములు) పొడివొడియై (చూరగా పొడియైపోయి) నభముకెగయ (ఆకాశవీధిని విరజిమ్మింది.) నీ బెడిదపు రవమున (భయంకరమైన కంఠస్వరమున) పిడుగులు దొరగగ (పిడుగులు రాలిన ధ్వని పొడజూపినది). ఇది పురాణేతిహాసములద్వారా మేము నేర్చిన వూహయే. కానీ యెడనెడ (ఆయాసమయాల్లో) నీవు యెట్లుండితవో (యెట్లావున్నావో కదా!)

ఈ నృశింహుడు (అహోబల నరసింహుడు) జ్వాలానృసింహుడు. భయంకరమైన అగ్నికీలలు నోటినుండి విరజిమ్మపడుతుండగా హిరణ్యకశిపుని వధించి ప్రహ్లాదుని రక్షించుటకు వెలసిన ఈస్వామి కాలానలము (కాలగ్నిని), గక్కున (ఒక్కమాటుగా) వెదజల్లుతూ జ్వలించు కన్నులు నిప్పులు గక్కుచుండగా ఫాలాక్షముతో (నెన్నుదుట మూడవ కంటితో) అనంతకోటి బ్రహ్మాండములకు నీవు యేలికవని అందరూ కీర్తించగా ఆనాడు నీవు యెట్లుంటివో కదా!

ప్రభూ! నారసింహా! నీవు హిరణ్యకశిపుని కుత్తికను చీల్చి కులుకుచు (రక్తము వెదజల్లుతూ) మళ్లీ నేలరాలకుండా గుటగుట ధ్వని వస్తుంటే

జుట్టుకొంటూ, కోపమాగక దంతములను గిటగిట ధ్వనివచ్చునట్లు గీటుచును (నూరుకొంటూ) వున్నావు. నీ ఆవేశం కట్టలు తెంచుకొని వస్తుంటే నీ దవడలు వణికి ఒకదానికొకటి తగిలిన నీ పెదవుల నుండి "తటతట"మను ధ్వని వస్తున్నది. ఇంత బీభత్సాకారముతో ఆనాడు నీవు యెట్లుంటివయ్యా నరహరీ!

స్వామి భయంకరమైన జూలు ఆయన కళ్ళకు అడ్డముపడి దిక్కులు కనబడకుండా పోతున్నాయి. పెదపెద (బాగా పొడుగైన) వ్రేళ్ళకున్న కొంకుల గోళ్ళు (వంకరలు తిరిగిన నఖములు) మెరుస్తుంటే... ఆ కాంతికి అంతా స్పష్టంగా కనబడుతున్నది. ఒక్కసారి ఆయన భయంకరమైన నోరు చూడండి. ఆయన నోటినుంచి రక్తంతో తడిసిన చొంగకారి, ఆ చొంగ నీరు ఆయన నోరు తెరచినప్పుడు తీగెలవలె సాగి ఆ నోటిలో వుచ్చిళ్ళు (వుమ్మి) ఆయన ముఖమునంతా కమ్ముకొన్నది. జుగుప్సాకరమైన ఆ ఆకృతితో అపుడెట్లుంటివయ్యా! ఉగ్రనారసింహా!

అప్పుడా నారసింహుడు దుష్ట హిరణ్యకశిపుని ఆ విధముగా ఏపడచి (ఏడిపించి) భయంకరమైన రూపముతో కడుమెరసె (గొప్పగా మెఱసి పోయాడు). ఓ తిరువేంకటాచలాధిపా! నేడు ఇట్లా గంభీర శాంతమూర్తిలా మా కన్నులముందు దర్శనమిస్తున్నావు కానీ ఆనాటి నీ ఉగ్ర నరసింహావతారములో మాత్రం యెట్లుంటివో, మా వూహకందుటలేదు తండ్రీ! లోకాల రక్షకుడే భక్షకుడైతే, శాంతాకారుడు క్రాంతికారుడైతే ఎవ్వరు చేయగలిగిందేముంది? శరణు శరణు సురేంద్ర సన్నుత... అంటూ శరణు వేడటమే దారి.





సంపుటి: 1 కీర్తన : జీవాతుమైయుండు చిలుకా నీ-
సంఖ్య : 50 పుట : 32 రాగం: ఆహిరి

**ఆహిరి**

**4 జీవాతుమై యుండు చిలుకా నీ-**
**వావలికి పరమాత్ముఁడై యుండు చిలుకా ॥ పల్లవి॥**

**ఆతుమపంజరములోన నయమున నుండి నా-**
**చేతనే పెరిగిన చిలుకా**
**జాతిగాఁ గర్మపుసంకెళ్లఁబడి కాలఁ**
**జేతఁ బేదైతివే చిలుకా**

**భాతిగాఁ జదువులు పగలురేలును నా-**
**చేత నేరిచినట్టి చిలుకా**
**రీతిగా దేహంపురెక్కలచాటున నుండి**
**సీతుకోరువలేని చిలుకా ॥జీవా॥**

**బెదరి అయిదుగురికిని భీతిఁబొందుచుఁ గడుఁ-**
**జెదరఁగఁ జూతువే చిలుకా**
**అదయులయ్యునశత్రులారుగురికిఁగాక**
**అడిచిపడుదువే నీవు చిలుకా**

**వదల కిటు యాహారవాంఛ నటు పదివేలు-**
**వదరులు వదరేటి చిలుకా**
**తుదలేని మమతలు తోరమ్ము సేసి నా-**
**తోఁగూడి మెలగిన చిలుకా ॥జీవా॥**

**నీవన నెవ్వరు నేనన నెవ్వరు**
**నీవే నేనై యుండుఁ జిలుకా**
**శ్రీవేంకటాద్రిపై చిత్తములో నుండి**

**సేవించు కొని గట్టి చిలుకా**

**దైవమానుషములు తలఁపించి యెపుడు నా-**
**తలఁపునఁబాయని చిలుకా**
**యేవియును నిజముగా వివి యేఁవిటికని నాకు**
**నెఱిఁగించి నటువంటి చిలుకా** ॥జీవా॥50

**అవతారిక:**

భారతీయ తత్త్వవేత్తలు 'నేను' అనేది శరీరం కాదని, దాంట్లో స్థితుడైవున్న చైతన్య స్వరూపుడే ఆత్మ అనీ, వాడు వున్నంతవరకే ఈ శరీరానికి 'నేను' వర్తిస్తుందనీ ఆ చైతన్యం పోతే నేను అనేది కట్టెల్లో కాలిపోయే ఇంకొక 'కట్టే' అని యేనాడో చెప్పారు. చైతన్యస్వరూపుడైన ఆత్మ వివిధాత్మలుగా కనుపించుచున్నా వీటిమూలము పరమాత్మనుంచి వచ్చిందే. చివరికి యేదో వొక నాటికి అది మళ్ళీ ఆ పరమాత్మలో కలుస్తుంది. అంతదాకా ఆత్మ అనేక భ్రమలకు లోనై అనేక వికారములు పొంది, అరిషడ్వర్గాలకు లోనై, త్రిగుణాత్మకమై, పంచేంద్రియములవశుడై పాపపుణ్యములు చేస్తూ జీవితవైకుంఠపాళి ఆటలో ఆశల నిచ్చెనలెక్కుతూ వైఫల్యాలనే పాములతో కరిపించుకొంటూ దినదినగండం నూరేళ్ళ ఆయుస్సు వలె బ్రతుకు నెట్టుకొస్తున్నాడు.

భారతీయ తత్త్వవేత్తలు పరమాత్మను హంసతోను, ఆత్మను చిలుకతోను పోలుస్తూ అనేక తత్త్వ బోధనాగీతములాలపించారు. హంసయుక్తాయుక్త విచక్షణగల పక్షి అని, చిలుక యుక్తాయుక్త విచక్షణలేక తుర్రున యెగిరిపోయే గుణంకల పక్షి అనీ, కొరికే పండును కూడా పూర్తిగా కొరక కుండానే యెంగిలి చేసి వదిలేసే చపలత్వంగల పక్షి అనీ అలా పోల్చివుంటారేమో. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు జీవాత్మవై





మాలోవున్న చిలుకా నీవు ఆవలికి (అసలుకి) పరమాత్మవైయుంటివే. కానీ అజ్ఞానం వల్ల భ్రాంతికి గురియై పంచేంద్రియాలకు వశమై, అరిషడ్వార్గాలకు లొంగి తన పరమాత్మ తత్త్వం మరచిపోయి కేవలం జీవ భ్రమతో చిలుకలాగా స్థిరత్వం లేక సతమతమవుతున్నాడు. అద్భుతమైన తత్త్వగీతం ఈ కీర్తన.

**భావ వివరణ:**

ఓ చిలుకా! నువు జీవాత్మవైవున్న చిలుకవు. ఆవలికి (అటువైపు నుంచి చూస్తే) నిజానికి నీవు పరమాత్మవే. కాని అజ్ఞానం వలన నీవు పరమాత్మవని గ్రహింపలేకున్నావు.

ఓ చిలుకా! నీవు ఆత్మ అనే పంజరంలో చక్కగా ఇరుక్కుపోయావు. నిన్ను పెంచింది కూడా వేరెవరో కాదు, నేనే. నీకీ బంధింపు యెందుకువచ్చినదో తెలుసా? నీవు చేసిన కర్మల పర్యవసానంగా "కాలఁజేతఁ బేదైతివి" (కాళ్ళూ చేతులూ ఆడని అశక్తురాలివయ్యావు). నీకుగా నీవే సంకెళ్ళలో బంధింపబడ్డావు.

ఓ చిలుకా! రేయింబవళ్ళు నాచేత విద్యలు చదివించుకొని, భాతిగా (విధాయకముగా) నేర్చావు. నీ దేహంలోవున్న రెక్కల చాటున వెచ్చని రీతిగా వున్నావు. బాగానే వున్నది. కాని నీవు సీతు కోరువలేవు (శీతోష్ణముల హెచ్చుతగ్గులకు సహించలేవు). అనగా నీవు కష్టనష్టములకు ఓర్వలేని చిలుకవు.

ఓ చిలుకా! నీకు అయిదుగురు జులాయి స్నేహితులు వున్నారు. వాళ్ళు నిన్ను అదిలించి బెదిరించి తమ పంతం నెగ్గించుకొంటారు. నువ్వు ఇలా యెంతకాలం వాళ్ళకి భయపడుతూ బెదరిపోతూ వుంటావే చిలుకా? (సుఖ భ్రాంతిని కలుగజేసే పంచేంద్రియాలను ప్రస్తావిస్తున్నారు అన్నమయ్య).

ఓ చిలుకా దయ అనేమాట నెరుగని ఆరుగురు శత్రువులు నిన్ను అడిచిపెట్టాలని చూస్తూనేవున్నారు (వాళ్ళే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు). వాళ్ళ వలన నీకేనాటికైనా ముప్పు తప్పదు. ఓ చిలుకా! నీకు ఇంకొక బలహీనత వుంది. ఆహారం లేకపోతే వుండలేవు. దానికోసం పదివేల అనవసర ప్రసంగాలు చేస్తావు. అడ్డమైన వాగుడు వాగుతావు. ఓ చిలుకా! నీవు అందరితో అనుబంధాలను పెంచుకొని తోరమ్ము (అధికమైన అనురాగంతో) మెలగి చివరికి నష్టపోతావు. విచిత్రమేమంటే ఒకసారి నష్టపోయినా బుద్ధి తెచ్చుకోవు.

ఓ చిలుకా! ఒకసారి వివేకంతో ఆలోచించు. నీవంటే యెవరు? నేనంటే యెవరు? నీవే నేనూ, నేనే నీవు (ఆత్మలన్నీ ఒక్కటే, అవి వేరువేరనేదే భ్రాంతి). మనందరికీ అంతరాత్ముడు. ఆ శ్రీవేంకటేశ్వరుడు. ఆయనను నీ చిత్తములో నిలుపుకొని సేవించుకొని, గట్టిపడు (స్థిరపడు).

ఓ చిలుకా! నీకు జరిగే సంఘటనలు కొన్ని 'మానుషాలు' (మనిషి చేసినందువల్ల సంభవిస్తాయి). అవి వాళ్ళు తమంతతామే చేసినవో లేక నీ చర్యకు ప్రతిచర్యగా చేసినవో అయివుంటాయి. వీటిని కొంత సవరించుకోగలవేమో? కాని నీకు కొన్ని దైవికంగా జరుగతాయి. దానినే ప్రారబ్ధము అంటారు. అవి ఆ దైవము నిర్దేశించినట్లు నీ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేక జరుగుతుంటాయి. ఇది ఆ స్వామి లీల. కావున నన్ను నీ తలపులనుండి బాయకు. ఆ స్వామిని వదలకు. ఇవేవీ నిజము కావని తెలుసుకొనేట్లు చేసి ఇవన్నీ వ్యర్థమని గ్రహించునట్లు చేశావు. అటువంటి ఓ చిలుకా! నీకు ఋణపడివున్నాను.





సంపుటి: 1 కీర్తన : వెఱతు వెఱతు నిందు వేదుకపడనిట్టి-
సంఖ్య : 235 పుట : 157 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

5 వెఱతు వెఱతు నిందువేదుకపడ నిట్టి-
కుఱుచబుద్ధుల నెట్టు గూడుదునయ్య ॥పల్లవి॥

దేహమిచ్చినవానిఁ దివిరి చంపెడువాఁడు
ద్రోహిగాక నేఁడు దొరయట
ఆహికముగ నిట్టి అధమవ్రిత్తికి నే
సాహసమున నెట్టు చాలుదునయ్య ॥వెఱ॥

తోడఁబుట్టినవాని తొడరి చంపెడువాఁడు
చూడ దుష్టుఁడుగాక సుకృతియట
పాడైనయిటువంటిపాపబుద్ధులు సేసి
నీడ నిలువ నెట్టు నేరుతునయ్య ॥వెఱ॥

కొడుకు నున్నతమతిఁ గోరి చంపెడువాఁడు
కడుఁబాతకుఁడుగాక ఘనుఁడట
కడలేనియిటువంటి కలుష వ్రిత్తికి నాత్మ
వొడఁబరపఁగ నె ట్లోపుదునయ్య ॥వెఱ॥

తల్లిఁ జంపెడువాఁడు తలఁప దుష్టుఁడుగాక
యెల్లవారలకెల్ల నెక్కుడట
కల్లరియనుచు లోకము రోయుపని యిది
చెల్లఁబో నే నేమిసేయుదునయ్య ॥వెఱ॥

యింటివేలుపు వేంకటేశ్వరుఁ దనవెంట-
వెంటఁ దిప్పెడువాఁడు విభుఁడట
దంటనై యాతనిదాసానుదాసినై
వొంటినుండెద నేమి నొల్లనోయయ్య ॥వెఱ॥

**అవతారిక:**

మనుష్యులు సాధారణంగా ఇంకొకరిని ఆక్షేపించేటప్పుడు “మా ఇంటావంటా అటువంటి బుద్ధులు లేవు అబ్బో! మీ అంత గొప్పతనం మాకెక్కడిది?” అని దెప్పిపొడుస్తూ వుంటారు. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు భగవంతునే దెప్పి పొడుస్తూ తన గురువు రామానుజాచార్యులవారు భగవంతునికంటే గొప్పవాడన్నారు. యెందుకంటె ఆయన తిరువేంకటేశుని కూడా తనవెంట దిప్పుకోగల సమర్థుడట.

శ్రీహరి దుష్ట శిక్షణ అనే నెపంతోను ధర్మనిర్వహణ అనే నెపంతోను తండ్రిని చంపాడు, తల్లిని చంపాడు, అన్నను చంపాడు, కొడుకును చంపాడు. ఆ మాటకొస్తే యెవ్వరినైనా, యెన్నో వుపాయాలతో మోసంచేసి చంపాడు. భాగవతం చదివితే అన్నీ ఆయన మోసంచేసిన కథలే. కాకపోతే ఆ కథలన్నీ “నిండువేడుకతో” వుంటాయి. ఈ శ్రీహరి బుద్ధులు చూడబోతే కొంచెపు బుద్ధులుగా కనబడుతున్నాయి. ఇటువంటి వాడిని నిన్నెట్లు కూడెదనయ్యా? నీవంటేనే వెఱతు వెఱతు (భయం భయంగా) వున్నది అంటున్నారు. ఇటువంటి ప్రక్రియను నిందాస్తుతి అంటారు. ఈ కీర్తన ప్రత్యేకత బహు అరుదుగా నిందాస్తుతని వుపయోగించే తాళ్ళపాక పదకవితాపితామహుడు తన ఇంటివేలుపుపై ఈ ప్రక్రియ చేయటం ఇందులోని కథలు నేటి తరానికి అంతుచిక్కని ప్రహేళికలు.

**భావ వివరణ:**

అయ్యా! (ఓప్రభూ!) నువ్వు ఇట్టి కుఱుచబుద్ధుల (దోషభూయిష్టమైన) తక్కువ బుద్ధులు వున్నవాడివి. నిండువేడుకన్ యెట్టుగూడుదును (పూర్తి సంతోషంతో నిన్ను యెట్లా నమ్మి నీతో స్నేహం చేయమంటావు చెప్పు స్వామీ!) నీవంటేనే వెఱతు వెఱతు (భయం భయంగా వున్నది).

దేహమిచ్చినవాని దివిరి చంపెడువాడు ఈ స్వామి. (ఆనాడు పరమశివుణ్ణి గజాసురుడు తన దేహంలోనే వుండిపొమ్మని కోరుకుంటే ఆ భోళాశంకరుడు వాడికా వరము నిచ్చేసి వాడి దేహంలోనే వుండిపోయాడు. కాలాంతకుడు లేక మరణాలు కరువైనాయి. పార్వతి దు:ఖం చూడలేక విష్ణువు నందిని గంగిరెద్దులా





అలంకరింపించి బ్రహ్మాది దేవతలతోపాటు గజాసురుని వద్దకు గంగిరెద్దు మేళగాళ్ళవలె వెళ్ళి నంది ఆటతో గజాసురుని మెప్పించి వరం కోరుకొమ్మంటే నీదేహం వరంగా ఇయ్యి నాకు అందులో వున్న శివుడు కావాలని వరము అడిగాడు. సరే దేహం తీసికోమని వాడు వరమివ్వగానే నందితో వాడిని చీల్పించి చంపాడు శ్రీహరి. ఇదీ ఆ కథ. నమ్మినవారిని చంపిన అటువంటి ద్రోహిగాక మరి యెవరు ఆయన? కాని ఆయనే “దొర”యట. (జగదీశ్వరుడట). ఆహికాముగ (జ్వరమువలె పీడించు) ఇట్టి అధమవ్రిత్తికి (మర్యాదతక్కువ పనికి) నేను సాహసమున యెట్లు చాలుదును తండ్రీ! నీకు నీవేసాటి.

తోడబుట్టినవాని తొడరి జంపెడువాడు ఈస్వామి. ఈ మహానుభావుడు తన తోడబుట్టినవాని (తనతోపాటు ఒకే తండ్రికి పుట్టినవానిని) తొడరి (గొప్ప ప్రయత్నంతో యెదిరించి) చంపాడు. ఆ కథ వినండి. వామనమూర్తియైన ఈ శ్రీహరి తండ్రి కశ్యప ప్రజాపతి. ఆయనకు దితి వలన పుట్టిన పెద్దకొడుకు హిరణ్యకశిపుడు. వాడికి బ్రహ్మ చావులేని వరం ఇయ్యటానికి కుదరదు వేరే వరం కోరుకోమన్నాడు. వాడు కష్టపడి ఆలోచించి ఏ దేవతలవల్ల, దేవజాతులవల్ల, నర, మృగ, ఖగ, కీటక జాతులవల్ల, భూమిపైనకాని లోనగాని ఆకాశంలోగాని, పాతాళాదిలోకాలలోగాని, ఏ ఆయుధంతోగాని, ప్రాణమున్నదానితోగాని, ప్రాణంలేనిదాంతోగాని, పగలుగాని, రాత్రిగాని, ఇంటిబయటగాని లోపలగాని తన రక్తం నేలపై పడకుండా మాత్రమే చావురావాలని వేరేవిధంగా చావకూడదని “హిరణ్యకశిపుని” వరములు కోరుకొన్నాడు. అప్పుడు తన స్వంత అన్నగారిని చంపటానికి ఈ శ్రీహరి యెంత మాయచేశాడో చూడండి. సింహం తల నరుడి దేహం గల నరసింహుడై గడపమీద కూర్చుని వాణ్ణి తన వడిలో పడుకోబెట్టుకొని సంధ్యాసమయంలో గోళ్ళతో చీల్చి చంపి బొట్టు నెత్తురు రాలకుండా వచ్చిన నెత్తురు వచ్చినట్లే జుఱ్ఱి మాయోపాయంతో చంపేశాడు. ఇటువంటివాడు దుష్టుడుగాక సుకృతి (మంచిపనులు చేసేవాడు) యెట్లా అవుతాడు? పొడైన ఇటువంటి పాపబుద్ధులుసేసి, నీ నిలువ (ఇలా గుహలలో దాక్కోవటం) నేను యెట్టు నేరుతునయ్యా (నాకు ఆ నేర్పు లేదు తండ్రీ!)

కొడుకునున్నతమతిగోరి చంపెడువాడు ఈ స్వామి. తన స్వంత కొడుకు ఉన్నతమతి అవ్వాలని ఆ శ్రీహరి అతనిని చంపేశాడట. ఆకథ వినండి.

వరాహావతారంలో హిరణ్యాక్షుని చంపి శ్రీహరి భూదేవిని రక్షించాడు. ఆయనను వలచిన భూకాంతను చేపట్టాడు. వారి వలపు పర్యవసానంగా నరకుడు జన్మించాడు. అసురసంధ్యలో జనించిన అతను అసురుడై లోక కంటకుడయ్యాడు. శ్రీహరి వాడిని సంహరిస్తాడని, భయపడిన భూదేవి వాడికి చావులేకుండా చేయమని శ్రీహరిని వేడుకొంది. అది సాధ్యం కాదని కావాలంటే భూదేవికి తప్ప ఎవ్వరికీ వాడిని చంపే శక్తి వుండదని వరం పొందింది. మామూలుగానే నరకుడు బల గర్వంతో లోకకంటకుడయ్యాడు. చివరికి శ్రీకృష్ణుని భార్య సత్యభామ చేతిలోనే వాడు చచ్చాడు. ఎందుకంటే సత్యభామ భూదేవి అంశతో జన్మించింది కాని ఆమె శ్రీహరి లీల తెలియదు. అదటుంచి కన్నకొడుకునే చంపినవాడు గొప్ప పాపాత్ముడుకాక ఘనుడవుతాడా? అంతులేని, ఇటువంటి కలుష వ్రిత్తికి (దోషపూరితమైన పనికి) నీఆత్మ యెట్లంగీకరించెనోగాని నా ఆత్మమాత్రం పుత్రునే సంహరించే దుర్మార్గానికి ఒప్పుకోదయ్యా!

తల్లిజంపెడివాడు తలచుకోరాని దుష్టుడు కదా! కానీ అటువంటివాడు యెల్లవారలకెల్లా (తక్కిన అందరికంటే అధికుడా? ఏమిటా కథ?) పరశురాముడి తల్లి రేణుకాదేవి తండ్రి జమదగ్ని. నీళ్ళు తీసికొని రావటానికి నదికి వెళ్ళిన రేణుక ఆ నదిలో జలకాలాడుతున్న గంధర్వ జంటను చూచి నీళ్ళు తేవటానికి ఆలస్యం చేసింది. ఆగ్రహించిన జమదగ్ని ఆమె తల నరికేయమని ఆజ్ఞాపించాడు. అందుకు నిరాకరించిన పుత్రులలో పెద్దవారిని శపించి బూడిద చేశాడు. పరశురాముడు తండ్రిమాట విన్న తక్షణమే తల్లి తల నరికేశాడు. (ఆతరువాత తండ్రి వరంతో ఆమెను బ్రతికించుకున్నాడు. అది వేరే సంగతి). కల్లరి (నేరస్థుడు) అని లోకమెల్లా నీవు చేసిన పనికి రోసినా (అసహించుకొనినా) నీవు లెక్కసేయవు. చెల్లబో! (ఓయమ్మో) నేనేమి చేసేదయ్యా!

ఇంటివేలుపు శ్రీవేంకటేశ్వరుడు. మనందరికీ ఆయనే దిక్కు. మరి ఆయనను తనవెంట వెంట త్రిప్పుకొనే విభుడు ఇంకెంత గొప్పవాడు. అవునా, ఆ గురువు శ్రీరామానుజాచార్యులవారు. దంటనై (దిట్ట తనము కలవాడనై) నేనాయనకు దాసానుదాసుడనైతిని, నేను కూడా ఒంటినుండెద (ఏకాకిగా సన్యసించి ఆయనవలె బ్రతికెదను). ఓ అయ్యా! (శ్రీహరీ!) నేనేమీ ఒల్లను (అన్యములను వేటినీ అంగీకరించను). నేను పరివ్రాజకుడనై జీవించెదను.





సంపుటి: 1 కీర్తన : బలువగుకర్మము లివివో జీవుల ప్రారబ్ధంబులు
సంఖ్య : 296 పుట : 197 రాగం: సామంతం

## సామంతం

**6 బలువగుకర్మము లివివో జీవుల ప్రారబ్ధంబులు సంచితంబులును**
**బలిసి తీరవివి పెరుగకనే కాని బ్రహ్మలబహుకల్పంబులదాఁక ॥పల్లవి॥**

**పాయనిజన్మంబులకర్మంబులు పాయక జీవుల ప్రారబ్ధములై**
**యేయెడఁ జూచిన నెదిటికొలుచులై యిచ్చల నిటు భుజియించఁగను**
**కాయపుఁ బెడతటిగండఁడు విధి, నుఁగడ తేర్చిన తనకడకర్మములు**
**పోయి సంచితంబులఁ గలసిన, నవి పొదలుచుఁ గొండలపొడవై పెరుగు ॥బలు॥**

**పొదలి సంచితంబులు వడిఁ బెరుగును పోలియును జీవునిపుణ్యముఁ జాలక**
**యెదిగినపుణ్యం బిగురును కాఁగినయినుముమీఁది జలములవలెను;**
**పదిలములై కడుఁ బాపకర్మములే బరువై పరగఁగఁ బ్రాణికి నెన్నఁడు**
**తుదయు మొదలు నెందును లేక, వడిఁ దొలఁగక భవములతొడవై తిరుగు ॥బలు॥**

**తలఁపులో నవయఁదలఁచిన జంతువు, కలుషహరుఁడు వేంకటగిరిపతి దను-**
**దలఁచుభాగ్య మాత్మకు నొసగినఁ, జిత్తము పరిపక్వంబై యెపుడు**
**జలజోదరుఁదలఁచగఁబ్రారబ్ధంబులు సంచితంబులుఁ బొలిసి పుణ్యులై**
**చెలువగునిత్యానందపదంబునఁ జెలఁగి సుఖించగఁ జేరుదు రపుడు ॥బలు॥296**

**అవతారిక:**

హైందవ సిద్ధాంతాల ప్రకారం మనం చేసే మంచిని పుణ్యమని చెడుని పాపమని, వర్గీకరించి, మంచి పనికి మంచి ఫలితం కలుగుతుందని చెడు పనికి చెడు ఫలితం కూడా అనుభవించవలసివుంటుందని హెచ్చరిస్తోంది. ఇంతవరకు బాగానేవున్నది, కానీ ఈ అనుభవమే విచిత్రంగా జరుగుతుంటుంది. చెడుకి మంచి ఫలితపు అనుభవం కలిగి, మంచికి

చెడు ఫలితం కలుగుతున్నదా అనే భ్రమ కలుగుతుంది. ఎందుకంటే దుర్మార్గులు రాజభోగాలనుభవిస్తే సన్మార్గులు తిండికి కూడా లేక అష్టకష్టాలు పడుతుంటారు. దానికి కారణమేమంటే, దుర్మార్గుడు అనుభవిస్తున్నది వాడు ఇదివరకు చేసిన మంచికి ఫలితం. భగవంతుని ఈలీల మన మనోస్థైర్యంలేనివారు ఆయనపై నమ్మకాన్ని వదలుకొనే ప్రమాదం వున్నది. ఒక్కటి గుర్తుపెట్టుకోవాలి. భగవంతునికి ఎవ్వరిపైనా ప్రేమకాని ద్వేషంగాని వుండవు. ఆయన కర్మసాక్షి. మరణశిక్షవేసే న్యాయపతికి నేరస్థునిపై యెట్టి శతృత్వమెలా వుండదో భగవంతునికీ మనపై ఇష్టాయిష్టములుండవు. కాని సత్ప్రవర్తనగల సాధువైన నేరస్థునిపై న్యాయపతికి కొంత సానుభూతి వున్నట్లే యెప్పుడూ మంచినే చేస్తూ ఒకానొక బలహీనక్షణంలో తప్పు చేసినా ఫలితం అంత దుస్సహముగా వుండదని పెద్దల నమ్మకం. అందుకనే సాధ్యమైనంత యెక్కువ మంచి, తక్కువ చెడు చేసి భగవంతుని శరణాగతితో చేసిన చెడుకు పశ్చాత్తాపపడుతూ, మరల ఆ తప్పు చేయకుంటే చివరికి అంతా మంచే జరుగుతుంది. ఇదంతా తెలియని హైందవ భక్తులు సాధారణంగా వుండరు. మరి ప్రపంచంలో అనాదిగా పాపం యెందుకు జరుగుతున్నది? మనిషి కామక్రోధాది అరిషడ్వార్గాలకు లొంగి ఒకానొక బలహీనక్షణంలో తప్పులు చేస్తూనేవుంటాడు. ఇట్లా చెప్పుకొంటూ పోతే ఈ వివరణకు అంతమనేది వుండనే వుండదు. కాబట్టి ఇది వదిలివేసి కర్మల గురించి ఆలోచిద్దాం.

మనము పూర్వ జన్మలలో చేసిన పాపపుణ్యములకు వేరొక జన్మలో ఫలితం అనుభవించటమే సంచిత కర్మఫలం అంటారు. అందువల్లనే పాపానికి మంచి పుణ్యానికి చెడు ఫలితములు కలుగుతున్నవా అనే భ్రమ కలిగి పాపులు ఇంకా యెక్కువ పాపం చేసే ప్రమాదమూ వున్నది. ప్రారబ్ధ కర్మఫలము అని ఇంకొక తిరకాసు వున్నది. దానివలన నిర్హేతుకంగా జీవి మంచీ చెడు ఫలితములనుభవిస్తుంటాడు. దీనికి యెవ్వరూ యేమీ





చేయగలిగింది లేదు. కేవలం అనుభవించటమే. సంచిత కర్మలలో కొన్ని ఇప్పుడిప్పుడే ఫలితానికి రావు. ఏదో ఒకనాటికి తప్పక వస్తాయి. వాటిని ఆగామి కర్మఫలం అంటారు. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు ప్రారబ్ధ సంచితకర్మలగురించి చెబుతున్నారు. వీటి ఫలితం అనుభవించక తప్పదు. అయినా శ్రీవేంకటేశుని కృప వుంటే ఆయన శరణాగతులకు చివరికి మంచే జరుగుతుంది.

**భావ వివరణ:**

ఈ పల్లవిని ఇలా చెప్పుకుంటే సులభంగా అర్థం అవుతుంది. అవే పదాలు అటూ ఇటూ మార్చాలి... అంతే. ఇవివో జీవుల ప్రారబ్ధంబులు, సంచితములును బలువగు కర్మలు. అవి బలిసి, బహు బ్రహ్మకల్పములదాకా పెరుగునే కాని తీరవు (వదలిపోవు).

జన్మంబులు పాయనివి (తప్పనివి). జన్మ అంటూ యెత్తాక మంచో చెడో యేదో ఒక కర్మ చేయక జీవికి తప్పించుకొనుట సాధ్యంకాదు. జీవులకు ఈ కర్మలు పాయక (విడువక) ప్రారబ్ధములై (ఇంకొక జన్మనెత్తించేవిగా) పరిణమిస్తాయి. అవి యెప్పటికైనా వదలక యెదిటి కొలుచులై (రాబోయే జన్మలై) కొన్ని ఇచ్చల (యాదృచ్ఛికముగా అనుకోకుండానే) జరుగుతుంటాయి. వాటిని భుజించక (అనుభవించక తప్పదు). ఇక ఇంకొక గండరగండుడు వాడు కాయపుబెడతటి గండడు (అవునంటే కాదని, కాదంటే అవుననే పెడసరపు వ్యతిరేకి అయిన మొనగాడు). వాడికొక గొప్పపేరుంది. అదే "విధి" తను కడతేర్చిన (చచ్చాక కూడా) తనకడ కర్మలు (వదిలిపెట్టని కర్మలు) అవే. అవేం చేస్తాయో తెలుసా? పోయి (ముందు జన్మలకు సంక్రమించి) సంచిత కర్మలై (కొనితేబడిన కర్మలై) కలిసిపోయి, పొదలుచు (పెరుగుచూ) కొండలపొడవున (ఎత్తైత్తుకొండలవలె) పెరుగుతూనే వుంటాయి. వీటిని తప్పుకోవటం అసాధ్యం.

ఇక ఈ సంచిత కర్మలు (కొనితేబడిన కర్మలు). పొదలి (అభివృద్ధి పొందుతూ) వడిపెరుగును (శ్రీఘ్రముగా వృద్ధి జెందును). జీవులు చేసే పుణ్యకర్మలవల్ల వారికి మంచి తప్పక జరుగుతుంది. అయితే వేడి చేయబడిన ఇనుముపై పడిన నీటిబిందువు ఎలా తర్వగా ఇగిరిపోతుందో పుణ్యములవలన కలిగే మంచికూడా ఆ జీవిచేసే చెడు కర్మల పాపమువలన ఇగిరిపోతూనే వుంటుంది. కనుక ఎంత తక్కువ పాపంచేస్తే అంత ఎక్కువ పుణ్యం నిలుస్తుంది. చేసే పుణ్యాలు చేస్తూనే, పాపాలు కూడా చేస్తూనే వుంటామంటే కొండల్లాగా పెరిగే పాపాలవల్ల పుణ్యపు ప్రయోజనం మిగలనే మిగలదు. పాపకర్మములు కూడా పదిలముగా పెరుగుచూ అంతులేని బరువుగా పరిణమించి ఎన్నడూ ప్రాణిని వదలక, ఎక్కడా తుదియు మొదలు లేక వడి తొలగక భవముల తొడపై (రకరకములైన పుట్టుకలుగ పరిణమించి) జీవిని తిరుగాడుతూనే వుండేట్లు చేస్తుంది.

ఈ తిరుగాడే కార్యక్రమము కూడా ఒక నాటితో ఆగిపోయే వ్యవహారం కాదు. పుట్టిన తరువాత చచ్చేదాకా కర్మ చేయక తప్పదు దాని ఫలితము అనుభవించకా తప్పదు. తన మనస్సులోని ఆలోచనలతో, నవయు (నలిగి కృశించిపోయే) జంతువు వంటివాడే నరుడు. వీడికి నిరంతరం చింతతో మనశ్శాంతి కరువవుతుంది. కలుషహరుడు (పాప నిర్మూలన చేయు సమర్థుడైన శ్రీవేంకటేశ్వరుడు తనను తలచుకొనే భాగ్యము ఆత్మకు కలిగించనప్పుడు ఆ చిత్తము (మనస్సు) పరిపక్వత నొంది తీరుతుంది. అట్టి స్థితిలో జలజోదరుని (పద్మనాభుని) ధ్యానించగా ఆయాత్మ చేసికొనిన సంచిత కర్మలు మరియు ప్రారబ్ధ కర్మలు బొలిసి (నశించి) పుణ్యులై చెలువగ (శోభిల్లగా), అపుడు ఆయాత్మలన్నియు నిత్యానంద పదమును పొందుతాయి. ఆ నిత్యానందస్థితిలో అనంతమైన సుఖమును పొందుతారు.





సంపుటి: 1 కీర్తన : అందరి బ్రతుకులు నాతనివే
సంఖ్య : 335 పుట : 223 రాగం: పాడి

**పాడి**

**7** **అందరి బ్రతుకులు నాతనివే**
**కందువెల్ల శ్రీకాంతునిదే** ॥పల్లవి॥

**వేమరుఁ జదివెడివిప్రులవేదము**
**సోము (మ?)కవైరియశోవిభవం**
**శ్రీ మించునమరలజీవనమెల్ల సు-**
**ధామథనునిసంతతకరుణే** ॥అంద॥

**హితవగు నిలలోని సుఖమెల్లను**
**దితిసుతదమనుఁడు దెచ్చినదే**
**తతి తల్లిదండ్రి తానై కాచిన-**
**రతి ప్రహ్లాదవరదుని కృపే** ॥అంద॥

**అలరినయమరేంద్రాదులబ్రదుకులు**
**బలిబంధనుకృపఁ బరగినవే**
**బలసి మునులయాపదలు వాపుటకు**
**బలునృపభంజను పరిణతలే** ॥అంద॥

**పూని యనాథుల పొందుగఁ గాచిన-**
**జానకీవిభునిసరసతలే**
**నానాభూభరణంబులు నందుని-**
**సూనుఁడు చేసినసుకృతములే** ॥అంద॥

**తలకొని ధర్మము తానై నిలుపుట**
**కలుషవిదూరునిగర్వములే**
**నిలిచి లోకములు నిలిపినఘనుఁడగు-**
**కలియుగమునవేంకటపతివే** ॥అంద॥**335**

**అవతారిక:**

ఆత్మరూపంలోవున్న అందరికీ వారివారి భాగ్యానుసారం యేదో ఒక జన్మనిచ్చేవాడు జనార్దనుడు. క్రిమికీటకమైనా మరే జీవియైనా ఆయన యిచ్చిన బ్రతుకును గడపవలసినదే. ఇంకొక ప్రత్యామ్నాయం (ఆల్టర్నేట్) వుండదు. కందువ అంటే చమత్కారం అని అర్థం. ఎవరికే జన్మ ఇవ్వాలి? ఎంతకాలం వుంచాలి? ఎప్పుడు తుంచాలి నిశ్చయించేది ఆ శ్రీకాంతుడే. ఇంకెవ్వరికీ ఆ అధికారం లేదు. ఈ జన్మలో మహారాజు కాబట్టి తరువాత జన్మలో చక్రవర్తి అవ్వాలని లేనేలేదు. నల్లి అయి రక్తం పీలుస్తూ చిదిమేయబడే ప్రాణి కావచ్చును. ఈ కీర్తనలో నర్మగర్భంగా “తలకొని (నిర్వహించి) ధర్మముతానేయై నిలుపుటకు” అంటే, నాస్తిక ధర్మమును బోధించే బుద్ధడూ తానేయైనట్లు ప్రస్తావన వస్తుంది. ఇది దశావతార వివరణ అని అర్థం అయితేనే, ఈ ఊహ తట్టుతుంది. కలుషమును (త్రిపురాసురుల చెడును) గర్వములను తొలగించిన ఆ దేవదేవుని గర్వములే (గౌరవములే) ఆయనదే యేపనియైనా. ఇది గ్రహించుట జ్ఞానము. వితండ వాదన అజ్ఞానము. ఎడ్డెమంటే తెడ్డెమనే వితండవాదులను సృష్టికి ప్రతిసృష్టిచేయగల విజ్ఞానవేత్తలమనే అఖండులను ఒక నమస్కారంపెట్టి వదిలేద్దాము.

ఓ నాస్తికశిఖామణులారా! మీ ఆలోచన కూడా సరియైనదే. నూటికినూరుశాతమూ మీ ఇష్టం వచ్చినట్లు పుట్టుకలు మరణాలు తెప్పించి ఏ రోగమొచ్చినా గ్యారంటీగా తగ్గించుకోగలిగిననాడు దేవుడు లేడు గీవుడు లేడు అని నేనూ మీతో చేరిపోతాను. అందాకా నేనూ మా తిరుపతయ్యా కలిసే వుంటాము. కొసమెరుపేమంటే అన్నమాచార్యులవారి దశావతార కీర్తన ఇది అని మీకు తెలిస్తే మీరు కాదు, నేను ధన్యుణ్ణి.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఈజీవులందరి బ్రతుకులునూ ఆతనివే (ఆ శ్రీమన్నారాయణునివే). ఆయన కృపవలన ఆ జీవికి ఆ బ్రతుకు దక్కింది.





కందవయెల్లా (ఆ చమత్కారం ఎవరికే జన్మ ఇవ్వాలో నిర్ణయించడంలోనే వున్నది.) ఆ చమత్కారం (ఆ నైపుణ్యం) అంతా ఆ శ్రీకాంతునిదే.

విప్రులు (బ్రాహ్మణులు) వేమరు జదివెడి వేదములు (అనేక పర్యాయములు వల్లించు వేదములన్నియు) ఆనాడు మత్స్యావతారంలో శ్రీహరి, వేదములను దొంగిలించిన సోమకాసురుని వధించి తిరిగి బ్రహ్మ దేవేరియైన వాణికి వాణి రూపంలో (మాటవలె) బీజాక్షరాలతో ఇచ్చి, ఇది ఇకపై శ్రుతివలె వుంటుందని నిర్దేశించి వేదము సోమకునికి దక్కకుండా కాపాడాడు. శ్రీమించు అమరజీవనమెల్ల (కామధేను, కల్పవృక్షములు సంపదలతో మించిన దేవతల వైభవమంతయూ కూర్మరూపియై మందర పర్వతమును ధరించిన సుధామథనుని (అమృతమథనుడైన) శ్రీహరి సంతతకరుణ (నిరంతర కృపాప్రసాదమే).

ఇలలోన్ ఈ సుఖమే హితవగున్ యెల్లను ప్రపంచంలో (ఈ ఆనందమే అన్నివేళలా క్షేమము నొసగునది). ఎందుకంటే ఆది వరాహమై హిరణ్యాక్ష దైత్యుదమనుడు (దానవ భంజనుడైన) శ్రీహరి ప్రసాదమే. అమిత నిశ్చయంతో యెల్లరకు తల్లియును తండ్రియునూ తానే అయి సంరక్షించిన ప్రహ్లాదవరదుడు శ్రీనరసింహుని కృపయే, సర్వమూ. ఆయనే లేకుంటే నేటికి మనం హిరణ్యకశిపుని భజనపరులమై వుండేవారము.

అమరేంద్రాదుల బ్రతుకులన్నీ (దేవేంద్రాది దేవతల బ్రతుకులన్నీ ఆనాడు బలిచక్రవర్తి వల్ల బూడిదపాలైపోతే శ్రీహరి వామనుడై, జగన్నాధుడైనా బలిచక్రవర్తిని భిక్షాం దేహియని యాచించి మూడడుగుల స్థలము చాలని, దానము గ్రహించి ఒక అడుగుతో భూమిని, ఇంకొక అడుగుతో సమస్త విశ్వమును ఆక్రమించి మూడవ అడుగుకు స్థలములేదని అసత్యదోషానికి, ఆ బలిని బంధనముతో బంధించి ఆతడు తన ప్రియభక్తుడు ప్రహ్లాదుని మనుమడైనందు వలన కరుణతో విడిచిపెట్టి అసత్యదోషణా నివారణార్థం ఆతని తలపై తన మూడవ అడుగువుంచి రసాతలమునకు తొక్కివైచి ఆతనికి గొప్ప వరములను ప్రసాదించి అతని వాకిలిలో కావలివానిగావుండి రసాతలంలో కూడా స్వర్గంలోవలె మృత్యువులేని అఖండవైభవములనిచ్చాడు.

నాస్తికులై మునులను పీడించు కార్తవీర్యునివంటి రాజుల శిరస్సులను ఖండించిన పరుశురాముడు ఇరువదియొక్క మారులు భూమిని చుట్టి తనవశమైన భూమిని బ్రాహ్మణ్యులందరికీ దానముగా ఇచ్చేసిన పిమ్మట రాజులను క్షమించి వారి సంతతిని ప్రజారంకముగా పరిపాలించండని హితవు చెప్పిన ఆ బలునృపభంజనుని, పరిణతులే (ఒసగబడిన ఆనందములే).

పూనికతో కోదండదీక్షాదక్షుడై పొందుగా (గొప్పగా) అనాథలను గాచిన (దీనజనోద్ధారకుడైన జానకీమనోహరుడు శ్రీరామచంద్రమూర్తి యొక్క సరసతలే (అనుగ్రహములే) సర్వమూ. ఆయనే లేకపోతే నేటికీ రావణాసురుడు కావలసినవి అందరినుంచీ లాగివేసికొంటూ, కావలసిన స్త్రీలను తనకైవశంచేసికొంటూ హాయిగా వుండేవాడు. వాడే గొప్పరాజ్య పరిపాలనా దక్షుడని వితండవాదులై కొంతమంది తమ స్వంత రామాయణాలతో వారిలోకంలో వారూ వుంటూనే ఒక నాటికి ఏది మంచో ఏది చెడో తెలుసుకొంటారు. ఎవరుమాత్రం యేమి చేయగలరు? వూరుపొమ్మని, వల్లకాడు రమ్మని పిలిచేనాడు తెలిసినా తెలియకున్నా తేడాయేమీ వుండదు. నందునిసూనుడై (రేపల్లెలో నందగోపుని బిడ్డడై యాదవుడై శ్రీకృష్ణుడై) నానాభూభరంబులను (అనేకరకములైన భూభారములను) తొలగించాడు. పూతన వంటి రాక్షసులనేకాక జరాసంధుడు, కంసుడువంటి రాక్షసాంసతో జన్మించిన రాజులనూ ధనరాజ్యమదోన్మత్తులై దుర్మార్గులైన రాజులనందరినీ భారతయుద్ధంలో నామరూపాలులేకుండా చేశాడు. దుష్టశిక్షణానంతరము సుస్థిర ధర్మరాజ్యపాలనతో శాంతి భద్రతలను పరిరక్షించాడు.

ద్వాపరయుగము అంతరించిపోయి కలియుగం వచ్చేసింది. ఇంకా అక్కడక్కడా త్రిపురాస్తురుల్లాంటి దుర్మార్గులు మిగిలిపోయారు. వారు పరమశివుని భక్తులు. లోకకంటకులు. శివుని చేతిలోగాని చావరు. వారిని శివభక్తికి దూరం చేసి తాను బుద్ధుడై వారికి నాస్తికవాదమే సరియైనదని బోధించి, త్రిపురాసుల భార్యల శీలాపహరణమనే పాపమును కూడా చేసి దానిచే శిలయైపొమ్మనే శాపం కూడా వారిచే పొందిన త్యాగశీలి ఆయన. తాను చెప్పినదే 'ధర్మము' చేసినదే 'న్యాయము' అయినా శిలయై తిరుమలలో వుంటానని తన తప్పుకి తానే భార్యారహితుడై శిలయైనాడు. శ్రీవేంకటేశ్వరుడై నిలిచి లోకములన్నీ నిలిపిన ఘనుడై కలియుగనారాయణుడై మనబోటి ఆర్తులను కంటికి రెప్పలా కాపాడుతున్నాడు.





సంపుటి: 1 కీర్తన : పుట్టుమాలిన బరుబోకివినన్ను
సంఖ్య : 107 పుట : 73 రాగం: సాళంగం

## సాళంగం

**8 పుట్టుమాలినబరుబోఁకివి నన్నుఁ**
**దిట్టే వదేమోసి దిమ్మరిమాయ ॥పల్లవి॥**

**ఒరపులాడక పోవె వోసి మాయ నాతోఁ**
**దొరలేవు నిను ముట్ట దోసము**
**వెరపించే వేమోసి విష్ణుభక్తినంటా-**
**నెరఁగనటే నీయేతు లిన్నియును ॥పుట్టు॥**

**వుదుటు చెల్లదు పో పో వోసి మాయ నా-**
**యెదుర మాఁటలు నీకు నిఁకనేలే,**
**వదరేవు హరిభక్తివనిత, తెలియరు నే-**
**నిదురవచ్చినవారు నీవు నా కెదురా ॥పుట్టు॥**

**వొల్లవటే జీవ మోసిమాయ నీ-**
**కల్లలిన్నియును లోక మెఱుఁగును,**
**నల్ల నివిభునిమన్నన భక్తినంటాఁ**
**జెల్లఁబో పాపపుచేఁదు మేయకువే ॥పుట్టు॥**

**వూరకుండవుగా వోసిమాయ నిన్నుఁ**
**బేరఁ బిలువము గుంపెనలాడేవు,**
**నారాయణభక్తినాతి నన్నును నిన్నుఁ**
**గోరి యిందరు నెఱుఁగుదు రేల పోవె ॥పుట్టు॥**

**వోవపు ననుఁజూచి వోసిమాయ నా-**
**తోవ వచ్చినను నొత్తువు నీవు,**
**శ్రీవేంకటగిరిదేవునిభక్తి నా-**
**హోవళికే నిన్ను నలమి రిందరును ॥పుట్టు॥107**

**అవతారిక:**

అన్నమాచార్యులవారి ఈ కీర్తనలో చాలా విశిష్ఠతలున్నాయి. శ్రద్ధగా ఆలకించండి. ఇది ఒక సంవాదరూపమై కీర్తన. ఇద్దరిమధ్య సంవాదము జరుగుతోంది, ఆ ఇద్దరిలో ఒకరు మంచి, ఒకరు చెడు. మంచికి మారుపేరు హరిభక్తి. చెడుకి మారుపేరు మాయ. ఈ మాయను, పుట్టుమాలినది (నాశనమైనదని) బరుబోకివి (పోరంబోకువి) అని తీవ్రంగా నిందిస్తున్నారు. ఎవరు? ఇంకెవరు మన హరిభక్తి. ఆ మాయను దిమ్మరిమాయ (భ్రమకలిగించే మాయ) అని అంటున్నారు. నేటికాలంలో దీనినే "మాయదారిది" అని వుపయోగిస్తున్నాం. మాయ కూడా తక్కువతిన్నదేమీ కాదు. "ఒసేయ్ నన్ను వూరకనే విష్ణుభక్తిని అని భయపెట్టకే. నీ యేతులిన్నియును నేనెరుగనటే? నీవంటే యెవడికి భయమే" అని మొండికెత్తింది మాయ. ఇవన్నీ ఒక యెత్తు ఆఖరి చరణం ఒకయెత్తు. ఆఖరికి విజేత అయిన హరి భక్తి ఏమంటోందంటే "నేను శ్రీవేంకటగిరిదేవుని భక్తిని. ఆహావళికే నిన్నున్ ఇందరును అలమిరి". అంటే యేమిటో అర్థమయిందా? బాగా ఆలోచించండి. ఎన్ని నిఘంటువులను వెదకినా ఫలితం వుండదు. శ్రీవేంకటేశ చరణం శరణం ప్రపద్యే. అని భక్తిగా మొక్కి ప్రార్థించండి. నేను అదే చేశాను. అప్పుడు ఒక తటల్లత తళుక్కున మెరిసింది. అదేమో తెలియాలంటే భావవివరణ చదవక తప్పదు మరి.

**భావ వివరణ:**

హరిభక్తి: ఓ దిమ్మరి మాయా! (భ్రమలు కలిగించే మాయా!) నీవు నన్ను దిట్టేవదేమోసి (నీవు నన్ను తిడతావేమిటే?) నీవు పుట్టుమాలిన బరుబోఁకివి (నాశనమైన పోరంబోకువి). మరి నేనెవరినో తెలుసా? సాక్షాత్తు ఆ శ్రీహరి భక్తిని. నాతో పెట్టుకుంటే నీఅంతు చూస్తాను జాగ్రత్త!

హరిభక్తి: ఓసి మాయా! నాతో ఒరపులాడకే (ఘర్షణపెట్టుకోవద్దే). నాతో దొరలేవు (కిందామీదా అవుతున్నావు). అసలు నిన్ను ముట్టుకుంటేనే దోసము (దోషమూ, పాపము).





మాయ: ఓసినీ విష్ణుభక్తినని గొప్పలు చెప్పుకొని, నన్ను భయపెడతావటే? నీయేతులన్నీ (గొప్పలన్నీ) నేనెరగనటే?

హరిభక్తి: ఓసి మాయా! పోపోవే! నీ వుదుటు (ఉద్ధతి) ఇక చెల్లదు (పనికిరాదు) ఇంకానాతో నీకు యెదురు మాటలు దేనికే? పోపోవే.

మాయ: ఒసే హరిభక్తి వనితా! నీవు నాకెదురేమిటే? ఎంతసేపు నేను హరిభక్తిని హరి భక్తిని అని వదరేవు? (వాగుతావు?) నేను ఎవ్వరినైనా మత్తులో పడేసి నిదురపుచ్చగలను తెలుసా? నేను నిదురపుచ్చినవారికీ ఒళ్ళూపైనా తెలియనే తెలియవు. జాగ్రత్త! నాతోపెట్టుకోకు. నీవు హరిభక్తివైతే నాకేమిటే?

హరిభక్తి: ఓసి మాయా! నీవు వొల్లవటే జీవము? (నీవు పరమాత్మను ఒప్పుకోవా యేమిటే?) లోకము నీకల్లలిన్నియును యెరుగునులే. నీవు అబద్ధాల పుట్టవని మా హరిభక్తులు యెప్పుడో తెలుసుకొన్నారు.

మాయ: ఒసే పాతకీ! హరిభక్తినని, నల్లని విభుడైన శ్రీవేంకటేశ్వరుని మన్నన కలిగినదానివని గొప్పలు చెప్పుకోకే. చెల్లబో!! (అమ్మయ్యో) పాపపుచేదు దున్నపోతులా మేయకువే (మేయవద్దే).

హరిభక్తి: ఓసిమాయా! నీవు వూరకుండవు గదే! (మౌనంగా వుండవు కదటే. నిన్ను బిలువము (నిన్ను పేరుతో పిలువము) ఎందుకంటే నీవు గంపెనలాడేవు (అతిశయపుమాటలు మాట్లాడతావు).

మాయ: నేను నారాయణ హరిభక్తినాతిని (శ్రీమన్నారాయణుని హరిభక్తి వనితా రూపం దాల్చి వచ్చిన దానను) అని ఏమి చెబుతున్నావే. ఇక్కడున్న ఇంతమందికి నేనెవరో నీవెవరో తెలియదటే. కోరి నీతో నాకేల? పోవే.

హరిభక్తి: ఓసి మాయా! నన్ను జూచి ఓపవే (సహించవే) నాతోవచ్చినను (నా దారికి అడ్డంవస్తే) నొత్తువు (ఇబ్బందిపడతావు) జాగ్రత్త! నీవు ఒళ్ళు దగ్గరబెట్టుకో. నేను శ్రీవేంకటగిరిమీది దేవుని భక్తిని. ఆహారికే (కొట్లాటవచ్చిందంటే) ఇందరును (ఇంతమంది హరిభక్తులూ కూడా) నిన్నున్ అలమిరి (ఆక్రమించి చితకబొడుస్తారు) జాగ్రత్త.

సంపుటి: 1 కీర్తన : పెరుగ బెరుగ బెద్దలుగాగా పెనువెట్టివట్టు బెద్ధెతిగితే
సంఖ్య : 440 పుట : 295 రాగం: బౌళి

**బౌళి**

**9** **పెరుగఁబెరుగఁ బెద్దలుగాఁగా పెనువెట్టి పట్టు బుద్ధెతిఁగితే,**
**మరులు మఱచితేనే యిన్నిటిగెలిచేమర్మము సుండీ జ్ఞానులకు ॥ పల్లవి॥**

**జననమందినయప్పుడు దేహి సన్యాసికంటే నిరాభారి**
**తనరఁ గొపీనకటిసూత్రముల తగులములేని దిగంబరి**
**తనుఁ దా నెఱఁగఁడు యెదిరి నెఱఁగఁడు తత్వధ్యానాలయ-**
**నిర్మలచిత్తుఁడు**
**పెనఁగేకోరిక యించుకంత లేదు పేరులేనివాఁడు**
**వీఁడువో యమ్మా ॥పెరు॥**

**నిద్దురవొయ్యేటియప్పుడు దేహినిత్య విరక్తునివంటిఘనుఁడు**
**బుద్ధి సంసారముపై నించుకా లేదు భోగమేమీ నొల్లఁడు**
**వొద్దనే యేపనులకుఁ జేయఁబోఁడు వున్నలంపటాల కేమియుఁ**
**జొరఁడు**
**కొద్దిలేనియాస యెందువోయనొకో కోప మేమి లేదు**
**వీఁడివో యమ్మా ॥పెరు॥**

**హరి శరణన్నయప్పుడు దేహి అమరులకంటె కడునధికుఁడు**
**పరమునిహము నఱచేతిదే ప్రయాస మించుక లేదు**
**దురితము లేదు దు:ఖములు లేవు తోడనే వైకుంఠ మెదురుగా వచ్చు**
**గరిమ శ్రీవేంకటేశుఁడు వీఁడివో కానరైరిగా యిన్నాళ్లమ్మా ॥పెరు॥440**

**అవతారిక:**

జీవి తను శిశువుగావున్నప్పుడు మాయామర్మము లేక సన్యాసివలె నిర్మోహిగావుంటాడు. దిగంబరియై కపటములేకుండా నిర్మలానందస్థితిలో





వుంటాడు. వాడు పెరిగి పెద్దవాడవుతున్నకొలదీ పెనువెట్టి తలకెక్కుతుంది. యుక్తవయస్సు వచ్చేసరికి బుద్ధెతిగిన కొద్దీ మదనతాపము మొదలవుతుంది. దానితో వాడి పతనమూ మొదలవుతుంది. ఈ మరులు మఱచితేగాని వాడు బాగుపడడు. మరులు మఱచితే అన్నిటిలోను విజయం సాధించగలడు. జ్ఞానులైనవారి విజయరహస్యం ఇదే సుండీ (సుమా!) అంటున్నారు అన్నమాచార్యులవారు. జన్మించినప్పుడు యే పేరూ పెట్టనంతవరకు వాడు తత్వజ్ఞాని ఒక్కసారి పేరుపెట్టి వాడిని ఆ పేరుతో పిలవంగానే వాడిలో నేను, నాది అనే భావన కలుగుతుంది. వాడిలో కోరిక చిగురిస్తుంది.

సరే! ఈ మానవుడి నిద్రావస్థను పరికించండి. అప్పుడుకూడా వాడు నిత్య విరక్తునివలె, దేనిమీదా వాంఛలేక, యే లంపటమూలేక కోపతాపాలు లేకుండా వుండగలుగుతున్నాడు. ఎందుకని? వాడి బుద్ధి సంసారము మీద లేదు. సుషుప్తిలోవున్నది. అందుకని. సరే! వాడు హరిశరణాగతి పొందినదే తడవుగా అమరులకంటే ఆనందంగా వుంటాడు. వాళ్ళకి స్వర్గంపైకెవరు దండెత్తుతారా అనే భయం వెన్నంటే వుంటుంది. కాని శ్రీవేంకటేశ్వరుని నమ్ముకొన్నవాడికి వైకుంఠం యెదురుగా వున్నట్లే వాడు జీవన్ముక్తుడు.

**భావ వివరణ:**

ఒక జీవి పెరిగి పెరిగి పెద్దవుతుంటాడు. అట్లా పెరుగుతున్నకొద్దీ వాడి బుద్ధికూడా వికసిస్తుంది. అయితే దురదృష్టం కొద్దీ ఆ బుద్ధి పెనువెట్టిబట్టి అనేక భ్రమలకు లోనై, మరులుగొని (మదనుని పీడకు గురియై) తన జీవన గమ్యం తెలియలేక చెడిపోతున్నాడు. అయితే భగవత్కృప కలిగితే జ్ఞానం వస్తుంది. అప్పుడు వాడు ఆ మరులు మఱచి జ్ఞానియై ఇహపరములను రెంటినీ సాధించగలుగుతాడు. ఇన్నిటినీ గెలిచేమర్మము ఇదే సుండీ! (సుమా).

జననమందినయప్పుడు దేహి అని పిలువబడే ఈ జీవి గొప్ప నిరాభారి (ముని) అతని లోకమే అతనిది. ఇతరుల సంగత్వం అక్కరలేదు. సన్యాసికంటే నిస్సంగుడు. మొలత్రాడుకాని, కౌపీనము (గోచీ) కాని వంటిపై లేని దిగంబరుడు. తనను తానెరుగడు. అట్లే యెదుటనున్న వారినీ యెరుగడు. పూర్వజన్మజ్ఞానం వుండి తల్లి గర్భంలోని అంధకారంలో తొమ్మిది నెలలు మగ్గి

భగవంతుడా నన్నీ నరకం నుండి బయటపడవేయి ప్రభూ! మరల యేపాపమూ చేయను. సద్బుద్ధితో వుంటాను. ఈసారి ముక్తిని సాధిస్తాను అని అనేక ఒట్లు పెట్టుకొంటాడు. నిర్మల చిత్తముతో ఈ ప్రపంచంలోకి అడుగుపెడతాడు. వాడికి పేరుపెట్టనంతవరకు 'నేను' అనే భావనకూడా రాదు. ఇంచుకైనా (కొద్దిగా కూడా) పెనగే కోర్కెల పీడ (పెనవేసికొని వేధించే కోర్కెల బాధ) వాడికుండదు. జీవన్ముక్తుడు వాడేనే వోయమ్మా!

ఇక నిద్రపోయేవాడిని చూద్దాము. ఆ నిద్రలో వుచ్ఛ్వాస నిస్శ్వాసములున్న దేహి (జీవి) మాత్రమే. ఊపిరిపీలుస్తున్నాడు. కాబట్టి జీవించినట్లున్నా, వీడు నిత్య విరక్తుడు. ఆలోచనేలేనివానికి యే రక్తి వుంటుంది? అందుచేత విరాగి యైన ఘనుడు. ఈ సంసారముపై కొద్దిగా కూడా ధ్యాసవుండని నిస్సంగుడు. ఆ దశలో వాడు యే భోగమును ఒల్లడు (కాంక్షించడు), ఒద్దనే, (నిరాకరించినట్లు) అసలు పట్టించుకోడు. ఏపనినీ తలపెట్టడు, పని నిర్వహించడు. లంపటాలకేమియూ జొరడు (ఏవిధమైన బంధుత్వపు తగుల ములలో తగులుకొనడు). కొద్దిలేని ఆస (అంతులేని ఆశ) యెందువోయనో ఆ సుషుప్తిలో యెక్కడికి పోయిందో కదా! ఇక అరిషడ్వర్గాలమాటకొస్తే, వీడికి కోపము అనేదేలేదు. ఓయమ్మా! వీడు జీవన్ముక్కుడే.

కానీ ఆ శైశవదశ, సుషుప్తి యెల్లకాలమూ వుండేవి కావు. ఆ స్థితిలో నుంచి విడివడగానే అరిషడ్వర్గాల పీడితుడై శీతోష్ణ సుఖదు:ఖాది ద్వంద్వ పీడితుడై అనేక పాపపుణ్యాల పీకులాటలో వుంటాడు. వాడి జన్మ సుకృతం వలన శ్రీవేంకటేశ్వరుని శరణాగతిని పొందుతాడు. అప్పుడు అమరులకంటే (దేవతలకంటే) అధికుడు అవుతాడు. ప్రయాస ఇంచుకంతైనా లేక (అప్రయత్నంగా) ఇహమూ పరమూ అతనికి అరచేతిలో నిలచివుంటాయి. ఏవిధమైన పాపచింతనలేని విరాగి అతడు. అతనికి యే దు:ఖమూ వుండదు. మరి అటువంటి వానికి వైకుంఠము యెదురుగా వుండకుండా యెక్కడ వుంటుంది? ఈ శ్రీవేంకటేశ్వరుని గరిమ (దివ్యమహాత్మ్యమును) ఇన్నాళ్ళూ చూడలేకపోయామే!! ఓయమ్మా! ఇప్పటికైనా బ్రతికాము. ధన్యులమయ్యాము.





సంపుటి: 6     కీర్తన : అల్లవాడే వాడల్లవాడే
సంఖ్య : 43     పుట : 31     రాగం: గౌళ

**గౌళ**

**10 అల్లవాఁడే వాఁడల్లవాఁడే**
**యెల్ల లోకములకుఁ దానేలికైనవాఁడు ॥ పల్లవి॥**

**దొడ్డమేఁక పొలగూడు దోమటి దొడికినాఁడు**
**గడ్డువయసగు బిడ్డగన్నవాఁడు**
**నడ్డిముక్కుతోడ వెట్టి నవ్వులు నవ్వినవాఁడు**
**అడ్డపాపఁడై యున్న ఆకుమీఁదివాఁడు ॥అల్ల॥**

**ఆలి యిల్లు బొడ్డుతోడ నంటఁగట్టుకొన్నవాఁడు**
**కోలలేక లోకమెల్లఁ గొలిచినాఁడు**
**కాలువగా మింటి నీరు కాలఁదన్ని తీసినాఁడు**
**నేలకింది పరపుపై నెలకొన్నవాఁడు ॥అల్ల॥**

**మించుల మించుల వన్నె మెకము నేసినవాఁడు**
**దంచేటి కైదువచేఁదనరువాఁడు**
**కంచముగా గొల్లవారి కడవలపాలెల్ల**
**వంచుకొని దోసిట వారవట్టువాఁడు ॥అల్ల॥**

**పోటుమీరిన యసురపురము లిన్నియుఁ జొచ్చి**
**వీటిబుచ్చి దుమ్ములుగా వేసినవాఁడు**
**బూటకపుసురలతోఁ బున్నమ కప్పురమున**
**కూటువగాఁ జాపకూడు గుడిచినవాఁడు. ॥అల్ల॥**

**అల్లిందామరల పొందులైన కన్నులవాఁడు**
**తల్లిఁ గూఁతుఁ గౌఁగిటఁ దగిలినాఁడు**
**చల్లనైన వేంకట శైలముపై నున్న**
**నల్లని మేనివాఁడు నవ్వుమోమువాఁడు. ॥అల్ల॥**

**అవతారిక:**

"అదిగో వాడే, యెల్ల లోకాలపాలకుడైన దేవదేవుడు" అని అత్యద్భుతమైన కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇది శ్రీమన్నారాయణుని అవతార వివరణే కాని దశావతార వివరణ కాదు. కూర్మ, నారసింహ, పరశురామ, కల్కి అవతారాల ప్రసక్తి లేదు. కాని యజ్ఞనారాయణుడు, ఆదినారాయణుడు, మఱ్ఱిఆకుపై శైశవ నారాయణుడు, దత్తాత్రేయుడు మొదలైన రూపములను దాల్చిన శ్రీహరి అవతారములను కీర్తిస్తున్నారు. ఎంతో పటిష్టమైన పౌరాణిక వాఙ్మయ పరిచయం వుంటేకాని ఇటువంటి కీర్తనలు వివరించుట సాధ్యంకాదు.

ఒక్కొక్కప్పుడు మన వూహ సరైనదో కాదో అని మనకే అనుమానం వస్తుంది. ఉదాహరణకు ఈ కీర్తనలో "బూటకపు సురలతోన్ పున్నమ కప్పురమున కూటువగాన్ చాపకూడున్ కుడిచినవాడు" – ఎవరు వాడు? నేను ఆలోచించి, దత్తాత్రేయులవారు అని వూహించాను. అన్నమాచార్యులవారి యోచన ఇంకొకరుకూడా అయివుండవచ్చును. దశావతారముల క్రమములో అది "కల్కి" వివరణ అవాలి. కానీ యెలా సమన్వయ పరచాలి? మరి ఇది "అసిధారావ్రతము" అంత ఆషామాషీ వ్యవహారం కాదు. అవునా? చాలా జాగ్రత్తగా చదవండి.

**భావ వివరణ:**

అల్లవాడే (అదిగోవాడే) వాడు అల్లవాడు (ఆదిపురుషుడు). ఎల్లలోకములను (పైనున్న ఏడు, క్రిందనున్న ఏడు మొత్తము పదునాల్గు లోకములకును) తానే ఏలికైన (పరిపాలకుడైన) వాడు. వీడే జగన్నాథుడు.

**"దొడ్డమేక పొలగూడు దోమటి దొడికినాడు".** శ్రేష్ఠమైన మేక (యజ్ఞ పశువైన మేక) పొలగూడు (మాంసమును) దోమటి దొడికినాడు (ఆహారముగా భుజించినాడు). ఈయననే యజ్ఞనారాయణుడని వేదము కీర్తించినది.





**"గడ్డు వయసగు బిడ్డగన్నవాడు".** అతి వృద్ధాప్యపు వయసుతో జగత్ పితామహుడని కీర్తించబడిన బిడ్డను (బ్రహ్మదేవుని) కన్నవాడు. ఈయనే ఆదినారాయణుడు.

**"నడ్డిముక్కుతోడ వెఱ్ఱి నవ్వులు నవ్వినవాడు"** నడుము మధ్యలో ముక్కువుండి, యెప్పుడు చూచినా వెఱ్ఱినవ్వు నవ్వుతున్నట్లు సగం తెరచుకున్న నోరుతోవుండే చేప ఆకారముగల దేవుడు. మత్స్యావతారముననున్న శ్రీహరి.

**"అడ్డపాపడైవున్న ఆకుమీది శిశువు"** జగత్ప్రళయమున అనంత నీరవములో ఒకమఱ్ఱి ఆకుపై శిశువు వలె తెలియుండి ఒక కాలిబొటనవ్రేలు నోటితో చప్పరించి తిరిగి జగత్ సృష్టి సంకల్పమును చేసిన శైశవనారాయణుడు. (కూర్మ, వరాహ నారసింహ ప్రసక్తిలేదు).

**"ఆలి ఇల్లు బొడ్డుతోడ నంటగట్టుకొన్నవాడు"** తన ఆలి లక్ష్మీదేవి పుట్టినిల్లయిన క్షీరసాగరమును బొడ్డుతోడ (పుట్టిననాటినుంచే) అంటగట్టు కొన్నవాడు (తనస్వంత ఇంటిలో హక్కు భుక్తంగా అనుభవిస్తూ స్వంతం చేసికొనిన శ్రీమన్నారాయణుడు).

**"కోలలేక లోకమెల్ల గొలిచినాడు".** ఏ కొలబద్ద లేకుండానే కొంచెముకూడా సందులేక లోకమంతా వ్యాపించి కొలిచి రెండు అడుగులతోనే భూనభాంతరములు వ్యాపించి చూపి బలి చక్రవర్తిని మరి నీవు దానమిస్తానన్న మూడవ అడుగునకు చోటేది అని ప్రశ్నించిన వామనమూర్తి.

**"కాలువగా మింటి నీరు కాలదన్ని తీసినాడు"** ఆనాడు ఆకాశమంతా నిండిపోయేట్లు పాదముతో నింగిని తన్నినప్పుడు ఆకాశగంగకు చోటు లేక ఆ త్రివిక్రముని పాదములు నాశ్రయించి అందులో ఇమిడిపోయింది. అటువంటి విశ్వప్రకాశకుడు. **నేలకింది పరుపుపై నెలకొన్నవాడు** ఆదిశేషుడు భూమిని పరుపులా మోస్తుంటే విష్ణుమూర్తి ఆదిశేషునిపై పవ్వళించియుంటాడని విష్ణుపురాణం వర్ణిస్తున్నదట. **మించుల మించుల వన్నె మెకము నేసినవాడు** మించు (విజృంభించుచున్న) మించులవన్నె (బంగారురంగుగల) మెకమున్ (లేడిని) యేసినవాడు (చంపినవాడు) శ్రీరామచంద్రుడి అవతార వర్ణనమిది (పరశురాముని వదలినారు).

**"దంచేటిక్రైదువచే దనరువాడు"** దంచుటకు వుపయోగించు సాధనములు (రోకలిని) కైదువగా (ఆయుధముగా) స్వీకరించినవాడు బలరాముడు అవతారము.

**"కంచముగా గొల్లవారి కడవలపాలెల్లా వంచుకొని దోసిటావారవట్టువాడు"** శ్రీకృష్ణలీలను వినండి. ఆ బాలకృష్ణుని ఇంటినిండా పాలేవుంటాయి. కానీ కంచముగా (తన స్వంత ఆహారంలా) వూళ్ళోవున్న గొల్లవారిండ్లలోని కడవల నిండుగనున్న పాలను వంచుకొని దోసిళ్ళలో పట్టి వారవట్టువాడు (ధారగా పార బోసిన చిలిపివాడు. నాయనా! మనింట్లో అన్నిపాలుంటే వాళ్ళఇంటి పాలెందుకురా అంటే వింటాడా? ఆయనకి కావలసింది యేడిపించడమే. అదే శ్రీకృష్ణలీల.

**"పోటుమీరిన అసురపురము లిన్నియుజొచ్చి వీటి బుచ్చి దుమ్ములుగా వేసినవాడు".** హద్దుమీరిన త్రిపురాసురుల పురములలో జొరబడి, వారి భార్యల మానములను వీటిబుచ్చి (పొల్లుచేసి) ఆ రాక్షసులను ఒకేసారి భస్మము చేయించినాడు. శ్రీహరి ఈలీలను బుద్ధావతారంతో నిర్వహించి పరమశివుని త్రిపురాంతకుడను కీర్తిని కలిగించినాడు.

**"బూటకపు సురలతోన్ పున్నమ కప్పురమున కూటువగాన్ చాపకూడున్ కుడిచినవాడు"** మారువేషాలలో వున్నదేవతలతోపాటుగా పున్నమకప్పురము అనే చోట, కూటువగా (ఒకే గుంపుగా) చాపకూడు (పంక్తి భోజనం) కుడిచినవాడు (తిన్నవాడు). దత్తాత్రేయావతారము.

**"అల్లిందామరల పొందులైన కన్నులవాడు"** జంట తామరపువ్వులవంటి రెండు కన్నులుగల అందగాడు.

**"తల్లి కూతుకౌగిట తగిలినవాడు"** తల్లియైన భూదేవిని వరాహమూర్తిగా, ఆమె కూతురైన సీతాదేవిని శ్రీరామునిగా కౌగలించుకొనిన జనార్దనుడు జగద్వల్లభుడూ ఈయనే సుమా!

**"చల్లనైన వేంకటశైలముపైనున్న నల్లనిమేనివాడు నవ్వుమోమువాడు"** ఎత్తైన కొండ అవటంవలన నిత్యమూ చల్లగా వుండే శ్రీ వేంకటాద్రిపై వెలసి నల్లని నిగనిగలాడు మేను (శరీరము) గలవాడు ఈ శ్రీవేంకటేశ్వరుడు. ఎంతటి దివ్య సౌందర్యరూపం అది. ఎంత చక్కటి నవ్వు మొగముతో వున్నాడో చూడండి.





సంపుటి: 1 కీర్తన : కొందరికివి సమ్మతియైతే కొందరి కవి గావు
సంఖ్య : 384 పుట : 257 రాగం: బౌళి

**బౌళి**

**11 కొందరి కివి సమ్మతియైతే కొందరి కవి గావు**
**యిందరిలోపల నీవెడమాయలు యేగతిఁ దెలిసే నేనయ్యా ॥ పల్లవి॥**

**దూరము కర్మమునకు జ్ఞానము; తోడనే (తొడునే?) వొండొకటికిని**
**దూరము; పరమునకు బ్రపంచము తొలుత విరుద్ధంబు;**
**దూరము విరతికి సంసారము; తుదమొదలే లేదు;**
**యీరీతుల నీ వెడమాయలు యేగతిఁ దెలిసెద నేనయ్యా ॥కొంద॥**

**కూడదు దేహమునకు నాత్మకు గోత్రవిరోధం; బెన్నఁడును**
**కూడదు కోపమునకు శాంతము గుణావగుణములను;**
**కూడదు బంధమునకు మోక్షము కోరికలే కట్లుగాన;**
**యేడ గొలఁదిగా శ్రీహరిమాయలు యేగతిఁ దెలిసెద నేనయ్యా ॥కొంద॥**

**శ్రీ వేంకటపతి నన్నీగతిఁ జిక్కించితి వీజగమునను;**
**భావింపఁగరాదు నీమహిమ బహుముఖములయర్థముగాన;**
**యేవిధమును నేఁటికి నాకిఁక యెందెందని తగిలెద నేను**
**దైవికమగు నీదాసానుదాస్యము దక్కినదే నాకు ॥కొంద॥384**

**అవతారిక:**

"వెడమాయ" అంటే నానార్థములున్నాయి. ఇక్కడ దాదాపుగా సరిపోల్చే అర్థం దుస్సహమైన లేక భరించలేని అని చెప్పుకోవచ్చును. ఆ పరమాత్మ జగన్నాటకం యెవరికీ అర్థం కాదు. ఆయన రచనలు యెంత విచిత్రమైనవంటే అవి కొందరికి నచ్చేట్లుంటాయి, కొందరికి నొచ్చేట్లువుంటాయి. ఆయన కృప ఒక్కొక్కరిపై ఒక్కొక్క రకంగా

ఉంటుంది. దానికి ఒక కొలబద్ద వుండదు. రెండు గంటలు పూజ చేసేవాడికి ఒక గంట పూజ చేసేవాడికంటే రెండింతలు పుణ్యం వస్తుందనే నియమం యేమీలేదు. ఇంతమందిలో నీవు ఎవరిని కరుణిస్తావో ఎవరిని శిక్షిస్తావో యెవరు చెప్పగలరు? ఇంతమందిలో నీ దుస్సహమైన మాయలు యెలావుంటాయో యెవరు చెప్పగలరు? అవి యేగతి తెలుస్తాయి స్వామీ! అంటున్నారు అన్నమాచార్యులవారు.

కర్మము దారి కర్మముదే జ్ఞానముదారి జ్ఞానముదే అనుకోవటానికీ వీలులేదు. దేహమునకు, ఆత్మకు జన్మవైరం వున్నట్లా లేనట్లా? బంధం యేది కలిగిస్తుంది, మోక్షం యేది కలిగిస్తుంది? చిట్టచివరగా, ఇదంతా శ్రీవేంకటేశ్వరుని మహిమ. బహుముఖములుగల ఆ మహిమనర్థంచేసికోవటం అంత తేలిక పనికాదు. ఆయన దాసానుదాసులకి తప్ప మిగతావారికి ఆయన మాయ ఎలా అర్థమవుతుంది? అసలివన్నీ వ్యర్థమే. ముక్తి మార్గము ఒక్కటే హరిదాసుల (దాస్యముతో హరి శరణాగతిలో జీవించే వానికి) యేదో ఒక నాటికి ముక్తి తథ్యము అంటున్నారు.

**భావ వివరణ:**

ఇవి (శ్రీహరి మాయలు) కొందరికి సమ్మతివైతే (అనుకూలమైనవి) అయితే కొందరికి (మరికొంతమందికి) అవి (ఆయనమాయలు) కావు. (అనుకూలమైనవి కాక, ప్రతికూలమైనవి). అయ్యా! (ఓ దేవదేవా!) ఇందరి లోపల (ఇన్ని సందర్భాలలో) నీ వెడమాయలు (దుస్సహమై, విచిత్రములైన మాయలను) ఏను (నేను), యేగతి తెలిసేను? (ఎట్లు తెలుసుకోగలను ప్రభూ!)

విచిత్రమేమంటే, కర్మమునకు జ్ఞానము దూరము. కర్మలు శ్రద్ధగా చేసేవాడికి జ్ఞానం వుండనక్కరలేదు. అలాగే నిజమైన జ్ఞానికి కర్మతోపనిలేదు. రెండూ కలిసేవున్నట్లున్నా రెంటికీ దూరమే. మొట్టమొదట





పరమునకు (ఊర్ధ్వలోక ప్రాప్తికి) ప్రపంచమునకు (ఇహలోక వ్యవహారములకు) విరుద్ధము (ఒకదానికింకొకటికీ పొసగదు). జ్ఞాని అయ్యాక రెండూ వ్యర్థమే. విరతికి (నిర్వాపారికి... అంటే... నాకే నిమిత్తమూ లేదు, నేనేపనీ చేయను అనేవాడికి) సంసారము (ఈ జగత్తు) దూరము (సమ్మతించదు). ఇటువంటి విచిత్రమైన విరుద్ధమైన నీ సృష్టిలోని మాయలను నేను యేరీతి తెలిసేనయ్యా!

ఇకపోతే దేహమునకు ఆత్మకు కూడదు (ఒకదానికొకటికి పడదు). వాటికి గోత్ర విరోధము (సగోత్రీకులు యెలా వివాహము నిషిద్ధమో, దేహమూ ఆత్మా కలపనసాధ్యమైనవి.) అదే విధంగా, కోపమూ శాంతమూ యెన్నడునూ కూడవు (కలవవు). కోపిష్టివాడికి శాంతగుణం అబ్బనే అబ్బదు. శాంతికామునికి కోపమురానేరాదు. శాంతము సుగుణమైతే కోపము, అవగుణము (చెడు గుణము). కోరికవున్నచోట కట్టుబడివుండుట తప్పనిసరి అవుతుంది. కోరిక వుంటే బంధము, కోరిక లేనివానికి మోక్షము, సహజమే కదా! ఆ శ్రీహరి మాయలకు కొలత యేవున్నది? వాటిని యేగతి తెలియగలము?

ఓ శ్రీవేంకటపతీ! నన్ను ఈ జగతిని (ఈ ప్రపంచమునకున్) చిక్కించితివి (వశమైపోయేట్లు చేసినావు). నీ మహిమ, బహుముఖముల అర్థములు (అనేకానేక విధములుగా వుంటుంది). భావింపగరాదు (ఊహాతీతమైనవి) ఏవిధమును (యేదియేమైనా) నేనెందెందు తగిలెదను (యెక్కడెక్కడని సంగత్వము పెట్టుకోమంటావు ప్రభూ!) నాకిక నేటికి? (నాకు ఈ పీకులాటలన్నీ యెందుకు?) నాకు నీదాసానుదాస్యము (నీ దాసులకు సేవచేసే భాగ్యము) దైవికమగు (దైవదత్తముగా) దొరికినది. నాకు అది చాలును తండ్రీ! అదే నా ముక్తి మార్గము.

సంపుటి: 4 కీర్తన : వెరపు దెలుపు నీవేగిరమేనీ
సంఖ్య : 2 పుట : 361 రాగం: శ్రీరాగం

**శ్రీరాగం**

**12 వెరపు దెలుపు నీ వేగిరమే నీ**
**వెఱిఁగియు నెఱఁగక యేమంటివో ॥ పల్లవి॥**

**గోరపురుధిరము గురియు గోళ్ళ నీ**
**తోరమైన యా తొడమీఁద**
**గోరంటగోళ్ళ కోమలి నిలువఁగ**
**ఈరసమందక యేమంటివో ॥వెరపు॥**

**నెత్తురుఁ బెదవుల నీ మొకమలరఁగ**
**బిత్తరి వీడెపుఁ బెదవులతో**
**మత్తకరిగమన మాటలాడఁగా**
**ఎత్తిన మదమున నేమంటివో ॥వెరపు॥**

**ఆననరౌద్రము నట్టహాసమును**
**పూనిన నినుఁగని బొమముడితో**
**లేనగవుల నదలింపెడి సిరితో**
**హీనాధికముల నేమంటివో ॥వెరపు॥**

**పెద పెద యూర్పుల పేగుల జందెపు**
**టుదరముతో నీవుండుచును**
**చెదరిన పయ్యెద చెరఁగు జారుసతి**
**యెదురెదురను నీవేమంటివో ॥వెరపు॥**

**చింపి నెరుల నీ శిరసు ముడుచుకొని**
**కంపముడిగి వేంకటపతివై**
**లంపటమందుచు లక్ష్మీసతితో**
**ఇంపులు నెరపుచు నేమంటివో ॥వెరపు॥ 2**





**అవతారిక:**

లక్ష్మీనృసింహుని కీర్తించుచు అన్నమాచార్యులవారు వినిపించిన సహజత్వముట్టిపడే కీర్తన ఇది. ఆనాటి తెలుగు నుడికారంలో వుండే తేడా వల్ల ఈ కీర్తనకి వివరణ కావలసివచ్చింది కాని నిజానికి సులభగ్రాహ్యమైన కీర్తనయే ఇది. వెరపుదెలుపుట అంటే భయపెట్టుట అని అర్థం. వేగిరము అంటే తీవ్రత అని అర్థం. నేటి కాలంలో అయితే "ఓ స్వామీ! భయమును కలిగించు నీ తీవ్రత నీవెఱుగుదువో యెఱుగవో" అని వివరించాలి అ పల్లవిని. అన్నమయ్య కాలంనాటి తెలుగులో. అన్నమయ్య "ఎత్తిన మదము" అన్నారంటే, నేటికాలంలో "యెక్కువైన గర్వము" అని అర్థం.

ఆ నృశింహుని ఆపాదమస్తకం అద్భుతంగా వర్ణించి ఆ చింపిరి జుట్టు స్వామియే తిరుమల వేంకటపతి అయ్యాడంటున్నారు. చింపిరి జుట్టు పోయి చక్కగా ముడిచిన కొప్పు వచ్చిందట ఈయనకి. లక్ష్మీసతి లంపటంలా తగులుకొందిట. ఆ లక్ష్మీదేవితో ఇంపులు నెరపుచు ఏమివున్నావయ్యా!! అని ఆశ్చర్యపోతున్నారు. కాబట్టి ఏమంటివో అంటే "ఏమివుంటివో" అని అర్థం చేసికోవాలి "ఏమి అన్నావో" అని అర్థం చేసికొంటే అంతే సంగతులు.

**భావ వివరణ:**

ఓ నారసింహా! వెఱపు దెలుపు (భీతిని కలిగించు) నీ వేగిరమే (నీ తీవ్రత) నీవు "యెఱిగియున్ యెఱుగక యేమంటివో!! (నీవు యెరుగుదువో యెరుగవో అన్నట్లున్నావు స్వామీ!)

నీ రూపము నవలోకింపుము ప్రభూ! గోరపురుధిరము (రోత కలిగించు నెత్తురు) నీ గోళ్ళనుండి కురియుచును (కారుచున్నది). తోరమైన (బలిష్ఠమైన) ఆ తొడమీద గోరంట గోళ్ళ కోమలి (గోరింటాకు వలన యెఱ్ఱబడిన, నఖములు కలిగిన సుకుమారమైన శ్రీలక్ష్మి) నిలువగ (ఆయనను నిలువరించి శాంతపరుస్తుంటే) ఈరసమందక యేమంటివో (ఏమాత్రమూ ఆమెపై నీ ఆగ్రహము చూపక యేమివున్నావయ్యా!)

ఓ నృసింహా! నెత్తురుతో తడిసి ఎఱ్ఱబారిన నీపెదవులతో నీముఖము ప్రస్ఫుటముగా కనుపించుచున్నది. నీవు అటులుండగా, బిత్తరి వీడెపు బెదవులతో (ఎఱ్ఱని తాంబూలపు పెదవులుగల), మత్తకరిగమన (మదగజపుమెల్లని నడక గలిగిన) శ్రీలక్ష్మి మాటలాడగ (నీతో మృదువుగా మాటలు కలిపి పలుకరించగా) ఇంత అందాల ఇందిర నాదిరా అని యెత్తిన మదమున (ఇనుమడించిన గర్వముతో) ఏమంటివో (ఏమివున్నావయ్యా!!).

స్వామీ! ఆనన రౌద్రము (ముఖములో కొట్టొచ్చినట్లున్న కోపము) అట్టహాసము (వికటాట్టహాసమువంటి గర్జన) చేస్తున్న నిన్ను చూచి, ఒకింత ఆగ్రహించి తన భ్రుకుటిని ముడిచి చిరునవ్వుతోనే నిన్ను అదలించెడి (బెదరించుచున్న) సిరితో (శ్రీలక్ష్మితో) హీనాధికముల (యెక్కువతక్కువ మాట్లాడకుండా) యేమివున్నావు స్వామీ!!

ఆ దుష్ట హిరణ్యకశిపుడు నీ ప్రియ భక్తుడు ప్రహ్లాదుని పెట్టిన చిత్రహింసను తలచిన కొలదీ ఆగ్రహంతో నీకు వుద్రేకమధికమై పోయింది. నీ వూర్పులు (ఉచ్ఛ్వాస నిస్స్వాసములు) పెదపెదలైనవి (అంతకంతకు అధికమైనవి). ఆ వుద్రేకంలో నీవు వాడి పేగులను పీకి జందెపు పోగులుగా వేసికొనినావు, ఆ పేగులపై నుంచి కారే నెత్తురు నీ పొట్టపై మిలమిల మెరుస్తున్నది. నీవిట్లావుంటే ఆ కోమలాంగి కంపించుట చేత తొలగిన పయ్యెద (జారి చెదిరిపోయినది). అట్టి అందాల భార్యతో యెట్టయెదుటనే నీవు యేమివున్నావు నారసింహా!

ఓ శ్రీవేంకటేశ్వరా! శాంత గంభీర సౌందర్యరత్నాకరుడవైన నీవే, ఈ ముడుచుకొనిన చింపినెరుల (చింపిరిజుట్టు)తో నున్న శిరస్సుగల నారసింహుడివా? నీ కంపముడిగినదా (కోపము తగ్గినదా) మరికనేమి? లక్ష్మీసతితో లంపటమందుచు (వ్యామోహ పడుతూ) ఇంపులు నెరపుచు (వలపులనొలకబోయుచు) యేమివున్నావయ్యా!! ఉగ్రనరసింహుడివి శాంత నరసింహుడివై నాబోటి భయస్థులకు దిక్కుమొక్కయినావు తండ్రీ!





సంపుటి: 6 కీర్తన : అతిశోభితేయం రాధా
సంఖ్య : 000 పుట : 35 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

**13 అతిశోభితేయం రాధా**
**నతతవిలాసవశా రాధా.** ॥ పల్లవి॥

**దర్పకబలబోధా రాధా**
**తర్పణగంధవిధా రాధా**
**దర్పయుతక్రోధా రాధా**
**దర్పకరసవేధా రాధా**
**తారితావరోధా రాధా**
**తారుణ్యోద్బోధా రాధా**
**ధారితానురోధా రాధా**
**దారితాపరాధా రాధా.**
**తరుణీమరుగాథా రాధా.**
**ధరసమకుచబాధా రాధా**
**తరుణసదనుబోధా రాధా**
**ధరణిదుస్సాధా రాధా. (?)**
**తనుభవగురుగాధా రాధా**
**స్తనకృతగిరిరోధా రాధా**
**తనువరవచనసుధా రాధా**
**ధ్వనిజితపికమేధా రాధా**
**తరుణసఖీసవిధా రాధా**
**దరశశిరుచిసౌధా రాధా**
**తరళితతటిద్విధా రాధా**
**దరహాసనవరోధా రాధా**
**ధనగర్వనిషేధా రాధా**

**స్తవతత్పర విబుధా రాధా**
**ద్రవధునీకృతసుధా రాధా**
**దవమదనవ్యాధా రాధా**
**తరుణత్వ పురోధా రాధా**
**తరుణస్మరయోధా రాధా**
**తరుపశుమణిగుణధారక బహుల వి-**
**తరణపరా బహుధా రాధా.**
**దైవికసుఖోపధా రాధా**
**ద్రావకనిజాభిధా రాధా**
**శ్రీవేంకటగిరిదేవకృపాము-**
**దావైభవ నాథా రాధా.**

**అవతారిక:**

సంస్కృతంలో ఒక విచిత్రమైన కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇది ఒక భజన. రాధాదేవిని ప్రస్తుతిస్తూ చెప్పిన కీర్తన. అన్నమయ్యమీద చైతన్య ప్రభువు (ఆయన సమకాలికుడే ఈయన) భక్తి ప్రభావం వుండటం వల్లనూ వారిమధ్య సంభాషణ సంస్కృతంలోనే జరిగివుండాలి. అందుకనే అన్నమయ్య చెప్పిన రాధా మాధవుల శృంగారకీర్తనలన్నీ గీర్వాణిలోనే వున్నాయి. ఈ కీర్తనలో ప్రతి చరణం రాధా అనే సంబోధనతో ముగియుచున్నందువలన ఇది భజన అయివుంటుందని నా అభిప్రాయం. ఉదాహరణకు, "అతిశోభితేయం" అని గాయకుడు అంటే... "రాధా" అని భజన బృందం అంటారు. "నతతవిలాసవశా" అని గాయకుడంటే, "రాధా" అని భజన బృందం అంటుంది. అన్నమాచార్యుల వారికి కూడా భజన సంప్రదాయంమీద మక్కువ యెక్కువే.

**భావ వివరణ:**

మిక్కిలి శోభ కలిగినదానివైన రాధా!

విలాసినియై నమస్కరింపబడుచున్న రాధా (పల్లవి) దర్పమను బలమును కలదానివైన రాధా!





తర్పణ సంస్కారయుతమైన దానా రాధా!
దర్పముతో కూడిన క్రోధమును కలిగిన రాధా!
మన్మథుడు కలిగించిన వేదనతో కూడిన రాధా!
కృష్ణునికై అవరోధములనన్నింటినీ తరించిన రాధా!
యౌవనమును ప్రేరేపించిన రాధా!
అనువర్తమును (అనుసరించినదచుటను) ధరించిన రాధా!
అపరాధములను సహించక ఖండించిన రాధా!
గోపాంగనలు వుదాహరణముగా చెప్పుకొనే రాధా!
ధారుణీభారముతో సమమైన కుచభారంచే పరితపించు రాధా!
తరుణులకు మంచిని బోధించు రాధా!
ధరణిలో అందరికీ దుస్సాధ్యమైన రాధా!
తనూభవుడైన మన్మథుని గురుగాథలను రచించురాధా!
గిరులకంటే వున్నతమైన స్తనయుగళముగల రాధా!
సౌందర్యమునకు సరితూగు సుధామయ వచనములు గల రాధా!
గండు కోయిల స్వరమును గెలువగల కంఠధ్వనిగల రాధా!
తరుణవయస్సుగల సఖులకు దగ్గరయైయున్న రాధా!
వెన్నెల నధిగమించు దంతముల కాంతిగల రాధా!
తళుక్కుమనిపించు మెరుపుతీగెవంటి నడుముకల రాధా!
మందహాసమున కొత్త కాంతులు కల రాధా!
ధనగర్వమును తృణీకరించు స్వభావముగల రాధా!
గోవిందుని స్తుతించుటలో ప్రావీణ్యముగల రాధా!
స్వరమున అమృత మాధుర్యమును స్రవించు రాధా!
మదనతాపముచే దహింపజేయు రాధా!
తరుణప్రాయములోనున్న రాధా!
తరుణప్రాయమున మన్మథ తాపము కలిగిన రాధా!
తరువులను, పశువులను ఆశ్రయించి బహుళముగా తిరిగే వితరణ కలిగిన రాధా!
దైవికముగా కలుగు సుఖమునకు మార్గమైన రాధా!
తననామోచ్చారణతోటే కృష్ణుని ద్రవింపజేయగల రాధా!
శ్రీవేంకటేశ్వరుని, కృపానందమను వైభవమున్న భర్తగల రాధా!

సంపుటి: 4 కీర్తన : తతిగాని యీపాటు దైవమా విచారించవే
సంఖ్య : 428 పుట : 287 రాగం: రామక్రియ

**రామక్రియ**

14 తతిగాని యీపాటు దైవమా విచారించవే
కతలాయఁ జెప్ప నేఁడు కలికాలమహిమ ॥ పల్లవి॥

తుటుములై భూసురుల తుండెములు మొండెములు
యిటువలె భూతములు యెట్టు మోఁచెనో
అటు బాలులరొదలు ఆకాశమె ట్టోరిచెనో
కటకటా యిట్లాయఁ గలికాలమహిమ ॥తతి॥

అంగలాచేకామినుల యంగభంగపుదోఁపు
లింగితాన మింట సూర్యుఁ డెట్టుచూచెనో
పొందు నానాజాతిచేత భువనమెట్లానెనో
కంగి లోకమిట్లాయఁ గలికాలమహిమ ॥తతి॥

అరుదు గోహత్యలు సేయఁగ దూడలంగలార్వ
సరి ధర్మదేవతెట్టు సమ్మతించెనో
పరధనచూర కెట్టు పట్టాయనో లక్ష్మి
కరుణ యెందణఁగెనో కలికాలమహిమ ॥తతి॥

దేవాలయాలు నానాదేశములెల్లాఁ జొచ్చి
దేవఁగా నెట్లుండిరో దేవతలు
తావులేలేరాజులకు దయ గొంత పుట్టదాయ
కావరమే ఘనమాయఁ గలికాలమహిమ ॥తతి॥

నిరపరాధులఁ జంపి నెత్తురు వారించఁగాను
తెరల కెట్లుండిరో దిక్పాలులు
విరసవర్తనలుండే విపరీతకాలమున
గరువాలుఁ గపటాలే కలికాలమహిమ ॥తతి॥





వుపమించి దంపతులు వొకరొకరినిఁ జూడ
చపల దు:ఖములతో సమయఁగాను
తపములు జపములు ధర్మము లెందణఁగెనో
కపురుఁబాపాలు నిండెఁ గలికాలమహిమ ॥తతి॥

తలలు వట్టీడువఁగా తల్లులు బిడ్డలవేయ
తలఁపెట్టుండెనో యంతర్యామికి
మలసి ముక్కలుగోయ మరుఁడెట్టు వోరిచెనో
కలఁకలే ఘనమాయఁ గలికాలమహిమ ॥తతి॥

దీనత లోఁబడి గుండెదిగు లసురుసురులు
వానినెట్లు లోఁగొ (నె) నో వాయుదేవుఁడు
గూను వంచి తల్లి చూడఁ గొడుకుఁ గుత్తిక గోయఁ
గానఁబడె నింతేసి కలికాలమహిమ ॥తతి॥

పలుమారు నమ్మించి ప్రాణములు గొనఁగాను
యిలఁ దమలోఁ బ్రాణాలెట్లుండెనో
నెలవై శ్రీవేంకటేశ నీవే యెరుఁగుదువు
కలుషమే ఘనమాయఁ గలికాలమహిమ ॥తతి॥ 428

**అవతారిక:**

ఈ కీర్తనకి అవతారిక వ్రాస్తుంటే మానాన్నగారి తల్లి రాధమ్మగారు గుర్తుకు వచ్చింది. అరవైయేళ్ళ కిందటిమాట. ఐదేళ్ళ నేను మాటవినక ఎదిరిస్తే... కలికాలం నాయనా! కలికాలం. ఒక వినయం లేదు ఒక వందనం లేదు అనేది. ఆనాడు నిజంగా అర్థం తెలియని అజ్ఞానినైప్పటికీ ఆవిడ ఆత్మకి క్షమార్పణ చెబుతూ నేడు ఈ కీర్తనవల్ల నాకు కలిగే పుణ్యం ఆవిడ ఆత్మకి అందాలని దేవదేవుని ప్రార్థిస్తున్నాను.

కలికాలం యొక్క ప్రభావాన్ని వివరిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఓ దైవమా! తతిగాని (కాస్త కూడా ఆసక్తి కలిగించని) యీ మానవుల అవస్థలు విచారించవయ్యా! నేడు నీకు చెప్పాలంటే ఇవన్నీ (ఈ మానవుల పాట్లన్నీ) కతలాయ (కథలు కథలుగా జెప్పవచ్చును) అంటున్నారు అన్నమయ్య. ఇది చాలా పెద్ద కీర్తన. ఇందులో కూడా నాటి రాజులను తీవ్రంగా నిరసించారు అన్నమయ్య. తల్లి చూస్తుండగానే కొడుకుని నరికివేసే రోజులొస్తాయట. నమ్మించి ప్రాణాలు తీసేవాళ్ళు కోకొల్లలుగా పుట్టుకొస్తారట. అయ్యా! కలికాలం... ఆకలికాలమా?

**భావ వివరణ:**

ఓ దైవమా! దైనందిన జీవితంలో ఈ మానవులు పడుతున్న యీపాటు (ఈ తిప్పలు) విచారించవే (కాస్త గ్రహించవయ్యా!) నేడు చెప్పన్ కతలాయన్ (అవి చెప్పాలంటే నేడు కథలు కథలుగా చెప్పవచ్చును). ఎందుకంటే, ఇది కలికాల మహిమ (కలియుగ ప్రభావం).

అప్పుడు జరిగే ఘోరాలు వినుము ప్రభూ. పూజింపబడవలసిన భూసురులు (బ్రాహ్మణులు) తుటుములై (సమూహముగా) తుండెములు మొండెములు (ఖండించబడిన మొండెములు) కలవారవుతారు. భూతములు (ప్రాణులన్నీ) ఇటువలె యెట్లు మోచెనో (ఇటువంటి అన్యాయం యెట్లు భరిస్తాయో!!)

తల్లిదండ్రులు మరణించిన బాలురు (చిన్నపిల్లల) రొదలు (యేడుపుతో) ఆకాశము నిండిపోతుంది. కటకటా! (అయ్యయ్యో!) ఇట్లా అయిపోయిందే ఈ కలికాలము!! హతవిధీ!

కామినుల (స్త్రీల) అంగభంగపుదోపు (మానభంగపు పాట్లు) అంగలార్చే (దు:ఖిస్తారు). ఈ ఘోరము మింటి (ఆకాశంలో) సూర్యుడు





యెట్లు చూచెనో (ఎట్లా సహిస్తాడో!!) నానాజాతులు (విభిన్న జాతివారు) పొంగుజేత (విజృంభణము వలన) ప్రపంచమెట్లు సహించునో కదా! హతవిధీ! కంగి (పోట్లాడుకుంటూ) ఈ లోకమంతా ఇట్లా చెడిపోయింది. ఆశ్చర్యకరముగా గోహత్యలు జరుగుతుంటాయి. దుర్మార్గులు అట్లా చేస్తుంటే లేగదూడలు అంగలార్వ (అల్లాడుతుంటాయి), సరి ధర్మదేవత నీతిని విడువని ధర్మదేవత ఈ దురాగతమునెట్లు సమ్మతించునో (సహించునో)? పరుల ధనమును చూఱకు (కొల్లగొట్టుదురు). అందులకు లక్ష్మీదేవి యెట్లు పట్టాయెనో (అవకాశమిస్తుందో) హతవిధీ! ఈ మొదనష్టపు కలికాలమున కరుణ యెందరిగెనో (దయాదాక్షిణ్యాలు యెక్కడకు వెడలిపోయినవో!!)

వివిధ దేవాలయాలలో ఆయా దేవతలు నానా దేశములలో (అనేక రకములైన రాజులు పరిపాలించు దేశములలో) దేవగాజొచ్చి (దేవత రూపములలో ప్రవేశించి) యెట్లుండిరో ఆలోచిస్తేనే ఆశ్చర్యంగా వుంటుంది. ఎందుకంటే, ఆయా రాజ్యాలనేలే రాజులు అందరికీ దయ ఒకింతయే కానీ కావరము (పొగరు) మాత్రం ఘనమాయ (అత్యధికమే కదా!) కలికాలం మహిమ. ఇంతకంటే యేమి చెప్పగలము?

ఈ రాజుల అధర్మపాలనలలో అనేక సందర్భాలలో నిరపరాధులు శిక్షించబడ్డారు వారిని చంపి నెత్తురు ఏఱులై పారించారు. ఇదంతా చూచికూడా దిక్పాలకులైన ఇంద్రాది దేవతలు, తెరలక (తొలగిపోకుండా) ఇంకా దిక్కులను పాలిస్తూ యెందుకు వున్నారో? విపరీతమైన భావాలున్న ఈ కలికాలంలో విరసవర్తనులే (దుష్ప్రవర్తనగలవారే) అధికులుగా వుంటారు. వాళ్ళకందరికీ గర్వమూ, కపట స్వభావము తప్పించి వేరే గుణములెట్లావుంటాయి? మరి కలికాలం మహిమ అంటే అంతే.

దంపతులెట్లా వుంటారో చూడండి. భార్య తన భర్తను ఇంకొకడితో ఉపమించి (పోల్చి) చూచి నిరసిస్తుంటుంది. భర్త కూడా అట్లే చపల చిత్తంతో తన భార్యకన్న పరస్త్రీ యెక్కువ సుఖమిస్తుందనే భ్రమలో నిత్యమూ దు:ఖిస్తుంటారు. ఇక వారు అట్లా వుంటే వారి నైష్టిక కర్మలు తపములు జపములు, ధర్మములు యేమైపోతాయో కదా! ఈ కలికాలమంతా కపురు బాపాలతో ఘోరమైన పాపాలతో నిండిపోతుంది. ఇక ఇదింతే.

తల్లులు తమ స్వంత కన్నబిడ్డల్నే చంపేసుకొంటుంటారు. వాళ్ళ తలలను పట్టి ఈడ్చి పిల్లలను ఇంట్లోంచి వెడలగొడతారు. ఇదంతా వారి అంతరాత్మ యెట్లా సహిస్తుందో? వారికీ ఆలోచనే యెట్లా వస్తుందో? స్త్రీలను ముక్కలుగా కోయటాన్ని మరుడెట్లు (మన్మథుడు యెట్లు సహిస్తాడో)? కలకలే (దు:ఖములే) ఘనమాయ (అధికమౌతాయి) ఎవరూ యేమీ చేయలేని స్థితిలో వుంటారు.

ప్రజలంతా దీనత్వమునకు లోబడి ఉస్సురుస్సురని నిట్టూరుస్తూ జీవిస్తుంటారు అటువంటిదీనులకు వాయుదేవుడు కూడ యెలా సహకరించి ఉచ్ఛ్వాస నిస్స్వాసలు కల్పిస్తుంటాడో అర్థంకాదు. గూనువంచి (దాగికొనిన) తల్లి చూస్తుండగా కొడుకు కుత్తిక (గొంతు) పట్టుకొని కోయుట అనే దురాగతము కనబడే రోజులు వస్తాయి. ఇంతేసి (ఇంత ఘోరమైన) కలికాలమహిమ అది.

అనేక పర్యాయములు ప్రాణములు నమ్మించి తీసేవాళ్ళు పుట్టుకొస్తారు. వాళ్ళు అట్లా ప్రాణాలు గొనగాను (తీస్తుంటే) ఇక తమలో ప్రాణాలు యెవరికి నిలుస్తాయి? ఓ శ్రీవేంకటేశ్వరా! జీవులలో నెలవై (నిలిచియున్న) నీవే యెరుగుదువు గానీ ఇంకెవరికి తెలుస్తుంది తండ్రీ! ఈ దౌర్భాగ్యపు కలికాలములో కలుషమే ఘనమాయ (పాపమే పరమావధి అయిపోతుంది ప్రభూ!)





సంపుటి: 4 కీర్తన : ఒక్కఁడవె లోకానకొడయఁడవు నీవె
సంఖ్య : 41 పుట : 388 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

15 ఒక్కఁడవె లోకానకొడయుఁడవు నీవె
దిక్కుగా నెవ్వరులేరు తిమ్మినాయఁడా ॥ పల్లవి॥

బొద్దుచెర్ల బొమ్మిరెడ్డి పొలమెల్లఁ జేడవెట్టి
గద్దనుండి పైరువిత్తి కాచుకుండఁగా
దొడ్డగాఁ బండఁగఁ జూచి దోసకారి మొండిదొర
దిడ్డివఁదీసి కొంటఁబోయ తిమ్మినాయఁడా ॥ఒక్క॥

పాలకొల్ని చందిరెడ్డి పంటసేయఁ బొద్దులేక
గాలివీటి కాఁపురానఁ గసుగందఁగా
కోలుపుచు దినమూ నీకొండమీఁది నాయకులు
తీలుపరచేరుగదే తిమ్మినాయఁడా ॥ఒక్క॥

కామకొల్ని మారిరెడ్డి కనుచూపువారినెల్ల
కోమలపు చెలువలు గోరు, మెత్తగా
ప్రేమముతోఁగేదారి పెరిగి పండిన పంట
తేమరేగి ఊటువట్టె తిమ్మినాయుడా ॥ఒక్క॥

గుండుఁగంటి దేవిరెడ్డి కొలిచిన వండిపెట్టు
కుండఁ గాపరింటనింట కూడుమోయఁగా
పండిన బండ్లఁగొట్టి పంటలెల్ల నానాఁటి
తిండికొక్క కొలఁదాయ తిమ్మినాయుఁడా ॥ఒక్క॥

వెలిగొండ కాపిరెడ్డి వేఁకపు జీవనమెల్ల
తలవోఁచి తిరిపెమై తల్లడించఁగా
తెలిసి యాతనితో నొక్కటిగాఁగ నీగుట్టు
తెలిసె వేంకటగిరి తిమ్మినాయుఁడా ॥ఒక్క॥41

**అవతారిక:**

అన్నమాచార్యులవారి ఈ కీర్తన ప్రత్యేకత ఏమిటంటే 16వ శతాబ్ది నాటి రాయలసీమ రైతుల కష్టాలు కళ్ళకు కట్టిస్తున్నారు. ఇందులో అన్నమయ్య ప్రస్తావిస్తున్న రైతుల పేర్లు మనకు చరిత్రలో మరెక్కడా కనబడవు కాబట్టి అవి అన్నమయ్య కాలంనాటి కౌలు చేసే రైతుల పేర్లని మనము భావిస్తే తప్పులేదని నా వూహ. ఈ కీర్తనలో భక్తిగాని వైరాగ్యం గాని శృంగారంగానీ లేవు. కేవలం చారిత్రక సంఘటనల సంఘటితమే ఈ కీర్తన. తిమ్మయ్య అనేది జానపదులు వుపయోగించే శ్రీవేంకటేశ్వరుని పేరు. తిమ్మినాయుడు అనేది కూడా శ్రీవేంకటేశ్వరుని పేరే. పల్లవిని గమనిస్తే అన్నమయ్య ఒకింత ఆవేదనతో ఈ కీర్తన చెప్పారనిపిస్తున్నది. ఓ తిమ్మనాయుడా! ఈ లోకానికికంతకూ నీవే ఒడయడవు (భర్తవు) వేరే యెవ్వరూ దిక్కుగా లేరు అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ తిమ్మనాయడా! (శ్రీవేంకటేశ్వరా) ఈ లోకమునకంతటికీ నీవు వొక్కడవే ఒడయడవు (భర్తవు). నీవు తప్పించి దిక్కుగా (రక్షణగా) వేరెవ్వరూ లేరు తండ్రీ! ఎందుకంటే దిక్కుగా వుండవలసిన పాలకులు భక్షకులైపోతున్నారు. స్వార్థం వెఱ్ఱితలలు వేస్తున్నది. బొడ్డుచెర్వు బొమ్మిరెడ్డి గారి పొలమంతా జేడవెట్టి (యెరువుతోలి) పైరువిత్తి, పంటకోసం నిరీక్షిస్తుంటే, పంట బాగా పండిందనే సంతోషం కూడా లేకుండా





దోసకారి (దుష్టుడైన) మొండిదొర "దిడ్డిఁదీసి" (అడ్డదారిగుండా వచ్చి) దోచుకొనిపోయాడు. ఓ తిమ్మినాయడా! ఏమిటీ దౌర్జన్యం!!

పాలకొల్ని చందిరెడ్డి పంటసాగుచేయుటకు, సమయములేక గాలివీటి కాపురాన (ఏమాత్రమూ నిలకడలేని సంసారంతో) కసుగందగ (మిక్కిలి వడలిపోయి) దినములు చెడగొట్టుకొంటుంటే, నీకొండ మీది నాయకులు, తీలుపరచేరు (అణగద్రొక్కారు.) ఓ తిమ్మనాయడా! ఏమిటీ అన్యాయం!! కామకొల్ని మారిరెడ్డి పేరుకుతగ్గవాడేనేమో అనిపిస్తున్నది. ఆయన కనబడ్డవారితోనెల్లా సౌందర్యారాధన జరుపుతుంటాడు. ఆయన యజమాయిషీలో పండిన పంట కూడా ప్రేమగానే తేమరేగి (నీరుయెక్కువై) ఊట వట్టె (చెడిపోయింది) స్వామీ! ఓ తిమ్మనాయడా! ఇటువంటి వాళ్ళ సాగులో ఇక బాగుపడేదేముంటుంది? గుండు గంటికి చెందిన "కొలచిన దేవిరెడ్డి" వండిపెట్టే కుండతో తనయజమానియొక్క ఇంటికి కూడు మోయగా తను చేస్తున్న పంట చెడిపోయి తను రోజూ తిండికే కొలదాయ (కొఱత యేర్పడినది).

ఓ తిమ్మనాయడా ఏమిటీ వైపరీత్యం? వెలిగొండ కాపిరెడ్డి వేకపు జీవనమెల్లా (బికారి జీవితమంతా) తలవంచుకొని ముష్టియెత్తి జీవించాడు. ఎంతో తల్లడిల్లిపోయాడు. ఇది తెలిసి అతనితో స్నేహబంధమేర్పరచుకొని ఒక్కటైపోయాక నీ గుట్టు తెలిసిపోయింది. ఓ తిమ్మనాయడా! నీవు వైకుంఠంలో కాదయ్యా నీవు కోపిరెడ్డిలాంటివారిలోనే వుంటావు. నీవు అమితమైన కరుణామూర్తివి ప్రభూ!

సంపుటి: 4 కీర్తన : వినరయ్య నరసింహవిజయము జనులాల
సంఖ్య : 513 పుట : 345 రాగం: నాట

### నాట

**16** వినరయ్య నరసింహవిజయము జనులాల
అనిశము సంపదలు నాయువు నొసఁగును ॥ పల్లవి॥

మొదలఁ గొలువుకూటమున నుండి కశిపుఁడు
చదివించెఁ బ్రహ్లాదుని శాస్త్రములు
అదన నాతఁడు నారాయణుఁడే దైవమనె
అదిరిపడి దైత్యుఁడు ఆతనిఁ జూపుమనె ॥వినర॥

అంతటఁ బ్రహ్లాదుఁడు 'అన్నిటానున్నాఁ'డనియె
పంతమున దానవుఁడు బాలునిఁ జూచి
యెంతయుఁ గడఁకతోడ 'ఇందులోఁ జూపు'మని
చెంతనున్న కంబము చేతఁగొని వేసె ॥వినర॥

అటమీఁదట బ్రహ్మాండం బదరుచు
కుటిలభయంకరఘోషముతో
చిట చిట చిటమని పెట పెట పెటమని
పటపట మనుచును బగిలెఁ గంబము ॥వినర॥

కులగిరు లదరెను కుంభిని వడఁకెను
తలఁకిరి దైత్యులు తల్లడిలి
కలఁగెను జగములు కంపించె జగములు
ప్రళయకాలగతిఁ బాటిల్లె నపుడు ॥వినర॥





ఘననారసింహుఁ డదె కంబమునందు వెడలె
కనుపట్టె నదిగొ చక్రజ్వాలలు
మునుకొని వెడలెఁ గార్ముకముక్తశరములు
కనకకశివునకుఁ గలఁగె గుండియలు ॥వినర॥

అదరె నద్దేవునికోపాగ్నులు బెడిదపు -
మిడుఁగురులతోడుత మిన్నులుముట్టి
పిడుగులురాలేటిభీకరనఖరములు
గడుసు రక్కసునికి గాలములై తగిలె ॥వినర॥

తొడికి పట్టి విష్ణుఁడు తొడమీఁద నిడుకొని
కడుపు చించెను వానిగర్వమడఁగ
వెడలెఁ జిల్లున వానివేఁడి నెత్తురు నింగికి
పొడి వొడియాయ శత్రుభూషణములెల్లను ॥వినర॥

నెళ నెళన విరిచె నిక్క వానియెముకలు
పెళపెళ నారిచి పెచ్చు వెరిగె హరి
జుళిపించి పేగులు జంద్యాలుగా వేసుకొనె
తళుకుఁగోరలు తళతళమని మెరిచె ॥వినర॥

పెటలించి నరములు పెరికి కుప్పలువేసి
గుటగుటమని రొప్పె గోవిందుఁడు
చిటిలించి కండలు చెక్కలు వారఁజెండి
కుటిలదానవుఁ జూచి 'ఖో' యని యార్చెను ॥వినర॥

తెంచి శిరోజములు దిక్కులకు వాని -
పంచప్రాణములుగొనెఁ బరమాత్ముఁడు
అంచెల నీరీతిని ప్రహ్లాదునిపగ నీఁగె

**మించి దేవతలు మితిమీతి జయవెట్టిరి ॥వినర॥**

**అప్పు డిందిరాదేవి యంకమునఁ గూచుండె**
**వొప్పుగ శాంతమందె నహోబలేశుఁడు**
**తప్పక కోనేటిదండఁ దానై యిందును నందు**
**చిప్పిల వరములిచ్చీ శ్రీవేంకటశుఁడు ॥వినర॥**

**అవతారిక:**

నేను మూడు సంవత్సరముల క్రిందట భాగవతగాధలు అనే పేరుతో త్రివిక్రమ విజయం అనే వామనావతార ఆవిష్కరణ గాధ వివరించాను. దానికి మాతృక బమ్మెరపోతనామాత్య విరచిత ఆంధ్రమహాభాగవతము. సాధ్యమైనంతవరకు మూలమునే అనుసరించి తెలుగు వచనంలో వ్రాశాను. అక్కడక్కడా కొన్ని పద్యాలను వినిపించాను. అవన్నీ పోతనామాత్యులవారి స్ఫూర్తితో నాకు స్ఫురించినవే. అదే భాగవత గాధలలో పరశురామావతార వైశిష్ట్యాన్నికూడా గద్యపద్య రచనగా అందించాను. ముందు ముందు తరాలు భాగవతపఠనం యెంత చేస్తారనేది భగవదేచ్ఛ అయినప్పటికీ www.geetadeeksha.com అనే నా website లోకి వెళ్తే ఎవరైనా చదువుకోవచ్చు.

ఆవిధంగా నేను నాకు తోచిన భగవత్సేవ చేశాను. కాని ఆనాడు నరసింహావతార గాధను ఎందుకనో చేపట్టలేదు. ఈరోజు అన్నమాచార్యులవారి రూపంలో ఆలోటు తీరుతోంది. ఇది చాలా పొడవైన కీర్తన. పొడవుకు పొడవైన పురుషోత్తముని, నృసింహావతార గాధను అన్నమాచార్యులవారి కీర్తన రూపంలో వివరించడం నిజంగా నా సుకృతమే. చాలా కాలానికి నా కోరిక నెరవేరుతున్నది.

"జనులాల! వినరయ్యా నరసింహ విజయము





అనిశము సంపదలు నాయువు నొసగును' – అని ఫలశ్రుతిని కూడా పల్లవిలోనే గానం చేస్తున్నారు అన్నమయ్య

మరింక ఆలస్యమెందుకు? మొదలుపెట్టండి. అహోబల నరసింహుని విజయము అన్నమయ్య ఆవిష్కరణము.

**భావ వివరణ:**

ఓ జనులారా! అనిశము (యెల్లప్పుడూ) నరసింహ విజయ చరిత్రమును వినరయ్యా! దాని శ్రణము మీకు ఆయువు (ఆయుర్దాయమును) సంపదలను ఒసగును.

తొలిరోజులలో హిరణ్యకశిపుడు తన పుత్రుడైన ప్రహ్లాదుని తన కొలువు కూటమునుండి (రాజధానినుండి) శాస్త్రములను చదివించుటకు గురువుల కడకు పంపెను. అదన (అదే తడవుగా ఆ ప్రహ్లాదుడు నారాయణుడొక్కడే దేవదేవుడనెను అదిరిపడిన (చకితుడైన) దనుజుడు అయితే ఆ ఆనారాయణుని తనకు చూపుమని నిర్బంధించెను.

అంతట ప్రహ్లాదుడు "ఇందుగలడందులేదని సందేహమేల? నారాయణుడు యెందెందు వెదకి చూచిన అందందే కలడు" అన్నాడు. పంతము బట్టిన దానవుడు బాలప్రహ్లాదుని జూచి యెంతయున్, కడకతోడ (ప్రయత్నముతో) చెంతనున్న ఒక స్తంభమును చూపించి అయితే ఇందులో హరిని చూపించరా అని చేతితో మోది ఆ స్తంభమును ఒక్క తన్నుతన్నాడు.

అటుమీదట (అంతట) బ్రహ్మాండమంతయు అదిరిపడునంత దారుణము, భయంకరము అయిన ఘోషముతో (ధ్వనితో) ఆ కంభము (స్తంభము) చిట చిటమని చిట్లిపోయింది. పెట పెట పెటమని పెగుళ్ళు రేచింది. పట పటమని పగిలిపోయింది.

ఆ ధ్వనికి కులగిరులదిరెను (భూమిపైనున్న కులపర్వతములు అదిరిపడినవి). కుంభిని (భూదేవి గడగడమని వణకిపోయింది). తల్లడిల్లిపోయిన (చలించిపోయిన) రాక్షసులంతా తలకిరి (భయపడిపోయారు) లోకములన్నియు కలగెను (సంక్షోభించాయి). జగత్తు అంతా ప్రళయ కాలము వాటిల్లబోతున్నదా అన్నట్లు కంపించిపోయింది.

ఘనుడైన నారసింహుడు (నరుని యొక్క మొండెము, సింహము యొక్క తల, వాడియైన గోళ్ళు గల భయంకరాకారముతో) అదె కంబమునందుండి వెడలె (బయటకు వచ్చాడు) అదిగో అదే కనుపట్టి చక్రజ్వాలలు (వలయాకారములో ఆవరించుకొనిన అగ్నిజ్వాలలు కనబడినవి). కార్ముకమునుండి వెడలిన (అప్రతిహతమైన విష్ణు ధనస్సు నుండి విడువబడిన శరములు (బాణములు) మునుకొని వెడలె (ముందరపడి ఆ ధనస్సు నుండి వెడలినవి). అది చూచి హిరణ్యకశిపునకు గుండెలు అదిరిపడినవి.

నృసింహదేవుని కోపాగ్నులు అడరెన్ (అతిశయించినవి) బెడిదపు (అధికమైన) మిణుగురులవలె నిప్పురవ్వలతో ఆకాశము నిండిపోయినది. ఆ స్వామి నఖరములు (గోళ్ళు) గీరుతుంటే పిడుగులు రాలుతున్న భయంకర ధ్వనులు విననైనవి. ఆ గోళ్ళు దుర్మార్గుడైన ఆ హిరణ్యకశిపునికి గాలములై తగిలినవి.

నృసింహుడైన ఆ విష్ణుమూర్తి వాడిని తొడికిపట్టి (ఒడిసిపట్టుకొని) తన తొడమీద బెట్టుకొని వాని కడుపును చించివేసెను. దానితో వాని గర్వము కూడా అడగెను (నశించెను). వాని వేడినెత్తురు ఆకాశమునకు జిల్లున వెదజల్లబడెను. శత్రువైన ఆ హిరణ్యకశిపుని భూషణములు (నగలు) ఆ నృసింహుని బలమునకు నుగ్గు నుగ్గయి పొడిపొడిగా రాలిపడినవి.

ఆ హరి (నరసింహరూపుడైన స్వామి) పొడుచుకొనివచ్చిన వాని యెముకలను నెళనెళమని ధ్వని వచ్చునట్లు విరిచివేశాడు. పెళపెళన్ ఆరిచి (పెళపెళమని





ఆడించి) పెచ్చుపెరిగాడు. వాడి పేగులు వూడదీసి జళిపించి (విదలించి) జంధ్యపు పోగులుగా మెడలో వేసికొనినాడు. ఆకాశములో మెరపులు మెరుస్తున్నట్లు అప్పుడు ఆయన కోరలు (ములుకు దంతములు) తళతళమని తళుక్కున మెరసినవి.

ఆ ఉగ్రనారసింహుడు హిరణ్యకశిపుని వధించిన భీకరలీల యెలావున్నదో వినండి. ఆయన వాడి యొక్క నరములను ఫెటలించినాడు (త్రెంచివేసినాడు). వాటిని పెరికి కుప్పలుగా పోసినాడు. ఆ భీభత్సమైన పని చేసినందువలన ఆ గోవిందునికి రొప్పు కలిగి గుటగుటమని ధ్వని వచ్చునట్లు రొప్పినాడు.

కాని ఇంతలోనే బాలుడు మరియు తన భక్తుడైన ప్రహ్లాదుని వాడు బాధించి ఇబ్బంది పెట్టిన వైనం గుర్తుకు వచ్చి వెంటనే వాడి కండలను చిట్లించి, చెక్కులువార (చిన్న చిన్న ముక్కలయ్యేట్లు చిట్లగొట్టి) కుటిలుడైన (కుత్సితబుద్ధికల) ఆ దానవుని జూచి 'ఖో'' యని వికృతముగా ఆ నరసింహుడు అర్చెను (పెద్ద కేకపెట్టాడు).

అంతట ఆ నరసింహుడు ఇంకా తన కోపం చల్లారక వాడి (ఆ రాక్షసుడి) తల వెంట్రుకలను వూడపీకి నలుదిక్కులకు విసరివేశాడు. పరమాత్ముడైన ఆ దేవదేవుడు అంతటితో చాలించి వాని పంచప్రాణములను ఒక్కసారిగా హరించివేసినాడు. ఈ రీతిగా ఆ హరి అంచెలంచెలుగా తన భక్తుని పగను ఈగె (తీర్చినాడు). మించి (నింగినుండి) ఇదంతా పరికించుచున్న దేవతలు మితిమీరిన ఆనందంతో, జయవెట్టిరి (జయజయ ధ్వానములు చేసిరి).

అంతలోనే ఇందిరాదేవి (శ్రీలక్ష్మి) ఆయనను శాంతపరచుటకు అక్కడకు వచ్చి మనోహరంగా ఆయన తొడపై కూర్చొనినది. అంతట అహోబలేశ్వరుడైన ఆ నరసింహుడు ఒప్పుగ (తగినట్లు) శాంతమందె (శాంతము వహించినాడు). ఆయనే పావనమైన కోనేటి ఒడ్డున శ్రీవేంకటేశ్వరుడు కూడా తానే అయి చిప్పిలునట్టి (పెల్లుబికిన) వరములను అనేకము ఒసగి అనుగ్రహించి తన దాసులను రక్షించినాడు.

సంపుటి: 4 కీర్తన : కటకటా మీరితివి కలికాలమా - పుణ్య
సంఖ్య : 77 పుట : 412 రాగం: ఆహిరి

**ఆహిరి**

**17** కటకటా మీరితివి కలికాలమా - పుణ్య
ఘటన గరవై పోయెఁ గలికాలమా ॥ పల్లవి॥

భూసురుల కామినులు బోయల నామి (య?) కులఁ
జేసుకొని యాండ్లై చిచ్చురికిరి
యీసునను నీవలన నెక్కువకులములెల్ల
కాసు సేయకపోయెఁ గలికాలమా ॥కట॥

అన్నలును జెల్లెండ్లు నాండ్లు మగలునునైరి
వన్నె సెడి యతులు ధనవంతులైరి
ఇన్నియును జేసితిని యింకనైనా నీకు
కన్నీరు రాదుగా కలికాలమా ॥కట॥

* అరుదగుఁ బతివ్రతలు అభిమానవతులు పలు
దొరలకమ్ముడు వోయి తొత్తులైరి
చిరకాల సుకృతమున చిత్తమునఁ గొంతైన
కరుణ మార్పితివిగా కలికాలమా ॥కట॥

కోవిదుల మను దొరల కులరాణి వాసములు
త్రోవలనె లంజలై తుదిమీరిరి
ఏవంకఁ జూచినా యిట్లనే ధర్మంబు
గావు వట్టితివిగా కలికాలమా ॥కట॥

పట్టభద్రుల నతులు పలుమారు నింద
* దిట్టు దిరిపెంబులై దీనులైరి
ది (ఇ?) ట్టినఁ దిరువేంకటేశుదాసులు నిన్నుఁ
గట్టవేతురుసుమీ కలికాలమా ॥కట॥ 77





**అవతారిక:**

"కటకటా"! అంటే నేటికాలంలో అయ్యయ్యో!! అనడం అన్నమాట. పాతకాలంనాటి వాళ్ళు అంటుంటారు అయ్యయ్యో! కలికాలం వచ్చేసిందండీ! ఏమిటీఘోరం? మరీ దారుణంగా వున్నది. ఎక్కడా పుణ్యఘటన అనేమాటే కరువైపోయిందే? అంటున్నారు అన్నమాచార్యులవారు. భగవద్గీత అర్జున విషాదయోగంలో చెప్పినట్లు కులవ్యవస్థ రూపుమాసిపోతుంది. వర్ణ సంకరమైనందువల్ల ఎవరి ధర్మం వారు ఆచరించడం అనేది వుండదు. అడిగేవాడూ వుండడు. మంచి చెప్పేవాడు అసలే వుండడు. ధనముంటే యేపని చేసినా అడ్డు చెప్పేవారుండరు అనే అహంకారులు తయారవుతారు. అన్నా చెల్లెలు వరుస అయిన వారు పెళ్ళి చేసికొంటారుట. బ్రాహ్మణుల ఆడపిల్లలను బోయలు వివాహమాడతారట. భర్త రక్షణలో వుండాల్సిన భార్యలను దొరలు కొనుక్కుంటారట. రాణివాసాలలో రంకులు జరుగుతాయట. ఏవైపు చూచినా 'ధర్మం' అనే వ్యవస్థే వుండదట. పట్టభద్రులు అంటే నేటి నవీన కాలంలో "డిగ్రీలు పీజీలు" వున్నవాళ్ళు అన్నమాట. వాళ్ళంతా దీనావస్థలో ముష్టియెత్తి జీవిస్తారట. "600 సంవత్సరాల" క్రిందట ఒక మహానుభావుడి కీర్తనలో నానాటికి పతనమవుతున్న మన వ్యవస్థ గురించి ఇంత చక్కగా చెప్పటం ఆశ్చర్యంగాలేదూ? కిలుము పట్టిన **అద్దగీతలోని** పూరణ ఆచార్యులవారి స్ఫూర్తితో ఈ రచయిత చేసినదే. పరిష్కర్తలు "..." అని వదలివేసియున్నారు. పొరబాటనిపిస్తే పెద్దలకి, క్షంతవ్యుడను.

**భావ వివరణ:**

కటకటా! (అయ్యయ్యో!) ఓ కలికాలమా! మీరితివి (హద్దునతిక్రమించితివి కదే!) నీ ప్రభావమువల్ల పుణ్య ఘటనలు (మంచిపనులే) కరవై పోయెను (అరుదైపోయాయి, లేకుండా కూడా పోతున్నాయి). "ఆ కలికాల ప్రభావం" వల్ల యేమి జరుగుతున్నదో వినండి.

భూసురుల కామినులు (సదాచారము పాటించవలసిన బ్రాహ్మణ యువతులు) బోయల (బోయవారిని) నాయకుల జేసికొని (మగనిగా

యెంచుకొని) ఆండ్లై (భార్యలై) చిచ్చురికిరి. చివరికి (అపస్మరణము పొందిరి). ఈసునను (ఈర్ష్య పెచ్చుపెరిగి) నీ వలన (నీ ప్రభావముచేత) యెక్కువ కులములెల్ల (అగ్రకులములన్నీ) కాసుసేయకపోయె (దమ్మిడీ విలువ జేయక, మేము అగ్రకులస్థులం కాదు బాబోయ్ అనే రోజులు వస్తాయి). కలికాలమా! యెంత దౌర్భాగ్యమే?

"అన్నలును జెల్లెండ్లు నాండ్లు మగలునునైరి" (అన్న చెల్లెలు వరుస అయిన స్త్రీ పురుషులు శాస్త్రము లేదూ చట్టు బండలూ లేదని పెళ్లి చేసికొంటారు.) యతులు (సన్యసించిన ధర్మబోధకులు) వన్నెసెడి (పేరు ప్రతిష్ఠ మఱచి) ధనవంతులైపోతారు. ఇన్నియును చేసికూడా, నీకు కన్నీరు అనేదే రాదు. ఓ కలికాలమా! నీవెక్కడ దాపురించావే?

'పతివ్రతలు' అనేవారే మచ్చుకి కూడా లేకుండా పోతారు. అభిమానవతులైన స్త్రీలు కూడా యెంతో మంది "దొరలకు" అమ్ముడుపోయి తొత్తులైరి (బానిసలైపోతారు). చిరకాలము సుకృతము చేయుటకు అలవాటు కలిగినవారు మాత్రం చిత్తమున కొంతైనా కరుణవుండి మార్పుకు ప్రయత్నిస్తుంటారు. కాని నీవు వారి ఆటలు సాగనీయవు. ఓ కలికాలమా నిన్నెవ్వరు నెగ్గగలరు?

కోవిదులు (శాస్త్రము తెలిసిన) పండితులము అనే దొరలు అగ్రకులస్త్రీల ఇంటి త్రోవలబట్టి వారిని చెడు వర్తనులను చేసినందువలన వారు లంజలై (వ్యభిచారిణులై) తుదిమీరిరి (హద్దులు లేకుండా పోతారు). ఏవంక జూచినా (ఎటువైపు జూచినా) ఇట్లనే ధర్మంబు గావుబట్టితివి కదా! (నాశనమైపోయింది కదా!) కలికాలమా! యెంత దరిద్రం దాపురించబోతున్నదే!

పట్టభద్రుల నతల (బాగా చదువుకొనిన విద్యాధికులు కూడా అణగిమణగివుంటారు.) పలుమారు (అనేక పర్యాయములు) నిందలతోనూ తిట్లతోనూ తిరిపెంబులై (బిచ్చగాండ్లవలె) దీనులైరి (దీనావస్థలో వుంటారు). ఇట్టైన (ఇదంతా ఇటున్నా కూడా).... ఓ కలికాలమా! నిన్ను వేంకటేశ్వరుని శరణాగతులు మాత్రం కట్టవేతురు (కట్టేసి పడేస్తారు). జాగ్రత్త! వారి జోలికి పోవద్దు.





సంపుటి: 14 కీర్తన : మలఘుని నిన్నపెరుమాళ్ళు వీడే
సంఖ్య : 368 పుట : 213 రాగం: సామంతం

## సామంతం

18 మలఘునినిన్న పెరుమాళ్లు వీఁడే
వెలయ రాజసమున విఱ్ఱవీఁగీ వాఁడే ॥ పల్లవి॥

నాలినిద్దరు దేవుళ్ళ నడుమ నిలుచుండి
కైలాటాలు చల్లీనదె కనుఁగొనల
వేళవేళఁ బొత్తులను విందులారగించుకొంటా
వాలి కొలువుండీఁ దిరువాముడి మంటపాన ॥మలఘు॥

ఆటలుఁ బాటలుఁ జూచి అంగరంగవైభవముల
నీటుతోడ సొమ్ములెల్లా నిండాఁ బెట్టుక
గాఁటపు పూదండలతోఁ గస్తూరినామములతో
మేఁటి సింహాసనముపై మించేరు కళల ॥మలఘు॥

తామెరకొలనువలెఁ దగఁ దిరుచేల చాతి
కోమలులిద్దరుఁ దాను కుచ్చుళ్ళు వోసి
ప్రేమఁగరకజడలు పిరిఁది దిండ్లు దీరిచి
కామించి నవ్వీ వాఁడే కల్యాణవేదికను ॥మలఘు॥

ముత్తేల చొల్లెపుచుట్టు ముంగురులపైఁ గప్పి
మెత్తిన గందపుఁబూత మేన నిండఁగా
హత్తిన పూవుదండలమర జల్లులలోని-
కొత్తమేలుకట్లలోను గూచున్నాఁడు వీఁడె ॥మలఘు॥

కుడియమకొప్పుల కుళ్ళాయి పాగచుంగుల
బెడిదపు దంపతులు పెండ్లిచవికెలో
అడరి శ్రీవేంకటేశుఁ డలమేలుమంగఁ దాను
పుడమిఁ గూడున్నవారు భోగపురతులను ॥మలఘు॥368

**అవతారిక:**

దేవుని కళ్యాణమహోత్సవ సందర్భంగా అన్నమాచార్యులవారు వినిపించిన కీర్తన ఇది. వైష్ణవ పరిభాషలో ప్రయోగించే పడికట్టు పదములు చాలా వున్నాయి.

"పెరుమాళ్ళు" అంటే శ్రీవేంకటేశ్వరుడు. "పెరియపిరాట్టి" అంటే లక్ష్మీదేవి. "మలఘునినిన్నపెరిమాళ్ళు" అంటే... కొండలలో నెలకొన్న కోనేటిరాయుడు అని భావించాలి. "తిరువాముడి మంటపము" అంటే కళ్యాణమండపము. 'మేలుకట్లు' అంటే (మెట్లమాదిరికట్టిన ఉన్నతాసనము). "పిరిది దిండ్లు" అంటే కూర్చున్నప్పుడు మెత్తగా వుండటానికి వేసికొనే పరుపు. "చొల్లెపుచుట్టు" అంటే చుట్టచుట్టిన సిగకట్టు. ఈయన దేవేరులైన శ్రీదేవి, భూదేవి ఎంతమనోహరంగా వున్నారంటే ఒకామెకు కొప్పు ఎడమవైపుకు చుట్టబడివుంటే ఇంకొకామెకు కుడివైపుకు చుట్టబడి వుందట. స్వామివారికి కుళ్ళాయి పాగ చుంగలుగా చుట్టారట. మొత్తానికి ఈ కీర్తనకి ప్రతిపదార్థం వివరించాలంటే అసామాన్య పాండిత్యం ద్రవిడ భాషలలో కూడా వుండాలి. నాకు అంత శక్తి లేదు తండ్రీ! అయినా ప్రయత్నం మానను.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! వీడే (ఈ స్వామియే) మలఘునినిన్నపెరుమాళ్ళు (కొండలలో నెలకొన్న కోనేటిరాయుడు) ఈ స్వామిని పరికించి చూచినారా? రాజసమున (రాచఠీవితో) విఱ్ఱవీగిని (అతిశయించుచున్నాడు), వాడే (ఆ శ్రీవేంకటేశ్వరుడే).

ఈ స్వామి, ఇద్దరు దేవుళ్ళనడుమ (దేవేరిల మధ్య) నాలిగా (మందముగా) నిలుచున్నాడు. అదే "కైలాటాలు" చల్లీను (మాయోపాయములు పన్నుతున్నాడు). కనుగొనల ద్వారా సైగలు చేయుచున్నాడు. వేళవేళా (ఆయావేళకు తగినట్లు) పొత్తులను ఇద్దరితో జంటగా విందులు





ఆరగించుచున్నాడు. ఈ విధముగా ఇద్దరు దేవేరులతో తిరువాముడి మండపాన (కళ్యాణమంటపమున) వాలి కొలువుండీ (అతిశయముగా కొలువుదీరియున్నాడు).

ఈ కళ్యాణ మహోత్సవ సందర్భంగా ఆడేవారు ఆడుతున్నారు. పాడేవారు పాడుతున్నారు. అంగరంగ వైభవముతో స్వామి అలరారుచున్నాడు. సొమ్ములన్నీ నీటతోడ నిండా బెట్టుకనున్నాడు (తమ ఆభరణములనన్నింటినీ పూర్తిగా అలంకరింపజేసికొన్నారు). గొలుపు పూదండలతో (ఒత్తుగా కట్టిన పూలదండలతో) వున్నవారికి కస్తూరి నామము నల్లగా అందముగా కనుపించుచున్నది. ఈ ముగ్గురూ మేటి సింహాసనముపై కళల మించేరు (కళలను విరజిమ్ముతూ) అతిశయించు ఠీవిగా కూర్చొనియున్నారు).

ఆ కోమలులిద్దరితోపాటు స్వామికి కూడా కుచ్చుళ్ళుపోసి మంగళవస్త్రాలు ధరింపజేసి, తామరకొలను ఒడ్డున మెత్తని దిండ్లు అమర్చిన మెత్తలపై ప్రేమగా చూపులు విరజిమ్ముతూ సుఖాసీనులైనారు. ఆ కళ్యాణవేదిక మీద కామించి నవ్వీను అదే (కోర్కెతో చిరునవ్వులొలికిస్తూవున్నాడు ఆ స్వామి).

ఈ దేవదేవుని కేశాలంకరణ చూడండి. ఈయన కొప్పుచుట్టూ ముత్యాలదండ గట్టిగా బిగించారు. వారి ఒంటిపై ఒత్తుగా, నిండుగా మంచి గంధము పూత మెత్తారు. మళ్ళీ ఒత్తైన పూదండలతో వారిని అలంకరించారు కొత్తగా మెట్లవలె అంచెలంచలుగా అమర్చిన ఆసనముపై కూర్చున్నాడే వాడే నిత్య పెళ్ళికొడుకు.

ఒక దేవేరికి కుడివైపున కొప్పు వంగివున్నది. ఇంకొక దేవేరికి ఎడమవైపు కొప్పు వంగి వున్నది. స్వామికి కుళ్ళాయి పాగా తలకి అందముగా చుట్టారు. బెడిదపు దంపతులను (సర్వాధికులైన ఆ దంపతులను) పెండ్లిచవికెలో (కళ్యాణ వేదికపై) అమర్చినారు. అడరి (అతిశయించిన) శ్రీవేంకటేశ్వరుడు అలమేల్మంగయును తానునూ, అఖండమైన భూలోక వైభవము కొరకు కూడియున్నారు. భోగపురతుల దేలుచూ నయనానందకరముగానున్నారు.

సంపుటి: 2 కీర్తన : సర్వోపాయముల జగతినాకితడే
సంఖ్య : 132 పుట : 89 రాగం: మలహరి

**మలహరి**

**19 సర్వోపాయముల జగతినాకితడే**
**వుర్వీధవుడు పురుషోత్తముండితడే ॥ పల్లవి॥**

**సకలగంగాదితీర్థస్నానఫలము లివి స్వామిపుష్కరణిజలమే నాకు**
**సకలపుణ్యక్షేత్రావాసయాత్ర లివి సరి వేంకటాచలవిహార మిదియే**
**సకలవేదాధ్యయన శాస్త్రపాఠంబు లివి శౌరిసంకీర్తనం బిదియే నాకు**
**సకలకర్మానుష్ఠానముల యితని కిచ్చుటఁజాతుపడికైంకర్య మిదియే ॥సర్వో॥**

**ఉపవాసతపము లివి యితనిప్రసాదంబు లొగి భుజింపుటే నాకు దినదినంబు**
**జపరహస్యోపదేశంబు లితనిపాదజలంబులుశరణనేటిసేవ యొకటే**
**ఉపమింపఁ బుణ్యపురుషులదర్శనము నాకు నొగినిచటి బహువృక్షదర్శనంబు**
**యెపుడుఁ బుణ్యకథాశ్రణంబు లిచ్చోటియెన్నఁగలబహుపక్షి కలకలఁబు ॥సర్వో॥**

**తలఁపుగలయోగంబులందు శ్రీవైష్ణవులఁ దగులుసంవాస సహయోగంబు**
**వెలయు నిండుమహోత్సవంబు లిన్నియునితనివిభవంబు**





**లెసఁగు తిరునాళ్లు నాకు**
**చెలఁగి యిటు దేవతాప్రార్థనింతయు నాకు శ్రీవేంకటేశ్వరుని శరణాగతి**
**అలరునాసంపదలు యితని పట్టపురాణి అలమేలుమంగ కడకంటి చూపు ॥సర్వో॥132**

**అవతారిక:**

దాదాపు ఇరువది సంవత్సరాలక్రిందట ఎం.ఎస్. సుబ్బలక్ష్మి గారి మధుర కంఠంలో ఈ కీర్తనవిని మంత్రముగ్ధుడినయినమాట నిజమే అయినా నా"భావయామి వేంకటేశవమ్"లో గాని, తదనంతరంగాని నేను ఈ కీర్తన యెన్నుకొనకపోవుటకు కారణమేమంటే... దీనిని షిర్డీసాయిపరంగా నేను అనుదినమూ బహుతరచుగా పాడుకోవటమే. కాని ఏడుకొండలవాడిని తప్పించుకొని తిరిగితే ఆయన తిరగనిస్తాడా?

1029వ కీర్తనగా నేడు "పొడవుకు పొడవైన పురుషోత్తమా" అనే ఈ సంపుటిలో దీనిని యెన్నుకొనక తప్పలేదు. దేవదేవా! తిరువేంకటేశ్వరా! నన్ను క్షమించు తండ్రీ! నా అజ్ఞానానికి నన్ను క్షమించు. "సర్వోపాయముల నీవే" అంటే ఇదే కదా! హరియైనా నీవే, హరుడైనీ నీవే, సాయిబాబా అయినా నీవే సర్వమూ నీవే. నా ఆత్మకూడా నీవే. మరి ఈ బేధభావము అజ్ఞానంవల్లనే కదా! ఉన్నది ఒకటే పరబ్రహ్మతత్వం దానికి ఏపేరుపెట్టినా ఒకటే. ఇప్పుడీ కీర్తనను ఇంకా స్పష్టతవున్న మనస్సుతో వ్రాస్తున్నాను.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! సర్వోపాయముల (నవవిధి భక్తిమార్గములన్నింటితో ఆరాధించుటకు) జగతి (ఈ ప్రపంచమున) నాకు ఇతడొక్కడే మిగిలియున్నాడు. ఈయన మరెవరో కాదు ఉర్వీధవుడు (భూదేవీ వల్లభుడు). సర్వులూ పురుషోత్తముడని కీర్తించే దేవదేవుడు కూడా ఇతడే సుమా!

నాకు ఈ తిరుమల కొండపైనున్న స్వామిపుష్కరిణి జలములే గంగ మొదలైన సకల పుణ్యప్రదమైన తీర్థస్నానములన్నింటితో సమానము. ఈ వేంకటాచలమున విహరించుటే, నాకు సకల పుణ్యక్షేత్రములలో బహుకాలవాసము వంటిది. ఈ తిరుమలలో శ్రీవేంకటేశ్వరునిపై నేను పాడుకొనే కీర్తనయే నాకు సకల వేదాధ్యయనముతోను సకల శాస్త్ర పాఠంబులను నేర్చుటతోను సమానము. ఇతనికి (ఈ శ్రీహరికి) ఇచ్చట చాతువడి కైంకర్యము (నేను ధరించి చేయు ఊడిగమే) నాకు సకల విహిత కర్మానుష్ఠానము. నేను చేయవలసిన కర్మకాండ యేదైనా నాకు అనవసరమే.

భక్తితో ఇతని ప్రసాదము ప్రతిదినము స్వీకరించుటే నాకు ఉపవాసదీక్షతో తపమునాచరించుట వంటిది. శరణాగతితో ఇతని పాదోదకమును తీర్థముగా స్వీకరించుటయే నాకు రహస్యముగా చేయబడిన పూజ వుపదేశము. ఈ తిరుమల శిఖరములపైనున్న అసంఖ్యాకమైన పుణ్య వృక్షముల దర్శనమే, ఈ విశ్వములోని అసంఖ్యాకులైన పుణ్యపురుషుల దర్శన భాగ్యము వంటిది. తన్మయత్వంతో ఈ తిరుమల శిఖరాలపైనున్న అశేష పక్షిజాతుల కలకలంబులే నాకు చెవికింపైన శ్రీహరి పుణ్య కథాశ్రవణము.

ఈ తిరుమలలోని శ్రీవైష్ణవులతోటి సహజీవనమే నేను మనస్ఫూర్తిగా కోరుకునే గొప్పయోగము. ఈ స్వామికి అనునిత్యము చేయు సుప్రభాతసేవ వంటి మహోత్సవములే నాకు వైభవోపేతమైన బ్రహ్మోత్సవంబులవంటి తిరునాళ్ళు. ఇన్ని వేలమంది దేవతల నారాధించుట నాకు ఈ శ్రీవేంకటేశ్వరుని శరణాగతికంటే యెక్కువైనది కాదు. ఇతని పట్టపురాణియైన అలమేలుమంగమ్మ కడకంటి చూపు (కేవలము కన్నుకొనలనుండి చూచి అనుగ్రహిస్తే) నాకు అష్టైశ్వర్యములూ సమకూడినట్లే. ఈ జన్మకాభాగ్యము చాలును.





సంపుటి: 2 కీర్తన : కలదిదివో సుఖము గలిగినను గర్భము నిలువక మానునా

సంఖ్య : 22 పుట : 15 రాగం: గుజ్జరి

## గుజ్జరి

**20** కలదిదివో సుఖము గలిగిననుగర్భము నిలువక మానునా
మలసి కామ్యకర్మములకుఁ జొచ్చిన మగుడఁ బుట్టువులు మానునా ॥పల్లవి॥

పరగ నింద్రజిత్తుఁడు హనుమంతుని బ్రహ్మాస్త్రంబునఁ గట్టి
అరయ నందుపై మోకులుగట్టిన నలబ్రహ్మాస్త్రము వదలె
పరిపరివిధముల నిటువలెనే హరిఁ బ్రపత్తి నమ్మిననరుఁడు
తిరుగఁ గర్మమార్గమునకుఁ జొచ్చిన దేవుఁడు దనవాత్సల్యము
వదలు ॥కల॥

అలరినసంసారభ్రమ విడిచి యడవిలోన జడభరతుఁడు
తలఁపుచు నొక యిఱ్ఱిఁ బెంచినంతనే తనకును నారూపు దగిలె
ములుగుచు లంపటములు దెగవిడిచి మోక్షము వెదకెడినరుఁడు
వలవనిదుస్సంగతులు పెంచినను వాసన లంటక
మానునా ॥కల॥

అటుగన తాఁబట్టినవ్రత ముండఁగ నన్యమతము చేపట్టినను
నటనల నెందునుఁ బొందక జీవుఁడు నడుమనె మోకుఁడైనట్లు
తటుకన శ్రీవేంకటపతి నొక్కనిదాస్యము భజియించిననరుఁడు
ఘటనల నాతనికైంకర్యములకు కడుఁ బాత్రుఁడు గాక
మానునా ॥కల॥

**అవతారిక:**

చాలామంది చావుపుట్టుకలు మానవ కల్పితాలు అని భ్రమపడి అనవసరమైన పగద్వేషాలతో రగిలిపోతూ వుంటారు. కానీ చావు పుట్టుకలు భగవన్నిర్దేశ్య ప్రకారమే జరిగే విధి విధానాలే కాని మానవ వ్యూహాలు కాదు. వచ్చిన గొప్ప చిక్కుయేమిటంటే కర్త నేనే అనుకుంటూనే జీవులు ఆ కర్మలకు సుఖదు:ఖాలనుభవిస్తుంటారు. అన్నీ పరమాత్మ కల్పితాలేనని, ఆయన జగన్నాటకం అని గ్రహించలేరు. కాని మూలకారణం కర్మయే కదా! ఒక స్త్రీతో సుఖిస్తే అంతటితో సరిపోతుందా? ఆమెకు గర్భం రాకుండా వుంటుందా? కామ్యములనిచ్చే యే కర్మకైనా ఫలితం అనుభవించక తప్పుతుందా? మరి ఆ ఫలితం దేహం లేకుండా అనుభవించలేని జీవుడు యేదో ఒక దేహం పొంది తద్వారా దానికి సంబంధించిన సుఖదు:ఖాలు అనుభవించాల్సిందే... తప్పదు. కాబట్టి అంతా భగవదేచ్ఛ అనుకోకుండా నేనే చేయగలను అని "మానవ ప్రయత్నం" మొదలు పెడితే... ఫలితం మాత్రం భగవదేచ్ఛ. ఈ సిద్ధాంతాన్ని అనేక పౌరాణిక ఘట్టాలతో వివరిస్తున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓ మానవులారా! ఇదివో వినండి. ఒక స్త్రీతో సుఖమును పొందితే మొగవాడు, ఆ కామ ఫలితం వలన ఆమె గర్భం ధరించక తప్పుతుందా? మలసి (తిరిగి) ఆ పుట్టిన జీవి అనేక కామ్య కర్మలు (ఫలితమునిచ్చే కర్మలు) చేయక మానుతాడా? దానివలన తిరిగి జన్మలు పొందక తప్పుతుందా? ఈ విధంగా జీవుడు కర్మలు చేస్తూనే ఫలితం అనుభవిస్తూనే వుంటాడు.





అలనాడు లంకలో చొచ్చిన హనుమంతుని ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముతో బంధించాడు. కాని అతితెలివితో రాక్షసమూకలు ఎందుకైనా మంచిదని ఆయనను మోకులతో (తాళ్ళతో) కూడా కట్టేశారు. ఫలితంగా బ్రహ్మాస్త్ర ప్రభావం చెడిపోయి ఆయన బంధవిముక్తుడయ్యాడు. పరిపరి విధముల (అనేక పర్యాయములు) ఇదేవిధముగా హరి ప్రపత్తి (శ్రీహరి శరణాగతి) నమ్మనివారు, తిరిగి కర్మ మార్గమునకు తగులుకొని తమ ప్రయత్నాలు తాము చేస్తుంటారు. అప్పుడు దేవుడు తన వాత్సల్యమును వదలిపెట్టి మనని మన కర్మకే వదలి వేస్తాడు.

జడభరతుడనేవాడు సంసారముపై వ్యామోహమును విడిచి అడవిలో తపస్సు చేస్తుండేవాడు. అనుకోకుండా ఒక 'యిట్టి' (జింకపిల్లను) రక్షించి దాని రక్షణ భారం వహించి దానిమూలంగా తిరిగి బంధము కలిగి జింకగా పుట్టి అనేక బాధలు అనుభవించాడు. ఇందువలన తెలిసేదేమంటే, లంపటములను (బంధములను) తెగవిడిచి నరుడు మోక్షమును పొందాలంటే, దుస్సాంగత్యమును వదలివేయక తప్పదు. దానిని పెంచుకొంటే వాసనలు (అనుభూతిని కలిగించు స్మృతులు) వదిలిపెడతాయా? అవే జన్మకారణాలవుతాయి.

అటుగన (అదే విధంగా) తాను నమ్మికతో పట్టిన వ్రతము ఒకటివుండగా అన్య సిద్ధాంతముల వెంట మతముల వెంటబడితే ప్రయోజనమేమిటి? ఆ జీవుడు ఇహపరములు రెంటికీ చెడి నడమనే మోద్దై బాధలు పొందుతాడు. తటుకున (చటుక్కున) శ్రీవేంకటపతి దాస్యమును స్వీకరించి ఆయన శరణాగతిని పొంది ఆ స్వామినే భజించే నరుడు ఆయన కైంకర్యమును (దాస్యమును) స్వీకరిస్తే ఆ ఏడుకొండలవాడి కృప రాక మానుతుందా? తప్పకుండా కలుగుతుంది.

సంపుటి: 2 కీర్తన : హరిగోవిందా హరిగోవిందా
ఆనందమానందమాతుమకును
సంఖ్య : 339 పుట : 228 రాగం: గుండక్రియ

**గుండక్రియ**

**21** **హరి గోవిందా హరి గోవిందా**
**ఆనందమానంద మాతుమకును**
**గురూపదేశాన వెదకఁగా వెదకఁగా**
**గరిమ నీయర్థము కంటి మోయయ్యా** ॥పల్లవి॥

**సరి నన్యధర్మములు మానుమంటివి**
**శరణు నీకుఁ జొరుమంటివి**
**దురితము లణఁచేనంటివి**
**పరగ మోక్షం బిచ్చేనంటివి**
**హరి నీవచనము అమోఘము**
**నరులము నే మిది నమ్మితిమి**
**పరమపద మిప్పుడే కలిగెను**
**ధర నొక్క మనసుతో నున్నారమయ్యా** ॥హరి॥

**యెందు నీవే గతి యనుమంటివి**
**యేచి యొక్క మాఁటే చాలునంటివి**
**యిందరి కభయ మిత్తునంటివి**
**యిది నీ కెపుడు వ్రతమంటివి**
**కందువ నీబిరుదుసత్యము**
**కానిమ్మని నేము చేపట్టితిమి**
**ఆంది నీవే మాకు దిక్కైతివి**
**అన్నిటా సంతోసాన నున్నారమయ్యా** ॥హరి॥

**ఆసమానినవాఁ డెక్కు డంటివి**
**ఆతనివెంటఁ దిరిగేనంటివి**
**భాసురపాదరేణువు నే నంటివి**





**పావన మయ్యేనని యంటివి**
**మోసలేనిది నీ సంకల్పము**
**మొక్కే మిందులకు శ్రీవేంకటేశా**
**ఆనపడ నితరుల నాకు నీవే యాస**
**యని నీదాసులమై యున్నారమయ్యా** ॥హరి॥ **339**

**అవతారిక:**

దేవదేవుడైన హరి గోవిందుని సంకల్పము అటలము. గీతావాక్యముగా ఆ పరమాత్మ బోధ అంతయూ ఆత్మానందము నొసగునదే. ఇందుకించిత్ సందియమును లేదు. ఆయనే జగద్గురువు. ఓ అయ్యా! అయినా మా గురుదేవులు వుపదేశము చేసిన తరువాతనే మేము నీ అర్ధము నెరింగితిమి లేనిచో మాకు నీ దివ్య బోధ అర్ధమయ్యేదే కాదు అని కితాబునిస్తున్నారు అన్నమాచార్యులవారు. పరధర్మములు భయంకరములు. అన్యధర్మముల జోలికి పోవద్దని పరమాత్మ చెప్పినా మానవుడు విననందువలననే నేడు ప్రపంచంలో ఇంత అశాంతి పెట్రేగిపోతోంది. శరణన్నవానిని కాపాడతానని వాగ్ధానం చేశాడు పరమాత్మ. ఆ విధంగా ఆయనే దిక్కు అనే భావనతో వుంటే నిత్యమూ సంతోషమే కదా! మానవులకు దు:ఖమేవుండదు కదా! దేవా! నిర్మోహి అయినవాడే సర్వశ్రేష్ఠుడన్నావు.

ఇకపోతే పాఠకులకు మనవి. ఇటువంటి కీర్తనలు ఒక్కసారి గానం చేస్తే భగవద్గీత చదివిన పుణ్యం వస్తుంది. కాని నమ్మకం, భక్తి శరణాగతి ముఖ్యం. అవి లేనినాడు 108 సార్లు పారాయణ చేసినా లక్షమంది పెద్దగా సామూహిక పారాయణ చేసినా ఫలితం యేమంతవుండదు.

**భావ వివరణ:**

ఓ హరిగోవిందుడా! హరిగోవిందుడా గురూపదేశాన (మా గురుదేవుల ఉపదేశ ప్రభావముచే) వెదకగా వెదకగా (నీ కొఱకు పట్టుదలతో శోధించగా) నీ గరిమ (నీ వైభవమును) నీ యర్థము (నీ గీతావచనపు వివరణమును) కంటిమి (దర్శించగలిగితిమి). ఓ అయ్యా! ఆనందమానందమాతుమకును

(మా ఆత్మకు బ్రహ్మానందము కలిగినది తండ్రీ!) మా జన్మ ధన్యమైనది.

నీవేమంటివి ప్రభూ! సరిగా అనిపించిననూ అన్యధర్మములు (పరులకు నిర్దేశించబడిన ధర్మములను) మానుము అంటివి. నీకు శరణు జొరుమంటివి (శరణాగతితో నిన్ను నమ్మమంటివి). మా దురితములను (పాపకర్మలను) తొలగింతునంటివి. సందేహము వలదు, నేనే నీకు మోక్షము నిచ్చెదనంటివి. ఓ శ్రీహరీ! నీ వచనము (గీతావచనము) అమోఘము (సాటిలేనిది). మేము మానవమాత్రులము. ఇదే నమ్మితిమి. పరమపదమిప్పుడే కలిగినది (జీవన్ముక్తులమయ్యాము). ఈ భూమిపై జీవిస్తున్నప్పటికి ఒక పరిపూర్ణమైన మనస్సుతోనున్నారము.

ఇంకా నీవేమన్నావో గుర్తుచేసి కొనెదను. ఎందున్ నీవే గతి అంటివి (మాజీవిత కాలమున, ప్రాణములను వదలునప్పుడు, మరణించిన పిదప కూడా నీవే మాకు దిక్కు అని అన్నావు) ఏచి (అతిశయించి) నీ ఆ ఒక్క అభయమే మాకు చాలును అన్నావు. శరణాగత రక్షణయే నీ వ్రతము అంటివి. ఓ జగదీశ్వరా! కందువ (సర్వ సమర్థుడవైన) నీ బిరుదు (శరణాగత రక్షకుడవను బిరుదు) సత్యము కానిమ్మని, చేపట్టితిమి (నీ ఆశ్రయమును పొందితిమి). అంది (మాకు వశమై) నీవే మాకు దిక్కు అయితివి. మేము ఇహపరములన్నిటిలోనూ సంతోషముగానున్నామయ్యా!

ప్రభూ! మేము అనుక్షణము గుర్తుంచుకొనవలసిన మరికొన్ని మాటలు సాటిలేనివి. ఆశ మానుమంటివి. పాపములన్నిటికీ మూలము ఆశ. అది చచ్చినా విడువని పీడ. మరల జన్మ కలుగుటకు అదియే మూలకారణము. నిర్మోహి (ఆశ విడనాడినవాడు) ఎక్కుడు (అధికుడు) అంటివి. అట్టి నిర్మోహి వెంటనే సర్వకాల సర్వావస్థలయందు నీవు వారితోడు వుంటానన్నావు. విశ్వరూపుడవైన నీ పాద రేణువు పాటివారు ఈ భారతయుద్ధ వీరులంటివి. అంతేకాదు అది నీ దాసులైన వారికి దివ్యచక్షువులతో చూపి మరీ నిరూపించితివి. కర్తవ్య దీక్షలో మేము చేసే పాపములు మమ్ము అంటవని అంటివి. ప్రభూ! నీ సంకల్పము మోసలేనిది (వంచన ఏమాత్రమూ లేనిది). ఓ శ్రీవేంకటేశ్వరా! ఇందులకే నీకు మొక్కేమయ్యా! ఆసపడని నీవే మా అందరికీ ఆస (ఆధారము). ఎందుకంటే నిన్ను ఏ ఆశా వశపరచుకోలేదు. ఓ ప్రభూ! ఆ ధైర్యంతోనే నీ భృత్యులమైవున్నామయ్యా! నా వూపిరి ఆగేదాకా అలాగే వుంటాను తండ్రీ!





సంపుటి: 2 కీర్తన : తందనాన ఆహి తందనాన పురె

సంఖ్య : 385 పుట : 259 రాగం: బౌళి

బౌళి

22 తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥ పల్లవి॥

బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పర
బ్రహ్మ మొకటే పరబ్రహ్మ మొకటే ॥తంద॥

కందువగుహీనాధికము లిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మింతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥తంద॥

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటునిద్రదియు నొకటే
మెండైన బ్రాహ్మణుఁడు మెట్టుభూమి యొకటే
చండాలుఁ డుండేటి సరిభూమి యొకటె ॥తంద॥

అనుగుదేవతలకును అలకామసుఖ మొకటే
ఘనకీటపశువులకు కామసుఖ మొకటె
దినమహోరాత్రములు తెగి ధనాఢ్యున కొకటే
వొనర నిరుఁబేదకును వొక్కటే అవియు ॥తంద॥

కొరలి శిష్టాన్నములు గొనునాఁక లొకటే
తిరుగుదుష్టాన్నములు దినునాఁక లొకటే
పరగ దుర్గంధములపై వాయువు నొకటే
వరుసఁ బరిమళముపై వాయువు నొకటే ॥తంద॥

**కడఁగి యేనుఁగుమీఁదఁ గాయుయెండొకటే**

**పుడమి శునకముమీఁదఁ బొలయునెండొకటే**

**కడుఁబుణ్యులను పాపకర్ములను సరిఁ గావ**

**జడియు శ్రీవేంకటేశ్వరు నామ మొకటే ॥తంద॥ 385**

**అవతారిక:**

ఈ విశ్వవిఖ్యాతమైన కీర్తనను "భావయామి వేంకటేశమ్" సంపుటి 1లో నేను వివరించటం జరిగింది. కాని అప్పుడు పల్లవితోపాటు మూడు చరణాలను మాత్రమే పేర్కొన్నాను. ప్రస్తుతం "పొడవుకు పొడవైన పురుషోత్తమ"లో పొడుగు కీర్తనలకే ప్రాధాన్యత గనుక ఇదేకీర్తన చరణాలు అన్నిటితోపాటు వివరిస్తున్నాను. ఇదివరలో చెప్పినట్లే అన్నమాచార్యులవారి ఈ కీర్తనలో 'అహి' అనే మాట నేటికాలంలో ఆహా! 'పురే' అనే మాటను "ఒరే" అని 'భళా' అనే మాటను "భలే" అని వ్యవహరిస్తున్నాము. తందనాన అనేది వూతపదం. "అవునవునూ" అనడం అన్నమాట. అందుకనే మనం అన్న మాటకి ఎవరన్నా 'వత్తాసు' పలికితే ఏమిట్రా! వాడన్న ప్రతిదానికీ తాన అంటే తందాన అంటావు అని మందలిస్తారు. కాని ఈ తాన తందాన పాటలు యెంత జనామోదం పొందాయంటే అన్నమాచార్యులవారి నెరుగనివారు కూడా ఈ కీర్తననెరుగుదురు. అన్నమయ్యలోని మరొక కోణం కానవచ్చే కీర్తన ఇది. చేతన వున్న ఏ జీవిలోనైనా పరబ్రహ్మ 'ఒక్కని' గానే వుంటాడు. ప్రకృతి ప్రసాదం అందరికీ సమానమే గాలి, వాన, కాంతి అందరివీ. ఏ ఒక్కరివీ కాదు. మరి అటువంటప్పుడు నేను అగ్రకులజుడననీ నీవు తక్కువ జాతివాడవని వివక్ష చూపించటం తగనిపని. అందరూ ఆ పరమాత్మ బిడ్డలమే. ఇంతకంటే అభ్యున్నతయోచన సాధ్యమా?

**భావ వివరణ:**

తందనాన! అహి, తందనాన! పురే తందనాన! భళా తందనాన!

జ్ఞప్తికి వుంచుకోండి. బ్రహ్మము ఒక్కటే పరబ్రహ్మస్వరూపుడైన పరమాత్మ ఒక్కడే. పరమాత్మయే మతమునకు చెందని పరబ్రహ్మ ఆయన యే ఒక్క





కులమునకు సొత్తుకాదు. ఇందు (ఈ పరబ్రహ్మకు) హీనులు, అధికులు అను విచక్షణలేదు. కందువగు (ప్రాపంచిక దృష్టిగల) అవన్నీ మానవమాత్రులకే. ఎందుకంటే అందరికీ శ్రీహరియే అంతరాత్మ రూపంలో వున్నాడు. కాకపోతే ఇందులో జంతువుల కులము జ్ఞానరహితమైనదైనా అదికూడా ఒకటే. వాటికి కూడా శ్రీహరే అంతరాత్మ. అదే నిజం కాకపోతే, వేటనైపుణ్యం ఆ జంతువుకు యెవరు నేర్పుతున్నారు? ప్రకృతి అని నాస్తికులు వాదించ వచ్చును. కాని పరమాత్మే ప్రకృతి రూపంలో మనబోంట్లకు తన అమేయమైన శక్తిని ఋజువు చేస్తున్నాడు.

ప్రజలారా! ఇది గుర్తుపెట్టుకోండి. నిండార (నిండుగా) నిద్రించునట్టి రాజుగారు పోయే నిద్రసుఖమూ ఒక్కటే. అండనే (అక్కడనే) నేలపై ఒదిగి పడుకొనే బంటు యొక్క నిద్రయు ఒక్కటే. మెండైన బ్రాహ్మణుడు (భూసురుడని కీర్తింపబడుతున్న బ్రాహ్మణుడు) నడిచే నేలా ఒక్కటే చండాలుడని జనులు నిరసించే కడజాతివాడు నడిచే సరిభూమి (చదునైన) నేల కూడా ఒక్కటే కదా! మరి ఒకడి గొప్ప యేమిటి? ఒకడి తక్కువ యేమిటి?

అనుగు (ప్రముఖులైన) దేవతలకు కామసుఖము యెట్లుండునో కీటకములకు పశువులకు కూడ కామసుఖము అట్లే యుండును. దినము అహోరాత్రములు (పగలు, రేయి) ధనవంతునికి నిరుపేదయైన వాడికీ ఒకేలా వుంటాయి. కొరవి (పొంది) శిష్టాన్నములు (విహితమైన) ఆహారమును భుజించెడి ఆకలి యెటువంటిదో ఎక్కడపడితే అక్కడ తిరిగి దుష్టాన్నము భుజించే ఆకలి కూడా ఒకటే. అదే విధంగా సువాసన వెదజల్లు వస్తువులపై వీచెడి వాయువు, దుర్గంధభరితమైన వాటిపై నుండి వీచు వాయువూ రెండూ ఒక్కటే. దుర్గంధ సుగంధములు వాయువునకు లేవు అవి కేవలం ఆయా వస్తువులపై వాయువు వీచుటవలన వస్తువలు నుంచి వాయువునకు సంక్రమించినట్లు భ్రమ కలిగిందేకాని వాయువునకు యేగంధమూ లేదు.

కడగి (పూని) యేనుగుమీదకాయు యెండ అయినా భూమిపై వీధికుక్కమీద పొలయు (కాయు) యెండైనా ఒక్కటే. ఘోర పాపాత్ములనైనా, గొప్ప పుణ్యాత్ములనైనా సరిగావ (సమానముగా రక్షించుటకు) పాపమును జడియజేయు (నివారించును), శ్రీ వేంకటేశ్వరుని నామమూ ఒక్కటే

సంపుటి: 2 కీర్తన : ఇవిసేయగనే నలసుడ యెటువలె మోక్షంబడిగెదను
సంఖ్య : 328  పుట : 220  రాగం: భూపాళం

## భూపాళం

23 ఇవి సేయఁగ నే నలఁసుడ యెటువలె మోక్షం బడిగెదను
వివరముతోడుత నీవు సులభుఁడవు విష్ణుఁడ నిన్నే కొలిచెదఁగాక
॥ పల్లవి॥

జపయజ్ఞ దానకర్మంబులు యెంచఁగ జిరకాలఫలంబులు
యెపుడుఁ బుణ్యతీర్థస్నానములు యిల పాపవిమోచనములు
అపరిమిత దేవతాంతరభజనలు ఆయాలోకప్రాప్తులు
వుపవాసాదినియమవ్రతములు తపోనిష్ఠకుఁ గారణంబులు
॥ఇవి॥

రవిచంద్రగ్రహతారాబలములు భువిలోఁ గామ్యఫలములు
తవిలినపంచేంద్రియనిగ్రహంబులు తనుధరులకు దుర్లభములు
అవిరళధర్మార్థకామంబులు మతియైశ్వర్యములకు మూలములు
అవలగ్రహణకాలానుష్ఠానము లధికఫలంబులు ఆశామయము
॥ఇవి॥

పరగ సప్తసంతానబ్రాహ్మణతర్పణములు ఖ్యాతిసుకృతములు
అరయఁ బుత్రదారక్షేత్రసంగ్రహ మందరికిని సంసారభోగము
హరి నరహరి శ్రీవేంకటేశ్వరా అఖిలము నొసఁగెడిదాతవు
సరుగన నీవే దయతో రక్షించఁజాలుదు వేకాలమును మమ్మును
॥ఇవి॥

**అవతారిక:**

అలసుడు అంటే సోమరిపోతు అని అర్థం. బాగా బద్ధకంవున్న వాడన్నమాట. వైదికధర్మం పాటించువానికి సంధ్యావందనము అనుష్టానము





వంటి కొన్ని వైదిక నిత్యకృత్యములు చేయవలసి వుంటుంది. గ్రహణ కాలములలో కొన్ని నియమములను పాటించవలసి వుంటుంది. పంచేంద్రియ నిగ్రహం ఆవశ్యకమై వుంటుంది. సప్త సంతాపములందు బ్రాహ్మణ తర్పణములను వదల వలసి వుంటుంది. పుత్రుల కొరకు భార్య కొరకు గృహము మొదలైన క్షేత్రముల కొరకు కొన్ని వైదిక కర్మలాచరించవలసి వుంటుంది. బ్రాహ్మణులకు ఇవి తప్పింప వీలులేని ధర్మములు. అన్నమాచార్యులవారు యేమంటున్నారో వినండి. స్వామీ! ఇవన్నీ నేను చేయవలసిన ధర్మములే కాదనలేను. కాని నేను గొప్ప సోమరిపోతును ప్రభూ! నాకవన్నీ యెందుకు? నీవు సర్వసులభుడవైన విష్ణుడవు. అయినా నిన్ను ఏవిధంగా నాకు మోక్షం ఇయ్యి స్వామీ! అని అడగగలను? ఒక్క అనుష్టానము రాదు. యజ్ఞకాండ తెలియదు. వైదిక కర్మకాండ అంటే తగని బద్ధకం నాకు. నాకు తెలిసింది నీ శరణాగతి ఒక్కటే. నీ దాస్యమే నా పరమావధి. నీవే దిక్కు. ఇంకొక సంగతి నాకు దృఢచిత్తముకూడా నీవే ఇవ్వవలసి వుంటుంది అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఇవి (ఈ విహిత కర్మములను) సేయగ (చేయవలెనంటే) నేను అలసుడ (సోమరిపోతును). నిన్ను, ఇక ఎటువలె (ఏవిధముగా) మోక్షం బడిగెద? (మోక్షమును ఇమ్మని ప్రార్థించమంటావు?) నీవు సులభముగా అనుగ్రహించు విష్ణుదేవుడవు. వివరముతోడ (విచారించగా) నిన్నే కొలిచెదను గాక!

ప్రభూ యెంచగా (ఆలోచించి చూస్తే) జపము, యజ్ఞము, దానము వంటి కర్మంబుల వలన కూడా మోక్షము తప్పక లభిస్తుంది. కానీ అవి చిరకాల ఫలంబులు (బహుకాలము పట్టు సాధనలు). గంగ మొదలైన పుణ్యతీర్థములలో స్నానములు కూడా పాపవిమోచనములే. అది యెంతో వ్యయప్రయాసలతో కూడినది. అంతులేకుండా దేవతాంతరములను (అన్యదేవతలను) ఆరాధిస్తే, అది సులభగ్రాహ్యమైన ఆయా దేవతల లోకప్రాప్తి నొసగగలుగును. ఇకపోతే ఉపవాసము మొదలైన

నియమములతో వ్రతములు చేసినా తపోనిష్ఠతో నిన్ను సంతృప్తి పరచాలంటే అది నావంటి సోమరివల్ల అయ్యే పనేనా స్వామీ! నక్క యెక్కడ! నాకమెక్కడ? అని పెద్దలేనాడో అన్నారు కదా!

ఓ ప్రభూ! భువిలో (ఈ భూలోకములో) సూర్యచంద్రాది గ్రహముల యొక్కయు తారాబలము యొక్కయు గణనము చేసి గ్రహచార దోషణా నివృత్తికి శాంతులు పూజలు చేయుటయు కద్దు. కాని అవి చేసే ఘనకార్యమేముంది? కామ్య ఫలములనొసగును. తవిలిన (ప్రయత్నించిన) పంచేంద్రియ నిగ్రహము సత్ఫలితమిచ్చినా, తనుధారులకు (దేహధారులైన మానవులవంటివారికి) అది దుస్సాధ్యము. అవిరళముగా (ఆపకుండా) ధర్మార్థ కామములను నెరవేర్చిన అష్టైశ్వర్యములు కూడా సిద్ధించుటకు మూలకారణము ఆవల (అటుపైన) గ్రహణ కాలములలో కొన్ని అనుష్ఠానములను చేసిన గొప్ప ఫలమెగుననుట సత్యమే. కాని అది ఆశామయము. ఆశకు అంతేలేదు. పైగా నిరాశ దాని నీడ. మరి ఇక యేమిలాభము?

పరగ (అతిశయించగా) బ్రాహ్మణుల చేత సప్త సంతాపములందు (ఎవరన్నా దివంగతులైతే) యేడు సంతాప కర్మలు చేయాల్సివుంటుంది. తర్పణలు వదలవలసి వుంటుంది. అవి ఖ్యాతిగల సుకృతములే. కాని మోక్షదాయకములు కావు. ఇకపోతే దారాసుతులతో (భార్య, సంతానముతో) క్షేత్రసంగ్రహమున (పొలములు కొని గృహనిర్మాణములు చేయువేళలలో) చేయునవన్నియు భోగ సంగ్రహములు. బహుపరిమిత సుఖములకారకములు. ఓ శ్రీహరి, నరహరి రూపుడైన శ్రీవేంకటేశ్వరా! అఖిలము నొసగెడి దాతవు నీవే. మమ్ములను యేకాలమందైనా రక్షించుటకు నీవొక్కడివే సమర్థుడవు. సరగున (వేగముగా) దయచూడుము తండ్రీ!





సంపుటి: 2 కీర్తన : పురుషుండని శ్రుతి వొగడీనట ఆపురుషుఁడు నిరాకారమట
సంఖ్య : 252 పుట : 169 రాగం: బౌళి

**బౌళి**

**24 పురుషుండని శ్రుతి వొగడీనట ఆ పురుషుఁడు నిరాకారమట**
**విరసవాక్యము లొండొంటికి నివి వింటే నసంబద్ధములు॥ పల్లవి॥**

**మొగమున బ్రాహ్మలు మొలచిరట ఆ మూరితి అవయవ రహితుఁడట**
**తగుబాహువులను రాజులట ఆ తత్వమే యెంచఁగ శూన్యమట**
**పగటున తొడలను వైశ్యులట ఆ బ్రహ్మము దేహము బయలట**
**అగపడి పాదాల శూద్రులట ఆతనిరూపము లేదట ॥పురు॥**

**తనవందనమునుఁ గలదట దైవము తనుఁ జూడఁ గన్నులు లేవట**
**తనవిన్నపమునుఁ జేయునట ఆతనికిని వీనులు లేవట**
**తనయిచ్చినదే నైవేద్యంబట దైవమునోరే లేదట**
**తనయిచ్చేటిధూపంబును గలదట దైవము ముక్కును లేదట ॥పురు॥**

**అంతాఁ దానే దైవమటా; యజ్ఞము లొరులకుఁ జేయుటట**
**సంతతమునుఁదా స్వతంత్రుఁడటా జపముల వరముల చేకొంటట**
**చింతింపఁ దానే యోగియటా చేరువ మోక్షము లేదట**
**పంతపుశ్రీవేంకటపతి మాయలు పచారించిన వివియట**
**॥పురు॥ 252**

**అవతారిక:**

పరమాత్మను వేదము పురుషుడని కీర్తించింది. పురుషసూక్తము, జగత్ప్రసిద్ధమైనది. కాని నిరాకార నిర్గుణ స్వరూపుడని కూడా శృతులు

కీర్తించాయి. అటువంటప్పుడు విరసవాక్యములైన ఇవి అసంబద్ధములు కదా! అంటున్నారు అన్నమాచార్యులవారు. ఆ విరాట్పురుషుని నోటినుండి బ్రాహ్మణులు మొలచిరట. ఇది వూహాతీతము కదా! రూపమే లేనివానికి నోరేమిటి అందునుండి బ్రాహ్మణులు రావటమేమిటి? నైవేద్యము ఆ స్వామికి పెడతారే నోరే లేనివానికి నివేదన యేమిటి? ఆకారములేనివానికి కన్నులెలా వుంటాయి? చెవులే లేనివానికి విన్నపములు చేయుటేమిటి? తనకేమీ అవసరం లేకపోయినా మనకోసం తనూ విహిత కర్మలు చేస్తాడట యోగేశ్వరుడైన కృష్ణుడు అతడి ప్రజారంజకముగా పాలించిన రాముడూ అతడే. నేడు శ్రీవేంకటాద్రిపై చేరి మాయలు ప్రదర్శించుచూ ప్రజలను సన్మార్గులను చేస్తున్నదికూడా ఆ స్వామియే. కానీ మోక్షమనేది నీలోనే వున్నదట. భావనా రూపమైన ఆ ముక్తి కావాలంటే మళ్ళీ ఒక్కటే దారి

"అన్యధా శరణం నాస్తి

త్వమేవ శరణం మమ" అని శరణువేడుటయే దారి.

**భావ వివరణ:**

శృతి (వేదము) ఆ దేవదేవుని "పురుషుడు" అని వొగడీని (కీర్తించింది). అట (అక్కడ) ఆ పురుషుడు నిరాకారమట (ఆకారములేనివాడట). ఇదెట్లు సాధ్యము? ఇవి వింటే అసంబంధంబులు (ఒకదానికొకటి ముడివడని నుడువులు). ఒండొంటికి (ఒకదానికింకోటి) విరసము (వ్యతిరేకమైన వాక్యములు).

ఆ (మూరితి) విరాట్పురుషుడు, అవయవములే లేని వాడట (నిరాకారుడు కదా!) కాని బ్రాహ్మలు (విప్రులు) ఆయన ముఖమునుండి మొలచిరట (ఆవిర్భవించినారట). తగు బాహువులయందు (దృఢమైన చేతులనుండి) రాజులట (క్షత్రియులు వచ్చారట.) ఆ తత్వము





లెక్కించనసాధ్యము కదా! ఆ పురుషుని తొడలనుండి వైశ్యులు పుట్టినారట. సరియేననుకొంటే మరి శృతులు ఆ బ్రహ్మమునకు దేహమే లేదన్నది కదా! ఇదెట్లు సాధ్యము? అగపడి ధృడముగా కనిపించు పాదములలో నుండి శూద్రులు వుదయించిరట. కాని ఆ విశ్వరూపునికి రూపమే లేదట. రూపములేని వానికి పాదములెట్లుండును? ఏమిటీ వైపరీత్యము?

ఆ పురుషోత్తమునికి వందనము ఆచరించిన చాలునట. నిన్ను తనవానిగా నెంచునట. కాని తను చూచుటకు కన్నులే లేని వానికి చూచుటెట్లు సాధ్యము? పోనీ మనవేదన తెలియజేయుదమంటే వీనులే లేని వింతరూపమట. ఫలం, పుష్పం, పత్రం, తోయం (నీరు) యేది భక్తితో ఇచ్చినా నాకు నైవేద్యముగా స్వీకరిస్తానని ఆ స్వామియే అన్నాడు. నిజమే, కానీ నోరే లేని వాడు దేన్ని తింటాడు? దేన్ని త్రాగుతాడు చెప్పండి?

అంతా తానే దైవమట (తానే సర్వోత్తముడైన దైవమట). తనకు యే కోరికా లేనందున యజ్ఞము చేయవలసిన అవసరం లేకపోయినా తనను ఇతరులు అనుకరిస్తారు కాబట్టి విశ్వశాంతికి తానూ యజ్ఞము చేస్తాడట. సంతతము (యెల్లప్పుడు) తాను సర్వస్వతంత్రుడట. కాని జపముల నాచరించి వరములను స్వీకరించునట (శ్రీరామునిగా యెన్నో యాగాలూ వ్రతాలూ జపములూ చేశాడు కదా!) చింతింప (యోచించిన) తానే యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడట. కాని మోక్షమనేది భావనయే కానీ వరము కాదట. పంతపు శ్రీవేంకటేశ్వరా! (పట్టుదలగల శ్రీనివాసా!) ఇవియన్నీ నీవు పచారించే (నడపునట్టి) మాయలు (మాయయేనట). అది తెలియగ మాకు సాధ్యమా తండ్రీ!

సంపుటి: 2 కీర్తన : ఎంచి చూడరో ఘనులార యిందీవరాక్షుఁడు రక్షకుఁడు
సంఖ్య : 235 పుట : 157 రాగం: దేసాక్షి

## దేసాక్షి

**25 ఎంచి చూడరో ఘనులార యిందీవరాక్షుఁడు రక్షకుఁడు**
**సంచితముగ నితనిశరణంబే సర్వఫలప్రద మిందరికి ॥ పల్లవి॥**

**హరిఁ గొలువని కొలువులు మఱి యడవిఁగాసిన వెన్నెలలు**
**గరిమల నచ్చుతు విననికథలు భువి గజస్నానములు**
**పరమాత్మునికిఁ గానితపంబులు పాతాళములనిధానములు**
**మురుగురునికిఁగానిపూవులపూజలు మగఁడులేనిసింగారములు ॥ఎంచి॥**

**వైకుంఠుని నుతియించనివినుతులు వననిధిఁ గురిసినవానలు**
**ఆకమలోదరుఁ గోరనికోరికె లందనిమానిఫలంబులు**
**శ్రీకాంతునిపైఁ జేయనిభక్తులు చెంబుమీఁదికనకపుఁబూఁత**
**దాకొని విష్ణుని తెలియనితెలువులు తగ నేటినడిమిపైరులు ॥ఎంచి॥**

**వావిరిఁ గేశవునొల్లనిబదుకులు వరతఁగలపుచింతపండు**
**గోవిందుని కటు మొక్కనిమొక్కులు గోడలేనిపెనుచిత్రములు**
**భావించి మాధవుపైలేనితలఁపులు పలుమేఘములవికారములు**
**శ్రీవేంకటపతికరుణ గలిగితే జీవుల కివియే వినోదములు ॥ఎంచి॥235**

**అవతారిక:**

అన్నమాచార్యులవారి కీర్తనలు వివరిస్తున్న నేను వృత్తిరీత్యా ఇంజినీరును. నా తెలుగు పాండిత్యం 12వ తరగతి తెలుగు మీడియం కుఱ్ఱవాడికుండే పాటిదే. నిఘంటువుల్లో కూడా కనబడని అచ్చతెలుగుమాటలు వాడిన పురాతన జానపద తెలుగు మాటలకు నాకు అర్థం కనబడదు కానీ స్ఫురిస్తుంది. నా లోపలినుంచి యెవరో చెబుతుంటారు. బహుశా ఇది అయుంటుంది అని నాకు "తోస్తుంటుంది". ఎవరో చెబుతుంటారు. లేదా నాకే అనిపిస్తుంటుంది. ఉదాహరణకు ఈ కీర్తనలోని "వావిరి గేశవు నొల్లనిబదుకులు వరతగలపు చింతపండు" అనే వాక్యానికి అర్థం యేమిటి?





ఎంత ఆలోచించినా నాకు లభ్యమైన ఏ నిఘంటువు వెదకినా అర్థం దొరకలేదు. "లావొక్కింతయులేదు ఏడుకొండలవాడా!" అని కళ్ళు మూసుకున్నాను. నాకు చటుక్కున స్ఫురించింది. కేశవుని అంగీకరించని బ్రతుకులు బాగా తెగులుపట్టి చెడిపోయిన చింతపండు వంటివి అన్నమాట. ఈ స్ఫురణనిచ్చిన వాడెవరు? నేనా? కాదు నేను అంత పండితుణ్ణి కాదు. దీనికి కారకులు ఇద్దరే అని నా నమ్మకం. ఒకరు అన్నమాచార్యులవారు. ఇంకొకరు వేంకటేశుడు. ఏది ఏమయినా నావంటి అతి సామాన్యుని చేత ఇంత చేయిస్తున్న ఆ ఇందీవరాక్షుని శరణమే కారణమని స్ఫురించి తండ్రీ! శ్రీహరీ! ధన్యుడనయ్యా! అనుకొన్నాను. ఇంకా ధైర్యంగా ఆ పురుషోత్తముని వెంట పరుగు మొదలుబెట్టాను. ఇకపోతే ఈ కీర్తనలో తాళ్ళపాక పదకవితాపితామహుడు వాడిన ఉపమానములు అనుపమానములు నభూతో నభవిష్యతి అని కీర్తించదగిన కవితాఝురి. ఆనందం అంచులు చూడండి.

**భావ వివరణ:**

ఓ ఘనులారా! ఈ సంగతిని మీరు యెంచి చూడరో (చూడండి). ఇందీవరాక్షుడు (కమలములవంటి కన్నులుగల శ్రీహరి) మాత్రమే మన రక్షకుడు. ఇందరికీ (ఈ జీవులందరికి) ఇతని శరణాగతియే సంచితముగ (కూడబెట్టినదానివలె) సర్వఫలప్రదము (అన్ని సత్ఫలితములను ఇచ్చును).

శ్రీహరిని కొలువని (ఆరాధించని) కొలువులు (పదవులు), మఱి (అటుపై) అడవిలో కాసిన వెన్నెలవలె నిరుపయోగమైనవి. ఎవ్వరికీ ఆనందము నొసగనివి. గరిమల (మహిమాన్వితడైన) అచ్చుతుని కథలను విననివాడు ఎన్ని పురాణాలు చదివినా యేమి లాభము? అది "గజ స్నానము" వలె నిరుపయోగమైనది. ఏనుగు చక్కగా స్నానం చేసి కొలను బయటకు వచ్చి తొండంతో మట్టిని పీల్చుకొని తిరిగి తన దేహముపైన ఆ మట్టిని చిమ్ముకొంటుంది. దాని స్నానం వలన యేమి వుపయోగముంటుంది? పరమాత్ముడైన శ్రీమన్నారాయణుని కొరకు తపములు చేయక అన్యదేవతలకై చేయు తపములు పాతాళముల నిధానములు (పాతాళ లోకము సముద్రముల అడుగున వుంటుంది. అక్కడికి వెళ్ళేదెవరు? అక్కడ ఎంత ఐశ్వర్యము వున్నా

భూమిపైకి తేగలిగినవాడెవరు? కనుక అది కేవలము నామ మాత్రమే). మరుగురునికి (మన్మథుని తండ్రియైన శ్రీహరికి) చెందని పుష్పార్చనలు, మగడులేని సింగారములు. ఒక స్త్రీ యెంత పూలతో అలంకరించుకొన్నా ఆమె భర్త దేశాంతరమున వుంటే ఆ పుష్పాలంకరణ వ్యర్థమే కదా!

ఓ ప్రజలారా! మనం నుతించవలసింది కేవలం వైకుంఠునే (విష్ణుమూర్తినే) అందుకు విరుద్ధముగా స్వప్రయోజనం కోసం, వారినీ వీరినీ కీర్తిస్తుంటే అవి వననిధిగురిసిన వానలు వంటివి (సముద్రముపై కురిసిన వానవలె నిష్ప్రయోజనమైనది. వాన పొలములో కురిస్తే పంటలకు ప్రయోజనము గానీ... అక్కడెక్కడనో కురిస్తే లాభమేమి?) ఏదన్నా కోరికవుంటే కమలోదరుడు (పద్మనాభుడు) అయిన శ్రీహరిని కోరాలి. అట్లుగాక అన్యులను కోరికలు కోరితే అది అందని మామిడిపండ్లకు ఆశించడంవలె నిరుపయోగమైన నిరీక్షణ. ఏదన్నా భక్తితో కూడిన కార్యక్రమముంటే అది శ్రీకాంతుని కోసం చేయాలి. అందుకు విరుద్ధమైతే అది నీళ్ళుతాగే చెంబు మీద బంగారపు పూత (గోల్డ్‌ప్లేటింగ్) చేయించడం వంటిది. మహా అయితే ఒక నెలపాటు వుండే ఆ పూత వలన ఏమి లాభం వుంటుంది? దాకొని (సమీపించి) విష్ణుని తెలుపని తెలుపులు (బోధనలు) తగన్ (తగినట్లు) పరిశీలిస్తే, అవి ఏటిపై వేసిన పైరులు (ఏటిమీద విత్తిన విత్తనాలు నిష్ప్రయోజనమే కదా!)

ఓజనులారా! వావిరి (ఉత్కృష్టుడైన) కేశవుని వొల్లని (నమ్మని) బ్రతుకులన్నీ "వరతగలపు చింతపండు" (బాగా తెగులు పట్టి చెడిపోయిన చింతపండు వంటిది). అది నిష్ప్రయోజనము. అటు (ఆమీదట) గోవిందునికి మ్రొక్కని మొక్కుబడులన్నీ గోడకు తగిలించని చిత్రపటములు. వాటిని చూచేదెవరు మెచ్చేదెవరు? మాధవుని భావించని తలపులు (ఆలోచనలు) ఆకాశంలోని అర్థం పర్థంలేని మేఘాకృతులు. క్షణక్షణం మారిపోయే ఆ మేఘాకృతులు నిష్ప్రయోజనములే కదా! అయితే... శ్రీవేంకటేశ్వరుని కరుణ కలిగిందంటే ఆ జీవులకు పైజెప్పినవన్నీ సత్ఫలితములిచ్చే వైభవములే అవుతాయి.





సంపుటి: 2 కీర్తన : ఏకాత్మవాదులాల యిందు కేది వుత్తరము
సంఖ్య : 253 పుట : 169 రాగం: శంకరాభరణం

**శంకరాభరణం**

**26 ఏకాత్మవాదులాల యిందు కేది వుత్తరము**
**మీకు లోకవిరోధ మేమిటఁ బాసీ నయ్యలాల ॥ పల్లవి॥**

**పాప మొక్కడు సేసితే పాపులే యిందరుఁ గావలదా**
**యేపున వొకరిపుణ్య మిందరికి రావలదా**
**కోపించి యొక్కఁ డసురైతే కోరి యిందరుఁ గావలదా**
**చూప దేవుఁడొక్కఁడైతే సురలిందరుఁ గావలదా ॥ఏకా॥**

**వొకఁ డపవిత్రుఁడైతే నొగి నిందరుఁ గావలదా**
**నొకఁడు శుచై వుండితే వోడ కిందరుఁ గావలదా**
**వొకనిరతిసుఖ మంటి యిందరును వొనరఁ బొందవలదా**
**వొకని దు:ఖ మందరు వూరఁ బంచుకోవలదా ॥ఏకా॥**

**ఆకడక నొకఁడు ముక్తుఁడయితే నందరునుఁ గావలదా**
**దీకొని యొకఁడు బంధుఁ (బుద్ధ) డయితే యిందరుఁ గావలదా**
**చేకొని శ్రీవేంకటేశుఁ జేరి దాసులయి యుండేటి -**
**లోకపుమునులనుఁ దెలుసుకోవలదా ॥ఏకా॥253**

**అవతారిక:**

అద్వైత బ్రాహ్మణుడైన అన్నమాచార్యులవారు విశిష్టాద్వైతాన్ని చేపట్టి ఆచార్యుడై అద్వైతాన్ని ఖండిస్తూనే తాను నమ్మిన సిద్ధాంతానికి కట్టువడి యెన్నో కీర్తనలను చెప్పారు. ఈ కీర్తనలో కూడా ఆయన ఏకాత్మవాదాన్ని ఖండిస్తున్నారు. ఇన్ని గుణదోషాలుగల ఈ జీవాత్మలు యేదోషమూలేని పరమాత్మ ఒక్కటే ఎలా అవుతాయి? నక్కయెక్కడ? నాకలోకము (స్వర్గము) యెక్కడ? అంటున్నారు ఆచార్యులవారు. పైగా మీరు లోకవిరోధులు ఆ గుణం మీరు పొమ్మన్నా పోతుందా? ఈ కీర్తనలో నా మాటలకి జవాబు చెప్పండయ్యా! అందరూ ఒకే ఆత్మ స్వరూపులైతే ఒకడు పవిత్రుడెందుకవుతున్నాడు? ఇంకొకడు ఆటవికుడెందుకవుతున్నాడు. ఎవరి ఆత్మ సంస్కారం వారిదేనని స్పష్టమవుతున్నది కదా! మరి ఆత్మ స్వరూపం ఒక్కటే

అనటంలో అర్థమేముంది? భగవంతుని దాసులైనవారికీ దురహంకారులకీ ఒకే ఆత్మ విచక్షణ వుంటుందంటే అది అసంబద్ధమే.

**భావ వివరణ:**

ఓ ఏకాత్మవాదులారా! (ఉన్నది ఒక్కటే ఆత్మ స్వరూపమని వాదించు తార్కికులారా!) ఇందుకేది వుత్తరము (నా వాదనను ఖండించగా తగిన సమాధానము మీవద్ద వున్నదా?)

అయ్యలారా! మీకు లోక విరోధము (లోకులు అన్నదానిని కాదనే నైజము) యేమిట బాసీను (యెందుకుపోతుంది?) మీ ఆలోచనా విధానమే తప్పు అని నాకు అనిపించుచున్నది. అయ్యలారా! అందరి ఆత్మా ఒక్కటే అయితే... ఒక్కడు పాపము చేస్తే ఇందరూ (ఈ జీవులందరు) పాపులేగావలదా (పాపాత్ములే కావద్దా?) ఏపున (అతిశయంగా) ఒక్కడు పుణ్యము చేసిన ఇందరూ ఆ పుణ్యమును పొందవలెను కదా! అట్లు జరగుట లేదేమి? కోపించిన ఒకడు అసురుడై దుష్కార్యములను చేస్తే (హిరణ్యకశిపుడి వంటి వారు) ఇందరూ కోరి అసురులే అయిపోవాలి గదా! సరే పోనీ దేవుడు ఒక్కడే అనుకొందాం. అటువంటప్పుడు ఇంద్రుడు, శివుడు, గణపతి, కార్తికేయుడు వంటి ముక్కోటి దేవతలెందుకు? అందరూ ఒకే పరమాత్మ అనుకొంటే సరిపోదా?

ఒకడు పవిత్రుడైన ధర్మబోధకుడైన ఆచార్యుడైతే అందరూ ఆచార్యులేకావలెను కదా! శుచిగా వుండేవారేకావాలి కదా! పోనీ ఒకడు అపవిత్రుడై ఆచారమేలేని దురాత్ముడైతే ఇందరూ అపవిత్రులే కావాలి కదా! ఒకరి రతి సుఖమింకొకరికి దక్కితే అందరూ భోగులే అయిపోయి స్త్రీ లోలులయ్యేవారు కదా! ఒకని ఇంట మృత్యువు సంభవించి దు:ఖముతో తత్తరజెందుతుంటే వూరివారందరూ తత్తరజెందవలెను కదా! అట్లా పంచుకోవటం సాధ్యమా?

ఇక పోతే ఇంకొక గొప్ప వుదాహరణను చూడండి. అకడ (అక్కడ) ఒకడు ముక్తుడైతే (మోక్షమును) పొందగలిగిన అర్హత సంపాదిస్తే... అందరూ ముక్తులే అయిపోవాలి కదా! దీకొని (దీనుడై) ఒకడు సంసారతాపత్రయముతో బద్ధుడైతే (కట్టివేయబడినవాడైతే), ఇంతమందీ అటువంటి వారే కావాలి కదా! ఒక సర్వసంగపరిత్యాగి ఎలా ఆవిర్భవిస్తాడు? మరి, ఈ లోకంలో యేదో బ్రతికేస్తున్న వారే అధికంగా వున్నారు. శ్రీవేంకటేశ్వరుని దాసులై మునులవలె జీవించేవారు యెందుకుంటారు? ఇంత చిన్న వివేచన తెలుసుకోవద్దా? కాబట్టి పరమాత్మ సాయిజ్యం పొందేదాకా ఏ ఆత్మా విశిష్టాత్మకాదు... కాబోదు... కాజాలదు.





సంపుటి: 2 కీర్తన : ఈతcడే యీతcడే సుండి యెంత యెంచిచూచినా
సంఖ్య : 371 పుట : 249 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

27 ఈతcడే యీతcడే సుండి యెంత యెంచి చూచినా
చేతనే వరాలిచ్చీ శేషాచలేశుcడు ॥ పల్లవి॥

విశ్వరూపపుబ్రహ్మము విరాట్టయినబ్రహ్మము
ఐశ్వర్యస్వరా ట్టాసామ్రాట్టయినబ్రహ్మము
శాశ్వతబ్రహ్మాండాలు శరీరమైన బ్రహ్మము
యీశ్వరుcడై మహారాట్టై యిందరిలో బ్రహ్మము ॥ఈత॥

సూర్యునిలో తేజము సోమునిలో తేజము
శౌర్యపుటనలునిభాస్వత్తేజము
కార్యపుటవతారాలc గనుcగొనేతేజము
వీర్యపుటెజ్జభాగాలవిష్ణునామ తేజము ॥ఈత॥

పరమపురుషమూర్తి ప్రకృతియైనమూర్తి
గరిమతో మహదహంకారమూరితి
ధరc బంచతన్మాత్రలు తత్వము లైనమూరితి
గరుడానంత సేనేశకర్తయైనమూరితి ॥ఈత॥

భాగవతపుదైవము భారతములో దైవము
సాగినపురాణవేదశాస్త్ర దైవము
పోగులైనబ్రహ్మలను బొడ్డునc గన్నదైవము
శ్రీగలిగిభూపతైన శ్రీవేంకటదైవము ॥ఈత॥371

**అవతారిక:**

ఈతడే శేషాచలేశ్వరుడు సుమండీ! ఎంత ఎంచి చూస్తే అంతగా తేటతెల్లమవుతుంది. ఈతడే యెంచుటచేతనే వరాలిచ్చే శ్రీవేంకటేశ్వరుడు.

ఇదేపల్లవికి ఇంకా రెండుమూడు విధాలుగా భావము వివరించవచ్చును. దేనినైనా సమర్థించవచ్చును. అదీ అన్నమాచార్యులవారి వైభవం. విశ్వరూపుడైన విరాట్పురుషునిగా ఈ బ్రహ్మమును భావించగలరా? సూర్యునిలోనున్న దివ్యకాంతి, చంద్రునిలోనున్న చల్లనికాంతి, అగ్నిలోనున్న జ్వలించేకాంతి ఈయనవే. జీవులలో జీవశక్తీ ఈతడే. చక్రవర్తులకు యేలికయైన జగదీశ్వరుడూ ఈయనే. యజ్ఞభాగములందరికీ అందించే యజ్ఞపురుషుడూ ఈ స్వామియే. అంతేకాదు విష్ణువు అని సమస్త దేవతలూ అనునిత్యం కీర్తించేదీ ఈ దేవేంద్రపూజితునే. నిత్యపారాయణ గ్రంథాలయిన భాగవతంలోనే కాక పంచమవేదముగా కీర్తించబడుతున్న మహాభారతంలో కూడా కథానాయకుడు ఈ పురుషోత్తముడే.

**భావ వివరణ:**

ఓ జనులారా! యెంత (ఏవిధముగా) యెంచి చూచినా (భావించినా) చేతనే (తలచుటచేతనే) వరాలిచ్చే (ఈప్సితములను తీర్చే) ఈతడే యీతడే సుండీ (ఇతడు ఇతగాడే సుమండీ). అంటే ఇటువంటి మరెవ్వరూ లేరని భావము.

ఈతడే బ్రహ్మము (పరబ్రహ్మ). విశ్వరూపము ప్రదర్శించిన బ్రహ్మము ఇతడే. విరాట్టు (ఆదిదేవుడు) అయిన బ్రహ్మము ఇతడే. ఐశ్వర్య స్వరాట్టు (బ్రహ్మము) మరెవ్వరో కాదు సామ్రాట్టు (సర్వం సహ చక్రవర్తి) యైన ఈ పరబ్రహ్మే. శాశ్వత బ్రహ్మాండాలు (పదునాలుగు భువనాలు) తన శరీరముగా గలిగిన ఈ బ్రహ్మమే నిజమైన పరబ్రహ్మము. ఈశ్వరుడై (సర్వాధిపతియై) మహారాట్టై (చక్రవర్తియై) ఇందరిలో (ఈ సమస్త జీవులలో) బ్రహ్మము (అంతర్యామి) గా వున్న పరమాత్మ స్వరూపుడు వారి జీవశక్తియూ ఈతడే.

సూర్యునిలోని కనులుమిరుమిట్లు గొలిపే కాంతి, చంద్రునిలోని చల్లని తెల్లని కాంతి కూడా ఈ దేవదేవునివే. శౌర్యపు (మండించు శక్తిగల) అనలుని (అగ్నిదేవుని) భాస్వత్తేజము (జ్వలన తేజము) ఈయనదే. ఈ స్వామి ఆయా





జగత్కళ్యాణ కార్యక్రమముల కొఱకు అనేక అవతారములనెత్తినాడు. వాటిలోని దివ్యతేజము ఈ దేవదేవునిదే. వీర్యపు యజ్ఞభాగాల (ప్రభావముగల గొప్ప యజ్ఞములలో) వారి వారి యజ్ఞభాగములందించు యజ్ఞనారాయణుడు విష్ణుమూర్తి అని ప్రసిధుడైన ఈ తేజోమూర్తియే.

ఓ ప్రజలారా! పరమపురుషుడని కీర్తివహించినదీ మూర్తియే. ప్రకృతి రూపంలో అనునిత్యమూ తన అనంత అద్భుత శక్తి (సెల్‌డికే, సెల్‌గ్రోత్) చూపిస్తున్నది ఈ మూర్తియే. గరిమతో (మహిమతో) మహత్ అహంకారము (మంచి స్వభావముగల అహంకారము) ఈ మూర్తియే. ధర (ప్రపంచములో) పంచతన్మాత్రలు (శబ్ద, రస, స్పర్శ, రూప, గంధములను గ్రహించు శక్తి ఈ మురారిదే) అనగా... పంచేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అందించు శారీరక జ్ఞానము ఏదైతే మన మెదడు ద్వారా అందుకొని గ్రహించి దాచుకొని పునశ్చరణ చేయగలుగుతున్నామో ఆ దివ్య శక్తికూడా ఈ మూర్తియే. ఈయనే లేనినాడు కళ్ళు వున్నా చూడలేవు, వాసన పీల్చినా తెలియదు తినినా రుచి తెలియదు స్పర్శేవుండదు. కోమాలో వున్నాడండీ అంటారు. వాడిది చావుకాదు బ్రతుకూకాదు. ఆ రూపమూ ఆయానే. ఈ భక్తులంతా శేషశయనుడని, గరుడ గమనుడని అనంత పద్మనాభుడని కీర్తింపబడుచున్న అగమ్యగోచరుడునూ ఈ  మూర్తియే.

ఓ ప్రజలారా! భాగవతములో అనేక పురాణ కథానాయకుడు, భారతములో శ్రీకృష్ణపరమాత్మ ఈ దేవదేవుడే. పదునెనిమిది పురాణములలోని పురాణ పురుషుడు ఈతడే. వేదము కీర్తించునది, శాస్త్రములు చర్చించునది ఈతనినే. ఈ పరమాత్మ స్వరూపుని బొడ్డులో నుంచి తొమ్మిది మంది బ్రహ్మలు (సృష్టికర్తలు) పుట్టారట. వారే నలువ (చతుర్ముఖ బ్రహ్మ), భగువు, పులస్త్యుడు, అంగిరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వశిష్ఠుడు, మరీచి. వారి నుండే అన్ని జాతులు సృష్టిచేయబడి జన్మించినవి. అందుచే సర్వులను కన్నదైవము ఎవరయ్యా అంటే శ్రీకలిగిన భూపతియైన ఆ శ్రీవేంకటపతియే.

సంపుటి: 2 కీర్తన : ఇంతయు నీమాయామయ మేగతిఁ దెలియఁగవచ్చును
సంఖ్య : 133 పుట : 89 రాగం: శ్రీరాగం

**శ్రీరాగం**

**28 ఇంతయు నీమాయామయ మేగతిఁ దెలియఁగవచ్చును**
**దొంతిఁబెట్టినకుండలు తొడరినజన్నములు ॥ పల్లవి॥**

**కలలోపలిసంభోగము ఘనమగుసంపద లిన్నియు**
**వలలోపలినిడిపరువులు వన్నెలవిభవములు**
**తలఁపున గలిగియు నిందునే తగులకపోదెవ్వరికిని**
**తెలిసినఁ దెలియదు యిదివో దేవరహస్యంబు ॥ఇంత॥**

**అద్దములోపలినీడలు అందరి దేహపురూపులు**
**చద్దికివండినవంటలు జంటఁగర్మములు**
**పొద్దొకవిధమయి తోఁచును భువి నజ్ఞానాంబుధిలో-**
**నద్దిన దిది దెలియఁగరా దంబుదముల మెఱుఁగు ॥ఇంత॥**

**మనసునఁ దాగినపాలివి మదిఁగలకోరిక లిన్నియు**
**యినుమున నిగిరిననీళ్లు యిల నాహారములు**
**పనివడి శ్రీవేంకటగిరిపతి నీదాసు లివిన్నియు**
**కని మని నిడిచిన మనుజులకాయపుమర్మములు ॥ఇంత॥133**

**అవతారిక:**

ఈ కీర్తన బహూక్లిష్టమైనదని నా అభిప్రాయము. ఆ దేవదేవుని మాయామయమైన దేహతత్త్వము అంతతేలికగా అర్థం కాదు. యజ్ఞము చేసేటప్పుడు దొంతరగ పేర్చిన కుండలలో అనేకరకములైన యాగ సామాగ్రినుంచుతారు. దేంట్లో ఏముందో మూత తెరిచి చూస్తేనే కానీ





తెలియదు కదా! అట్లాగే అనుభవాలనుపొంది, కొన్నింటిని మూటకట్టుకొని వెంటతీసికొనివెళ్ళే జీవుడు దానిని యేదో ఒక జన్మలో అనుభవిస్తాడు. ఈ అనుభవం కూడా ఒక మాయవలె యెందుకు అనుభవిస్తున్నామో ఎంతకాలం అనుభవిస్తామో చివరికి ఏమవుతుందో తెలియదు. చిత్తు కాగితాలేరుకొనేవాడు, కొన్ని లక్షలమంది భవిష్యత్తును నిర్దేశించగల నాయకుడవుతున్నాడు. ఉన్నట్లుండి ఒక ప్రమాదంలో ప్రాణాలే పోగొట్టుకొంటున్నాడు. పెద్ద యజ్ఞం చేసి ఆయువు పెరగాలని హోమం చేసేవాడు యాగశాల తగలబడి శవం అవుతున్నాడు. మరి ఆయువు పెరగలేదేం? ఏమిటి నీ మాయ? ఏది నిజం? ఏది అబద్ధం? కొసమెరుపు యేమంటే అన్నమాచార్యులవారు, అనుభవాల సంకలనమే జీవితమైనప్పటికీ శ్రీవేంకటేశ్వరుని శరణాగతి చిట్టచివరికి రక్షిస్తుందంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఇంతయూ నీమాయామయమే (ఈ జగమంతా నీ మాయతో నిండినదే). ఏగతి దెలియగవచ్చును (మేము దానిని ఏవిధముగా నేర్చెదము?) తొడరిన జన్నములు (చేసిన క్రతువులలో) ఒకదానిపై ఇంకొకటి దొంతిబెట్టిన కుండలవలె దేంట్లో యేముంటుందో తెలియని వగుటచే ఏదిముందు అనుభవిస్తామో తెలియదు. (అనుభవించటమే మనపని).

ఒకనికి సంభోగించినట్లు కలవచ్చిందంటే ఆ అనుభవము భావజనితమే కాని, అనుభవేక వేద్యము కాదుకదా! కలలో ఒకనికి ఘనమైన సంపద కలిగితే సంపన్నుడై పోతాడా? కలలో రకరకములైన

వైభవములు కలిగినా ప్రయోజనమేముంటుంది? వలలో మెత్తని పరుపులు పరిస్తే అందులో పడుకోగలరా? అయితే పైవన్నీ తలపులో భావాలే అయినప్పటికీ దాని అనుభూతిని సుఖదు:ఖములద్వారా అనుభవించని వాడెవ్వడూ వుండడు. అవునా? ఇదెట్లు సాధ్యమో యెవ్వరికీ తెలియని దేవరహస్యము. తెలిసినట్లుంటుంది, కానీ యేమీ తెలియదు.

ఒక జన్మలో మనం పొందే దేహపురూపవైభవము అద్దములోని ప్రతిబింబాలవలె సదామారిపోతూనే వుంటాయి. ఇక మన జంట కర్మంబులు (సంచిత కర్మ మరియు ప్రారబ్ధకర్మ) చద్దిమూట కట్టుకొని పోయేవాడు వండించుకొన్న వంటల వలె యెప్పుడు తింటామో... తీరా తినేవేళకు ఆ వంటకు రుచీపచీ వుండని పరిస్థితి. అయినా తినక తప్పదు కదా! అజ్ఞాన సాగరంలో తలమునకలయ్యేవాడికి యే పొద్దు యెలావుంటుందో తోచదు. అంబుదముల మెఱుగు (ఆకాశంలోని మేఘాలలోని మెరుపులకు ఏ ఆకారముంటుందో ఎవరికి తెలుస్తుంది? ఇది అద్దినది (ఏదోవిధముగా సంభవించేది) తెలియగరాదు. (దీనివిధానము తెలియాలంటే సాధ్యము కాదు).

మనస్సులో పుట్టిన ఈ కోరికలు మనస్సులోనే దాగిన మర్మములు. అవి సూర్యకాంతిలో ఇగిరిపోయిన నీళ్ళవంటివి. మనం తినే ఆహారం యేపూట దాపూటే కదా! దాచివుంచుకొనే వీలులేదు. అట్లే కోర్కెల వైక్లబ్యముననుభవించక తప్పదు. అయితే దీనిలో ఒక సుగుణమున్నది. శ్రీవేంకటేశుని దాసులకు మాత్రము ఈపై జెప్పినవన్నియు వర్తించవు. వారు మనుష్య శరీరాలు దాల్చినా వదిలివేసినా సంగత్వమునొల్లని ముక్తులు.





సంపుటి: 2 కీర్తన : వెలుపల మరువక లోపల లేదు
వెలుపలగలిగిన లోపల మఱచు

సంఖ్య : 137 పుట : 92 రాగం: రామక్రియ

### రామక్రియ

**29** వెలుపల మఱవక లోపల లేదు వెలుపలఁ గలిగిన లోపల మఱచు
చలమున నిదియే ఘడియ ఘడియకును సాధించినసుఖమటుదోఁచు ॥పల్లవి॥

వెలుపలి వెలుఁగే చూడఁగ లోపలి వెడచీఁకటి గాననియట్లు
అలరి ప్రపంచజ్ఞానికిఁ దనలో నాత్మజ్ఞానము గనరాదు
పలుమరు చీఁకటి చూడఁగఁ జూడఁగ బయలే వెలుఁగై తోఁచినయట్లు
అలయక తనలోచూపు చూచినను అంతరంగమున హరిఁ గనును ॥వెలు॥

జాగరమే కడుఁ జేయఁగఁ జేయఁగ సతతము నిద్దుర రానట్లు
చేగలనింద్రియములలోఁ దిరిగినచిత్తవికారము లయపడదు
యీగతి నిద్దుర వోఁగాఁ బోఁగా నిలలో సుద్దులు యెఱఁగనియట్టు
యోగపుటేకాంతంబును దనమన సొగి మరవఁగ మరవఁగ హరిఁగనును
॥వెలు॥

దేహపుటాకాశపునిట్టూర్పులు బహిరపుబయట నడఁగినయట్లు
ఆహా జీవునిజననమరణములు అందే పొడముచు నం దడఁగు
వూహల శ్రీవేంకటపతివాయువు కొగి నాకాశము వొక్క సూత్రము
ఆహా ప్రాణాపానవాయువులు ఆతుమ నిలుపుటే
హరిఁ గనుట ॥వెలు॥137

**అవతారిక:**

అంత:కరణము పరిశుద్ధంగా వుంటే బాహ్యముగా శుచిగా వుండే గొప్ప ప్రయత్నం చేయవలసిన అవసరం లేదు. బాహ్యముగా గొప్ప పరిశుద్ధుడను అనేవాడు అంత:కరణలో సాధారణ వ్యక్తి అయితే

అతడు భగవంతుని మన్ననకు అనర్హుడు. శౌచము అనగా శుభ్రత. వెలుపల శౌచమును మరువక లోపల శౌచము లేదు. ఒకవేళ వెలుపల శౌచము కలిగిననూ లోపలి శౌచము సంగతినే మరచును. ఇది జీవిలక్షణం. ఘడియ ఘడియకూ ఇదే జరుగుతుంటుంది. కానీ ఆ చలమును (మత్సరమును) నిరోధిస్తే సుఖము తప్పక దొరుకుతుంది. వేళకు నిదురించక జాగరణకు అలవాటు పడిన ఇంద్రియములలోనే తిరిగే మనోవికారములు తమ ప్రతాపము చూపిస్తాయి. అట్లే అతి నిద్రాలోలుడూ ఆత్మజ్ఞాని కాలేడు. యోగ శక్తి ద్వారా బాహ్యపు ప్రపంచమును మరచి మానసిక యేకాంతమునకు అలవాటుపడితేనే శ్రీహరి దర్శనం కలుగుతుంది. ఇదంతా చిలుకపలుకుల్లాగా అనుకొంటుంటే ఏమీ వుపయోగం లేదు. ఆ భావన మనస్సులో స్థిరపడాలి. అదీ అంత తేలిక కాదు. కొసమెరుపేమంటే ఈ చెప్పేది కేవలం బాహ్యజ్ఞానం మాత్రమే.

**భావ వివరణ:**

వెలుపల (బాహ్యముగా శౌచము) మఱువక (వదలిపెట్టక) లోపలలేదు (అంత:కరణము శౌచముగా నుండుట సంభవించదు.) వెలుపల గలిగిన (బాహ్యముగా శౌచమును పాటించువాడు) లోపల (అంత: కరణ యొక్క శౌచమును) మఱచు (వదలివేయును). చలమున (మత్సరమున) ఘడియ ఘడియకు (ప్రతిక్షణమూ) ఇదియే మరువరానిది, నిజమైనది. దీనిని (అంత:శౌచమును) సాధించిన అటు (అటుపిమ్మట) సుఖము దోచు (సుఖము కలుగుతుంది).

వెలుపలి వెలుగే (బయటకు కనుపించే వెలుగు) చూచినచో లోపలి వెడ చీకటి (గృహాంతర్భాగపు చీకటి) కనుపించదు. అదేవిధముగా తానే గొప్ప ప్రపంచజ్ఞానము కలవాడననుకొనే అహంభావికి ఆత్మజ్ఞానం





కనరాదు. చీకటిలో చాలాసేపు గడిపి కనులను చిమ్మచీకటికి అలవాటు చేసినవానికి బయలే (ఆరుబయటి వెలుగే) వెలుగై (సూర్యకాంతివలె) తోచును (కనుపిస్తుంది). అట్లు (అదే విధముగా) అలయక (వెనుదీయక) తనలో చూపుచూచినను (అంతర్ముఖుడై ఆత్మావలోకనం చేసికొంటే) తన అంతరంగంలోనే నెలకొనియున్న శ్రీహరిని దర్శించుట సాధ్యమే. వారే జీవన్ముక్తులు.

జాగరమే కదు జేయగా (యెప్పుడు మెలకువతోనే వుండి) అట్లే చేయగా చేయగా యెప్పటికీ నిద్దురే రానట్లు, చేగల (స్వాధీనము చేసికొనుశక్తిగల) ఇంద్రియాలలో తిరిగే మనోవైకల్యము, లయ పడదు (అంతము కానేకాదు). ఈ విధముగా నిదురించగా నిదురించగ ప్రపంచజ్ఞానముకూడా అలవడదు. ఎందుకంటే మనస్సు యేస్థితికి అలవాటు చేస్తే ఆ స్థితిలోనే వుంటుంది. అట్లే యోగసాధనతో ఏకాంతమునకు అలవాటుపడితే మనస్సున బాహ్య విషయములనన్నీ మరచి హరినే నిలుపగలుగును.

దేహము అనే ఆకాశంలో ఒక నిట్టూర్పు అంకురిస్తే అది బయటకు వెలువడక తప్పదు కదా! అది బయటకు వస్తేనే అడగును (అంతమవుతుంది). ఆహా! జీవుని జననమరణములు కూడా ఉచ్ఛ్వాసతోనే పుట్టి నిస్వాసతో అంతమైపోతాయి. ఊహలలో నిలుపుకోవలసిన శ్రీవేంకటేశ్వరుని యోగసాధనతో తమ ప్రాణాపానవాయువులను నిరోధించి ఆత్మలో నిలుపుకోగలిగితే హరి దర్శనము సాధ్యమవుతుంది.

సంపుటి: 2 కీర్తన : ఇందరిలో నేమెందు బోలుదుము యిందరి బోలినజీవులమే

సంఖ్య : 138 పుట : 93 రాగం: గుజ్జరి

## గుజ్జరి

30 ఇందరిలో నే మెందుఁబోలుదుము యిందరిఁ బోలినజీవులమే
కందువ వీరలఁ దలఁచి చిత్తమిది కలఁగెడి దైవము కావఁగదే ॥ పల్లవి॥

యెందరొకో జరాదు:ఖము లేచి యనుభవించేటివారు
యెందరొకో దరిద్రదు:ఖము లెసఁగి యలమటించేటివారు
యెందరొకో బంధనతాడనహీనదెసల నుండెడివారు
యెందరొకో దాసదాస్యవిధి నెడయరాక చెఱ లయినవారు ॥ఇంద॥

యెందరొకో మరణదెసలచే నిల సంయోగవియోగదు:ఖితులు
యెందరొకో జన్మరోగముల నెక్కువభయమందేటివారు
యెందరొకో రాజులచోరులహింసలకు లోనయినవారు
యెందరొకో పొడమినజీవుల కెక్కడ నెక్కడ నేపాటో ॥ఇంద॥

యెందరొకో యీదు:ఖనివృత్తికి యెడసి మిమ్ముఁ గొలిచినవారు
యెందరొకో సంపదలకు లోనై యేతాయాతనఁ బడువారు
యెందరొకో శ్రీవేంకటేశ యిపు డెక్కువ నీశరణము చొచ్చి
యిందును నందును సుఖులై లోకుల నిందరిఁ జూచుచు
నవ్వెడివారు ॥ఇంద॥138

**అవతారిక:**

ఈ ప్రపంచంలో క్రిమికీటకాలవంటి అల్పజీవులను సృష్టించినదా దేవుడే. తిమింగలాలవంటి భారీ జీవులనూ పుట్టించినది ఆ దేవుడే. సప్త ఋషుల వంటి ధన్యజీవులను భూమ్మీదకు తెచ్చిందా పురుషోత్తముడే దుందుభిలాంటి దుష్టరాక్షసులకు జన్మనిచ్చింది ఆ దేవుడే. మరి ఇదంతా





యెందుకు చేస్తున్నాడు? ఒక జీవిని ఇంకొక జీవికి ఆహారంగా యెందుకు పెట్టాడు. మంచితనాన్ని పెంచి చెడుని త్రుంచటమే ఆయన వుద్దేశ్యమైతే ఆయన భక్తులు కూడా బాధలు యెందుకు అనుభవిస్తున్నారు. ఆయన ఆలయంలో దొంగతనాలు చేస్తున్నవారు అంతులేని సిరిసంపదలతో యెందుకు ప్రముఖులుగా కీర్తింపబడుతున్నారు. పడుతూ లేస్తూ రోజూ గుడికి వెళ్ళేవాడు, పాము కాటుకు చచ్చిపోతే గుడిస్థలాన్నే 'కబ్జా' చేసేవాడు గుడి ధర్మాధికారి అవుతాడు. ఇదెక్కడి న్యాయం అని మనబోటి పిచ్చోళ్ళు జుట్టు పీక్కుంటూ వాళ్ళూ దుర్మార్గులవుతున్నారు. ఎందుకు ఇదంతా? అన్నమాచార్యులవారు ఈ అరుదైన కీర్తనలో ఆ తమాషాను వివరిస్తున్నారు. ఎందరో ముసలి బడుగులు దు:ఖిస్తున్నారు, ఎందరో దాస్యం అనుభవిస్తున్నారు. ఎందరో మరణం ద్వారా వియోగం అనుభవిస్తున్నారు, ఎందరో కాలు కిందపెట్టనవసరం లేని శ్రీమంతులున్నారు. ఇంతమందిలోన యేము (మేము) ఏ కోవకి చెందినవాళ్ళమో తెలీటం లేదు. ఈ చెప్పబోయే వాళ్ళలో నేను యెందులో వుంటానో తెలియటం లేదు. వీళ్ళను తలచుకొంటేనే నా మనస్సు కకావికలమై పోతున్నది అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దైవమా! (దేవదేవా!) ఇందరిలోన (నేను ఈ కీర్తనలో చెప్పబోయే ఇంతమందిలో) యేము (మేము) యెందుబోలుదుము (యెవ్వరిని పోలివుంటాము) యెందరిబోలిన (యెవ్వరివలెనున్నా) మేమూ జీవులమే కదా! వీరల (ఈ నిర్భాగ్యులను) కందువ దలచి (ప్రత్యేకముగా తలచుకొని) చిత్తమిది (ఈ నామనస్సు) కలగెడి (కలత చెందుతున్నది). ఏమి చెయ్యాలో పాలుపోవటం లేదు. ఏచి (అతిశయముగా) జరాదు:ఖములను (ముసలితనంవల్ల అనేక కష్టములను) అనుభవిస్తున్నవారు యెందరొకో (యెంత మందివున్నారో)

దరిద్రదు:ఖములెసగి (పొంది) అలమటించేవారు (అవస్థలు పడుతున్నవారు) యెందరొకో? బంధించబడి, తాడన (దెబ్బలు తింటూ) హీనమైన బ్రతుకులు గడుపుతున్నవారు యెందరొకో? దాసులై దాస్యమనుభవిస్తూ యెడయరాక (ఇంకొక దారిలేక) చెఱసాలవంటి బ్రతుకు గడుపుతున్న వారు యెందరొకో? ఎందుకిలా జరుగుతున్నది? వాళ్ళు చేసిన తప్పేమిటి?

ఇల (ఈ ప్రపంచంలో) మరణదెసలచే (చావుమూలంగా) సంయోగ వియోగములను పొందుతున్నారు, (కొంతమంది కలుస్తున్నారు... కొంతమంది విడిపోతున్నారు). ఇట్లాంటివారు యెందరొకో? జన్మరోగములతో (పుట్టుకతోనే వచ్చిన వ్యాధులచే పీడించబడుతూ) గొప్పభయపీడితులై యెప్పుడు చస్తారో తెలియని నిర్భాగ్యులు యెందరొకో? రాజుల (అధికారుల) చోరుల (దోపిడీదారుల) హింసలకు లోనై యేడుస్తున్నవారు యెందరొకో? పొడమిన జీవులకు (పుట్టుక కలిగిన ప్రాణులందరికీ) యెక్కడెక్కడ యేపాటో (యేదిప్రాప్తమో) తెలిసేది యెందరొకో? అయినప్పటికీ ఈ దు:ఖనివారణకు, యెడసి (వదలక) మిమ్ము కొలిచేవారు యెందరొకో (యెంతమందివుంటారు స్వామీ! అత్యల్పులే సంఖ్యలో)

సంపదల గర్వపీడితులై యేతయాతన (గర్వాంధులై మదోన్మత్తులై) దైవమును తలచేవారు యెందరొకో? ఓ శ్రీవేంకటేశ్వరా! ఇపుడు యెక్కువగా నీ శరణాగతులై నిన్నే నమ్ముకొనేవారెందరొకో? అటువంటి నీ ఆశ్రితులంతా ఇందున (ఈ భూమ్మీదా) అందునా (చచ్చాక ఆ స్వర్గంలో కూడా) సుఖులై (హాయిగా వుంటూ) లోకులనందరి జూచుచు (పైన చెప్పిన తిప్పలన్నీ పడుతున్న పిచ్చోళ్ళను చూచి) నవ్వెడివారు (నవ్వుకొంటుంటారు).





సంపుటి: 5 కీర్తన : చల్లనైకాయగదో చందమామా నీ
సంఖ్య : 228 పుట : 156 రాగం: సామంతం

## సామంతం

31 చల్లనై కాయఁగదొ చందమామా నీ
వెల్ల(ల్లి?) గాఁ దిరువేంకటేశునెదుర
మొల్లమిగ నమృతంపు వెల్లి గొల్పుచు లోక-
మెల్ల నినుఁ గొనియాడఁగాను ॥పల్లవి॥

పొందైన హితులు నాప్తులు రసికులును గవులు
నందమగు నునుమాటలాడ నేర్చిన ఘనులు
చిందులకు నాడేటి సీమంతినీ మణులు
చెలఁగి యిరుగడఁ గొలువఁగాను

వందిమాగధులు గైవారింపఁ దనదివ్య-
మందిరోపాంత ఘనమార్గమునఁ గోనేటి-
ముందటను మంద మందప్రయాణములతో-
నిందిరాపతి మెరయఁగాను ॥చల్లనై॥

ఏకాంత సుఖగోష్ఠినింపొంద మానవా-
నీకంబులెడఁ గలసి నిలిచి సేవింపఁ గాం-
తాకదంబముల (లు?) హస్తముల కంకణఝణ-
త్కారములు నిగుడఁ జామరములిడఁగ
జోకైన మణిగణస్తోమాంకితంబులై
సొంపొందు నాలవట్టములు గరములఁ దాల్చి
యేకాంతులిరువంక నెదిరి కొలువఁగ సకల-
లోకేశ్వరుఁడు మెరయఁగాను ॥చల్లనై॥

బంగారుప్రతిమలకు ప్రతులైన దివిజలో-
కాంగనలు ఘనవిమానాంగణంబుననుండి

**చెంగలువలును మంచిసేవంతిరేకులును**
**చెలఁగి యిరుగడఁ జల్లఁగాను**
**మంగళాత్మకములగు మహితవేదాంత వే-**
**దాంగవిద్యలకు ప్రియమంది చేకొనుచుఁ దిరు-**
**వేంకళేశ్వరుఁడు గడు వేడుకలతోడఁ దిరు-**
**వీథులను విహరించఁగాను ॥చల్లనై॥ 228**

**అవతారిక:**

చిన్నపిల్లలకి, వలపుజంటలకి ప్రీతిపాత్రుడైన మామ చందమామపై చక్కటి కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. జాజర పాటలను జోలపాటలను, విరహగీతాలను, భజనలను, మేలుకొలుపులను..., ఒకటేమిటి? ఏ ప్రక్రియ చేసినా ఎవరిపై కీర్తన చెప్పినా చివరికి ఆ కీర్తన నివేదన మాత్రం శ్రీవేంకటేశ్వరునికే దక్కుతుంది. రసికులకు కవులకు, ప్రేమజంటలకు ఆరాధ్య దైవమైన చందమామ అమృతము వెదజల్లేది ఆ శ్రీవేంకటేశుని కోనేటి ఒడ్డున చేరిన అశేష భక్తులు తరించి పులకించి పోవుటకేనట. అన్నమయ్య ప్రత్యేకత యేమంటే మనబోంట్ల కన్నులకు కానరాని దేవాంగనలు, దివ్యవిమానాలూ, అప్సరసలు చల్లె చేమంతులూ చెంగలువలు ఆయన మనో నేత్రాలకు కనిపిస్తాయి కాని మనబోటి మానవమాత్రులకు కనబడవు. మనకు ఆయన సేవించే వనితామణులు మాత్రమే కనిపిస్తారు.

**భావ వివరణ:**

ఓ చందమామా! నీవు చలనై (చల్లనివాడవై) కాయగదో వెన్నెలను కాయవయ్యా! వెల్లిగా (ధారగా) ఈ తిరువేంకటేశ్వరుని యెదుట, నీవు కాయగదో! మొల్లమిగా (అధికముగా) అమృతంపుధారలు వెల్లిగొల్పుచు (కురిపించుచూ) లోకమంతా నిన్ను చల్లని రేరాజువని కీర్తిస్తుంటే కాయగదో!

నీకు పొందిక గల హితులు ఆప్తులు అనేకులున్నారు. వారంతా రసికులు, కవులు, అందమైన మెత్తని కమ్మని మాటలు చెప్పడం నేర్చిన ఘనులు. కాలి





గజ్జెలు ఘల్లుఘల్లుమన చిందేసి ఆడేటి సీమంతినీ మణులు (ముద్దుగుమ్మలు) నీకునూ ఆరాధ్యదైవమైన శ్రీరమణుని ఇరువైపులా బారుగా నిలుచుండి కీర్తిస్తుండగా కాయగదో! బహుపరాక్ అని కీర్తించు వందిమాగదులు పనిలోపనిగా నిన్నునూ గైవారింపుగా (పొగుడుతుండగా) ఆ వేంకటరమణుని దివ్య మందిర ప్రాంగణమున, రాచమార్గములలోనూ, స్వామి కోనేటిముందటను మందముగా (మెల్లమెల్లగా) ప్రయాణము చేయుచూ నీ స్నిగ్ధ కాంతిలో వేంకటరమణుడు మెరిసిపోతుంటే చల్లగా రావయ్యా! చందమామా!

శ్రీవేంకటేశ్వరుడు ఏకాంతసేవకు సిద్ధమయ్యాడు. ఆయన సుఖగోష్టికై మానవుల వరుసలు దీరి నిలిచి సేవిస్తున్నారు. కాంతాకదంబములు (వివిధ వయో పరిమితిగల వనితలు... అంటే... బాలికల నుంచి వృద్ధ స్త్రీలవరకు గల ఆడువారి గుంపులు) చేతికంకణములు ఝణఝణమనుచుండగా చామరములతో వీయుచున్నారు. ఆలవట్టములతో (వస్త్రముతో చేసిన గుండ్రటి విసనకర్ర) నున్న చేతులకు మణులు పొదిగిన అందమైన సొంపైన ఆభరణముల సమూహముతో ఏకాంతసేవకై ఇరువైపులా నిలుచున్నారు. వీరందరి సేవలో సకలలోకేశ్వరుడైన శ్రీవేంకటేశుడు మెరయగాను (శోభిల్లుచున్నాడు).

బంగారుబొమ్మలవలె మెరిసి పోతున్న ప్రతులైన (సాటిలేని) దేవకాంతలు ఆకాశమార్గమున వచ్చి తమ విమానముల వరుసలలో నుంచి దిగి, చెంగలువలను (ఎఱ్ఱని కలువపూలను, మంచి చేమంతి పూవులను ఇరువైపులా విస్తృతముగా చల్లుతున్నారు. మంగళకరమైన వేదాంత వేదాంగ విద్యలలో ఆరితేరినవారు వేదఘోషతో నుతిస్తుంటే ప్రియమంది చేకొనుచు (ఆప్యాయంగా వాటిని స్వీకరించుచూ) శ్రీవేంకటేశ్వరుడు గొప్ప వేడుకగా తిరుమల మాడవీధులలో వూరేగుచున్నాడు. ఈ మహోత్సవం చూస్తూ తన బావగారి సౌందర్యానికి మురిసిపోతూ చల్లనైన చందమామ వెన్నెల జల్లు కురిపిస్తూనేవున్నాడు.

సంపుటి: 5 కీర్తన : ఎటువంటిభోగి వీడెటువంటి జాణ
సంఖ్య : 177 పుట : 121 రాగం: సామంతం

## సామంతం

**32** ఎటువంటి భోగి వీఁడెటువంటి జాణ
వటపత్రమున నున్నవాఁడా వీఁడు ॥ పల్లవి॥

పొదిగొనఁ బూచిన పున్నాగతరులలో
పొదలుఁ బుప్పొళ్ళపైఁ బూఁదేనె సోనలు
గదలుచు జడివానకాలంపుఁ బెదపెద్ద-
నదులై పారనున్నతిని
కదలని నడిగడ్డ కల్పభూజంబుల
పదిలమైన నీడ బంగారు చవికెలో
కదిసిన జలరాశి కన్నెకౌఁగిటఁ గూడి
వదలకెప్పుడు నున్నవాఁడా వీఁడు ॥ఎటు॥

వలనగు తావుల వాసంతికలలోన
కెలఁకుల నరమోడ్పుఁ గెందామరలయందు
పొలయుచు గొజ్జంగపూవుల దూళితో
లలితంపు గాలి చల్లఁగను
కొలఁదిమీరిన మంచి కోనేటి పన్నీటి-
జలములలో నున్న జలజముఖులుఁ దాను
అలరుచుఁ దగనోలలాడుచు నేప్రొద్దు
వలపులు చల్లినవాఁడా వీఁడు ॥ఎటు॥





లోకము లోపలి లోలలోచనలెల్లా
జోకైన తనవాలుఁ జూపులచేఁ జిక్కి
యాకదాకడ చూడనెఱఁగక నిజమైన-
సాకారమునకె మెచ్చుఁగను
పైకొన్న సరసపుఁ బలుకులఁ గరఁగించి
యేకాంతమున సౌఖ్యమెల్లఁ జేకొనుచుఁ దా-
నీకడఁ దిరువేంకటేశుఁడై యున్నాఁడు
వైకుంఠపతియైన వాఁడా వీఁడు ॥ఎటు॥ 177

**అవతారిక:**

తిరువేంకటేశ్వరుని ఏకాంతసేవలో అన్నమాచార్యులవారు ఆలపించిన కీర్తన ఇది అని నా వూహ. ఈ స్వామియెట్లాంటిభోగి!! ఎట్లాంటి జాణ అని సన్నుతిస్తున్నారు. ఆచార్యులవారి ఈ కీర్తన ప్రత్యేకత మేయంటే ఇందులోని వర్ణనలు ప్రకృతి శోభావిష్కరణ యెంతో రమణీయంగా వున్నాయి. జలరాశికన్నెగూడి కౌగిటినెప్పుడూవదలక కదిసివున్నవాడట ఈ భోగి. అంటే ఏమిటో అంతా తెలిసీ యేమీ తెలియనట్లు వున్నది కదూ! ఇద్దరు భామలతో జలకములాడీయాడీ యేపొద్దునూ వలపులు జల్లేవాడట. ఏకాంత సౌఖ్యమెల్లచేకొనుచు ఈవేళ వేంకటపతియై యున్నాడట ఈ వైకుంఠపతి. దీనినిబట్టి ఈ కీర్తన తాళ్ళపాకలోని కోనేటిరాయనిపై చెప్పారేమో అనిపిస్తున్నది. ఏదియేమైనా మధురసుధావాహిని ఇది.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! మన కన్నులయెదుటనున్న ఈ దేవుడు యెటువంటి భోగి (యెంత భోగపురుషుడు!!), వీడు యెటువంటి జాణ (యెంత చతురుడు!!) ఆనాడు అనంతనీరవమున శిశువై తెప్పగా మఱ్ఱియాకుపై తేలి, కాలిబొటనవ్రేలిని చీకిన వటపత్రశాయిగానున్నవాడు, పొడవుకు పొడవైన ఈ పురుషోత్తముడేనా?

పొదిగొని బూచిన (దట్టముగా పూచిన) పున్నాగ వృక్షములలో పొదలు (నెలకొన్న) పుప్పొళ్ళపైనుండి పూదేనె (మకరందము) సోనలు (చిరుజల్లు) కదలిప్రవాహమై వానాకాలమున వున్నతముగా పారు పెద్దపెద్ద నదులైనవి. ఆఝురుల గట్లపై కదలని కల్పతరువులున్నాయి. ఆ కల్పతరువుల చల్లని నీడలో బంగారపు చవికెలో (మంటపములో) కదిసిన (చేరువయైన) జలరాశికన్నె (సాగరకన్యయైన లక్ష్మీదేవి) ను సందిట బిగించి యేపొద్దునైనా విడువని శ్రీకాంతుడైన వాడా వీడు!! ఆహా! మన జన్మ తరించినది.

వలనగుతావుల (ఆ ప్రక్కనున్న ప్రదేశములలో) వాసంతికలు (అడవిమొల్లచెట్లు) వున్నాయి. వాటి సమీపమున అరవిచ్చిన కెందామరల (ఎఱ్ఱని తామరపూవుల)పై గొజ్జంగ పూవుల పుప్పొడిని మోసుకుపోతున్న లలితమైన చల్లనిగాలి వీస్తుంటుంది. అక్కడ కొలది మీరిన (సాటిలేని) ఒక కోనేరు వున్నది. పన్నీరు వంటి ఆ కోనేటి జలములలో పద్మములవంటి వదనములు గల భామలతో తనివిదీర జలకములాడిన దేవదేవుడు యే ప్రొద్దునైనా జలములతోపాటు తన వలపులను చిలిపిగా వెదజల్లుచున్న ఈ శృంగార రాయుడు అని సరసులపొగిడే వాడేనావీడు.

లోకములోనున్న లోలలోచనలు (చంచలాక్షులు అనగా కదలే కనుగవలున్న లలనలు) సరసమైన తమ వాలుచూపులలో చిక్కి అటూ ఇటూ కూడా చూడలేక తిన్నగా చూచుచున్న ఈ కాసారపు జగన్మోహనుని మెచ్చేవిధముగా నున్నాడు. వారిని సమ్మోహనపరచే తన వాక్చాతురితో కరగించుచున్నాడు. ఈ ఏకాంత సేవా సౌఖ్యములో తిరువేంకటేశుడు ఈ వేళ తానే వైకుంఠపతియై యున్నాడా? వాడే వీడా?





సంపుటి: 3 కీర్తన : చాలుఁజాలు నీహరియే మాకును సకలక్రియలకు నాయకుడు
సంఖ్య : 371 పుట : 250 రాగం: లలిత

**లలిత**

**33 చాలుఁజాలు నీహరియే మాకును సకలక్రియలకు నాయకుఁడు**
**నాలుకతుదనే యీతఁడుండఁగా నలుగడ నెవ్వరి వెదకేము. ॥ పల్లవి॥**

**యేలినవాఁడట లక్ష్మీవిభుఁడట యేమిటనుఁ గొరత మాకిఁకను**
**నాలోనున్నాఁడు బ్రహ్మతండ్రియట నాకాయుష్యము బాఁతా**
**పాలజలధిపై దేవునివారము పాఁడి మాకు నిఁక నేమరుదు**
**ఆలింపఁగ నే మింతటివారము అన్యుల కిఁకఁజేయి చాఁచేమా. ॥చాలుఁ॥**

**భూకాంతాపతికింకరులము యీ భూము లిన్నియును మాసొమ్మే**
**పైకొని చక్రాయుధుఁడే మాదాపు భయము లిన్నిటాఁ బాసితిమి**
**యీకడ నచ్యుతుమరఁగు చొచ్చితిమి యెన్నటికిని నాశములేదు**
**యేకొఱఁతని ఇఁక నాసపడుచు నే మెవ్వరికి నోళ్లు దెరచెదము ॥చాలుఁ॥**

**శ్రీవైకుంఠునిదాసులమట యరచేతిదిమోక్షము మాకిదివో**
**పావనగంగాజనకునిబంట్లము పాపములన్నిటఁ బాసితిమి**
**శ్రీవేంకటపతి వరము లియ్యఁగాఁ జిక్కినవెలుతులు మాకేవి**
**యీ వైభవములఁ దనిసిన మాకును**
**ఇతరులఁ దగిలెడి దిఁకనేది ॥చాలుఁ॥371**

**అవతారిక:**

ఈ కీర్తన పాడుకొన్నా, వినినా గొప్ప ఆనందంతో కూడిన గర్వం కలుగుతుంది. అయ్యో! నాకేమీలేదు అనుకొని ఇతరులను యాచించుటకంటే దరిద్రమేముంటుంది? ఒకవేళ మనకు తిండికే లేక

యాచించవలసి వస్తే... లక్ష్మీపతి మనస్వామి భూలలనావిభుడు మన దైవము ఆయనను ఆశ్రయించి నాకిది కావాలి అంటే ఇవ్వడా? మరి ఇంకొకళ్ళముందు చేయి చాచుటకు సిగ్గులేదా? పోనీ మీకు ఇహలోకంలో యేమీ వద్దు, మోక్షం కావాలి అనే ఆశవుంటే వైకుంఠుని వేడుకోక ఇంకెవరిని వేడుకొంటారయ్యా? పోనీ పుణ్యంకావాలనే పీకులాట వుంటే ఈ స్వామియే గంగాజనకుడు కదా! ఈయన దాసులకి పాపమెలా వస్తుంది? అన్నిటికన్నీ నచ్చజెప్పే అన్నమాచార్యులవారి వాదనకు మీరు సరితూగగలరా?

**భావ వివరణ:**

ఓ భక్తులారా! మాకు ఈ హరియే చాలున్ జాలును (సరిపోతాడు). ఆయన సకలక్రియలకు (ధర్మార్థ కామమోక్షము లొసగుటకు) నాయకుడు (ఈయగల అధినాయకుడు). మా పూర్వ జన్మ సుకృతం వలన నిత్యమూ మా నాలుక తుదినే యీతడుండగా (ఇతనినే మేము కీర్తిస్తుంటే).... నలుగడ నెవ్వరి వెదకేము? (నలుదిక్కులా ఇంకా యెవరిని వెతుకుతాము)? మాకింకొరు అవసరమే లేదు.

ఇతనెట్టివాడో మీకు తెలియునా? వినండి. యేలినవాడట (జగత్పరిపాలకుడు); లక్ష్మీదేవి మనోవల్లభుడట. ఇక మాకు కొరతయేమిటను (యెందులో కొఱత వుంటుంది). నాలో అంతర్యామిగా వున్న ఈయనే స్వయముగా బ్రహ్మదేవుని తండ్రియట. ఇక మా ఆయుర్దాయమునకు బాతా (కొఱతయేమి వుంటుంది) చెప్పండి. మేము పాలజలధిపై పవ్వళించు దేవుని (క్షీరసాగర శయనుడైన శ్రీహరి) వారము (ఆప్తబంధవులము). ఇక మాకు పాడినేమరుదు? (భోగభాగ్యములకు కొదవేమిటి) చెప్పండి. నేము (మేము) ఆలింపగ (విన్నారంటే) ... ఇంతటి వారము (ఇంత వున్నతులము). ఇక అన్యులకు (పరులముందు) చేయిజాచి యాచింతుమా? చాలు చాలు మేమెన్నటికీ అట్లు చేయము.





మా గురించి మేము చెప్పుకోకూడదు... కానీ మేమెవ్వరమో తెలియునా? భూదేవీ వల్లభుడీ జగన్నాథుడేకదా! మేము ఈ స్వామి కింకరులము (భృత్యులము). ఈ భూమండలంలోవున్న భూములన్నీ మా ప్రభువువే. అంటే మా సొమ్మే కదా! స్వయముగా సుదర్శన చక్రాయుధుడే మా దాపైన సంరక్షకుడు (మావెంటనేవుండి రక్షించు దైవము). మరి మాకు భయమెందుకు? అచ్యుతుడంటే అర్థం తెలుసా మీకు? చ్యుతి (నాశనము) లేనివాడని అర్థము. మేము ఈ అచ్యుతుని మరుగుజొచ్చితిమి (ఆశ్రయములోనున్నవారము). అందుకనే మాకు యెన్నటికీ నాశనము లేదు. ఇక మాకు యేమి కొఱత వుందని పరులముందు నోరు తెరచి యాచించెదము? ఆశపడి అట్లు చేయవలసిన అగత్యమే మాకు లేదు. అవునయ్యా! ఇది నిజము.

సరే! ఇహలోకంలో అన్నీ వున్నాయి, మరి మోక్షము సంగతేమిటంటారా? ఆయన స్వయముగా శ్రీవైకుంఠపతి. మేము ఆయన దాసులము. మాకు అరచేతిలోనే మోక్షము వుంటుంది. దానికోసం మేము యెవ్వరినో యాచించవలసిన పనిలేదు. ఇకపోతే మేము పాపాలు చేస్తుంటే మా పాపాలు వదిలించండని ఇతర దేవతలను యాచించాలి. కానీ మాకా అవసరమే లేదు. మా స్వామి పరమ పావనియైన గంగాదేవికి జనకుడు. మేము యెన్నడో పాప విముక్తులమయ్యాము. మాకు ఈ శ్రీవేంకటేశుడు యేవరమడిగితే అది ఇస్తాడు. ఇక మాకు వెలితి (లోటు) యేమిటి? ఈయన దాస్యమనే వైభవమును స్వంతం చేసికొనిన మాకు ఇతరులను తగిలి (సంపర్కము పెట్టుకొని) వారి అండలో బ్రతకాల్సిన పనేమిటి?

సంపుటి: 3 కీర్తన : ధరగడపటనే జంతువుకైనా తనజన్మమే సుఖమైతోచు
సంఖ్య : 372 పుట : 221 రాగం: లలిత

**లలిత**

**34** ధరఁ గడపట నేజంతువుకైనా తనజన్మమే సుఖమై తోఁచు
హరి గలఁడని తా నమ్మివుండఁగా
నతఁడిచ్చేసుఖ మొల్లరు ॥ పల్లవి॥

మొదలఁ గొందరికి స్వర్గలోకమే మోక్షసుఖంబని తోఁచును
అదె కొందరికి దేవత్వమే బ్రహ్మానందంబై తోఁచును
వుదుటునఁ గొందరికి సంసారమే వున్నతసుఖమై తోఁచును
తుద నామీఁదటిహరిదాస్యసుఖము ధ్రువపట్టంబని కానరు. ॥ధరఁ॥

సొరిదిఁ గొందరటు శూన్యతత్వమే సుఖమని మాఁటలనందురు
యిరవెరఁగని వారికి ధనధాన్యము లెక్కువసుఖమై తోఁచును
నిరతిఁ గొందరికి చిరజీవులౌటే నిత్యసుఖంబని తోఁచును
వరుసల శ్రీపతిపై భారంబిదె వైరాగ్యపుసుఖ మెఱంగరు ॥ధరఁ॥

యెక్కడ చూచిన మాయలసుఖములు యెన్నైనాఁ గల వెప్పుడును
చొక్కపు శ్రీవేంకటపతితోడుత సుఖియించేటిసుఖ మొల్లరు
యిక్కడ నక్కడ నీతనిదాసులే యేచి సుఖింతురు నిజసుఖము
కిక్కిరిసినయజ్ఞానాంధకారులు కిందును మీఁదును
నెరఁగరు ॥ధరఁ॥372

**అవతారిక:**

తమ జీవితకాలంలో జీవులందరూ శ్రీహరి వునికినే ప్రశ్నిస్తూ వారికి సుఖము వారిశక్తి సామర్థ్యాలవల్ల కలుగుతున్నాయని గర్వించి శ్రీహరిని అతనిచ్చే 'సుఖమును' కాదంటారు. ఆయన మాయవల్ల జంతువుకు కూడా





దాని బ్రతుకు హాయిగానే వున్నదనిపిస్తుంది. దొంగ తిండ్లు తింటూ పిల్లి రోజూ తిట్లు తింటూనే వుంటుంది. కాని ఒక్కరోజు కూడా ఛీ యేమిటీ బ్రతుకు? ఇంతమందితో రోసి బ్రతికి లాభమేమిటి? అనుకోదు. దాని బ్రతుకు దానికి సుఖమైతోచు అంటున్నారు అన్నమాచార్యులవారు. స్వర్గం కావాలనుకొంటారు కొందరు. దేవత్వం దక్కితే చాలంటారు కొందరు. అదేం కాదు నా సంసారమే మకరందాస్వాదనలాగా హాయిగా వుందంటాడింకొకడు. కాని హరిదాస్యమే సుఖము అని మాత్రం కానరు (తెలియరు). ఇదంతా అజ్ఞాన జనితమైన మాయ. ఎన్ని జన్మలెత్తినా కొంతమందికి తమ బ్రతుకు పరమావధి కేవలం బ్రతకటం కాదని, హరినెరుగుటే ముక్తి అని జీవుడు తెలుసుకోలేడు. దానికీ ఆయన కృప కలుగవలసిందే. లేకపోతే మహాసాగరాల అనంతగర్భాలలో బ్రతికే అసంఖ్యాక జలచరాలలో యేదో ఒకటియై చచ్చేదాకా బ్రతికి అలా జన్మల పరంపర అనుభవిస్తూనే వుంటారు. ఒక్కసారి కళ్ళుమూసికొని ఆలోచించండి. గడచిన క్షణంరాదు. అవునా? గడచిన క్షణం మన వయస్సును పెంచిందే కాని జ్ఞానాన్ని కాదు అనుకోండి... మన బ్రతుక్కీ పిల్లి బ్రతుక్కీ పెద్ద తేడా యేమీ లేదు.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! కడపటన్ (చిట్టచివరకు) ధరన్ (ఈ లోకంలో) యే జంతువుకైనా తన జన్మమే గొప్ప సుఖమైనది అనే తోచు (అనిపిస్తుంది). అట్లాగే మానవులంతా హరిగలడనీ శ్రీహరిమాత్రమే సుఖమునీయగలడని ఒల్లరు (ఒప్పుకోరు) అలా బ్రతికేస్తూ వుంటారు.

కొందరికి మొదల (మొట్టమొదటగా స్వర్గముకంటే సుఖ కరమైనది ఇంకొకటి లేదనిపిస్తుంది. అదే మోక్షమనిపిస్తుంది. అదే కొందరికి దైవత్వం పొంది తాము కూడా పూజింపబడితే దాన్ని మించిన బ్రహ్మానందం లేనే

లేదనుకొంటారు. ఉదటున (ఉద్ధతితో) సంసారమే మరి కొందరికి సుఖముగా తోస్తుంది. కానీ తుదన్ (చివరికి) ఆ శ్రీహరి దాస్యము మాత్రమే ధ్రువపట్టమువలె (ధ్రువమండలమేలుతున్న ధ్రువుడు పొందిన ఔన్నత్యము వలె) శ్రేష్ఠమైనదని, సుఖకరమైనదని కానరు (గ్రహించలేరు).

ఇంకా కొంతమంది శూన్యత్వవాదులుంటారు. జగమంతా మిథ్య, శూన్యము అని వారు నమ్ముతూ ఆ శూన్యతత్వమె, సొరిది (క్రమముగా) సుఖము నిస్తుందని నమ్ముతారు. ఇరవెరుగనివారికి (జీవన గమ్యం తెలియని వారికి) ధన ధాన్య సేకరణయే యెక్కువ సుఖము అనిపిస్తుంది. వారు దానికోసమే జీవిస్తుంటారు. మరి కొందరికి చావే లేకుండా చిరకాలం జీవించి సుఖించాలని వుంటుంది. అదియే వారికి నిరతి (మిక్కిలి ఆసక్తిని కలిగించు లక్ష్యము) గా తోస్తుంది. కానీ వారెన్నటికీ శ్రీపతిపైననే భారము వేసి ఆ క్రమములో వైరాగ్యభావనలో వుండుటే నిజమైన సుఖమని యే నాటికీ గ్రహించలేరు.

ఇదంతా నటనసూత్రధారియైన శ్రీహరిమాయయని, యెన్నైనా (యెన్ని విధాలనైనా) యేమైనా యెప్పటికినైనా యెక్కడ చూచినా ఆ మాయను జయించలేరనీ, అదే సుఖమని భ్రమిస్తుంటారని కూడా గ్రహించలేరు. చొక్కపు (అందమైన) శ్రీవేంకటేశ్వరునితో సుఖించుటే నిజమైన సుఖమని తెలియలేరు. ఇక్కడ (ఈ లోకమందూ) అక్కడా (పరలోకమందుకూడా) ఈతని దాసులే, యేచి (అతిశయించి) సుఖింతురు. అదే నిజమైన సుఖము. అతని దాసులు కాని అహంకారులు కిక్కిరిసిన (దట్టమైన) అజ్ఞానాంధకారంలో బడి క్రిందనూ మీదను (ఏదిమంచో ఏది చెడో) యెరుగక బ్రతుకు ఈడుస్తుంటారు.





సంపుటి: 28 కీర్తన : చల్లరే హరిపై జాజరజాజ
సంఖ్య : 319 పుట : 211 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

**35** చల్లరే హరిపై జాజరజాజ
చల్లఁగా సరసపు జాజరజాజ ॥ పల్లవి॥

సతతపు వలపుల జాజరజాజ
చతురులమాటల జాజరజాజ
సతమగు నవ్వుల జాజరజాజ
జతనపు సిగ్గుల జాజరజాజ ॥చల్ల॥

సముకపు కొసరుల జాజరజాజ
సమరతికరఁగుల జాజరజాజ
జమళి తమకముల జాజరజాజ
సమయని యాసల జాజరజాజ ॥చల్ల॥

జడియని పంతపు జాజరజాజ
సడఁగుల చేఁతల జాజరజాజ
జడిగొను చెమటల జాజరజాజ
జడగొను పెనఁగుల జాజరజాజ ॥చల్ల॥

చలముల వొట్ల జాజరజాజ
సలిగెలపగటుల జాజరజాజ
చలువల వినయపు జాజరజాజ
సళుపుల చూపుల జాజరజాజ ॥చల్ల॥

సంగడి మూఁకల జాజరజాజ
జంగిలి మతకపు జాజరజాజ
సంగాత మమరిన జాజరజాజ
సంగతి యెరికల జాజరజాజ ॥చల్ల॥

**సారపు మోవుల జాజరజాజ**
**సారెకుఁ బొలసేటి జాజరజాజ**
**సొరుచి మెచ్చుల జాజరజాజ**
**జారతనంబుల జాజరజాజ ॥చల్ల॥**

**సందడి కొలువుల జాజరజాజ**
**సందుల వొత్తుల జాజరజాజ**
**చందురుపాటల జాజరజాజ**
**సందె చీఁకటుల జాజరజాజ ॥చల్ల॥**

**చాలుకొను సతుల జాజరజాజ**
**జాలివిరహముల జాజరజాజ**
**చాలామరిగిన జాజరజాజ**
**చొలూరించే జాజరజాజ ॥చల్ల॥**

**చనుఁగవ గురుతుల జాజరజాజ**
**చనవుల కొసరుల జాజరజాజ**
**యెనసెను శ్రీవేంకటేశ్వరుఁ డీతని**
**చనుమానంబుల జాజరజాజ ॥చల్ల॥**

**అవతారిక:**

ఇది ఒక జాజరపాట. వసంతోత్సవంలో పరవశించి దేవేరిలతోనూ సఖియలతోనూ జాజరచల్లుతూ కనువిందు చేస్తున్నాడు కర్పూరధూళితో జాజర చల్లుతూ శ్రీవేంకటేశుడు. శృంగారం రసప్రవాహవాహినియైనది. అన్నమాచార్యులవారి కన్నులముందు యెక్కడచూచినా తానేయై జాజరలో పాల్గొంటున్నాడు ఏడుకొండల ఏలిక. భావాన్ని సాధ్యమైనంత నర్మగర్భంగా వుంచడానికి ప్రయత్నించింది "పెద్దలను" "పిన్నలను" దృష్టిలో వుంచుకొనియే.

ఇదివరలో ఒకసారి చెప్పినట్లు జాజర జజ్జర అనే పదమునకు పర్యాయపదము. జజ్జర అంటే వంచన అని అర్థం. నేటి కాలంలో ఈ





వసంతోత్సవమే హొలీ పండుగ అయ్యింది. శ్రీనివాదుసు పద్మావతి హొలీ ఆడుతున్నారని వూహిస్తేనే ఒళ్ళు పులకరిస్తున్నది కదా! మరి అన్నమయ్య తన భావనా విలీనాకాశంలో ఈ జాజరజాజన వీక్షిస్తున్నారు. సురులకు మునివరులకు మాత్రమే దృగ్గోచరమయ్యే జాజరను పరమాత్మ కృపచేత మీ కనులముందుంచుతున్నాను. చదివి పరవశించండి.

**భావ వివరణ:**

ఓ చెలులారా! హరిపై జాజరజాజ (వసంతమును) చల్లరే. సరసముతో కూడిన జాజరజాజ ఆయనపై చల్లగా (శీతముగా) వెదజల్లరే.

ఈ జాజర యెటువంటిదో తెలియునా? సతతము (యెల్లప్పుడూ) వలపులు వెదజల్లునది. జాణతనముతో కూడిన చతుర సంభాషణలు కలిగిన జాజర. శాశ్వతముగా ఆనందమునందించు జాజర. ప్రయత్నపూర్వకముగా సిగ్గులు దాచుకొని పరవశించుచున్న జాజర.

ఈ జాజర సముకపు కొసరులది (బాహాటముగానే మరి కొంచెము కావాలని కొసరు అడిగే వసంతము). ఇది సమరతికి ప్రోత్సహించుచూ ఒండొరులలో కరగిపోయే జాజర. ఇది జమళి (జంటలు) తమకమున (తన్మయత్వమున) తలమునకలయ్యే జాజర. ఇది సమయని ఆసల జాజర (ఏమాత్రమూ తగ్గని ఆశలు చిగురించిన జాజర.)

ఈ జాజర జడియని పంతపు జాజర (శ్రీనివాసుడు తనపంతము నెగ్గించుకోవటానికి యెంతకైననూ వెనుదీయడు). ఇది సడగుల చేతల జాజర (చిలిపి చేష్టల వసంతము). ఇది చెమటలు జల్లులై కురియు జాజర. ఇది తనదేవి జడను చేతితో అందిపుచ్చుకొని వేంకటేశ్వరుడు ఆడే వసంతము.

ఈ జాజర చలములవొట్లది (మత్సరముతో కూడిన ఒట్లు పెచ్చుమీరిన యది). ఇది సలిగెల పగటులది (ఆశ్రయించిన లావణ్యములు పెల్లుబికిన జాజర). ఇది చల్లని వినయములు పరిఢవిల్లు జాజర). ఇది సళుపుచూపుల (నొప్పించునట్లు నటనతో చూచు జాజర). అవన్నీ పైపైనటనలే.

ఈజాజర సంగడిమూకల జాజ (జతకలసిన గుంపులు చేసికొను పండుగ). ఇది జంగిలిమతకప జాజర. (జంగలి అంటే గోసమూహములేక పశు సమూహము అని అర్థం. కాని అన్నమయ్య మొరటు అనే అర్థంలో వాడారు). ఇది జంగిలి మతకపు జాజర (మొరటుగా చేసే వంచన). ఇది సంగాత మమరిన జాజర (స్నేహముతో కూడిన తమాషా). ఇది సంగతి యెరికల జాజర ఇది ఏ జంట, యెక్కడ, యెలా చేరిక అవుతున్నాయో తెలిసినా లక్ష్యపెట్టని జాజర. అంటే ఇక్కడ యెవరిగోల వారిదే.

ఈ జాజర సారపు మోవుల జాజ (చేవగలిగిన వలపుల మొలకల వసంతము). ఇది సారెకు పొలసేటి జాజర (మాటకు మాట బదులిచ్చి అతిశయించు పండుగ). ఇది సొరుచి మెచ్చుల జాజర (ఒకరి అంద చందాలు ఇంకొకరు మెచ్చుకొనే జాజర). ఇది జారతనంబుల జాజర (యధేచ్ఛగా శృంగార సామ్రాజ్యములేలే పండుగ).

ఈ జాజర సందడి కొలువుల జాజ (సందడిగా కలిసివుండే పండగ). ఇది సందుల ఒత్తుల జాజర. ఇది చందమామపై విరహగీతము లాలపించి పరవశించే జాజర. ఇది సందె చీకటుల (సాయం సంధ్యా లేచీకట్లలో జంటలు కులికే జాజర).

ఈ జాజర చాలుకొను సతుల జాజ (సతులు వరుసలు దీరెడి పండుగ). ఇది విరహ వేదనలో కన్నీటిజలపాతములౌ జాజర. వ్యాకులతలకు గురి అయ్యెడి జాజర. ఒకరి వ్యాకులత ఇంకొకరికి మూర్ఖత్వంగా కనుపించవచ్చును. అందుకనే ఇది చౌలూరే (రుచులు గుబాళించే జాజర)

ఇన్ని యధేచ్ఛ కూటములనంతం ఇంకా చెప్పేదేముంటుంది? ఇది చనుగవలపై గుర్తులు మొలచిన జాజర. ఇది కొసరి కొసరి చనువులు ప్రదర్శించెడి జాజర. ఈ జాజరలో శ్రీవేంకటేశ్వరుడు యెనసెను (విజృంభించినాడు). అందుచే ఇది ఈతని చనుమానంబుల జాజర (యెప్పుడూ తన మాటే చెల్లుబడి అయ్యే వసంతోత్సవము). ఈ శృంగారరాయని కాదనగల దమ్ముయెవరికున్నది చెప్పండి.





సంపుటి: 3 కీర్తన : కలదందే పో సర్వముఁ గలదు - కామితార్థమును గలదు
సంఖ్య : 446 పుట : 300 రాగం: లలిత

**లలిత**

**36 కల దందే పో సర్వముఁ గలదు - కామితార్థమును గలదు**
**కలదు కలదు శరణాగతులకు హరి - కైంకర్యంబున**
**మోక్షము గలదు. ॥ పల్లవి॥**

**ఆకాశంబున మోక్షము వెదకిన - నందులోపలా లేదు**
**పై కొని తానెంత వెదకి చూచినా - పాతాళంబున లేదు,**
**ఈకడ ధరలో మూల మూలలను - యెందు వెదకినా లేదు**
**శ్రీకాంతుని మతిఁజింతించి యాసలఁ**
**-జిక్కక తొలఁగిన నందే కలదు. ॥కల॥**

**కోటి జన్మములు యెత్తిన ముక్తికి - కొన మొదలేమియు గనరాదు**
**వాటపు సంసారములోఁ గర్మపు - వార్ధి యీఁదినాఁ గనరాదు,**
**కూటువతో స్వర్గాదిలోకములఁ- గోరి వెదకినాఁ గనరాదు**
**గాటపు కేశవభక్తి గలిగితే - కైవల్యము మతిఁగానఁగవచ్చు ॥కల॥**

**సకలశాస్త్రములు చదివినాఁబరము - చక్కటిమార్గము దొరకదు**
**వికటపు పలువేల్పుల నెందరి గడు - వెదకి కొలిచినా దొరకదు,**
**ఆకలంకుడు శ్రీవేంకటగిరిపతి - అంతరంగమున నున్నాఁడనుచును**
**ప్రకటముగా గురుఁడానతి యిచ్చిన - పరము సుజ్ఞానము**
**తనలో దొరకు. ॥కల॥**

**అవతారిక:**

మోక్షమనేది యెక్కడో లేదయ్యా! నీలోనే వున్నది. నాది నావాళ్ళు అనే పీకులాట వున్నంత కాలమూ నీకు మోక్షం ఎలా వస్తుంది. నీవు “బందీ”వే

కదా! నీ మనస్సులోనే వున్న ముక్తిని వెదకవు కానీ మోక్షం కావాలని వూళ్ళు పట్టుకు తిరుగుతే వస్తుందా? మరి అది విరక్తి వలనగాని రాదు. అది సాదనవలన గాని రాదు. అది చెప్పినంత తేలిక కాదు. అతి తేలిక మార్గమొకటి వున్నది. అదియే శ్రీహరి శరణాగతి. అంతా అందులోనే వున్నది. శ్రీహరిని శరణన్నవాడు యెవ్వరినీ యేదీ యాచించడు. అందువల్ల ఆశ అనే తంటా నుంచి ముందుగా విడుదల అవుతాడు. ఏనాడైతే హరిని గాక పరులను యాచించడో వాడు జీవన్ముక్తుడే. వాడికి కామితార్థములు దక్కినట్లే. అటువంటి ముక్తులకు శ్రీహరికైంకర్యములోనే మోక్షము దక్కుతుంది. ఎందుకంటే కేశవుడి భక్తి తప్ప వాడికింకేమీ వద్దు. ఇట్టి సుజ్ఞానము కలుగవలెనంటే, ఆకలంకుడు శ్రీవేంకటేశ్వరుడు మన అంతరంగంలోనే వున్నాడనే గురువుల ఆనతిని మనస్ఫూర్తిగా శిరసావహించాలి అంటున్నారు అన్నమాచార్యులవారు. కొసమెరుపేమంటే ఈ వైరాగ్య భావన నమ్మకంగా మనస్సులో నాటుకొని పోవాలి. ఊరకనే పైపై మాటలవల్ల లాభం లేదు.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! అందేకలదుపో సర్వము. (జీవనసారమంతా అందులోనే వున్నది పోండి!) హరి శరణాగతులకు (శ్రీహరినే శరణాగతితో ఆశ్రయించిన వారికి) ఆయనే కామితార్థములను (కోరిన ఐహికములన్నీ తీరుస్తాడు, సంపదలనిస్తాడు). ఆయన కైంకర్యమే మోక్షసాధనము.

ఇక ఆ మోక్షము యెక్కడవున్నదో ఒక్కసారి ఆలోచించండి. ఆకాశంలో వున్నదా? యెంత వెదకినా అక్కడ లేనే లేదు. పోనీ పాతాళ లోకమున వున్నదా అంటే, పైకొని (తీవ్రంగా యత్నించి) వెదకినా అక్కడ కూడా కానరాదు. ఈకడ (ఇక్కడ) ధరలో (భూమిమీద) మూలమూలల వెదకినా బొత్తిగా





కనుపించదు. మరి ఇంకెక్కడున్నాడయ్యా! అంటే ఆ శ్రీకాంతుని ఆసల జిక్కక (ఆశాపాశమునకు కట్టువడక) మతి జింతించి (మనస్సులో ధ్యానించి వెదకితే) అందే (ఆ మనస్సులోనే) ఆ మోక్షమూ వున్నది.

ఒక జీవుడు కోటి జన్మలెత్తినప్పటికీ ముక్తికి, కొనమొదలు (ఆద్యంతములు) కనుగొనుట సాధ్యము కాదు. ఎందుకంటే ముక్తికి ఆ ప్రయత్నం చేయాలంటే ఆ పరమాత్మ సమ్మతించాలి. లేకపోతే జీవి వాటపు సంసారములో (అనుకూలమైన ప్రాపంచిక సుఖములలోబడి) కర్మలు అనే మహాసాగరంలో యెంత ఈదులాడినా లాభం లేదు. పోనీ కూటువతో (సాధనచేసి) తపోశక్తి వంటి వాటితో స్వర్గమునంతా వెదకినా, అందునా కానరాదు. ఎందుకంటే అది ఒక వస్తువు కాదు. కేశవునిపై (శ్రీమన్నారాయణునిపై) గాటపు భక్తి (గాఠమైన భక్తివుంటే) ఆ కైవల్యము (మోక్షము) మతిగానగా వచ్చును (మనస్సులోనే దర్శించవచ్చును).

ఇంకా కొంతమంది సర్వ శాస్త్రము (ఆరు శాస్త్రములూ) చదివి గొప్ప పాండిత్యము సంపాదిస్తారు. అంత మాత్రాన చక్కటి మార్గము పరమునకు (ముక్తికి) దొరుకుతుందని అనుకొంటున్నారా? సాధ్యంకాదు. పోనీ వికటపు పలువేల్పులను (చమత్కారులైన ముక్కోటి దేవతలనూ) ఆరాధిస్తే మోక్షం దొరుకుతుందా అంటే, కల్ల! ఒక్కనాటికీ దొరకదు. అకలంకుడు (దోషరహితుడు) అయిన శ్రీవేంకటేశ్వరుడు వేరే యెక్కడో లేడు. మన అంతరంగములోనే వున్నాడు. అయితే మరి యెట్లా మనకు కనబడుతాడయ్యా! అంటే గురువుల కృప కలిగి ఆనతిచ్చినచో సుజ్ఞానము పరము (మోక్షము) ప్రకటనమవుతాయి.

సంపుటి: 3 కీర్తన : శరణని బ్రతుకరో జనులాల!
సంఖ్య : 239 పుట : 160 రాగం: సాళంగనాట

సాళంగనాట

37 శరణని బ్రతుకరో - జనులాల!
గరిమ మెరసె నిదె - కనకసింహము. ॥ పల్లవి॥

అహరహమునుఁ బ్ర - హ్లాదుఁడు దొరకొని
బహువిధముల హరి - మహిమలు వొగడఁగ,
కహకహ హిరణ్య - కసిపుఁడు నగి హరి
సహజ మేది యని - చఱచెఁ గంభము. ॥శర॥

అటమరి పెటపెట - మని బేట్లెగసి
చిటపట రవముల - జిరుతపొగలెగసి,
తటతట మనుచును - తరలి వ్రయ్య లై
పటపట మనుచును - పగిలెఁ గంభము. ॥శర॥

బెడిదపు చూపుల - మిడుఁగురు లెగయఁగ
పుడమి యదర నూ - ర్పులు చెలఁగ,
గడగడ వడఁకి ది - క్తటము లల్లాడగ
వెడలెఁ గంభమున - విజయసింహము. ॥శర॥

నగవుల సుడివడె - నభోంతరంబులు
పొగలెగసెను పెను - బొమముళ్ళ,
పగటు నార్పులను - పగిలెను గొండలు
వెగటున వెడలెను - వీరసింహము. ॥శర॥

తెఱచిన నోరఁ బ్ర - తి ధ్వనులెసగఁగ
కఱకు గతులు చు - క్కలు చెదర,
నెఱిహంకృతులను - నిఖిలముజెదరగ
వెఱచఱవఁగెరలె - విమలసింహము. ॥శర॥





పటువిహారముల - బ్రహ్మాండ మగల
గుటగుటరవళి నా - కులు వొగడ,
నిటలనేత్రమున - నెఱమంట లదర
పటుగతి మెరసెను - భయదసింహము. ॥శర॥

పెదపెద కోఱల - పిడుగులు రాలఁగ
తుద నఖముల నె - త్తురు దొరుగ,
గుదిగొను కసురుల - కులగిరు లూఁటాడ
వుదయించె నదివొ - వుగ్రసింహము. ॥శర॥

అట్టహాసమున - నసురలు వారఁగ
ముట్టి వాయువులు - మొగతిరుగ,
దట్టములై జల - ధరములు ముసరఁగ
దిట్టయై వెడలె - ధీరసింహము. ॥శర॥

జలధులు గలఁగెను - జడిసె లోకములు
తలకె సప్త పా - తాళములు,
ఉలికి పడదొడగె - నూర్ధ్వ లోకములు
కొలువున నిలిచెను - ఘోరసింహము. ॥శర॥

అచ్చుట హిరణ్యు - నదరంట బట్టి
యిచ్చలదొడపై - నిడి చించి,
కుచ్చివానిపే - గులు జంధ్యములుగ
విచ్చివేసుకొనె - విష్ణుసింహము. ॥శర॥

పొగిడిరి దివిజులు - భువనములు వెలసె
పగయుడిగి చెలగెఁ - బ్రహ్లాదుఁడు,
మిగుల శాంతమున - మించె శ్రీవేంకట
నగమునహొబల - నారసింహము. ॥శర॥

**అవతారిక:**

అహోబలనృసింహునిపై అసంఖ్యాకమైన కీర్తనలు చెప్పారు అన్నమాచార్యులవారు. అక్కడి నారసింహుని నవనారసింహులంటారు. ప్రహ్లాదునిపై అమిత కరుణారస వృష్టిని కురిపించే ఆ స్వామి శ్రీలక్ష్మీ చేరువైనప్పుడు శృంగార స్వరూపుడు. దుష్ట హిరణ్య కశిపుని దురాగతానికి మండిపడే జ్వాలా నృసింహుడు. నారదాదుల కీర్తించునపుడు శాంత నృసింహుడు హిరణ్యకశిపుని దానవపుత్రులు స్వామిపై పగతో దాడిచేసినపుడు ఉగ్రనరసింహుడు. ఈ కీర్తన ప్రత్యేకత యేమంటే, మూడవ చరణమైన "బెడిదపు చూపుల – మిడుగురు లెగయగ" అనే పాదము నుంచి కీర్తన చివరి పాదము "నగమున నహోబల నారసింహము" వరకు గల తొమ్మిది చరణాలు నవనారసింహులలో ఒక్కొక్కరి ప్రశస్తి అని పెద్దల అభిప్రాయము. ఏది ఏమైనా ఈ కీర్తన నాలపించిన వారికి ఈ అహోబల నవనారసింహులను అన్ని ప్రయాసల కోర్చి దర్శించిన పుణ్యం భక్తితో ఈ కీర్తన గానం చేస్తే కలుగుతుంది. "వెలస్వల్పము – ఫలమధికము" అని అన్నమయ్య తరచూ అంటుంటారే... అదే ఇది. కళ్ళుమూసి ఆ నృసింహుని రూపు మనస్సు అనే తెరమీద ప్రతిఫలింపజేసికొని "శరణు, శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీ సతి వల్లభా"! అని ముమ్మారు స్మరించి అప్పుడీ కీర్తన చదవండి మీ జన్మ ధన్యమవుతుంది.

**భావ వివరణ:**

ఓ జనులారా! ప్రహ్లాదవరదుడైన ఈ అహోబల నారసింహుని శరణని బ్రతుకు వెళ్ళమార్చుకోండి. ఇదే (ఇక్కడే) ఈ కనకసింహము (హిరణ్యుని చంపిన సింహము) గరిమ మెరసెను (మహిమతో వెలుగొందుచున్నాడు).

ప్రహ్లాదుడు దొరకొని (పూనుకొని) అహరహము (రేయింబవళ్ళూ) అనేక విధములుగా శ్రీహరి మహిమలను కీర్తించుచుండగా, దుష్టుడైన ఆ హిరణ్యకశిపుడు "కహకహ" మని నవ్వి యెక్కడరా నీ హరి? వాని సహజమేది (స్వభావము యెట్టిది?) చూపరా! అని అక్కడనేవున్న కంభమును (స్తంభమును) చరచెను (మోదెను).





అటుమరి (ఆపైన) పెటపెటమని పెల్లగిసి (పెట్లిపోయి) చిటపటమనే ధ్వనితో చిన్నగా పొగలను వెదజల్లుతూ తటతటమనే పెద్ద ధ్వనితో ఆ స్తంభము వ్రయ్యలై (పగుళ్ళువారి) పటపటమని పగిలిపోయి భయమును గొలిపింది. అప్పుడేమి జరిగిందో వినరయ్యా!

ఒక "విజయ సింహము" బయటకు వచ్చింది. అదెట్లా వున్నదయ్యా! అంటే... దాని బెడిదపు చూపుల (భయంకరమైన చూపులు) మిణుగురులు (మెరుపులు) యెగిసిపడుతున్నాయి. భూమి కంపించిపోవునట్లు వూర్పులు (ఉచ్ఛ్వాస నిస్వాసములు) చేయుచున్నాడు. దానిని చూచి దిక్తటములు (దిక్కులన్నియు) గడగడమని అల్లాడినవి (కంపించినవి). అప్పుడు ఆ స్తంభము నుండి ఒక సింహము వెడలి వచ్చినది. విజయవాంఛతో వెడలివచ్చిన ఆ నవ నరసింహుడే విజయసింహము.

ఇదిగో ఈ నరసింహుడే వీరసింహము. ఈయన నగవుల ధ్వనితో నభోంతరంబులు సుడివడెన్ (గగనసీమ ఘూర్ణిల్లినది). పెద్దపెద్ద కనుబొమలనుండి పొగలు యెగసిపడినవి. పగటునార్పులను (వెలువడిన గర్జనలతో) కొండలు కూడా నుగ్గునుగ్గయిపోయినవి. వెగటున (గొప్ప విరస భావముతో) ఆ వీర నృసింహుడు స్తంభమునుండి బయటకు వెడలి వచ్చెను.

అహో! ఈ యెదుట నున్న నరసింహుడే విమల నారసింహుడు. తెరచిన ఈ స్వామి నోటినుండి ప్రతిధ్వనులు వెడలుచున్నవి. ఈయన కరకుగతులకు (కఠినమైన విధానములకు) బెదరి చుక్కలు చెదరినవి (నక్షత్రములు చెదరిపోయినవి. ఆయన భీకరాకారమునుండి వెడలిన గొప్ప హూంకారమునకు నిఖిల జగంబంతయు బెదరిపోయింది. భీతి గొలపు ఆ విమలనారసింహము అట్లు అతిశయించినది.

భళా! ఈ భయద (భయమునుగొలుపు) సింహమును గమనించండి. ఆయన పెద్దపెద్ద అంగలతో విహారము చేస్తుంటే బ్రహ్మాండము పెల్లగించబడినట్లు బీటలువారింది. ఆయన వేగానికి చెవుల ఆకులనుంచి గుటగుటధ్వనులు వెలువడినవి. ఆయన నిటల నేత్రమునుండి (కనుబొమ మధ్యనున్న అగ్ని నేత్రము

నుండి) నెఱమంటలు (మండుతున్న జ్వాలలు) వెలువడుచున్నవి. ఈ భీకర నృసింహుడు పటుగతి (మెఱసెను శ్రేష్ఠమైన విధమున దీప్తించినాడు).

బాపురే! ఈ ఉగ్ర నరసింహమును చూడండి. ఈయనకు పెదపెద కోఱలున్నవి. వాటినుండి పిడుగులు రాలుతున్నప్పుడు వచ్చే కాంతి వస్తున్నది. ఆయన గోళ్ళ చివరలనుండి నెత్తురు కారుచున్నది. “గుదిగొను కసురుల కులగిరులూటాడ” – అంతవరకు అతిశయించిన దానవ కులములను కొండలు సమూలంగా అంతమైనవి. అదిగో అప్పుడు ఆవిర్భవించాడు ఆ ఉగ్ర నారసింహుడు.

ఇదిగో ఈ ధీరసింహమును చూచినారా! ఈయనగారి వికటాట్టహాసము వినినంతమాత్రాన అసురులు వారగ (పారిపోతుండగా) ఎందుకంటే ఆ నవ్వుల నుండి ఘోరమైన ధ్వనితో వాయువు వెలువడింది. ఆ వేడి వాయువుచే దట్టమైన జలధరులు ముసరగ (మేఘాలు కమ్మినవి). ఆ భయోత్పాతంతో ఈ ధీర సింహము దిట్టయై వెలువడినాడు.

ఇదిగో ఈ ఘోరసింహమును వీక్షించండి. ఈ స్వామిని జూచి జలధరులు గలిగినవి. (కారుమేఘములు కమ్ముకొనినవి). పదునాల్గు లోకములన్నియు జడిసినవి (కంపించినవి). ఏడుపాతాళములు (అధోలోకములు) తలకినవి (చలించిపోయినవి). ఏడు ఊర్ధ్వలోకములు ఉలికిపడినవి. ఈ విధంగా ఈయన కొలువుదీరియున్నాడు.

ఆహా! యేమి ఈ విష్ణు సింహపు వైపరీత్యము!! ఆయన ఆ హిరణ్యకశిపుని అదిరిపోవుచుండగా పట్టుకొని ఇక్కడకు యెత్తుకొనివచ్చి తన తొడలపై నుంచుకొని చించివేశాడు (చీల్చివేసినాడు). వాని పేగులను కుచ్చి (జడలుగా మెలిబెట్టి) జంద్యాలుగా తన మెడలో వేసికొనినాడు. విచ్చివేసుకొనిన (విడదీసి వేసికొనిన) ఆ పోగులనుంచి నెత్తురు జొటజొట రాలుతున్నది. ఆ విధంగా ఆ విష్ణు సింహము అతిశయించినది.

ఎట్టకేలకు దుష్టశిక్షణ శిష్టరక్షణ జరిగినవి. దివిజులు (దేవతలందరూ) ఆ దేవదేవుని కీర్తించిరి. పదునాల్గు భువనములు పరవశించినవి. బ్రహ్మాది దేవతల పగ చల్లారినది. అందరూ శాంతించారు. ఆ అహోబల నారసింహము శాంతాకారుడై శ్రీవేంకటేశ్వరుడై ఈ వేంకటాద్రిపై మించె (అతిశయించినాడు.) ఈయనను శరణని తరించండి.





సంపుటి: 18 కీర్తన : అప్పడు వేంకటరాయ డలమేలుమంగ గూడి
సంఖ్య : 281    పుట : 188    రాగం: సామంతం

## సామంతం

38 అప్పఁడు వేంకటరాయఁ డలమేలుమంగఁ గూడి
కుప్పలుగా భోగించీఁ గోడతిరునాళ్లు ॥ పల్లవి॥

చీనిచీనాంబరములసింగారపు మేడనుండి
వీనుల సన్నగాళెలు వినుకొంటాను
పూని విహరించి వచ్చి పొందుగా నుయ్యాలలూఁగి
కోనేటిదరి మెరసీఁ గోడతిరుణాళ్లు ॥అప్పఁ॥

ఆముకొన్నపన్నీట నద్దినదుప్పటితోడ
దోమటి పూవుదండలు దూలాడఁగా
కోమలపుటెలుఁగులకొమ్మలు లావులువాడ
గోమున నవధరించీఁ గోడతిరుణాళ్లు ॥అప్పఁ॥

అడుగడుగుకు విడేలందుకొంటా సంకీర్తన –
లెడయక భాగవతు లెచ్చిపాడఁగా
గొడుగులుఁ బడగలు కోరి చామరము లిడ
గుడిగొన వినోదించీఁ గోడతిరుణాళ్లు ॥అప్పఁ॥

నానావాద్యాలతో నట్టుకులు గడించగా
పానిపట్టి మంచిమంచి పాత్ర లాడఁగా
ఆనుక కోలాటములు అంత నింతఁ జూచుకొంటా
కోనేటిరాయఁడు మెచ్చీఁ గోడతిరుణాళ్లు ॥అప్పఁ॥

వరుసతో విణ్ణాపఁజివారు తాళము లొత్తుచు
పొరిఁదొరి ద్రావిడానఁ బొగడఁగాను
విరులు యేకాంగులు వినువీధిఁ జల్లఁగాను
గురుతరముగ మించీఁ గోడతిరుణాళ్లు ॥అప్పఁ॥

**పప్పులు నిద్దెనలును పానకాలు ఫలములు**
**అప్పటప్పటికిఁ బైపై నారగింపుచు**
**చెప్పరాని మహిమల శ్రీవేంకటేశ్వరుఁడు**
**కుప్పళించీ వాసనలఁ గోడతిరుణాళ్లు** ॥అప్పఁ॥281

**అవతారిక:**

కోడతిరుణాళ్ళు అంటే వేసంగిలో స్వామి వారికి జరిపే వసంతోత్సవములు. ఒకానొక వసంతోత్సవ వైభవమును కళ్ళకుకట్టినట్లు వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇది చాలా పొడవైన కీర్తనయే కాదు, పొడవైన పురుషోత్తముని పొగడే కీర్తన. ఆ తిరునాళ్ళలో శ్రీవేంకటేశుడు, అలమేల్మంగ 'కుప్పలుగా భోగించీరట' అంటే విరివిగా సుఖించారన్నమాట. ఈ స్వామియే మనందరికీ "అప్పడు" (తండ్రి). ఆయన వూరేగింపుతో వెళ్ళే అదృష్టం అందరికీ దొరకదు. నేడు మన సుకృతం కొలదీ మనకు దక్కింది స్వామి వెంట నడిచి మీ జన్మ చరితార్థం చేసికోండి. అన్నమయ్య ఆ వైభవాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తున్నారు. ఆనందనిలయుని ఆశీర్వాదం పొందండి. తమిళులు కూడా అసంఖ్యాకంగా విచ్చేసి వారి భాషలో ప్రార్థనలు చేస్తున్నారు. ఆ వూరేగింపు ఆ కోడెతిరుణాళ్ళ శోభ వర్ణించటం నావల్ల నేమవుతుంది? అన్నమయ్య వివరమును మనకు అర్థమయ్యేట్లు చెప్తాను. చదివి జన్మతరింపజేసికోండి.

**భావ వివరణ:**

అప్పడు (సర్వ జగతికి తండ్రియైనట్టి) శ్రీవేంకటేశ్వరుడు అలమేల్మంగమ్మ కలిసి కుప్పలుగా భోగించీ (విరివిగా సుఖించారు) ఆ కోడెతిరునాళ్ళు (ఆ వసంతోత్సవము) కన్నులపండువగా వీక్షించి తరించండి.

ఆయన యెలా వేంచేస్తున్నాడో తిలకించండి. సింగారపు మేడనుండి తమ (ఆనంద నిలయ భవనం నుండి) చీనీ చీనాంబరములు (పట్టువస్త్రములు) ధరించి, వీనుల విందుగా సన్నాయి మేళము వింటూ, పొందుగా (హాయిగా) విహరించి వచ్చి ఈ కోనేటి ఒడ్డున ఉయ్యాలలూగుతూ ఈ కోడె తిరునాళ్ళలో మెరసిపోవుచున్నాడు. ఏమియీ వైభవం!!





ఆముకొన్న పన్నీట నద్దిన దుప్పటి (విరివిగ చల్లిన పన్నీరుతో అద్దిన గట్టి వస్త్రము) పై వారిని ప్రతిష్టించినారు. దోమటి పూవుల దండలతో (దట్టముగా అల్లిన పుష్పమాలలను) దూలాడగా (వ్రేలాడేట్లు) వేశారు. కోమలముగా నున్న కొమ్మలు (స్త్రీలు) లావుగవాడగ (పెద్దగా పాడుతున్నారు). ఈ విధముగా ఈ కోడెతిరునాళ్ళలో వారు (శ్రీవేంకటేశుడు, అలమేల్మంగ) గోమున (సౌకుమార్యముతో) అవధరించారు. (సావధానులైయున్నారు).

ఆ ఊరేగింపు అడుగడుగునకూ ఆగుతూనే వున్నది. స్వామి భక్తులనుండి విడేలు (తాంబూలము) నందుకొంటూ, భాగవతులు అవిశ్రాంతముగా పాడుచున్న సంకీర్తనలు ఆలకిస్తూ గొడుగులు పట్టుకొనేవారు స్వామికి పన్నగేంద్రుని పడగలవలె పట్టుకొని వెంటవెంట తరలివస్తుంటే చామరములు (వింజామరలు) వీచేవారు వీస్తుంటే, ఈ కోడెతిరునాళ్ళను స్వామి అతిశయముగా వినోదించుచున్నాడు.

అనేక వాయిద్యముల కనుగుణముగా నట్టువలు (నర్తకులు) నృత్యములను చేయుచున్నారు. విచిత్రవేషధారులు పానిపట్టి (ప్రయత్నపూర్వకముగా) రకరకాల పురాణ పాత్రలను ధరించి వెంట నడచుచూ చూపరులకు దేవతలే వెంటవస్తున్నారా అన్న భ్రాంతిని కలిగించుచున్నారు. అలసట లేకుండా కోలాటములాడుచున్న వారిని అక్కడక్కడా వింటూ ఆ వైభవం చూచి ఆ కోనేటిరాయుడు "సెబాసు" అని మెచ్చుకొంటూ ఆ కోడెతిరునాళ్ళలో మెల్లిగా ముందుకు సాగుతున్నాడు.

వరుసలు దీరిన శ్రీవైష్ణవులు తాళబద్ధముగా ద్రావిడ భాషలో (తమిళములో) స్తోత్రాలు పాడేవారి పొగడ్తలు ఆనందంగా వింటూ ఏకాంగులు (సన్యాసులు) పూవులను చాలా ఎత్తునకు పడునట్లు చల్లుతుంటే ఈ కోడతిరునాళ్ళు గురుతరముగా (శోభాయమానంగా) వున్నది.

అదిగో అటుచూడండి స్వామివారికి నైవేద్యము పెట్టేవారు వడపప్పు, రకరకములైన పప్పులు, ఇడ్డెనలు, పానకము, మంచి మంచి పండ్లు నైవేద్యముగా పెడుతున్నారు. స్వామివారు అప్పటికప్పుడు పైపైన వాటిని స్వీకరిస్తున్నారు. చెప్పనలవిగాని మహిమాన్వితమూర్తియైన ఈ శ్రీవేంకటేశుడు ఆ రకరకాల నైవేద్యములు స్వీకరించి రకరకములైన వాసనలను కుప్పళించీ (కుమ్మరిస్తున్నాడు). ఆ పరిమళములు నాఘ్రాణించి స్వామికి జయము పలకండి.

సంపుటి: 1 కీర్తన : ప్రాణుల నేరమిగాదిది – బహుజన్మ పరంపరచే
సంఖ్య : 362 పుట : 242 రాగం: గుండక్రియ

### గుండక్రియ

**39** **ప్రాణుల నేరమిగాదిది – బహుజన్మ పరంపరచే**
**ప్రాణులు సేసిన తమ తమ – పాపఫలము గాని. ॥ పల్లవి॥**

**హరి సకలవ్యాపకుఁడని – అందరుఁ జెప్పఁగ నెరిఁగియు**
**పరదైవంబుల గొలువక – పాయరు మానవులు,**
**నరపతి భూమేలఁగ భూ – వరు భజియింపఁగ నొల్లక**
**పరిసరవర్తుల వెంబడిఁ – బనిసేసిన యట్లు ॥ప్రాణు॥**

**పొందుగఁ దమతమ చేసిన – పూజలు మ్రొక్కులుగైకొన**
**అందముగాఁ బురుషోత్తముఁ – డాతఁడె కలఁడనియు,**
**అందరు నెరిఁగియు నితరులఁ – జెందుదు రున్నతశైలము**
**నందక చేరువ తరువుల – నందుకొనిన యట్లు. ॥ప్రాణు॥**

**శ్రీవేంకటపతి యొక్కఁడె – చెప్పఁగ జగముల కెల్లను**
**దైవము నాతుమలోపలి – ధనమనఁగా వినియు,**
**సేవింపరు పామరు లీ – దేవుని మధురం బొల్లక**
**వావిరిఁ బులుసులు చేఁదులు – వలెనని కొనునట్లు. ॥ప్రాణు॥**

**అవతారిక:**

దేవదేవుడు, పురుషోత్తముడు అయిన శ్రీహరిని పూజించకుండా అన్యదేవతలను పూజించువారు యేనాటికీ ముక్తిని పొందలేరు. కొన్ని వరములను పొంది కోరికలు సిద్ధింపజేసికొనవచ్చును. కాని ఆ తీరిన





కోరికలవల్ల అప్పటి కానందం కలిగిన కడకు కన్నీరే మిగులుతుంది. శ్యమంతకమణి వుదంతం గుర్తుకు తెచ్చుకోండి. అయితే ఇది ప్రాణుల నేరము కాదంటున్నారు అన్నమాచార్యులవారు. యెన్నో జన్మల పరంపరలో జీవి అనేక పాపకర్మలు చేసి వాటి ఫలితం అనుభవిస్తూ పరితపిస్తూ భగవంతుడికి దూరంగానే వుంటాడు. ఏదో ఒక నాటికి ఆయనకి కరుణ కలిగి తనదారికి తిప్పుకొంటాడు. అందాక అంతర్యామిగా మనలోనే వున్న హరిని గుర్తించలేక అలిసిపోతుంటాం. ఆ హరి చరణమును శరణంటే దరిచేర్చుకుంటాడు. అందాకా... "చిల్లర రాళ్ళకు మొక్కుతువుంటే, చిత్తశాంతి దొరకదు గాక దొరకదు. రాజు గారిని నమ్ముకోవాలిగాని రాజోద్యోగిని నమ్ముకుంటే యేమి లాభం? దూరాన వున్న ప్రదేశం గురించి తెలియాలంటే సమున్నత శైలము నెక్కాలి, యేదో కనబడ్డ చెట్టెక్కితే యేమిలాభం? తింటే తియ్యటి పాయసం తినాలిగాని పుల్లటివి చేదువి యెన్నితిన్నా ప్రయోజనం యేమిటి అంటున్నారు అన్నమయ్య.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఇది (శ్రీహరినే నమ్ముకొని యుండక పోవుట) ప్రాణులనేరమిగాదు (జీవులు చేసికొనిన అపరాధం కాదు). ఎందుకంటే, ప్రాణులన్నియు బహుజన్మల పరంపరలో (వరుసలో) తాము చేసే అనేక పాపాల పర్యవసానంగానే అజ్ఞానంతో శ్రీహరి తమ యెదుటనే వున్నా గుర్తించి శరణువేడని దౌర్భాగ్యులుగానే వుండిపోతారు.

ఏ ప్రవచనం వినినా శ్రీహరి సర్వవ్యాపకుడు శరణాగత రక్షకుడనే చెబుతారు కదా! అది విన్నవాడెవడైనా నిజమైన భక్తుడయ్యాడా? మానవులు అప్పటికప్పుడు తమ కోర్కె నెరవేరాలని పరదేవతలను (అన్యదేవతలను)

ఆశ్రయించక మానరు. ఇదింతే. దీనికి చేయగలిగిందేముంది? ఒక దేశాధినేత అయిన రాజుగారిని ఆశ్రయిస్తే ఆ పని జరుగుతుంది కాని, యెవడో రాజోద్యోగిని ఆశ్రయించితే పరిసరవర్తనులయిన (రాజునాశ్రయించి వెంటబడే) ఆ రాజోద్యోగివల్ల మనకేమి లాభం వుంటుంది?

మనం పూజిస్తే పురుషోత్తముడైన శ్రీహరిని పూజించాలి. పొందుగా (చక్కగా) తమతమ పూజలని స్వీకరించుటకు ఆయన యెల్లప్పుడు సిద్ధంగా వుంటాడు. ఆయన ద్వారా ఈప్సితాల నీడేర్చుకోవాలిగాని చిల్లరదేవుళ్ళనాశ్రయించటం అవివేకం కాదా? దూరానవున్న దృశ్యమేదైనా చక్కగా కనుపించాలంటే ఆ దగ్గిరలోవున్న ఉన్నత శైలము (ఎత్తైన కొండ) నెక్కాలి అంతేకాని యేదో కనబడ్డ చెట్టునెక్కితే యేమి ప్రయోజనముంటుంది చెప్పండి? అయ్యలారా!

చెప్పగ (చెప్పాలంటే) శ్రీవేంకటేశ్వరుడు వొక్కడే జగములకెల్ల దైవము (జగదీశ్వరుడు). ఈయనే మన ఆతుమలోపలి ధనము (ఆత్మ నిధానము) ఇది యెంతో మంది జ్ఞానులు చెప్పిన జ్ఞానబోధ. ఇది అంతా యెఱిగి కూడా పామరులు (అజ్ఞానులు) ఈ దేవుని సేవింపక యెందరో చిన్నచిన్న దేవుళ్ళని ఆశ్రయిస్తుంటారు. దీనికి యెవరేమి చేయగలరు? చక్కటి తీపులు (మధుర భక్ష్యాలు) తమ చెంతనేవున్నా పుల్లటి పండ్లను చేదు వంటకాలను తింటామనే వారిని మనమేమి చేయగలం చెప్పండి? ఎవరికర్మ వారిది... అంతే.





సంపుటి: 1 కీర్తన : ఎన్నిబాధలబెట్టి-యేఁచెదవు నీవింక
సంఖ్య : 284 పుట : 190 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

**40 ఎన్నిబాధలఁ బెట్టి - యేఁచెదవు నీవింక -**
**నెంతకాలముదాఁక గర్మమా!**
**మన్నించు మనుచు నీ - మఱుగు చొచ్చితిమి మా -**
**మాటాలకించవో కర్మమా! ॥ పల్లవి॥**

**ప్రతిలేని దురితముల - పాలుసేయక నన్నుఁ -**
**బాలించవైతివో కర్మమా!**
**తతితోడ నాత్మపరి - తాపంబు తోడుతను -**
**తగులేల సేసితో కర్మమా!**
**జితకాములకు గాని - చేతికిని లోనయి -**
**చిక్క వేకాలంబు కర్మమా!**
**మతిహీనులైనట్టి - మాకు నొక పరిపాటి -**
**మార్గంబు చూపవో కర్మమా! ॥ఎన్ని॥**

**ఆసలనియెడి తాళ్ళ - నంటఁగట్టుక విధికి -**
**నప్పగించితివి గదె కర్మమా!**
**వాసి విడిచితిమి నీ - వారమైతిమి మమ్ము -**
**వన్నె చెడనీకువో కర్మమా!**
**కాసుకునుఁ గొరగాని - గతిలేని పనికిఁగా -**
**కాలూఁద నీవేల కర్మమా!**
**ఓసరించొక మారు - వొయ్యనే ఒకరీతి -**
**నొల్లనని తలఁగుమీ కర్మమా ॥ఎన్ని॥**

**తిరువేంకటాచలా - ధిపుని మాయలచేత -**
**దెసలఁదిరిగిన యట్టి కర్మమా!**
**హరిదాసులగు వారి - నాదరింతువుగాక -**
**అంత నొప్పింతువా కర్మమా!**
**వరుస నేనుగ మీఁద - వాని సున్నంబడుగ -**
**వచ్చునా నీకిట్లఁ గర్మమా!**
**పరమపురుషోత్తముని - భ్రమతఁబడి నీవిట్ల -**
**బట్టబయలైతిగా కర్మమా! ॥ఎన్ని॥**

**అవతారిక:**

పురాకృత కర్మమును తప్పింప పురుషోత్తమునికైనను వలను గాదనే పురాణాలూ బోధిస్తున్నాయి. అయితే ఆ దేవదేవుడు యే కర్మకు 'కర్త' కానప్పటికీ జరిగిన ఆ లీల (కర్మ) వలన వేదన చెంది శపించినప్పుడు ఆ శాపాన్నికూడా అనుభవిస్తూ జగత్కళ్యాణమే జరిపాడు. ఆయన, ఏడుకొండలపై ఏళ్ళతరబడి 'నిలబడే వున్నాడు'. అదీ కర్మననుభవించటమే కదా!

అటువంటి కర్మను తెగడుతూ అన్నమచార్యులవారు... ఇంకా యెంత కాలం మమ్ము పీడిస్తావే? యెన్ని బాధలు పెడతావే? ఇక నీ బాధ భరించే శక్తి మాకు లేదు. మా మాట మన్నించి మమ్ము వదలిపెట్టి రక్షించవే అని బ్రతిమిలాడుతున్నారు. కొసమెరుపేమిటంటే ఒసే కర్మమా! హరి దాసులను మాత్రం నీవేం చేయలేవే యెందుకంటే వాళ్ళు నీకన్నా యెంతో యెత్తున శ్రీహరిని నమ్ముకొనివున్నారు. వాళ్ళ జోలికి పోతే ఆయన వూరక నిన్ను మన్నించడు. ఏనుగు అంబారీపై పోతున్న వాడిని అయ్యా తాంబూలంలోకి సున్నంలేదు కాస్త ఇస్తే సున్నం రాసుకొంటాను అని యెవడన్నా అడుగుతాడా? అట్లాగే హరిదాసులమైన మా దగ్గరకొచ్చే అర్హతే నీకు లేదంటున్నారు.

**భావ వివరణ:**

ఓ కర్మమా! ఇంకా యెంతకాలం మమ్మల్ని నీవు (యేచెదవే) పీడిస్తావే? యెన్ని బాధలు పెడతావే? ఎంతోకాలంనుంచి మమ్మల్నేడిపిస్తూనేవున్నావు





కదుటే!! నీవు పెట్టే హింసనికయేమాత్రమూ భరింపలేక, మమ్మల్ని రక్షించమని నీ చాటుకు చేరి వేడుకొంటున్నాము మమ్మల్ని మన్నించరాదా?

ఓ కర్మమా! నీ మూలంగా అనేక పాపాలు చేస్తున్నాము. మమ్మల్ని వాటిపాలు చేయక కాస్త రక్షించవే. ఇంత పరితాపం కలిగించే బంధములను మాకెందుకు కట్టిపెడతావే? యెంత మనోవేదన కలిగిస్తావే? ఎవడన్నా జితకాముడు (కోర్కెలను జయించినవాడు) వుంటే, నీవు వాడిని యేమీ చేయలేవు. నీవు విరక్తులకు లొంగియే వుంటావు. మతి హీనులైన మాబోటివారి మీద కనికరించి మాకు పరిపాటి మార్గము (సక్రమమైన మార్గం) చూపించరాదా?

ఓ కర్మమా! ఆశలు అనే గట్టి తాళ్ళతో అంటకట్టేసి మమ్మల్ని 'విధి' అనే దుర్మార్గుడికి ఒప్పగించావు కదటే!! పేరు ప్రతిష్ఠలను పోగొట్టుకొని నీవారిమయ్యాము. మమ్మల్ని ఇంకా చెడగొట్టకు. కాసు విలువ కూడా చేయని చిల్లర పనులు మాచేత చేయించి కాసేపైనా మమ్మల్ని కాలు నిలదొక్కనీయక వేగిరపరుస్తున్నావు. మేమంటే నీకు అంత ఇష్టం యెందుకే! ఈ ఒక్కసారికి "మీరంటే నాకిష్టంలేదు మీ దారిన మీరుపోండి అని మమ్మల్ని తృణీకరించి వెళ్లగొట్టరాదా? తిన్నగా మిమ్మల్ని నేను ఒల్లను అనరాదా?"

ఓ కర్మమా! ఆఖరికి మా వేడుకోలు వినకపోయినా మా హితవును వినుము. అది నీకే మంచిది. మమ్మల్ని నీవు అడ్డమైన దిక్కులలో తిప్పగలుగుతున్నావంటే అది కేవలం శ్రీవేంకటేశ్వరుడి మాయవల్లనే. అందులో నీగొప్పేమీలేదు. నీవు మమ్మల్నేమీ చేయలేవు. యెందుకంటే మేము శ్రీవేంకటేశుని దాసులము. నీవు ఇతరుల నేడ్పించినట్లు శ్రీవేంకటేశుని దాసులను నొప్పించలేవు. ఏనుగు అంబారీపైపోయే సర్వోన్నతుని మా తాంబూలం కొరకు కాస్త సున్నం వుంటే ఇస్తారా అని యే బుద్ధిహీనుడైనా అడుగుతాడా? అదే విధంగా నీకంటే చాలా యెత్తులోనున్న భగవద్భక్తులము మేము. నీవు మమ్మల్ని యేమీ చేయలేవు. మేము నీ భండారం బయటపడేస్తాము. మేమె వరమనుకొన్నావు, పరమపురుషుడైన శ్రీహరి దాసులము భ్రమలో పడి మాజోలికి రాకు. జాగ్రత్త!!

సంపుటి:4 కీర్తన : ఎంతని నుతియింతు రామరామ
యిట్టి నీప్రతాపము రామరామ
సంఖ్య : 485 పుట : 327 రాగం: దేవగాంధారి

**దేవగాంధారి**

**41 ఎంతని నుతియింతు రామరామ యిట్టి నీప్రతాపము రామరామ**
**పంతాన సముద్రము రామరామ బంధించవచ్చునా రామరామ**
**॥ పల్లవి॥**

**బలుసంజీవనికొండ రామరామ బంటుచేఁ దెప్పించితివి రామరామ**
**కొలఁదిలేనివాలిని రామరామ ఒక్కకోల నేసితివట రామరామ**
**వెలయ నెక్కువెట్టి రామరామ హరువిల్లు విరిచితివట రామరామ**
**పెలచు భూమిజను రామరామ పెండ్లాడితివట రామరామ**
**॥ఎంత॥**

**శరణంటే విభీషణుని రామరామ చయ్యనఁ గాచితివట రామరామ**
**బిరుదులరావణుని రామరామ పీఁచమడఁచితవట రామరామ**
**ధరలోఁ జక్రవాళము రామరామ దాఁటి వచ్చితివఁట రామరామ**
**సురలు నుతించిరట రామరామ నీ చొప్పు**
**యిఁక నదియెంతో రామరామ ॥ఎంత॥**

**సౌమిత్రి భరతులు రామరామ శత్రుఘ్నులుఁ(డుఁ?)**
**దమ్ములట రామరామ**
**నీ మహత్త్యము రామరామ నిండె జగములెల్లా రామరామ**
**శ్రీమంతుఁడ వన్నిటాను రామరామ శ్రీవేంకటగిరిమీఁది రామరామ**
**కామితఫలదుఁడవు రామరామ కౌసల్యానందనుఁడవు**
**రామరామ ॥మెంత॥ 485**





**అవతారిక:**

శ్రీరామచంద్రునిపై అన్నమాచార్యులవారు కీర్తన చెప్పారంటే అది సాధారణంగా భజన ప్రక్రియలోనే వుంటుంది. మరామరా అంటూ అదే పనిగా భజించి తన చుట్టూ వల్మీకము (పుట్ట) వెలసినా ఆ నామాన్ని వదలని ఒక బోయవాడు అందించిన మోక్షప్రమాణం రామాయణం. 'రామ' అంటే పాపవిముక్తుని చేస్తానని నారాయణుడు స్వయంగా ప్రతిజ్ఞ చేశాడు. నేటికీ కాశీనగరంలో దేహం చాలించే మోక్షార్తులకు తారకనామం స్వయంగా శివుడే వారి చెవిలో వుపదేశిస్తాడని భక్తులు నమ్ముతారు. అటువంటి రామనామంపై అన్నమయ్యకు యెంత మక్కువో ఈ కీర్తనే నిరూపిస్తున్నది. ఈ కీర్తన గాయకుడు పాడుతుంటే తోటి భక్తులు రామ రామ అని వంత పాడితే చాలును. అనునిత్యం పాపపంకిలంలో కూరుకుపోయి స్వయంగా భగవన్నామ సంకీర్తనయే చేయలేని పామరులను సైతం ప్రభావితంచేసి "వైష్ణవులను" చేసిన ఆచార్యులవారు అభినందనీయులు. ద్రాక్షాపాకంలావున్న ఈ కీర్తనకు భావవివరణ అవసరమే లేదు. కాని మనం వుంటున్నది 21వ శతాబ్దం కాబట్టీ మనకు 'టెల్గూ' రాదనుకోవటం 'గొప్పతనం' కాబట్టి, ఒకటి రెండు మాటలకి వివరణ అవసరం వచ్చింది. అంతే. ఉదాహరణకి, "ధరలో జక్రవాళము రామరామ దాటి వచ్చితివట రామరామ" అనే వాక్యానికి అర్థం నూటికి తొంబది యెనిమిది మందికి రాదని (యెందుకంటే... నాకూ... రాదు) నాకు తెలుసు. పర్వాలేదండీ పాండిత్యంకంటే భక్తి గొప్పదని భక్తికంటే పట్టుదల గొప్పదని వాల్మీకి యేనాడో నిరూపించిన కర్మభూమి మనదేశం. చుట్టూ కొండలు వున్న లంకా ద్వీపంలో వాటిని దాటి వచ్చాడట కోదండరాముడు. అదీ సంగతి.

**భావ వివరణ:**

ఓ శ్రీరామచంద్రా! నిన్ను యెంతని కీర్తించనయ్యా! నీపేరే "వీరరాఘవుడు" ఓ రామా! నీవు ఆనాడు పంతముతో సముద్రమును బంధించి వారధి

కట్టించితివి. అట్లు చేయవచ్చునా (చేయగలరా?) శ్రీరామా అది అన్యులకు అసాధ్యము.

ఓ శ్రీరామా! ఆనాడు ఇంద్రజిత్తుతో పోరునందు నీ తమ్ముడు లక్ష్మణుడు మూర్ఛిల్లగా నీ బంటు అయిన హనుమంతునితో సాటిలేని సంజీవని పర్వతాన్ని తెప్పించినావు. కొలదిలేని (సాటిలేని) వాలిని ఒకే ఒక బాణంతో విగత జీవుని చేశావు. నిండు సభలో సాటిలేనట్లు శివధనస్సును యెక్కువెట్టి విరిచితివట కదా! ఆపైన పెలుచు (అతిశయించిన) భూమిజను (సీతను) పెండ్లియాడితివట. ఓ శ్రీరామా! నీ దివ్యగాథను గానం చేయుచూ మేము మా జన్మ తరింపజేసికొంటున్నాము తండ్రీ!

ఓ శ్రీరామభద్రా! నీవు శత్రువు సోదరుడైనా విభీషణుడు శరణాగతితో నీ వద్దకు వస్తే చయ్యన (వెంటనే) వానిని ఆదరించి రక్షించావు. బిరుదుల రావణుని (సమర్థుడైన రావణాసురుని) పీచమడచితివి (యుద్ధమున సంహరించావు) అందుకోసం సముద్రం మధ్యలో చుట్టూ చక్రవాళము (కొండల మధ్య వర్తులాకారం)లో వున్న లంకా ద్వీపానికి సముద్రాన్ని దాటివచ్చావు. అప్పుడు శ్రీరామా! నిన్ను దేవతలు సైతము కీర్తించిరి. ఇక నీచొప్పు (నీవు అనుసరించిన జీవనగమ్యము) యెంత వున్నతమైనదో మళ్లీ చెప్పనవసరంలేదయ్యా!.

ఓ రామ భూవరా! సుమిత్రానందనుడైన లక్ష్మణుడు, భరత శత్రుఘ్నులూ నీ అనుంగు తమ్ములు. వారు నిత్యమూ నిన్ను సేవిస్తుంటారు. నీ మహాత్మ్యముతో ఈ సర్వజగత్తు నిండిపోయింది. ఓ శ్రీరామచంద్రా! నీవు అన్ని విభవములుగల శ్రీమంతుడవు. శ్రీవేంకటగిరి మీద వెలసిన వేంకటరాముడవు. కామిత ఫలములను (కోరుకొన్న కోర్కెలను) సత్వరమే తీర్చెడి కౌసల్యానందనుడవు నీవే తండ్రీ!





సంపుటి: 4 కీర్తన : ఎప్పటిజీవవుడే యెప్పటి యెంతగాలమును నీరతే
సంఖ్య : 437 పుట : 295 రాగం: బౌళి

**బౌళి**

**42 ఎప్పటిజీవుఁడే యెప్పటిజగమే యెంతగాలమును నీరీతే**
**కప్పువచ్చితి వనాదినుండియు కర్మమ యింకా వేసరవా ॥ పల్లవి॥**

**మఱచితివా తొలుజన్మంబుల మరణకాలముల దు:ఖపుఁబాట్లు**
**మఱచితివా యమకింకరులయి మర్దించిన బహుతాడనలు**
**మఱచితివా నరకకూపముల మాఁటికి మాఁటికిఁ బరచిన బాధలు**
**మఱియును సుఖమని భవమే కోరెదు మనసా ముందర గానవుగా**
**॥ఎప్పటి॥**

**తలఁచవుగా జననకాలమునఁ దనువిదియే యిటు పుట్టిన రోఁతలు**
**తలఁచవుగా బాల్యంబునఁ దల్లితండ్రుల శిక్షలు వ్యాథులును**
**తలఁచవుగా సంసారమునకును దైన్యంబున యాచించెటి యలమట**
**తలఁపుననిదియే వలెనని వోమెదు తనువా యింకా రోయవుగా**
**॥ఎప్పటి॥**

**కంటివిగా మలమూత్రాదుల కడుగఁగఁ దీరని దినదినగండము**
**కంటివిగా కనురెప్పలనే కాలముగడచేటికడత్రోవ**
**కంటివిగా శ్రీవేంకటపతి కరుణచేత నీ వివేకభావము**
**అంటి యిటువలెనె సార్వకాలమును అంతరాత్మ నినుఁదలఁచగా**
**॥ఎప్పటి॥437**

**అవతారిక:**

ఒక జీవి జన్మిస్తున్నదంటే అదేమొదటి జన్మా? అట్లా యెన్ని జన్మలు పొందుతాడో ఆ జీవి, యెవరికి తెలుస్తుంది? ఈ జీవుడు యెప్పటివాడు? ఏమో యెవరికి తెలుస్తుంది? పోనీ వీడు జన్మలను పొందుతున్న జగత్తు

యెప్పటిది? అదీ చెప్పలేము. పోనీ వీడు యెంత కాలం నుండి ఈ జన్మలు పొందుతున్నాడు? అదీ చెప్పలేము. పోనీ వీడు యెంత కాలం ఈ జన్మలు పొందుతాడు? అదీ చెప్పలేము. ఎన్నాళ్ళయినా ఈ రీతే. దీనికి అంతూలేదు పొంతులేదు అంటున్నారు అన్నమాచార్యులవారు. ఆయన వీటన్నిటికీ కర్మము మూలకారణము అంటున్నారు. అనాది నుండి పూర్వజన్మ వాసనలను కప్పుక వచ్చితివి ఇంకా ఈ జీవిని యెన్ని తిప్పలు పెడతావే? నీకు ఇంకా విసుగుపుట్టటం లేదటనే? అంటున్నారు. ఈ జన్మలూ, బాలారిష్టాలూ, సంసారతాపత్రయం, వ్యాధులు ముసలితనంలో చావూ, నరకలోకం పీడా... యెన్నాళ్ళయినా ఇంతేనా ఈ రోతకు విసుగూ విరామంలేవా?

ఇక జంతు జన్మ అయితే చింతించే బుద్ధి కూడా వుండదు. ఆహార నిద్రా భయమైథునాలకే పరిమితమైన దేహం వుంటుంది. దినదినగండంగా బ్రతికినంతకాలం బ్రతకటం... అంతే.. మన కనురెప్ప తెరచి మూసేలోగా కాలం కరిగిపోతూనే వుంటుంది. ఇక ఇదింతే... ఏదో ఒకనాడు ఓ శ్రీవేంకటపతి! నీ కృప నాపై కలుగుతుంది. అప్పటినుండి సర్వకాల సర్వావస్థలయందు నా అంతరాత్మ నిన్నే తలుస్తుంటుంది. మళ్లీ ఆదారిలో జన్మలూ, భ్రాంతులూ, నవ్వులూ కన్నీళ్ళు కొన్నాళ్ళకు విరక్తి. అప్పుడు ఈ "కామి" "మోక్షగామి" అవుతాడు.

**భావ వివరణ:**

ఓ కర్మమా! వీడు (నీవు ఏడిపిస్తున్న ఈ జీవుడు) యెప్పటివాడే? వీడు వుంటున్న ఈ జగత్తు యెప్పటిదో అదన్నా తెలుసా? యెంతకాలమైనా ఇదే రీతి (విధానము). మార్పుయేమన్నా వున్నదా? ఈ జీవుణ్ణి అనాదినుండి కప్పుకవచ్చితివి (ఆక్రమించుకొని వున్నావు). ఇంకా వేసరవా (విసుగుపుట్టదా?) నా దారిన నన్నొదిలేయరాదా?

ఒసే మనస్సా! నీకు ముందరేముందో తెలీదు (రాబోయే జన్మ తెలీదు). నీ తొలి జన్మంబులనన్నింటినీ మరిచిపోయావు. ఆ జన్మలలో చచ్చేటప్పుడు





యెంత యాతనపడ్డావో యెంత దు:ఖపడ్డావో యెంత కష్టపడ్డావో అప్పుడే మరచిపోయావు. పోనీ యమలోకంలో యెట్లా మర్దించి బాధలు పెట్టారో అదన్నా గుర్తుందా? ఉహూ, నీకు యెప్పటికప్పుడే "పరగడుపు" ఆ నరక కూపాల్లో వాళ్ళు మాటికి మాటికీ పరచిన బాధలు అప్పుడే మఱచిపోయావు. అన్నీ మరచి మళ్ళీ సుఖంగా వుండే భవము (జన్మ) కావాలని ఆశపడుతున్నావు. దానికోసం యేవేవో పుణ్యకార్యాలూ చేస్తున్నావు. ఇంకా యెంత కాలమే?

ఒసే! తనువా! (శరీరమా!) నీకు రోతపుట్టటం లేదటే? నీ ఈ జన్మ యెంత రోతపుట్టించింది? మీ అమ్మకడుపులో తొమ్మిది నెలలు, దుర్గంధ భరితమైన నెత్తుటిమడుగులో చిమ్మచీకట్లో దిక్కు మొక్కూ లేకుండా వున్నావు. పోనీ మీ అమ్మ కడుపులోంచి బయటకు వచ్చాక నీ బాల్యం గుర్తుందా? నిన్ను నీవు చీమనుంచి కూడా రక్షించుకోలేక అన్నిటికీ యేడిచేవాడివి. ఆకలి, నొప్పి అనికూడా చెప్పుకోలేని అర్భకుడివి. పోనీ పెళ్ళి చేసుకొని సంసారంలోనన్నా సుఖపడి యేడిచావా అంటే అదీ లేదు. ఎంతమందిని దైన్యంతో యాచించావు? ఎంతమందితో తిట్లు తిన్నావు? ఎంత అలమటించావు? నీ తలపున ఇది కావాలి అది కావాలి అని ఆశించి వోమెదువు (రాజీకొస్తుంటావు?) ఇంకా నీకు రోతపుట్టదేమే?

ఒసే అంతరాత్మా! ఎన్ని జంతు జన్మలెత్తావే? మలమూత్రాదులను విసర్జించి అలాగే కడుక్కోకుండానే నీవు తిరిగిన వైనం మాకు తెలియదా? కనురెప్ప మూసేలోగా నిన్ను ఇంకే జంతువు పట్టుకొని గుటుక్కుమని మింగుతుందో తెలియదు. ఏ వేటగాడు నీవు పోయే దారి కడత్రోవ (ఆఖరిదారి) చేస్తాడో తెలియదు. నీకు తెలియకుండానే ఒకరోజున అట్లా అఘోరిస్తున్న నీపై ఆ శ్రీవేంకటపతికి దయ కలుగుతుంది. నీలో వివేక భావము కలుగుతుంది. అంటి (పూనుకొని) ఈవిధంగా ఓ వేంకటపతీ! సర్వకాలమునా అంతరాత్మ నిన్ను తలచగా (ధ్యానించగా) యేదో ఒకనాటికి దీనికి (ఈ అంతరాత్మకి) ముక్తి కలుగుతుంది.

సంపుటి: 4 కీర్తన : ఏలయ్య పరమాత్మ యేలికపు మాకునై
సంఖ్య : 64 పుట : 403 రాగం: ధన్యాసి

## ధన్యాసి

**43 ఏలయ్య పరమాత్మ యేలికపు మాకునై**
**నాలినే పెట్టితివి నాడూను**
**కాలునికి మమ్ము నరిగాఁపులే కమ్మనుచు**
**నేలనే తిప్పేవు నేఁడూను ॥ పల్లవి॥**

**భారమగు నీటిలోఁబవళించి నీ వాది-**
**నారాయణుఁడవైతి నాఁడూను**
**పైరుగా నిందరిని ప్రకృతిలోపలఁదెచ్చి**
**నారుగాఁ బోసితివి నాఁడూను**

**నారపేరిడి తండ్రి నందనుని బిలవఁగరు-**
**ణారసము నించితివి నాఁడూను**
**చేరి కడు మమ్ము రక్షింపనోపక వట్టి**
**నేరములె యెన్నేవు నేఁడూను ॥ఏలయ్య॥**

**దట్టముగఁ జొచ్చి యిందరిదేహములలోన-**
**నట్టనడుమెక్కితివి నాఁడూను**
**అట్టలుగ బ్రహ్మాండమనియించి జంతువుల-**
**నట్టే ముంచితివి నాఁడూను**

**ఒట్టి యిందరికి సరయూ (యవు?) దరిని మోక్షంబు**
**నట్టు కొట్టితి గొంత నాఁడూను**
**పొట్ట పొరుగునఁ దెచ్చి భూతముల మెడగట్టి**
**నిట్టి (ట్ట;) పిడినేఁపేవు నేఁడూను ॥ఏలయ్య॥**





**పొలుపుగా మమ్మిట్లఁ బుట్టించుకొరకునే**
**నలిననాభుఁడవైతి నాఁడూను**
**పలువేలుపులకెల్ల పదవులిన్నియు నొసగి**
**నలుగడల నునిచితివి నాఁడూను**

**చలముకొని దానవులఁ జక్కాడి దేవతల**
**నలఁకువలు దీర్చితివి నాఁడూను**
**చెలఁగి యిందరిఁగావ శ్రీవేంకటాద్రిపై**
**నెలకొనిటు నిలిచితివి నేఁడూను. ॥ఏలయ్య॥ 64**

**అవతారిక:**

"నాలిని" పెట్టుట అంటే వంచన చేయుట అని అర్థం. పరమాత్మునితో అన్నమాచార్యులవారు విన్నవించుకొంటున్నారు. నువ్వులోకపాలకుడవు కదా! మేము అర్భకులం. మమ్మల్ని మభ్యపెట్టి మాచేత చేయరాని పాపాలను చేయించావు. నాడూను నేను బలిపశువునే అయ్యాను. మరి నేడూను (ఈనాడు) కాలునికి (యమునికి) మమ్ము కట్టు కావలి పెట్టి ఈ లోకంలో పిచ్చి వాళ్ళను తిప్పినట్లు తిప్పుతున్నావు. నాడు నువ్వు ఆదినారాయణుడవు. ప్రకృతి నుంచి మాకు నారుపోసి పెంచావు. తండ్రికి తన పుత్రునిపై అంత కరుణ యెలా కలుగుతున్నది? నీవల్లనే. నేడు మేము ఆ బంధాల వశులమైపోతే మళ్ళీ నువ్వు మమ్మల్నే నిందిస్తావు. ఇదేమి న్యాయం ప్రభూ! మా దేహాలలో అంతరాత్మగా దూరి మా జన్మ కారకుడవయ్యావు. అంతవరకూ బాగానే వున్నది మరి ఇంత బ్రహ్మాండంలో మమ్మల్ని జంతువులాగానే ప్రవర్తింపజేస్తున్నావు ఏమిటి స్వామీ! నీ లీల.

గమనిక : ఇదే ఇతివృత్తంతో అన్నమయ్య అనేక కీర్తనలు చెప్పటం వలన ఇది మనం ఇదివరకే చదివినట్లుంటుంది. కానీ ఇది అది కాదు. ఇది వేరేదే.

**భావ వివరణ:**

ఓ పరమాత్మా! నీవు యేలికవు (లోకపాలకుడవు). మాకునై (మాకోసము) నాలినే (వంచననే) పెట్టితి వేలయ్య? విధించితివెందులకు? నాడూను (ఆనాటినుంచి) నీతీరు ఇదియే. మమ్ము కాలునికి (యమధర్మరాజునకు) అరిగాపులే కమ్మనుచు (మేమే మూల్యము చెల్లించే కాపలాలో వుండమని) నేడూను (ఈ జన్మలో కూడా) తిప్పేవు యేలయ్యా? (యెందుకు పిచ్చి వాళ్ళలా పరుగులు పెట్టిస్తున్నావు స్వామీ?)

అనంతజలధియైన సాగరమున మఱ్ఱియాకుపై పవ్వళించిన ఆదినారాయణుడవైతివి నాడూను (సృష్ట్యాదియందు). నాడూను (ఆనాడే) ఇందరిని (ఈ జీవులందరినీ) పైరుగా ప్రకృతి లోకి తెచ్చి నారు బోసితివి (ఈ ప్రకృతిలోనికి తీసికొనివచ్చి సశ్యమును పెంచినట్లు పెంచి పోషించావు.) ఇదంతా యెందుకు చేస్తున్నావు స్వామీ!

తన కన్న కొడుకును ఒక తండ్రి పేరుపెట్టి పిలిచిన నాటినుంచే ఆ తండ్రి గుండెల్ని కరుణారసముతో నింపేస్తున్నావు. అనాదిగా ఇంతేకదా! మరి నేడు మేము మమతానుబంధాలకు కట్టువడి వ్యధ చెందుతుంటే తిరిగి నీవు మమ్మల్నే దోషులుగా నిలబెడుతున్నావు. ఇదంతా యేలయ్యా?

ఇందరి జీవుల దేహములలోనూ దట్టముగా అంతర్యామి వలె దూరి, నాడూను (అనాదిగా) అతిశయించితివి. ఇంత పెద్ద బ్రహ్మాండమును క్షణంలో నామరూపాలు లేకుండాచేసి జంతువుల తీరుగా మమ్ము అణగించి నట్టేటముంచేశావు. ఇదంతా యెందుకు చేస్తున్నావయ్యా?





ఇన్ని జీవులకు ఒట్టి (పూనుకొని) క్రమేపీ ముక్తిని ప్రసాదిస్తావు. కొంతనట్టుకొట్టితివి (కొంత ఆలస్యం మాత్రం తప్పదు). పోనీ ఈ జీవులను వారి దారిన వారిని ఒంటిగా వదలిపెడతావా అంటే... అదీలేదు. ఈ భూతములకు (జీవులకు) తోడూనీడా అని ఇంకొకరిని మా మెడకు అంటకడతావు. ఈ విధంగా మమ్మల్ని వేపుకుతింటావు. నేడూను (ఈనాటికీ) నీది ఇదే తంతు. ఓదేవదేవా! ఇదంతా యేలయ్యా!

ఈవిధంగా మమ్మల్ని పుట్టించుటకోసం ఆనాడు పద్మనాభుడవై, నీ నాభికమలంలోంచి బ్రహ్మదేవుని సృష్టించి... ఆయనకు తోడుగా దక్షుడు, అంగిరసుడు మొదలైన నవ బ్రహ్మలను సృష్టించి జీవుల పుట్టుక నిర్వర్తించావు. సృష్టి స్థితి లయ కార్యములు నిర్వహించుట కొరకు ముక్కోటి దేవతలను వారికి మళ్ళీ శంకరుడు, దేవేంద్రుడు వంటి అధినాథులను నియమించావు. వారిని నలుగడల (అన్నిచోట్లా) నీ కార్యక్రమ బాధ్యతలనే పంచి ఇచ్చావు. అనాదిగా నీది ఇదే తంతు. ఇలా యెందుకయ్యా?

అదట్లావుంటే, నీ సృష్టిలోనే కొందరిని చలముకొని (మత్సరముగల) దానవులను చేస్తున్నావు. వాళ్ళను జక్కాడి (వధించి) దేవతలను సంరక్షిస్తావు. అనాదిగా వారిని (దేవతలను) అమరులను (చావులేనివారిని) చేశావు. మోసంతో అమృతము దేవతలకర్పించావు. సరే! మా కర్మకు మమ్మల్ని వదలివేయక ఈ జీవులనందరినీ రక్షించటంకోసము తిరుమల శిఖరాలపై వెలసి నేడూను అలా నిలుచునేవున్నావు. తండ్రీ! ఏడుకొండలరాయుడా! యేలనయ్యా? మాకోసం ఇంత శ్రమ పడుతున్నావు?

సంపుటి: 5     కీర్తన : రాధామాధవ రతి చరిత మితి
సంఖ్య : 166   పుట : 112     రాగం: రీతిగౌళ

రీతిగౌళ

44 రాధామాధవరతిచరితమితి
బోధావహం శ్రుతిభూషణం ॥ పల్లవి॥

గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి
విహరతస్తదా విలసంతౌ
విహతగృహాశౌ వివశౌ తౌ ॥రాధా॥

లజ్జాశబళ విలాసలీలయా
కజ్జలనయన వికారేణ
హృజ్జావ్యవహృత (హిత?) హృదయా రతి
స్పృజ్జా సంభ్రమచపలా జాతా ॥రాధా॥

పురతో యాంతం పురుషం వకులై:
కురంటకైర్వా కుటజైర్వా
పరమం ప్రహరతి పశ్చాల్లగ్నా
గిరం వినాపి వికిరతి ముదం ॥రాధా॥

హరి సురభూరుహ మర్త్వతివస్వ- (మారోహతీవ?)
చరణేన కటిం సంవేష్ట్య
పరిరంభణ సంపాదితపులకై-
స్పురుచిర్జాతా సుమలతికేవ ॥రాధా॥

విధుముఖదర్శన విగళితలజ్జా-
త్వధరబింబఫలమాస్వాద్య
మధురోపాయనమార్గేణ కుచౌ
నిధివద (ద్ధ?) త్వా నిత్యసుఖమితా ॥రాధా॥





సురుచిరకేతక సుమదళ నఖరై-
ర్వరచిబుకం సా పరివృత్య (వర్త్య?)
తరుణిమసింధౌ తదీయదృగ్జల-
చరయుగళం సంసక్తం చకార ॥రాధా॥

వచన విలాసైర్వశీకృత (త్య?) తం
నిచులకుంజ మానితదేశే
ప్రచురసైకతే పల్లవశయనే
రచితరతికళా రాగేణాస ॥రాధా॥

అభినవకల్యాణాంచితరూపా-
వభినివేశ సంయతచిత్తౌ
బభూవతుస్తత్పరౌ వేంకట-
విభుణా (నా?) సా తద్విధినా సతయా ॥రాధా॥

సచ లజ్జావీక్షణో భవతి తం
కచభరం (ర?) గంధం ధూపయతి
నచలతిచేన్మానవతీ తథాపి
కుచసంగాదనుకూలయతి ॥రాధా ॥

అవనతశిరసాప్యతి సుభగం
వివిధాలాపైర్వివశయతి
ప్రవిమల కరరుహరచన విలాసై-
ర్భువనపతి (తిం?) తం భూషయతి ॥రాధా॥

లతాగృహమేళనం నవసై -
కతవైభవ సౌఖ్యం దృష్ట్వా
తత స్తతశ్చరసౌ (శ్చరతస్తౌ?) కేలీ-
వ్రతచర్యాం తాం వాంఛంతౌ ॥రాధా॥

వనకుసుమ విశదవరవాసనయా
ఘనసారరజోగంధైశ్చ
జనయతి పవనే సపది వికారం
వనితా పురుషౌ జనితాశౌ ॥రాధా॥

ఏవం విచరన్ హేలా విముఖ-
శ్రీవేంకటగిరి దేవోయం
పావనరాధాపరిరంభసుఖ-
శ్రీవైభవసుస్థిరో భవతి ॥రాధా॥ 166

**అవతారిక:**

రాధామాధవుల శృంగార రసఝరిలో తలమునకలు చేస్తున్నారు అన్నమాచార్యులవారు. ఇటువంటి కీర్తనలకు ప్రతిపదార్థం వివరించటానికి కొన్ని ఇబ్బందులున్నాయి. ఇది సంస్కృత కీర్తన. సంస్కృతానికి తెలుగు అర్థం ఒక్కొక్కప్పుడు యెబ్బెట్టుగా వుంటుంది. ఇక రెండవ విషయం పాఠకులలో పిన్నవయసు వారికి శృంగార మోతాదు యెంత పరిమితివుంటే అంత మంచిది. సాధ్యమైనంత నర్మగర్భంగా వుండాలి. ఇక నా వయసు వృద్ధులకి శృంగారం నమలలేని పోకచెక్కలాగా ముదావహంకాదు. అందుచే సంస్కృత తాత్పర్య వివరణ చాలా సవరించవలసి వచ్చింది. సంస్కృత పండితులకు నా ప్రత్యేక క్షమార్పణలు. నా ఉద్దేశ్యము నిజానికి ప్రతిపదార్ధ వివరణ కాదు భావ వివరణయే. మూడవ విషయమేమంటే అన్నమయ్య శృంగార వివరణ ప్రేయసీ ప్రియుల సమాగమమనిపించినా నిజానికి అది ఆత్మ పరమాత్మల సాయిజ్యం. మాధవుడు పరమాత్మ. ఆయనను చేరుకోవాలని రాధ అనే ఆత్మ అహరహమూ తహతహలాడుతుంటుంది. చివరికి వారి కలయికే మోక్షసామ్రాజ్యం. ఉత్కృష్టమైన ఈ వివరణనందించిన డా॥ పవన్‌కు యేమిచ్చి ఋణం తీర్చుకోగలనో తెలియదు. పద్మావతీ వల్లభుడు అనునిత్యం ఆయనకు మేలుచేయాలని ఆకాంక్షిస్తున్నాను.





**భావ వివరణ:**

రాధామాధవుల రతి చరితము (శృంగార సామ్రాజ్య విహరణము) నెరుంగుట వేద సమ్మతము (శిష్ట జనామోదకరము) అని గ్రహించవలెను.

రాధామాధవులిరువురూ అంధకారమున కలసి విహరించుచూ రహస్యముగా రతికి ప్రేరేపించుచూ విలాసముగా విహరించు గృహములను వీడినవారై వివశులైరి. అట్టి రాధామాధవుల రతి చరితము కమనీయము మరియు రమణీయము.

అధికమైన సిగ్గు అనే విలాసము చేతను కాటుక కన్నుల వికారము చేతను, హృదయపూర్వకంగా వ్యవహరించు ఇచ్ఛారతిగల రాధ సంభ్రమమునకు, చపలత్వమునకులోనైనది. అట్టి రాధామాధవుల రతిచరితము రమణీయమైనది.

ముందు నడుచుచున్న ముకుందుని కొంటెతనమును సహించలేని రాధ లతల తూళ్ళతోనూ, పొదరింటి దుబ్బలతోను కొట్టుచున్నదై తరువాత మౌనముగా చిరునవ్వులు చిందించుచున్నది. అట్టి రాధామాధవుల రతిచరితము కడు మనోహరమైనది.

పారిజాత వృక్షమును అవనికి దెచ్చిన శ్రీహరి యొక్క నడుమును కౌగలించి పరవశించి పులకాంకితమైన శరీరము గల రాధ సుమలతవలె భాసిల్లుచున్నది. అట్టి రాధామాధవుల రతి చరితము అతి మనోహరమైనది.

విగళత లజ్జ గలదై, చంద్రబింబమువంటి వదనమునందలి బింబాధరములను ఆస్వాదించుచు మధురోపాయ మార్గములచేత కుచమర్దనమున నిత్యసుఖమును కలిగించు రాధామాధవుల రతి చరితము మనోజ్ఞమైనది.

సుందరమైన మొగలిపూవుయొక్క దళములవంటి గోళ్ళతో రాధ నందకిశోరుని చబుకాన్ని పరివేష్టించి యౌవన వనంలో తన చరణ

యుగళమును చేరుటకు సంసిద్ధురాలగుచున్నది. అట్టి రాధామాధవుల రతిచరితము మనోహరమైనది.

తన వాగ్విలాసముతో మాధవుని వశపరచుకొని పొదరింటియందు, పరచిన ఇసుక పరుపుపై రతికళానైపుణ్యము ప్రదర్శించే ఆ యౌవన సామ్రాజ్యాధినేతలైన రాధామాధవుల రతిచరితము కడు రమణీయమైనది.

అభినవ కళ్యాణాంచిత రూపముగలిగిన ఆయత్తచిత్తములతో తత్పరులైవున్న వేంకట విభునితో కూడిన ఆ రాధామాధవుల రతి చరితము అతిమనోహరమైనది.

ఆమె సిగ్గు కల్గిన చూపులతో అతనిని చూస్తూ గంధయుక్తమైన తన జుత్తు వాసనలను గుబాళిస్తున్నది. కుచ సంగమునకు అనుకూలముగా నుంటూ ఆమానవతి కదలకనేయున్నది. అట్టి రాధామాధవ చరితము కడు రమణీయము.

వంచిన శిరస్సు కలదైనప్పటికినీ, అనేక రకములైన పలుకులచే వివశు రాలవుతున్నది. కోమలమైన పవిత్ర కరముల వివిధరచనా విలాసములచేత భువనపతియైయున్న ఆ నందనందనుని భూషించుచున్నది. అట్టి రాధామాధవుల రతిచరితము మనోజ్ఞము.

లతాగృహమునందు రతి సమాగమములచే కొత్తదగు ఇసుకపరుపుల వైభవ సౌఖ్యమును చూచి అక్కడ చరించే జంటలు రతికేళీవ్రతమును కోరుచున్నారు. అట్టి రాధామాధవుల చరితము కడు మనోహరము.

వనపుష్ప విలాస సుగంధములతో ఘనసార (కర్పూర) పరాగ గంధములతో అక్కడ వాయువులు సంచరించే వనితా పురుషులకు తాపము కలిగించుచున్నవి. అట్టి రాధా మాధవుల రతిచరితము మనోజ్ఞమైనది. ఈవిధంగా విహరించు లీలా వినోదియైన శ్రీవేంకటగిరిదేవుడీతడు. ఈయనను పావని రాధాదేవి ఆలింగన సుఖముగల శ్రీవైభవము సుస్థిరముగానుండుగాక!





సంపుటి: 4 కీర్తన : ఇరవుగా నిన్నెరిగిరి యిదివోనీదాసులు
సంఖ్య : 217 పుట : 145 రాగం: గుండక్రియ

## గుండక్రియ

**45** ఇరవుగా నిన్నెరిఁగిరి యిదివో నీదాసులు
పరదైవములమీఁద నొల వేయనేల పనిలేవు
నీ మాయలు కరుణానిధీ ॥ పల్లవి॥

ముంచెను నీపాదములు మూఁడులోకములయందును
యెంచెను నీ వేయినామాలు యిలలో వేదవ్యాసుఁడు
చంచులఁ దలఁచిరి నిన్ను మున్నే సనకాదియోగీంద్రులు
పొంచి యింకా నీకు దాఁగఁ జోటు లేదు
యిందు బొడచూపవే యింకవెడమాయలేలా ॥ఇర॥

కొనెను నీపాదతీర్థము బ్రహ్మ కోరి నీపాదము గడిగి
వినుతించె నీమహిమ తొల్లె వేయినోళ్లగలశేషుఁడు
అనిరి నిన్నెక్కుడనుచు మొదల శుకాదిమునీంద్రులెల్లా
పొనిగి నీవు మాయ సేయఁ జోటు లేదు
మమ్ము పొసఁగి యేలుకోవె పురుషోత్తముఁడా ॥ఇర॥

యెక్కెను ధ్రువుఁడు పట్టము యిదివో నిన్నుఁ గొలిచి
చిక్కెను నీశరణాగతి నేఁడు శ్రీవైష్ణవులచేతను
గక్కన శ్రీవేంకటేశుఁడా యిట్టె కాచితివి మాటకే మమ్ము
యిక్కడ నీమాయ సేయఁ జోటు లేదు
నిన్ను నెరిఁగిరి నీదాసు లిందిరారమణా ॥ఇర॥ **217**

**అవతారిక:**

పరమాత్మను ఇరవుగా (సుస్థిరముగా) నెరిగిన వాడెవడు? ఆయన గుణగణాలు, రూప విలాసములనెరిగినవారెవరు? నిజానికి యెవ్వరూలేరు. దుష్టశిక్షణకై ఏ రూపాన్నైనా ధరించాడు. ఎక్కడ పడితే అక్కడ ప్రత్యక్షమయ్యాడు. ఇదివో నీదాసులు నిన్నెరిగిరి అంటున్నారు తాళ్ళపాక అన్నమాచార్యులవారు. ఓ కరుణానిధీ! నీమాయలకు వశులైనవారు భ్రమపడి నీకృప సత్వరముగా రాదని పరదేవతల నాశ్రయిస్తుంటారు. విశ్వరూపుడవు, విశ్వవ్యాప్తుడవు, విశ్వనేత్రుడవు, విశ్వవందితుడవు నీవు దాగి వుండగల స్థలం వుంటుందా? చతుర్ముఖ బ్రహ్మనీ త్రివిక్రమరూపం చూచి సంభ్రమానంద పారవశ్యములతో నీ పాదములను తన కమండల జలంతో కడిగితే అదే సురగంగ యైనది. ఘన యోగీంద్రులకు లభ్యముకాని నీవు బాలుడైన ధ్రువునికి చిక్కావు. ఓ పురుషోత్తమా! నీ శరణాగతులు మాత్రమే నిన్నెరుగుదురయ్యా! నేడు మాబోటి శ్రీవైష్ణవుల ననుగ్రహించుటకు శ్రీవేంకటేశ్వరుడవై తిరుమల శిఖరంపై చేరావు. ఇక్కడ నీమాయ నీదాసుల జోలికిరాదు. రానేరాదు అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ కరుణానిధీ! ఇరవుగా (సుస్థిరముగా) నీవు ఇటువంటివాడవని నిన్నెరిగిన వారెవరయ్యా! ఇదివో నీ దాసులు (శరణాగతులు) నిన్నెరిగిరి. నీవుండగా పరదేవతలపైన ఒలవేయనేల (చుట్టుకొనుటెందులకు?) నీ మాయలు పనిలేవు. (నీ చిద్విలాసము నెరుంగనసాధ్యము).

అలనాడు వామనుడవై నీవు బలిచక్రవర్తిని మూడడుగుల స్థలమును యాచించితివి. త్రివిక్రముడవైన నీ పాదములు ఈ మూడు లోకములను ముంచెను (ఆక్రమించినవి). ఇలలో వేదవ్యాసులవారు నీ వేయి





నామములను యెంచెను. ఆయన భీష్మాచార్యులవారి నోటిద్వారా వాటిని మాకందించారు. అదే విష్ణు సహస్రనామ ప్రవచనమై జగద్రక్షకమైనది. ఇదిట్లుండగా, మున్నె (అంతకుముందే) సనకసనందనాది యోగీంద్రులు నిన్ను చంచులదలచిరి (భావనాకాశములో నిన్ను భావించగలిగారు). మరి ఇకనీకు దాగికొనుచోటేదయ్యా? ఇంకా నీ వెడమాయలేలయ్యా? (వికృతమైన మాయలు మాపై యేల ప్రయోగించెదవయ్యా!)

ఆనాడు త్రివిక్రముడవైన నీ పాదము నింగినంతయు కప్పివేయగా చతుర్ముఖ బ్రహ్మ పరవశుడై నీ పాదమును కడిగాడు. అదే నీ పాద తీర్థము పవిత్రమైన గంగానదియైనది. తొల్లె (ఆనాడే) ఆదిశేషుడు నీదివ్యమహిమను వేయినోళ్ళతో పొగడినాడు. మొదటి నుండి శుకమహర్షి వంటి భాగవతోత్తములు నిన్ను యెక్కుడు (అధికముగా) కీర్తించిరి. పొనిగి (తృణప్రాయులమైన మాపైన) నామాయలేలయ్యా? నీమాయ చూపుటకు వేరే చోటేలేదా? ఓ పురుషోత్తమా! మమ్మనుగ్రహించి యేలుకోవయ్యా!

ఓ ఇందిరారమణా! ఆనాడు ముక్కుపచ్చలారని బాలుడైన ధ్రువుడు ఇదిగో నిన్ను గొలిచే పట్టమునెక్కెను (ధృవతార అయ్యాడు). నేటికీ ఆయనను దర్శించక వివాహ తంతే పూర్తికాదు. ఈనాడు విశిష్టులైన ఈ శ్రీవైష్ణవులు అందరికీ విశిష్టమైన నీ దివ్య శరణాగతి చిక్కినది దక్కినది. ఇంకా వారికి కావలసినదేమి వున్నది. ఓ శ్రీవేంకటేశ్వరా మమ్ము అనుగ్రహించి నీవు, గక్కున (వెంటనే) మమ్ము మాటకే గాచితివి (కేవలం మాటలతో కీర్తించినందుకే రక్షించితివి) నీదాసులందరికీ నీ శరణాగత రక్షణాదీక్ష గురించి తెలిసిపోయింది. ఇంక నీ మాయజూపే చోటేది స్వామీ?

సంపుటి: 4 కీర్తన : అతడే యెరుగును మముబుట్టించిన అంతరాత్మ
సంఖ్య : 442    పుట : 297    రాగం: లలిత

**లలిత**

**46** **అతఁడే యెరుఁగును మముఁబుట్టించిన యంతరాత్మయగునీశ్వరుఁడు**
**అతికీ నతుకదు చిత్తశాంతి యిదె ఆత్మవిహారం బిఁక నేదో ॥ పల్లవి॥**

**కనుచున్నారము సూర్యచంద్రులకు ఘనవుదయాస్తమయములు**
**వినుచున్నారము తొల్లిటివారలవిశ్వములోపలికథలెల్లా**
**మనుచున్నారము నానాఁటికి మాయలసంసారములోన**
**తనిసీఁదనియము తెలిసీఁదెలియము**
**తరువాతి పనులిఁక నేవో ॥అత॥**

**తిరిగెద మిదివో ఆసలనాసల దిక్కుల నర్థార్జన కొరకు**
**పొరలెద మిదివో పుణ్యపాపములభోగములందే మత్తులమై**
**పెరిగెద మిదివో చచ్చెడి పుట్టెడి భీతిగలుగు దేహములోనే**
**విరసము లెరఁగము మరచీ మరవము వెనకటికాలము విధియేదో**
**॥అత॥**

**అట్టైనారము హరినుచతిచే నాఅడి (డిఁబోవక) గురువనుమతిని**
**పట్టినారమిదె భక్తిమార్గమిదె (మును?) బలువగు విజ్ఞానముచేత**
**గట్టిగ శ్రీవేంకటపతి శరణని కంటి మిదివో మోక్షము తెరువు**
**ముట్టిముట్టము పట్టీపట్టము ముందటి కైంకర్యంబేదో**
**॥అత॥442**

**అవతారిక:**

భగవంతుడు వున్నాడు అంటారే కాని వున్నాడన్న వాళ్ళెవరూ ఆయనను కన్నులయెదుట సశరీరంగా నిలిపి నిరూపించలేదు. పోనీ లేదనుకుందామా ఒక జీవి పుట్టి పెరిగి నశించే క్రమపరచబడిన





కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నదెవరు? పరమాణువుకు జగద్విలయాన్ని సృష్టించగల శక్తి యెక్కడనుంచి వచ్చింది. ఇంత నిబద్ధతతో ఇన్ని అనూహ్య పరిమాణంగల గోళాలు ఖగోళంలో నిర్విరామంగా నిర్నిమిత్తతతో నిరంతర చలన కార్యక్రమం జరుగుతున్నది? ఎవ్వరూ సరయిన సమాధానం చెప్పలేని శేష ప్రశ్న ఇది. మనం వూహించలేని ఈ జగత్తును నిర్వహిస్తున్న ఆ శక్తినే ఈశ్వరుడు అని పిలుస్తున్నాం. మనలో చైతన్య రూపంలో వున్న ఆ ఈశ్వరునే అంతర్యామి అంటున్నాం. ఆ అంతర్యామి జీవిలో ఆత్మరూపంలో విహరిస్తుంటాడు. భగవంతుని మాదిరిగానే వున్నా కనుపించడాయె, పైగా ఒక్కొక్కరిలో ఒక్కొక్కరకంగా వున్నాడు. ఒకణ్ణి సజ్జనుని చేస్తే ఇంకొకడిని దుర్మార్గుని చేస్తున్నాడు. రెండురకాలవారికీ ఒకసారి ప్రశాంతంగా మనశ్శాంతి వుంటుంది. ఇంకొకసారి వారికే మనశ్శాంతి వుండదు. అతికీ అతుకనట్లుండే ఈ చిత్తశాంతే ఆత్మ విహారమంటే. మరొకటి కానేకాదు అంటున్నారు అన్నమాచార్యులవారు. వారి ఆలోచనతో లాక్షణికులు విభేదించవచ్చును. కాని కవి సర్వస్వతంత్రుడు. అతని భావన అవగాహన అతని స్వంతము, అతని అంతర్యామి అధీనము. బయటి ప్రపంచంలో ప్రకృతి రూపంలో ఆ భగవంతుడే వున్నాడు.

**భావ వివరణ:**

మమ్మల్ని పుట్టించిన అంతర్యామి రూపుడైన ఈశ్వరుడు మాత్రమే ఈ సంగతి నెరుగును. అతికీ అతుకనట్లుంటుంది. చిత్తశాంతి (మనశ్శాంతి ఒకసారి వుంటుంది, ఒకసారి వుండదు). దీనినే ఆత్మవిహారము అంటున్నాం. ఇంకోటి యేముంది చెప్పండి.

ఈ ప్రకృతి నిబద్ధత చూస్తున్నాము కదా! ఎంతో ఘనముగా సూర్యోదయం ఉదయాన్నే చూస్తున్నాము. సంధ్యాసమయాన సూర్యాస్తమయాన్నీ చూస్తున్నాము. సూర్యుడస్తమించగానే రాత్రి అవుతోంది. చంద్రోదయం అవుతోంది. తిరిగి సూర్యుడు అదే నిబద్ధతతో

వస్తున్నాడు, చంద్రుడు పోతున్నాడు. తొల్లిటి వారు (మన పూర్వీకులు) వీరినే దేవుని రూపాలని అనేక కథలను చెప్పారు. అవన్నీ వింటూనేవున్నాము. మాయా పరివృత్తమై అంతుచిక్కని ఈ సంసారములో మన మనుగడ సాగిస్తూనే వున్నాము. తనిసీ తనయము (ఒక్కొక్కప్పుడు) అతిశయిస్తాము (ఒక్కొక్కప్పుడు అతిశయించము). తరువాత పనులికనేవో తెలిసీ తెలియము (తరువాత యేమి జరుగుతుందో ఒకసారి తెలుస్తుంది ఒకసారి తెలియదు). మరి నిబద్ధత వుంటే యెప్పుడూ తరువాత యేమి జరుగుతుందో తెలియాలి కదా! అదెందుకు కావటం లేదు?

ప్రకృతి సంగతి కాసేపు అలావుంచి మన సంగతి చూడండి. ఇదిగో ఆసలనాసల (ఆశలపై ఆశలు)తో సతమతమవుతూ దిక్కులన్నీ అర్థార్జనము (ధన సంపాదన) కొరకు తిరుగుతూనే వున్నాము. దానికోసం అనేకమైన పనులు చేసి పాపమూ మూటకట్టుకొంటున్నాము, పుణ్యమూ మూట గట్టుకొంటున్నాము. అనేక భోగాల మత్తులో పడిపొర్లుతున్నాము. పుట్టినదగ్గరనుంచీ చచ్చేదాకా దేవుడిచ్చిన ఈ దేహములోనే మనుచున్నారము (నివసిస్తున్నాము). మనకు జరిగే విరసములు (అవమానాలను) జరిగేదాక తెలియము. జరిగాక జరిగినది మరువాలన్నా మరువలేము. ఇది విధియేనని సరిపుచ్చుకోనూలేము. ఇది విచిత్రమైన మానవ ప్రకృతి.

మేము ఇటువంటి ప్రకృతి చేత, అట్టినారము (బజారున పడ్డాము). సద్గురువుల కృప కలిగి వారి అనుమతితో ఇదే భక్తి మార్గమును పట్టుకొన్నాము. శ్రీహరిని కీర్తించినాము. బలమైన విజ్ఞానము భగవత్ జ్ఞానమును సంపాదించినాము. దానివలన గట్టిగా (ధృఢముగా) శ్రీవేంకటేశ్వరుని శరణాగతిని పొందినాము. ఇదే మోక్షమార్గమని గ్రహించినాము. కానీ ఈ భగవత్ కైంకర్యము (దాస్యము) ముట్టీముట్టము (ఒక్కొక్కప్పుడు చేపడతాము ఒక్కొక్కప్పుడు చేపట్టము) పట్టీ పట్టము. ఇదే ఈశ్వరమాయ, శ్రీవేంకటేశ్వరుని లీల.





సంపుటి: 4 కీర్తన : "నిశ్చింతం పరమం సుఖ" మనుమాటే నిజము నిజము తెలియరుగాని

సంఖ్య : 318 పుట : 214 రాగం: గుండక్రియ

## గుండక్రియ

**47 "నిశ్చింతం పరమం సుఖ" మనుమాటే నిజము**
**నిజము తెలియరుగాని**
**ఆశ్చర్యంబిది పరమయోగులకు ననుభవులకు**
**దృష్టాంతముసుండీ ॥ పల్లవి॥**

**కరచరణాదులుగలచైతన్యము గక్కునఁ బానుపుపైనుండి**
**సరుగన సడిలిన నిద్రామందము సమకూడీ నరులకటువలెనే**
**పరమాత్మునిపై సకలోద్యోగ వు (గో?) పాయంబులు దా దిగవిడిచి**
**ధరఁ దానుండిన బ్రహ్మానందము తనుఁదానే పైకొనుఁజుండీ**
**॥నిశ్చిం॥**

**వున్నతిఁ దానొక దేశములోపలనుండి క్రితముచూచిన నవియెల్లా**
**అన్ని దేశములు నటుదలపోసిన యంతకుగోచరమైనట్లు**
**యెన్నఁగఁబూర్వజ్ఞానంబున సర్వేశ్వరుఁడగు హరిఁదలఁచినను**
**సన్నిధియగు సుజ్ఞానానందము సత్యము సత్యంబదిసుండీ**
**॥నిశ్చిం॥**

**ననిచిన ప్రపంచకత్ప (ల్ప?) ములలో నానావిధముల జంతువులు**
**తనుఁదాఁజాడఁగరానిరూపు లద్దములోపలఁగన్నట్లు**
**ఘనుఁడగు శ్రీవేంకటపతిరూపము గక్కన నెదుటనె సేవించి**
**అనయము తనుఁదా సంతసించుటే యాత్మానందంబిదిసుండీ**
**॥నిశ్చిం॥ 318**

**అవతారిక:**

సుఖముగా లేకపోవుట వేరు చింతిస్తూవుండటంవేరు. సుఖంగా లేకపోయినా నిశ్చింతతో వుండవచ్చును ఎప్పుడు? భక్తీ వైరాగ్యములుంటే. సుఖంగా వున్నా కొంతమంది తృప్తిలేక చింతతోనే గడుపుతారు. కానీ నిశ్చింతవుంటే పరమసుఖంగా వుంటారు. ఇది నిజము. అదియే నిజమని తెలియరుగాని అదే నిజము అంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ విషయం పరమయోగులకు కూడా ఆశ్చర్యం తెప్పిస్తుంది. గొప్ప అనుభవంకలవారికి కూడా ఇదే చక్కని దృష్టాంతము సుమండీ! అంటున్నారు. మంచి మెత్తటి బూరుగు దూది పరుపుపై పడుకొన్నవాడు కమ్మటి నిద్రలోకి హాయిగా జారుకొన్నట్లు ప్రాపంచికమైన యుక్తులు, కుయుక్తులూ విడిచిపెట్టినవారు బ్రహ్మానంద స్థితిని తప్పక పొందగలరంటున్నారు. శ్రీవేంకటేశ్వరుని యెల్లవేళలా దలచుచూ యెప్పుడూ సంతోషంతో వుండటమే ఆత్మానందము అంటే. అదేలేనివాడు యెన్ని మేడలున్నా, యెంతధనమున్నా, యెంత అధికారమున్నా యేమీలేనట్లే. అవునా?

**భావ వివరణ:**

నిశ్చింతగా వుండుటయే మిక్కిలి సుఖవంతమైన స్థితి. ఇట్లు చెప్పెడి మాట నిజము. అయితే ఈ సత్యం చాలామంది యెరుగరు, గాక! పైజెప్పిన సత్యం పరమయోగులకు కూడా ఆశ్చర్యకరమే. అనుభవంగలవారికి ఈ సత్యము గొప్ప దృష్టాంతము సుమండీ!

ఒక వ్యక్తి తన పాన్పుపై సుఖముగా పరుండినదే తడవుగా అతని కరచరణములలో కలిగే చైతన్యంకూడా నిద్రిస్తుంది. నరులందరికీ





అటువలెనే (అట్లాగే) జరుగుతుంది. పరమాత్మునిపై అచంచలమైన నమ్మకంతో సకలోద్యోగ ఉపాయంబులు దిగవిడిచి (అన్నిరకములైన వ్యవహారపు కిటుకులను విసర్జించి) తనలో తానే బ్రహ్మానందము (పరమానందు) అనుభవించుచున్న స్థితిలో వుంటే, బ్రహ్మానందము తనకుతానే (దానంతట అదే) సంప్రాప్తిస్తుంది సుమండీ!

ఎవరైనా రోజూతానొక దేశములో చూచిన వున్నతిని తన స్వంతదేశములో కూడా ప్రవేశపెట్టాలని యోచిస్తాడు. అన్ని దేశముల రాజులూ అట్లే ఆలోచించిన ఉన్నతి దానంతట అదే వస్తుంది. అట్లే తన పూర్వజన్మసుకృతముచేత కలిగిన జ్ఞానముతో సర్వేశ్వరుడైన శ్రీహరిని స్మరించినచో సుజ్ఞానానందము వాని సన్నిధినే నిజముగా యుండును. ఇది సత్యము సుమండీ!

ఈ ప్రపంచంలో ననిచిన (పూచిన) అనేక కల్పములలో నానారకములైన జంతువులు అనేకరూపములతోనున్నవి. మన వెనుక యేమున్నదో మనము చూడలేము. కానీ మన ముందు ఒక అద్దము వుంటే ఆ లోటు తీరుతుంది కదా! అట్లే ఎవ్వరికైనా ఆత్మానందము అంత సులువుగా లభ్యమవదు. మొట్టమొదట శ్రీవేంకటేశుని శరణాగతి పొందవలెను. ఆయన రూపమును తనకన్నులయెదుట నిలుపుకొని, అనయము (ఎల్లవేళలా) తనుదా సంతసించుచు (తన ఆత్మావలోకనంతో తనలో తానే సంతోషముతో) వుండవలెను. అదే ఆత్మానందము సుమండీ!

సంపుటి: 4 కీర్తన : హరిహరి నిను సకలాంతర్యామిని ఆత్మదలచుటే యోగంబు

సంఖ్య : 450 పుట : 303 రాగం: గుజ్జరి

**గుజ్జరి**

**48** **హరిహరి నిను సకలాంతర్యామివి (ని?) ఆత్మఁదలఁచుటే యోగంబు**
**శరణాగతరక్షామణి నిన్నే శరణని యెడిదే తుదిపదము ॥ పల్లవి॥**

**నీయందే యీ సచరాచరమును నీవే చరాచరమందు నిత్యమును**
**పాయక వుండుట గని తలపోయుట పరమార్థంబుల సారంబు**
**కాయము జీవుఁడు నీయధీనమై కలుగఁగఁ బ్రకృతియుఁ బురుషునిఁగానిటు**
**మాయలముంతవు మాయకుఁ జొరవని మతిఁ దలపోయుట సుజ్ఞానంబు ॥హరి॥**

**తనలోఁ (పల) బరతత్వపు నీవును తా నీపరతత్వములోపలఁగా**
**మనసునఁ దలఁచుట వేదాంతంబులమంతనములసన్మార్గంబు**
**ఘనమునకును మరి ఘనమై యందే కడుసూక్ష్మమునకుఁ గడు సూక్ష్మంబై**
**యెనసిన పూసలలోదార మవని యెన్నుటె పరమరహస్యంబు ॥హరి॥**

**ఆతుమలోపల ఘనవైకుంఠము ఆతుమ నీ వైకుంఠములోపల**
**యీతల నాతల సరిగాఁదెలియుట యిదియే బ్రహ్మానందంబు**
**శ్రీతరుణీశ శ్రీవేంకటపతి సేవారతి నిను నీ భజియించెద**
**దాతవు దైవమవై ననుఁగావుము తలఁచెద మిదియే తత్వంబు ॥హరి॥ 450**





**అవతారిక:**

సకలజీవులలో అంతరాత్మగా నున్నవాడు శ్రీహరే. కాని ఏ జీవికీ ఆ హరికృప కలిగేదాకా ఆ విషయం తోచదు. ఒకవేళ తోచినా శ్రద్ధ కలుగదు. హరికృప కలిగినవారికి ఆయనను ఆత్మలో ధ్యానించాలనే వూహ కలుగుతుంది. దానికీ యోగ్యత కావాలి. ఆ యోగ్యత కలుగుటయే యోగము అనబడింది. అది ఆ శ్రీహరి శరణాగతులకే దక్కుతుంది అంటున్నారు అన్నమాచార్యులవారు. అప్పుడే తుదిపదమైన మోక్షము సిద్ధించుతుంది అంటున్నారు. సృష్టిలోని చరాచరములన్నీ ఆ శ్రీహరిలోనే వున్నాయి. ఆయనే వాటన్నింటిలోనూ వున్నాడు. సర్వం విష్ణుమయం అంటే అదేమరి. ఆ శ్రీహరి ఏ మాయకూ లోనుగాడని తలపోయు జ్ఞానమే సుజ్ఞానమంటున్నారు భగవద్గీతా వాక్యాన్ని పునశ్చరణ చేస్తున్నారు అన్నమయ్య. పూసల దండలో ఆ పూసల్ని నిలిపివుంచే దారము కనబడనట్లు ఈ విశ్వాన్నంతా ఆయన ఆక్రమించివున్నా మన కనులకు గోచరించడు. ఇంకొక సత్యమేమంటే ఆత్మలో వైకుంఠాన్ని నిలుపగలిగిన వారిఆత్మ వైకుంఠములోనే వుంటుందంటున్నారు. కొసమెరుపేమంటే ఇవన్నీ చిలుక పలుకుల్లాగా వినటానికే ప్రాముఖ్యతనిస్తే ఇంతే సంగతులు. అనుభవపూర్వకంగా ఆ శ్రీవేంకటేశుని తెలియాలి. అప్పుడే బ్రహ్మానందం కలుగుతుంది అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ శ్రీహరీ! సకల జీవులలో అంతర్యామిగా నెలకొనియున్న నిన్ను ఆత్మయందు నిలిపి ధ్యానించగలుగుటయే గొప్ప యోగము (సిద్ధి). అది అందరికీ దక్కేది కాదు. శరణాగత రక్షామణి (శరణన్నవారికి రక్షణనిచ్చే మణి) వంటి నిన్నే శరణనేదే తుదిపదము (మోక్షమార్గము).

దేవా! సచరాచరము (కదలికగలిగినవి, కదలికలేనివి) రెండూ నీయందేవున్నవి. వింతలలోకి వింతయేమంటే నీవునూ వాటియందున్నావు. నిత్యమూ కన్నులకు కనుపించుచున్న ఈ సమస్త

చరాచరమందు నీవువున్నావు. ఆ విధముగా పాయక (విడువక) నిన్నే తలపోయుచూ వుండుటయే గొప్ప వైభవము. అదే అన్ని పరమార్థముల సారము. మా శరీరము అందులో వుండే ఆత్మ నీ అధీనములోనే వుంటాయి. ప్రకృతి రూపంలో ఈ కాయాన్నీ (దేహాన్ని) పురుషుని రూపంలో ఆ దేహంలో నెలకొనియున్న దేహిని (ఆత్మను) ఈవిధంగా అనేకమైన మాయలలో ముంచుతున్నావు. కాని మాయ నిన్నేమీ చేయలేదు. మనస్సులో ఇది తలపోసి నీ దాసులైయుండకోరుటే సుజ్ఞానము.

ఇక వేదాంత మంతనము (వేదాంతరహస్యము) గురించి ఆలోచిస్తే, సన్మార్గము అలవడుతుంది. అది అలవడినప్పుడుతన మనస్సులో నీ (పరమాత్మ) పరతత్త్వతత్త్వమున్నదనీ, అదే విధముగా నీ పరతత్త్వంలోనే తానున్నానని ఆ వేదాంతి గ్రహించగలుగుతాడు. నీ తత్త్వం తెలిసినవాడు నీవు ఘనమైనవాటికెల్లా ఘనుడవని, సూక్ష్మమైనవాటికెల్లా సూక్ష్మమైనవాడివని జీవులన్నిటిలోనూ పూసలదండలోని దారమువలె వున్నావని అర్థమవుతుంది. పూసలదండకు ఆధారమైన దారమూ కనబడదు. జగత్కారణమైన నీవూ కనబడవు. ఇదే పరమ రహస్యము.

శ్రీమన్నారాయణుని నిలయమైన వైకుంఠము యెక్కడుందో తెలియునా మన ఆతుమ (ఆత్మలోనే వున్నది). దేవా! మోక్షం అంటే మా ఆత్మ నీవైకుంఠము చేరుటే కదా! మరి మా ఆత్మలో వున్నదాన్ని మేము చేరుట యేమిటి? ఈతల (ఇహలోకంలోనూ) ఆతల (పరలోకంలోను) నీ తత్త్వమును తెలియుటయే బ్రహ్మానందము అనబడింది. పరమాత్మ మనలోనే వున్నాడని గ్రహిస్తే బ్రహ్మానందంకాక మరేముంటుంది? ఇంత జరిగాక శ్రీతరణీ వల్లభుడైన ఓ శ్రీవేంకటేశ్వరా! నీ తత్త్వం తెలిసింది. నీసేవారతి (దాస్యభక్తి)తో నిన్ను భజిస్తూ, నీవే దాతవు నీవే దైవమవు అని తెలిసింది. ప్రభూ! ఈ తత్త్వమునే తలపోస్తూ జీవితాంతం నీ దాసుడనై వుంటాను.





సంపుటి: 4 కీర్తన : ఇతరములన్నియు నదుమంత్రములే యెంచిచూచినను యింతాను

సంఖ్య : 399 పుట : 268 రాగం: గుజ్జరి

## గుజ్జరి

49 ఇతరములన్నియు నదుమంత్రములే యెంచిచూచినను యింతాను
హితవగుబందుగుఁ డీశ్వరుఁడొకఁడే యితని మరవకుమీ జీవాత్మా
॥ పల్లవి॥

భవకూపంబుల బడలెడినాఁడు పాయనిబంధువుఁ డితఁడొకఁడే
దివిస్వర్గంబునఁ దేలెడినాఁడు తిరుగఁబాయకె (ఁడె?) పు డితఁడొకఁడే
నవనరకంబుల నలఁగెడినాఁడు నటనలఁ బాయఁ డితఁడొకఁడే
యివలనవలహృదయేశుఁడు విష్ణుఁడు యీతని మరవకుమీ జీవాత్మా
॥ఇతర॥

పశుమృగాదుల వొడలెత్తినప్పుడు పాయనిబందుగుఁ డితఁడొకఁడే
విశదపుదు:ఖపువేళలనైనా విడువనిబంధువుఁ డితఁడొకఁడే
శిశువైనప్పుడు వృద్ధినప్పుడు చిత్తపుబందుగుఁ డితఁడొకఁడే
దశావతారపు విష్ణుఁడొకఁడే యితఁడని తలఁచుమీ జీవాత్మా ॥ఇతర॥

భావజకేలినిఁ జొక్కినప్పుడును ప్రాణబంధువుఁ డితఁడొకఁడే
యీవల నావల నిహపరములలో నిన్నిటిబంధువుఁ డితఁడొకఁడే
దైవము దానని శరణనియెడు నను దగ్గరికాచెను యితఁడొకఁడే
శ్రీవేంకటగిరి నాయకుఁ డితఁడే చేరి భజించుము జీవాత్మా ॥ఇతర॥399

**అవతారిక:**

నడమంత్రము అంటే మధ్యలో వచ్చినవి అని అర్థం. ఉన్నట్లుండి వ్యాపారంలో పట్టిందల్లా బంగారమై ఒకడు శ్రీమంతుడవుతాడు. ఒక వెలుగు వెలుగుతాడు. ఒక రోజున ఇంకొక వ్యాపారంలో ఈ వచ్చినదంతా పోతుంది. ఎట్లా వచ్చిందో అట్లా పోతుంది. అందుకనే దాన్ని నడమంత్రపు సిరి అన్నారు. చాలామంది అట్లా సిరి కలిగినప్పుడు కన్నూమిన్నూ తెలియక ప్రవర్తించి ఇతరులను చిన్నచూపు చూచి అదంతా తమ ప్రతిభేననీ, దేవుడు లేదు స్వయంకృషే దేవుడు అని ప్రసంగాలు దంచుతారు. కొంతమంది కుత్సితులై అక్రమాలకు పాల్పడతారు. కొన్నాళ్ళకు ఎలాపైకి వచ్చారో అలాగే ఆరిపోతారు. కీర్తి ప్రతిష్ఠలు, సిరిసంపదలు, హితాభిలాషులూ వస్తూనేవుంటాయి, పోతూనేవుంటాయి. మరియెన్నడూ విడిపోని హితకారి హితాభిలాషి యెవరు? ఇంకెవరు? ఈశ్వరుడొక్కడే. మధ్యమధ్య అజ్ఞానాంధకారంలో పడిపోయే జీవాత్మా! ఈ నేను చెప్పెడి హితవు మరువవద్దు, అంటున్నారు అన్నమాచార్యులవారు. జన్మాంతరాలలో మనకు తోడునీడగా వుండి సంరక్షించేవాడు ఈయనే. స్వర్గ నరకాలలో మన పుణ్యపాపాలనుభవానంతరం కూడా మనని విడువని జన్మాంతర బంధుగుడితడే. మనమశక్తులమైన పశు, జంతు జన్మలలోనూ రక్షకుడితడే. కావున ఈ శ్రీవేంకటేశునికి శరణుజొచ్చి నిశ్చింతగా వుండండి.

**భావ వివరణ:**

ఓ జీవాత్మా! నీకు హితకరుడైన బందుగు (బంధువు) ఆ ఈశ్వరుడొక్కడే. ఇతరములన్నియు (ఈయన కాక అన్యులెవ్వరూ) నడమంత్రపు సిరివలె మధ్యలో వచ్చి మధ్యలో పోయేవారే. ఈ సంగతిని మరువకుమీ! (జ్ఞప్తియందుంచుకొనుము).





ఓ జీవుడా! ఒక జీవి చావుపుట్టుకలనే భవసాగరంలో పడికొట్టుకుపోతుంటే ఆ భవకూపంలో వడలిపోతుంటే, పాయని బంధువు ఇతడొకడే (ఈ శ్రీహరి ఒక్కడే). ఒకవేళ స్వర్గప్రాప్తి కలిగి ఆ స్వర్గసుఖాలలో దేలెడినాడు సరేలే వీడికీ స్వర్గం చాలు అని తిరుగబాయడు (త్రిప్పి వేయడు) నవనరకంబుల (రౌరవాది తొమ్మిది రకములైన) నరకములలోపడి శిక్షలనుభవించుచూ నలిగిపోతున్ననాడు నటనల నటిస్తూ తెలియనట్లు విడిచిపెట్టుడితడు. ఇవల (ఈ పుడమి మీద) ఆవల (పరలోకాలలోను) హృదయేశ్వరుడు (హృదయంలోవుండి యేలే సర్వేశ్వరుడు) ఈ విష్ణువొక్కడే. ఈతనిని మరువరాదు సుమా!

ఓ జీవాత్మా! నీవు కర్మ వశంబున పశువుగానో మృగపక్షి కీటకాది జాతులలోనో జన్మనెత్తినపుడు నీ ఈ జ్ఞానమంతా నశిస్తుంది. మరి అప్పుడు నీకు దిక్కుయెవరనుకున్నావు? అప్పుడుకూడా నిన్ను పాయని బంధువు (విడవని ఆప్తుడు) ఇతడొక్కడే. నీవు తీరని దుఃఖములో వివశుడవై వుంటే నీకష్టకాలంలో నిన్ను వదిలిపెట్టని బంధువు ఇతడొక్కడే. సమర్థవంతమైన మానవజన్మనెత్తినప్పటికీ వాడిశైశవ దశయందును వృద్ధాప్యదశయందును చిత్తపుబంధువు (ఆత్మబంధువు) ఇతడొకడే. దశావతారములనెత్తి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసిన విష్ణుదేవుడితడొక్కడే అని నీ మనస్సున తలచుకోరాదా!

ఓ జీవుడా! నీవు యౌవనమున భావజకేలిని (శృంగారకామకలాపము) సాగిస్తున్నప్పుడు అలసిజొక్కెదవు. అప్పుడుకూడా నిన్ను విడువక నీ వుద్రేకపు తీవ్రత నిగ్రహించి నీ ప్రాణములను నిలబెట్టు నీప్రాణ బంధువితడొకడే. ఈవల (ఈ భూమిపైనా) ఆవల (ఆ పరలోకంలోను) ఇన్నిటి (నీపాపపుణ్యానుభవమున) బంధువు, ఇతడొక్కడే. తానే దైవమని భావించి శరణుజొచ్చినవారిని, తానే దగ్గరకు జేరి సంరక్షించేవాడు ఇతడు ఒక్కడే. ఈయనే శ్రీవేంకటేశ్వరుడు. ఈ స్వామిని దరిచేరి భజించి తరింపుము.

సంపుటి: 4 కీర్తన : ఏమనవచ్చును చెల్లుచున్నవివె యీశ్వర నీమాయలు

సంఖ్య : 259 పుట : 173 రాగం: గుజ్జరి

### గుజ్జరి

**50** **ఏమనవచ్చును చెల్లుచున్నవివె యీశ్వర నీమాయలు గొన్ని**
**శ్రీమాధవ నీ చిత్తము కొలఁదిఁక చెప్పెడిదేఁటికి జీవులకు**
**॥పల్లవి॥**

**కలిదోషనిరుహరణ కైవల్యాకర హరి**
**తలఁచినవారిది నేరుపు మిముఁ దలఁచనివారిది నేరమి**
**కలుషమెడలి సూర్యోదయమైనా కానవు కొన్ని జంతువులు**
**తెలిసినవారలు కందురు యీతెరఁగ(గు?)లు రెండిటి దినమొకటే**
**॥ఏమ॥**

**శరణాగతరక్షణచతుర సర్వాంతరాత్మక యచ్యుత**
**సరి నిన్నుఁ గొలిచినవారిది పుణ్యము చలమున మానుటే పాపము**
**సరుగనఁ గాచేటి చల్లని చంద్రుఁడు జారచోరులకుఁ గడు వేఁడి**
**అరయఁగఁ గలువలకును హితుఁడు అందుకు నిందుకు గురి యితఁడే**
**॥ఏమ॥**

**శ్రీవేంకటగిరినిలయా శ్రీసతీశ పురుషోత్తమ**
**మీవొద్దనుండితే వైకుంఠము మిమ్ము నెడసితే నరకము**
**భావములోపల నీవే వుండఁగ భక్తి లేదు కొందరికైతే**
**శ్రీవైష్ణవులకు నిత్యము యీ చింతలు రెంటికి నీ మహిమే**
**॥ఏమ॥259**





**అవతారిక:**

పరమాత్ముడైన శ్రీవేంకటేశ్వరునితో రాజీకివస్తున్నారు అన్నమాచార్యులవారు. ఓ శ్రీమాధవా! ఈశ్వరుడివైన నీమాయలలో కొన్నింటిని యేమనాలో తెలియటంలేదు. స్వామీ! నీవెట్లా తలచుకుంటే అట్లా చెల్లుబడి అవుతుంది. నీ చిత్తమొచ్చినట్లు చేయవయ్యా! నీకు చెప్పేదేమిటి? అంటున్నారు. ఎందువల్లనోగాని ఈ కీర్తన తుది చరణాలు అంత సులభగ్రాహ్యంగా లేవు. భావములోపల నీవే వుండగ కొందరు ఆపద్ధర్మ భక్తులకు ఎంతసేపు నీమూర్తి యెదుట కూర్చున్నా మనస్సు నీపై నిలువదు. అదే శ్రీవైష్ణవులకైతే నిత్యమూ వారి మనస్సులలో నీవే వుంటావు. మరి ఈ రెండు విధములుగానున్న చింతనలు ఎందుకు కలుగుతున్నాయి? నీ మహిమవల్లనే కలుగుతున్నాయి స్వామీ! అంటున్నారు.

ఆయన కృపలేనివారికి శ్రీవేంకటేశ్వరుడు అంటే నల్లటి పొడవాటి విగ్రహం. ఆయన కృప కలిగినవారికి ఆయన కరుణాసముద్రడైన వైకుంఠుడు. ఆ తిరుమలే వైకుంఠము “యద్భావం తద్భవతి” అని అందుకే అన్నారు పెద్దలు. ఉన్నదొక్కటే… అది జ్ఞానికి ఒక లాగున అజ్ఞానికి ఇంకొకలాగున కనబడుతుంది. సూర్యోదయమైతే ప్రపంచం మనకు కనబడుతుంది కాని గుడ్లగూబకు కనబడదు కదా! చల్లని ధవళకాంతులీనే చంద్రుడి వెన్నెల జారులకీ చోరులకీ చిరాకు కలిగిస్తుంది కదా!

**భావ వివరణ:**

ఓ ఈశ్వరా! నీ మాయలు కొన్ని వివరింపనసాధ్యముగానున్నవి. వాటిని యేమనవచ్చును (ఏమనగలము)? ఓ శ్రీమాధవా! ఇక నీ చిత్తము కొలది (నీఇష్టం వచ్చినట్లు) చెయ్యవయ్యా! జీవులకు చెప్పెడిదేమిటి (మాబోటి అల్పులైన జీవులకు నీవు వివరణ ఇవ్వవలసిన పనియేమున్నది తండ్రీ! నీకెలా తోస్తే అలా చేయుము.

కలిదోషనివారకుడవైన ఓ శ్రీహరీ! నీవు కైవల్యాకారుడవు (మోక్షప్రదాతవు). నిన్ను తలచినవారిదే (ధ్యానించినవారిదే) నేరుపు

(చతురత). మిమ్ము తలచనివారిది (ధ్యానించనివారిది) నేరమి (అపచారము). కొన్ని జంతువులు సూర్యోదయమై వెలుతురు వస్తే ప్రపంచాన్ని చూడలేవు. మరి మనిషి సూర్యుడు లేకపోతే చూడలేడు. తెలిసినవారు (జ్ఞానులు) ఈ రెంటికీ (మనిషికి, ఆ జంతువుకు) దినము ఒక్కటే అయినా చూడటంలో ఎలా తేడావున్నదో అలాగే భగవంతుని జ్ఞాని చూడగలడు అజ్ఞాని చూడలేడు. కళ్ళున్నంతమాత్రాన లాభం లేదు. అవునా?

ఓ అచ్యుతా! ఓ సర్వాంతరాత్మకా! ఓ శరణాగత రక్షణా చతురా (శరణాగతులను నేర్పుతో రక్షించువాడా!) నిన్ను కొలిచినవారిదే నిజమైన పుణ్యము. చలమున (అహంకారముతో) నిను కొలువకుండుటే పాపము. ఒక్కొక్కప్పుడు మంచివారు, చెడ్డవారికి చెడుగా కనుపించుచుందురు. పున్నమి రాత్రి చల్లని చంద్రుడు పిండారబోసినట్లు వెన్నెల కాంతినిచ్చి అందరికీ ఆనందం కలుగజేస్తాడు. అవునుకదా! కాని అదే చంద్రుని చూస్తే జారులకు (వ్యభిచారులకు) చోరులకు (దొంగలకు) వేడికలుగు (ఉడుకుమోతు తనంతో కూడిన కోపము వస్తుంది). కాని కలువపూవులు చంద్రుని చూస్తే వికసిస్తాయి. అవునా? అందుకు నిందుకు గురి అయినది ఒకే చంద్రుడు కదా! అట్లే శ్రీహరి ఆశ్రయమే పుణ్యము నిరాదరణే పాపము. అంతే సుమా!

ఓ శ్రీవేంకటేశ్వరా! ఓ శ్రీసతీవల్లభా! ఓ పురుషోత్తమా! మీ వొద్దనుండుటే (నీ సన్నిధిలో వుండుటే) వైకుంఠము. మీ ధ్యాసలేక విముఖులై యెక్కడవున్నా అదే నరకము. కొందరు సాధారణ భక్తులకు నీ దివ్యమంగళాకారమును చూస్తే పొడవైన నల్లని విగ్రహం కనబడుతుంది. మరి మాబోటి కొందరు శ్రీవైష్ణవులకైతే నిత్యమూ నీవే వారి యెదురుగా వున్నట్లుంటుంది. ఈ రెండు రకములైన చింతలకి (భావనలకీ) మూలము నీ ఒకే మూర్తి. అవునా! మరి ఇలా యెందుకు జరుగుతున్నది? అదే నీ మహిమ తండ్రీ!





సంపుటి: 3 కీర్తన : దేవానీవే యిన్ని చందముల తిరముగ మహోపకారివైతివి

సంఖ్య : 240 పుట : 162 రాగం: బౌళి

**బౌళి**

**51** **దేవా నీవే యిన్ని చందముల తిరముగ మహోపకారి వైతివి**
**యేవలనైనా నీవేకాక బువి నింతటివారలు యిఁకఁగలరా ॥ పల్లవి॥**

**జనులకు నీవే వొక్కకచోటను శాస్త్రార్థములై కడఁగుదువు**
**తనియక నీవే మరి వారికి బోధకులఁ గొందరినిఁ గల్పింతువు**
**మనసులో నంతలో వొడఁబడికె చేసి మలయుచు నీవే నిలుతువు**
**కనుఁగొన నీవే సుజ్ఞానమార్గము కైవసముగాఁ దెలుపుదువు**
**॥దేవా॥**

**కడఁగి యప్పటి నీవే యజ్ఞాదికర్మఫలములై వుండుదువు**
**తడయక నీవే తిరుపతుల దేవతామూర్తులై పొడచూపుదువు**
**యెడయక నీవే తపోమహిమలై యెదుటనే తార్కాణ లౌదువు**
**వొడలై నీవే యిహపరములకును వొడిగట్టి సాధింపింతువు.**
**॥దేవా॥**

**ఆవేళ నీవే తత్త్వనిర్ణయము నాధారమునై యేర్పరతువు**
**నీవే కమ్మటి ఆచారవిధులకు నియమములెల్లా నేర్పుదువు**
**భావింప నీవే అలమేల్మంగకుఁ బతివై శ్రీవేంకటేశ రక్షింతువు**
**జీవుల కంతర్యామివై నీవే శిష్టుఁ బరిపాలింతువు**
**॥దేవా॥ 240**

**అవతారిక:**

ఏ జీవికైన దేహము, దానిలో ప్రాణమువుండటం ఒక ఎత్తయితే దానిలో జ్ఞానముండటం ఇంకొక ఎత్తు. ప్రాణం కూడా లేకపోతే ఆ దేహము శవమే కదా! ఒక జీవికి ఈ మూడూ వుంటే వానిని జ్ఞాని అంటారు. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు ఆ దేవదేవుని కీర్తిస్తూ, దేవా! ఇన్ని విధములుగా నీవు మాకు మహోపకారం చేసే వాడివైనావు. ఈ భువిలో నీవు గాక నీ అంతటివారు ఇంకొకరున్నారా? అని ప్రశ్నిస్తున్నారు. జీవులకు ఒక్కసారి జ్ఞానం వచ్చాక వారి చిత్త ప్రవృత్తులు వేర్వేరుగా వుంటాయి. కొందరికి శాస్త్ర అధ్యయనంపై మక్కువ వుంటుంది. కొందరికి శాస్త్ర బోధన మీద ఇష్టం వుంటుంది. కొందరికి మనస్సులో నీవే నిలుతువు. కొందరికి నీవే సుజ్ఞానమార్గమును కైవసము జేతువు. అనాదిగా అనేకయుగాలలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసియున్నావు. ఈనాటి కలియుగంలో అల్పజ్ఞానులైన ఈ జీవులను శిష్టులను చేసి పరిపాలించుటకు అలమేల్మంగ సమేతుడవై తిరుమల శ్రీవేంకటేశ్వరుడవైనావు మా అంతర్యామివై కంటికి రెప్పలా కాపాడుతున్నావు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవొక్కడవే ఇన్ని చందముల (విధములుగా) తిరముగ (స్థిరమైన) మహాపకారివైతివి (గొప్ప ఉపకారము నొనరించు, సహాయకుడవైతివి). ఏవలనైనా (ముల్లోకాలలో యెక్కడనైనా) ఈ భువిలో ఇంతటి వారలు (ఇంత ఉదారులు) నీవేకాక మరొకరు కలరా తండ్రీ!

ఓ ప్రభూ! నీవే ఈ జనులకు ఒకొక్కచోట శాస్త్రార్థములను కడగుదువు (అనుసరింపచేతువు) తనియక (తృప్తిలేక) నీవే వారిలోనే కొందరికి విశేషమైన జ్ఞానమునిచ్చి బోధకులను (ప్రవచనకారులను) చేయుచున్నావు. ఇంకా ఈ ధర్మరక్షణ సరిగా జరుగుతుందో లేదోనని మాబోటి భక్తుల మనస్సులలో కూడా అంతలో వొడబడి (చొరబడి) ఆ ప్రయత్నంలో వారి





మనస్సులలో నిలిచియుంటున్నావు. అప్పటికీ అజ్ఞానావర్తనులై అర్జునునివలె సందేహపరులైతే సుజ్ఞానమార్గమును కైవసముగా (సుస్థిరముగా) కనుగొనజేతువు. అందులకు నీ విశ్వరూప సందర్శనము కూడా చేయించినావు కదా!

ప్రభూ అప్పుడు బోధించినట్లు, నీవే యాజ్ఞాదికర్మలయొక్క ఫలములవలె వుందువు. ఆ ఫలములచే ఆ యజ్ఞములను చేసినవారికి సార్వభౌమత్వము, దివ్యలోకవాసము, స్వర్గ సుకానుభవము వంటి దివ్య భాగ్యములను ప్రసాదించుచున్నావు. తడయటక (అంతటితో తృప్తిచెందక) నీవే 108 తిరుపతులలో ఆయాదేవతామూర్తులై పొడచూపుదువు (కనబడుచున్నావు) ఇట్లు లోకమంతా నీ భక్తులను పెంపొందింపజేయుచున్నావు. నీకోసం తపస్సు చేసేవారికి వారి వారి శ్రద్ధననుసరించి వారి యెదుటనే తార్కామణముగా ప్రత్యక్షమవగుచున్నావు. నీవే ఒడిగట్టి (నిర్వహించి) నీ భక్తులచేత ఇహపరములు రెంటినీ సాధింపజేతువు అంతేకాక ఆ సాధించిన కీర్తికూడా మాకే తక్కేట్లే చేస్తావు. ఎంతటి కరుణామూర్తివయ్యా!

దేవా! నీవేతత్త్వ నిర్ణయమునకు ఆధారములై విధి విధానములను నిర్దేశించుచున్నావు. లేనిచో ఒకానొక వ్యక్తి చెప్పిన తత్త్వమును వేల సంవత్సరములు, కోట్లాది మంది ప్రజలు అనుసరించుట సాధ్యపడుతుందా? నీవే ఒక్కొక్క వ్యవస్థాపకుడవై ఆ వ్యవస్థ ఆచారవిధి విధానములను నిర్దేశించుచున్నావు. ఇక నేటి కలగియుగంలో మాబోటి సర్వసామాన్యులు అనుకొన్నది చెప్పరు, చెప్పింది చేయరు, చేసిందే ఇంకొకసారి చేయని అసత్య అధర్మవర్తనులు. నీ సన్నిధిలోనే దురాచారులైపోతున్నారు. భావించి వారిని వుద్ధరించటానికి నీవే అలమేల్మంగపతివై, జీవుల అంతర్యామివైన శ్రీవేంకటేశ్వరుడవై శిష్యులను జేసి పరిపాలించుచున్నావు.

సంపుటి: 3 కీర్తన : విచారించుకోరో యిది(వి) కులాలమెందు
సంఖ్య : 241 పుట : 163 రాగం: ధన్నాసి

## ధన్నాసి

52 విచారించుకోరో యిది(వి) కులాల మెందు-
పచారాలు చూచి మీరు భ్రమయకురో. ॥ పల్లవి॥

భావింప నారదునికి బ్రహ్మపట్ట మరుదా
వేవేలైనాఁ గొంచెమని విడిచెఁగాక
దేవతలు తన్నుఁ జూచి దిగ్గన లేచి మొక్కేటి-
ఆవైభవపుపద మందెఁగాక. ॥విచా॥

మిక్కిలి జ్ఞానము గల్గి మించి తమనేరుపెల్లా
చిక్కి సంసారముపాలు సేయవలెనా
యెక్కువ హరిదాసుఁడై యిట్లానే వైకుంఠ-
మెక్కెడితోవ సాధించే దిది మేలుగాక. ॥విచా॥

మూలమని నుడిగితే ముంచి యెవ్వడు గాచెను
పోలించ నెవ్వనినాభిఁ బుట్టె లోకాలు
చాలి యెవ్వనికుక్షి నీజగము లున్నవి మరి
కాలమందే ఆ దేవునిఁ గానవలెఁగాక. ॥విచా॥

యిదియే శ్రీవైష్ణవులు యిలఁ బూర్వాచార్యులు
వెదకి చదివి కన్నవివరమెల్లా
తుదమొద లెరఁగనిదుష్టులకతలు మాని
పదిలమై యిట్టే నమ్మి బ్రదుకుటగాక. ॥విచా॥

సంకుఁజక్రములు మా (నూ?) ని సమానభోగముతోడ
అంకెల శ్రీవేంకటేశునండ నుండరో
పొంకపుబుద్ధు లిమ్మని పొంచి గాయత్రి జపించి
ఇంక బ్రహ్మవేత్త లెంచే దిందుకేకాక. ॥విచా॥241



పొడవ్యకు పొడవైన పురుషోత్తమా

**అవతారిక:**

'పచరించు' అంటే అంగడిలో సరుకులు కొని, అమ్ముట అని అర్థం. దీనినుంచే పచారీకొట్టు అనేమాట వచ్చి వుంటుంది. కులాల పచారాలు అంటే నాకులం యెక్కువ నీకులం తక్కువ అనే వాదులాటగా ఇక్కడ నప్పే అర్థం చెప్పుకోవచ్చును. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు యేమంటున్నారంటే 'ఓ మానవులారా! ఈ సంగతి విచారించుకోండయ్యా! కాస్త ఆలోచించండి. ఈ కులాల పచారాలు చూచి మాది అగ్రకులం మాది సర్వోన్నతమైన వంశం అని భ్రమపడకండి నిజం గ్రహించండి" అంటున్నారు. నీ పూర్వ జన్మలో యెవరివో నీకు తెలుసా? లేదు. పోనీ ఈ శరీరంతో యెంత కాలం వుంటావో తెలుసా? 70 ఏళ్ళక్రిందట ఈ దీక్షితులు లేడు. ఇంకొక 10 ఏళ్ళ తరువాత వుండడు. మధ్యలో వచ్చి మధ్యలో పోయే మనకు నేను బ్రాహ్మణుడిని నీవు కడజాతివాడివి అనే విచక్షణ అవసరమంటారా? హరిదాసుడైన వాడికి వైకుంఠం దక్కుతుంది, అంతులేని మర్యాద దక్కుతుంది అంటున్నారు. తన పొట్టలో పదునాల్గు భువనాలను దాచుకొన్న నారాయణుని గాక ఇంకొకరిని ఆశ్రయించవలసిన అవసరమేమి వుందయ్యా! అంటున్నారు. అతి సాధారణంగా తోచే ఈ కీర్తన వైభవం గురించి యెంత చెప్పినా తక్కువే. జాగ్రత్తగా చదవండి మరి.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! యిది విచారించుకోరో (ఆలోచించుకోండయ్యా!) మీరు ఈ మెందు కులాల పచారాలు (అగ్రకులాలమనే ప్రచారం) మానుకోండి. భ్రమయకురో (ఆ పిచ్చి భ్రమలో వుండకండయ్యా!)

నారదమహాముని అంటే మిడిమిడి జ్ఞానంతో తంపులమారివాడు అనుకోకండి. మీ తెలివితక్కువతనం బైటపెట్టుకోకండి. భావింప (ఆలోచిస్తే) ఆయనకు బ్రహ్మపట్టం (బ్రహ్మపదవి) అరుదా? ఇట్లాంటి పదవులు వేవేలు (వేలకొలదీ) ఆయన వద్దనుకొని నాకు నారాయణ నామ సంకీర్తనే చాలునని కోరుకున్నాడు. మరి అందుకనే దేవతలైనా, రాక్షసులైనా, చక్రవర్తులైనా ఆయన రావటం చూడగానే 'దిగ్గున' లేచి నిలుచుంటారు, మ్రొక్కుతారు. అది వైభవం కదా! మరి వైభవమంటే ఇంకేమిటి?

మానవుడు యెంతో జ్ఞానం గడిస్తాడు, నేర్పు సంపాదిస్తాడు నిజమే. అది భగవంతుని అనుగ్రహమే కానీ వీడి గొప్పతనం కాదు కదా! అయితే వీడు తన నేర్పంతా సంసారం పాలు చేస్తున్నాడు. అది అవసరమా చెప్పండి? ఈ జ్ఞానాన్ని నేర్పునీ హరిదాసుడై వైకుంఠం సాధించడానికి వుపయోగించవచ్చును కదా! ఆ వైకుంఠపు త్రోవను పట్టుకోవటం మేలుకదా! మళ్ళీ ఇట్లాంటి జన్మ వస్తుందో రాదో తెలియదు కదా! ఉన్న సమయాన్ని వృధా చేసికోవటం న్యాయమా?

ఆనాడు, "మూలకారణంబెవ్వడు... వాని నాత్మభవునే శరణంబే వేడెదన్" అని దీనుడై విలపించిన గజేంద్రుని వంటి ఆర్తులు వేడుకొంటే ముంచి (ఆక్రమించి) యెప్పుడునూ గాచె (యెల్లవేళలా రక్షించాడు). పోలించ (యుక్తముగా) యెవ్వని నాభినుండి లోకములన్నీ వచ్చినవో, యెవ్వని కుక్షి (పొట్ట)లో జగములన్నియూ నెలకొనియున్నవో అటువంటి దేవుని కాలమందే (నీ జీవితకాలంలోనే) గానవలె (దర్శింపజేసికొనవలెను). అంతేకాని నువ్వు చచ్చాక చేయగలిగిందేమిలేదు. ఏదన్నా చేస్తే బ్రతికున్న ఈ నాలుగురోజుల్లోనే చేసికొనవలెను.

ఇదిగో, ఈ శ్రీవైష్ణవులు, వారి పూర్వాచార్యులు మొదలైన పెద్దలు శోధించి, వేదాధ్యయనం చేసి, హరి కథలు విని సర్వము నేర్చిరి. కాని కొందరు దురహంకారులు కన్నుమిన్నుగానని దుష్టులకేమైనదో చదివి తెలిసినవారు, ఆ శ్రీహరిని నమ్మిబ్రతుకుటే పదిలమని గ్రహించిరి.

శ్రీవైష్ణవ దీక్షతీసికొనినవారు తమ రెండు భుజములపై శ్రీమన్నారాయణుని శంఖము చక్రము యొక్క ముద్రలు వేయించుకొంటారు. నుదుట తిరునామము ధరిస్తారు. ఆ పిమ్మట శ్రీవేంకటేశుని అండలో (రక్షణలో) చేరి ఆయనతోపాటు సమానమైన భోగాలు (వైభవములు) అనుభవిస్తూ ఆయన అంకెల (సన్నిధిలో) వుంటారు. మరి బ్రహ్మవేత్తలైన మహానుభావులు, మాకు సుబుద్ధినిమ్ము తల్లీ! అని అనునిత్యం గాయత్రీమంత్రం చదివేది ఇంకెందుకు? ఈ జ్ఞానం కోసమే కదా! ఈ వైష్ణవులకూ దొరికే సిద్ధి అదే కదా!





సంపుటి: 3 కీర్తన : ఎన్నడు మానవు (ను) యీదుర్గుణములు యేది అవుషధము యిందుకును
సంఖ్య : 85 పుట : 57 రాగం: గుజ్జరి

**గుజ్జరి**

**53 ఎన్నఁడు మానవు(ను) యీదుర్గుణములు యేది అవుషధము యిందుకును**

**కన్నులఁజూచుచుఁ జెవుల వినుచు నేఁ గనియు వినియునిదె**
**కష్టుడ నయ్యా నేను. ॥ పల్లవి॥**

**హృదయములోపల దేవుఁ డుండఁగా నెఱఁగక భ్రమయుచుఁ గన్నచోటనే**
**వెదకియుఁ గానక అనుమానించేటివేఁదురనయ్యా నేను**
**చెదరినజననము దుఃఖరూపమని చెప్పఁగ విని యది సుఖమని కోరుచు**
**మది దీపమువట్టుక నూఁతఁబడినమత్తునిలెనవయ్యా నేను.**
**॥ఎన్నఁ॥**

**పరమగురువులదె భక్తిమార్గమిటు ప్రాణులకెల్ల నుఁ బెట్టివుండఁగా**
**విరసపుటింద్రియమార్గములఁ దిరుగువీరిడినయ్యా నేను**
**దరిచేర్పఁగ హరినామము గలిగియు దైన్యము నొందితి సంసారములో**
**పరుసము చేతఁబట్టుక తిరిసేటిభ్రాంతునివలెనయ్యా నేను.**
**॥ఎన్నఁ॥**

**శ్రీవేంకటపతి యెదుటనుండఁగా సేవింపఁగ సంసారములోపల**
**దావతిఁ బొరలుచు వేసరుచుండేటితగనిజడుడనయ్యా నేను**
**కైవశమై యీదేవుఁడే యిటు ననుఁ గరుణింపుచు రక్షింపుచు నుండఁగ**
**పూవునుఁ బరిమళమునువలనే నేపొదలుచు నుండెదనయ్యా నేను.**
**॥ఎన॥ 85**

**అవతారిక:**

ఆత్మన్యూనత వైరాగ్యానికి పరాకాష్ఠ. అందులోనూ భగవంతుని యెదుట ఆత్మన్యూనత వైరాగ్య జనితమై భక్తి పరిమళాన్ని వెదజల్లుతూనే వుంటుంది. ఓ దేవుడా! నా దుర్గుణములు నేను చచ్చేదాకా నన్నువదలవు. దీనికి మందు అనేదే లేదు. కన్నులజూచిన వానిని మరువలేను. చెవుల వినినవానిని మరువలేను. కన్నవీ విన్నవీ మరువక వాటికి కట్టుబడిపోయానయ్యా! అంటున్నారు అన్నమాచార్యులవారు. దీపము చేతిలోవున్నా నూతిలోపడ్డ మత్తుడనయ్యా అని నిందించుకొంటున్నారు. సంసార సాగరపు దరిజేరుటకు నాకు హరినామము దొరికింది. కానీ నా దురదృష్టం కొద్దీ నేను మూర్ఖుడిలాగా పరుసముచేతబట్టి (బంగారము కావాలనే పిచ్చి పట్టి) భ్రాంతితో తిరిగాను. ఎంత దౌర్భాగ్యుడిని!! శ్రీవేంకటేశ్వరుని యెదురుగా పెట్టుకొని "దావతి బొరలుచు వేసరితి" అంటున్నారు. మనం 21వ శతాబ్దంలో వున్నాము కాబట్టి "హలో" అననిదే తెల్లవారదు కాబట్టి తెలుగుమాటలకే అర్థాలు వెతుక్కోవలసిన "తెగులు" పట్టింది. ఏమి చేయగలం చెప్పండి? ప్రవాహానికి యెదురీదగల మొనగాడెవడు? నీ కరుణ వుంటే పూవులను పరిమళం వదలనట్లు నిన్ను అంటిపెట్టుకొనే వుంటానయ్యా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నేను నా దుర్గుణములను యెన్నడూ మానుకోను. పోనీ వాటిని మానుకోవటానికి యేదైనా "అవుషధము" (మందు) వున్నదా అంటే అదీ దొరకటం లేదు. నా కన్నులతో జూచుచూ ఆ కన్న వాటికీ, చెవులతో వింటూ ఆ విన్నవాటికీ కట్టుబడిపోతున్నాను. అయ్యా! దిక్కుతోచుట లేదు.

ఓ అయ్యా! నా హృదయంలోపలనే, అంతర్యామి రూపంలో దేవుడు (సర్వేశ్వరుడు) వుండగా నేను యెఱగక భ్రమకులోనై, కనబడుతున్న





చోటనే వెదకుచున్నాను. మరి నీవు ఇంకెలా కనుపిస్తావు? నేను అన్నీ అనుమానించేటి వేదురును (పిచ్చివాడిని). మరి ఇకనాకు నీవు యెలా కనుపిస్తావు? చెదరిన జననము (దుఃఖ భాజనమైన పుట్టుక) చాలా సంతాపకరమని చెప్పగా వినటమే కాని, ఆ దుఃఖములోనే సుఖాలను వెదకులాడే దౌర్భాగ్యం పట్టింది. ఇలా జరుగుతుందని వూహించలేదు. పైగా దీపాన్ని చేతిలో బట్టుకొని తిరుగుతూనే కనబడుతున్నా కూడ నూతిలో (బావిలో) పడిపోయిన మత్తుడను (మత్తుయెక్కువైపోయిన వాడను) అయినాను. ఎంత దౌర్భాగ్యుడనయ్యా!

పరమగురువులు (గొప్ప వైష్ణవ గురుపుంగవులు) ఈ విధముగా ప్రాణులందరికీ భక్తి మార్గము శ్రేష్ఠమైనదని బెట్టిరి (నియోగించిరి). మరి నేనేం చేశాను? విరసపుటింద్రియాలు (చెప్పిన మాట వినని ఇంద్రియాలు) చెప్పిన మార్గములో నడచిన వీరిడిని (అవివేకిని) అయ్యాను. దరిజేర్పగ (మోక్ష మార్గమునందించగా) నాకు హరినామము సులభముగా దొరికింది. అయినప్పటికీ నేను దైన్యము నొందితిని (దీనావస్థలోనే వుండిపోయాను). ఎందుకంటే సంసారబద్ధుడనైపోయాను. తాకినంతనే స్వర్ణమయం చేసే, పరుసము (పరుసవేదిని) చేతిలో వుంచుకొని భ్రాంతిపట్టి లేనిపోనివాటికోసం నేను తిరిగానయ్యా! ఎంత మందమతిని!!

శ్రీవేంకటేశ్వరుడు ఇన్నాళ్ళూ నా కన్నుల యెదుటనే వున్నా, సేవించక సంసారపు యావలోబడి సతమతమయ్యాను. దావతి బొరలితినయ్యా! (దుఃఖభాజనుడనయ్యాను). ఎప్పుడూ ఏదో ఒక ఏడుపే. నేను ఆ విధముగా తగని జడుడనయ్యాను (మందమతిని అయిపోయాను). అయితే, ఎట్టకేలకు నా అజ్ఞానం నశించి ఈ దేవుడే (శ్రీవేంకటేశ్వరుడే) నా కైవసమై (స్వాధీనమై) ఈవిధముగా నన్ను కరుణింపుచూ రక్షించినాడు. ఇంకా చెప్పేందుకేమివున్నది? పూవుకు పరిమళం అబ్బినట్లయింది. ఇక నేను పొదలుచూ వుండెదనయ్యా! (వర్ధిల్లుతూ వుంటాను ప్రభూ!)

సంపుటి: 3 కీర్తన : శరణాగతవజ్రపంజరుడితడు చక్రధరుడసుర సంహారుడు

సంఖ్య : 117 పుట : 79 రాగం: ధన్నాసి

## ధన్నాసి

**54 శరణాగతవజ్రపంజరుఁ డీతఁడు చక్రధరుఁ డసుర సంహారుఁడు**
**వెరవుతోడఁ దను శరణనువారివెనుబల మీతఁడే రక్షకుఁడు. ॥ పల్లవి॥**

**హరినామోచ్చారణఁ దెగనికర్మ మవల వేరొకటున్నదా**
**అరసి యెందు నమ్మికచాలక ప్రాయశ్చిత్తంబులు చెప్పుదురు**
**ధర నెరఁగనివా రేమనినాఁ దామసులగొడవ యేమిటికి**
**హరి హరి యంటే దురితము లణఁగెను అతఁడే మాకిఁక రక్షకుఁడు.**
**॥శర॥**

**శ్రీపతి దిక్కయి కావఁగ మరియునుఁ జేరనిసంపద లిఁకనేవి**
**చాపలబుద్ధుల(లు?) నది నమ్మక విచ్చనవిడి నోములు చెప్పుదురు**
**తీపులు వుట్టించి యెవ్వరేమనినఁ దెలిపి వాదడువ నేమిటికి**
**శ్రీపతిఁ గొలిచితి చేరె సంపదలు జిగి నితఁడే మారక్షకుఁడు ॥శర॥**

**అంతరాత్మ శ్రీవేంకటేశ్వరుఁడు అన్యము భజించఁ జో టేది**
**యింతట నమ్మక దేవతాంతరము లేఁటేఁటివో మరి చెప్పుదురు**
**యెంత లేదు ప్రాకృతజనముల భ్రమ యెవ్వరిఁ గాదన నేమిటికి**
**యింతకు శ్రీవేంకటేశుదాసులము యీతఁడే మాకిఁక రక్షకుఁడు.**
**॥శర॥117**

**అవతారిక:**

శ్రీహరి వైభవాన్ని వేనోళ్ళ వినుతిస్తున్నారు తాళ్ళపాక పద కవితా పితామహులు. శరణు మహాప్రభో! అనగానే గజేంద్రుని "సిరికిన్ జెప్పక





శంఖ చక్రయుగమున్ చేదోలు సంధింపక... పరుగు పరుగున వచ్చి" కాపాడే ఆయన శరణాగత వజ్రపంజరుడు అని అన్నమాచార్యులవారు కీర్తిస్తున్నారు. అంటే వజ్రంతో చేసిన పంజరం (కవచం) ఎలా అభేద్యమై రక్షిస్తుందో అలా తన చక్రాయుధంతో ఆర్తులను వెరవుతోడ వెనుబలమై ఆదుకొంటాడట. అవతారికలోనే అన్నమయ్య కీర్తనను వివరించటం అయ్యేపనికాదు అని తేలిపోయింది కదా! "హరి" అనగానే చేసిన దుష్కర్మల ఫలితం దూరంగా తొలగిపోతుంది... అట్లా "తెగని" కర్మ అంటూ యేదన్నా వుంటుందా... అని అంటున్నారు. ఆయనే శ్రీపతి కుచేలుని వంటి కట్టబట్టలేని ఆశ్రితులకు అక్షయమైన అష్టైశ్వర్యాలను ప్రసాదించే లక్ష్మీవల్లభుడు ఈ నందనందనుడు. అంతరాత్ముడై ప్రతి ప్రాణిలోనూ నెలకొని అనుక్షణం రక్షించే ఈ శ్రీవేంకటేశ్వరుని కాదని చిల్లర రాళ్ళకు మొక్కుతువుంటే చెడిపోదువురో ఒరే ఒరే అన్న సత్యాన్ని పునరుద్ఘాటిస్తున్నారు.

**భావ వివరణ:**

ఇతడు (ఈ శ్రీహరి) శరణాగత వజ్రపంజరుడు (శరణుజొచ్చిన వారికి వజ్రపు కవచమువలె రక్షకుడు). చక్రధారియై అసురులను తెగటార్చి ఆర్తులను రక్షిస్తాడు. తనను శరణన్న వారిని వెరవుతోడ (ఉపాయముతో) వెనుబలమై (వెన్నెముక వలె బలవర్ధకుడై) రక్షకుడని పిలువదగిన వాడు ఇతడొక్కడే.

అవల (అటుపైన) హరినామమును ఉచ్ఛరించిన తరువాత కూడా తెగిపోనటువంటి కర్మావశేషము యేదైనా వుంటుందా? ఎన్నటికీ వుండదు. ఆయన గీతావాక్యము యేమని చెప్పాడు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణం వ్రజ" – అన్నాడు. అయితే నేటికీ అనన్యముగా ఆమాట నమ్మనివారు యేవేవో ప్రాయశ్చిత్తములనొనరించుతూ తమ తప్పులనుంచి

బయటపడాలని చూస్తున్నారు కాని నిజముగా శరణాగతులగుటలేదు. ధరలో హరి తత్త్వము నెరుగనివారు యెన్ని చెప్పినా తామసులతో మనకు గొడవదేనికి? హరి-హరి అంటే దురితములణగును (పాపములు నశిస్తాయి). ఇక మాకు అతడొక్కడే రక్షకుడు.

ఆయన శ్రీపతి (సిరుల రాణి లక్ష్మీవల్లభుడు). మరి ఆయనే స్వయముగా దిక్కయి కాపాడితే ఇక మనని చేరుకోని సంపదలేమైనా వుంటాయా? చాపల్యము గల బుద్ధితో అది నమ్మక యేవేవో వ్రతాలనాచరించమని, యేదేదో కర్మకాండ చెప్పి విచ్చన విడితో (సర్వ స్వాతంత్ర్యంతో) ప్రవర్తిస్తుంటారు. ఎవ్వరెవరో ఏమేమో అంటుంటే తీపులుపుట్టించే (నొప్పించే) ఆ మాటలన్నీ విని వారి పలుకులకు వివరణ వెతుక్కొని వారితో వాదించి వారి వాదన అడువనేటికి (అణచాల్సిన అవసరమేముంది?) వాళ్ళగోల మనకెందుకు? శ్రీపతిని గొలిచితే సర్వసంపదలు చేకూడుతాయి. జిగి (శోభతో) మా రక్షకుడు ఇతడే. మాకు ఇంకొకరితో పనేమిటి?

మాకు అంతరాత్మయై మా అంతరంగంలోనే ప్రతిష్ఠింపబడిన దైవం శ్రీవేంకటేశ్వరుడు ఆయనే మా దిక్కయి తోడుంటే ఇక అన్యులను ఆశ్రయించవలసిన అగత్యమేమిటి చెప్పండి. అయినా ఇదంతా నమ్మక దేవతాంతరములు (అన్యదేవతల) గొప్పతనము గురించి కొందరు పొగడుతుంటారు. ఏవేవో కథలు చెబుతుంటారు. అజ్ఞానులై ప్రాకృతజనము యేవేవో భ్రమలకు లోనై యేవేవో చెబుతుంటారు, యేవేవో చేస్తుంటారు. ఎవ్వరి నేమనగలము చెప్పండి? మేము శ్రీవేంకటేశ్వరుని దాసులము మాకు ఇక ఈతడొక్కడే రక్షకుడు.





సంపుటి: 3 కీర్తన : కనియు గానరు నీమహిమ కౌరవకంసజరాసంధాదులు

సంఖ్య : 277 పుట : 187 రాగం: బౌళి

**బౌళి**

**55** **కనియుఁ గానరు నీ మహిమ కౌరవకంసజరాసంధాదులు**
**మనుజులు దనుజులఁ జంపిరనఁగ విని మరి నీశరణము చొరవలదా.**
**॥ పల్లవి॥**

**పుక్కిటనే లోకములు చూపితి పూతకిచ న్నటు దాగితివి**
**పక్కననే బండి దన్ని విరిచితివి బాలలు సేసేటిపను లివియా**
**అక్కరతో తృణావర్తు నణఁచితివి ఆఁబోతులకీ టణఁచితివి**
**చిక్కించి యనలము చేత మింగితి శిశువులు సేసేటిపను లివియా.**
**॥కని॥**

**తొడిఁబడ మద్దులు భువిపైఁ గూలఁగదొబ్బి యఘాసురుఁ జంపితివి**
**బడినే గోవర్ధనగిరి యెత్తితి పడుచులు సేసేటిపను లివియా**
**అదరి బ్రహ్మమాయకుఁ బ్రతిమాయలు అట్టే గడించి నిలిచితివి**
**పిడికిట చాణూరు నేనుగఁ గొట్టితి పిన్నలు సేసేటిపనులివియా.**
**॥కని॥**

**కాళింగునిమద మణఁచి దవ్వుగా కడగడలకుఁ బోఁజోఁసితివి**
**గోలవై యజ్ఞఫలము లిచ్చితివి గో వాళుసేసేటిపను లివియా**
**యీలీల శ్రీవేంకటాద్రిమీఁదనే యిందరికిని పొడచూపితివి**
**బేలుదనంబుల నెంచిచూడ పసిబిడ్డలు సేసేటిపను లివియా.**
**॥కని॥277**

**అవతారిక:**

శ్రీకృష్ణలీలామృతాన్ని వీనులవిందుగా వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఏదో ఒక చరణంలో ఒక కృష్ణ లీల వుండటం కద్దు. కానీ ఇలా పూర్తి కీర్తన, అందులోనూ పొడవుకి పొడవైన కీర్తన కృష్ణలీలలనే గానం చేయడం మన అదృష్టమే. శ్రీకృష్ణుని మరొక గొప్ప లీల ఏమంటే భీష్ముడు, విదురుడు, కుంతి వంటివారు ఆయన పరమాత్ముడని గ్రహించారు, కాని కౌరవులు, కంసజరాసంధాది మదోన్మత్తులైన రాజులు ఆయన లీలలు కనియు, ఆయన పరమాత్ముడని వినియు ఆయన మహిమ గ్రహించలేక ఇంద్రజాలకుడనుకొన్నారు.

మనుష్యులు రాక్షసులను ముక్కుపచ్చలారని వయస్సులో ఒక్క గుద్దుతో చంపడం యెక్కడన్నా సాధ్యమా? ఇది చేసినవాడు భగవంతుడు కాడా అని కొందరు గ్రహించి ఆయన శరణు పొందనేలేకపోయారు. కుచేలునివంటివారు గ్రహించగలిగారు కాని బ్రహ్మదేవుడు, ఇంద్రుడు కూడా భ్రమలోపడి ఆయనను వెట్టిగొల్లడిగానే పొరబడి భంగపడ్డారు. నేడు కలికాలంలోనూ సుకృతం కొద్దీ ఈ తిరుమల శిఖరాలపై శ్రీవేంకటేశ్వరుడవై నిలిచి పొడచూపితివి. బేలుదనంబుల నెంచి చూడ... ఇవి పసిబిడ్డలుచేసే పనులా అని విస్తుపోతున్నారు. ఇట్లాంటి కీర్తన వివరించడం నిజంగా సుకృతమే, మరి. కొసమెరుపేమంటే ఇందులో అన్నమయ్య నుతించిన శ్రీకృష్ణలీలలు విపులంగా వ్రాయాలంటే ఒక పెద్ద గ్రంధమే అవుతుంది.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! అజ్ఞానులు నీ మహిమను కనియు గానరు (చూసికూడా గ్రహించలేరు). ఆనాడు కౌరవులు కంసజరాసంధాదులు నీలీలలను చూచికూడా నీవు ఇంద్రజాల విద్యలు నేర్చిన గొల్లవాడివనే నమ్మారు.





మనుష్యులు రాక్షసులను చంపడం సాధ్యమయ్యే పనియేనా? ఇది విని అయినా నీ మహిమ గుర్తించి నిన్ను శరణు కోరవద్దా? ఎంత దౌర్భాగ్యులు!!

ప్రభూ! నీ లీలలు సామాన్యమైనవా? పుక్కిటనే లోకములు చూపితివి (నీతల్లి యశోదకు) నీ చిన్నారి నోటిలోనే చతుర్దశభువనములను చూపినావు. పూతన చనుబాలు త్రాగినట్లే నటించి ఆమె ప్రాణములను హరించితివి. ఒక పెద్ద బండి ప్రక్కన పడుకోబెడితే చిన్నారి శిశువుగానే అంత పెద్ద బండిని ఒక్క తన్నుతో ముక్కలు ముక్కలక్రింద చేసేశావు. ఇవేమన్నా బాలురు (పసిబిడ్డలు) చేసే పనులటయ్యా!! తృణావర్తుడనే రాక్షసుని, అక్కరతో (అవశ్యతకు తగినట్లు విపరీతంగా బరువు పెరిగిపోయి ఊపిరాడకుండాచేసి చంపినావు). ఆంబోతుల కీటణచితివి (కోసల రాజకుమార్తె పేరు నాగ్నజితి. ఆమె తండ్రి తన రాజ్య ప్రజలను పీడించుచున్న ఏడు ఆంబోతులను ఒకేసారి పట్టి వంచి బంధించగలిగినవానికి తన కుమార్తెనిచ్చి పరిణయము జేతునని ప్రకటించెను. శ్రీకృష్ణుడు అవలీలగా ఆ పని సాధించి నాగ్నజితిని తన ఏడవ భార్యగా పెండ్లాడినాడు). ఇది మానవమాత్రులు చేయగల పనియేనా? రేపల్లెను కార్చిచ్చు కబళిస్తుంటే ఆ అనలమును చిక్కించి (చేతితో పట్టుకొని) మింగివేశావు. ఇది శిశువులు చేసే పనియేనా? ఈ పనులు చూశాక కూడా నీవు శ్రీమన్నారాయణుడవని గ్రహించ లేకపోయారే ఇంకేం చెప్పాలి?

ఓ శ్రీకృష్ణా! నీతల్లి యశోద నిన్ను రోటికి కట్టివేస్తే దామోదరుడవైనావు. ఆ రోటిని మెల్లిగా ఈడుస్తూ, తొడిబడన్ (తొట్రుపడునట్లుగా) రెండు పెద్ద మద్ది చెట్ల మధ్యనుంచి ఆ రోటిని లాగి వాటిని నేలపై కూలదొబ్బితివి (కూలునట్లు త్రోసివేశావు). ఆ లీలతో కుబేరుని పుత్రులైన నలకూబర, మణిగ్రీవులకు నారదశాప విమోచనమునిచ్చి అనుగ్రహించావు. చిన్ని పాపడిని రోటికి కట్టేసినందుకు యశోద పశ్చాత్తాపపడి, పడిపోయిన మద్ది చెట్టును చూచి వణికిపోయిందే కాని నీలీల గ్రహించనేలేదు.

అఘాసురుడనే పెద్ద కొండచిలువ రూపంలోవున్న రాక్షసుని సంహరించావు. బడినే (దిట్టతనముతో) గోవర్ధన పర్వతము నెత్తి గోకులము నెల్ల దానిక్రింద ఇంద్రుని వడగండ్లవాన నుంచి రక్షించితివి. ఇది పడుచు కుఱ్ఱవాళ్ళు చేసేపనియేనా? బ్రహ్మదేవుడు, అదరి (అతిశయించి) నిన్ను పరీక్షించాలని మాయతో నీవు కాయుచున్న గోగణమును గోపాలురను మాయం చేశాడు. నీవేమీ తెలియనట్లే ప్రతిమాయ చేసి గోగణముగాను గోపాలురుగాను నీవే మారిపోయి, వారి వారి ఇండ్లకు వెళ్ళి అందరినీ అలరించావు. ఒక దశలో బ్రహ్మకే జరుగుతున్నదేమిటో తెలియక దిగ్భ్రమకలిగింది. చివరికి నీ కాళ్ళ బేరానికి వచ్చాడు బ్రహ్మదేవుడు. ప్రభూ! నీవు అట్టె గడించి నిలిచితివి (దేవదేవుడవు అని కీర్తింపబడితివి. నీ చిన్ని పిడికిలితో కుమ్మి చాణూరుడనే జగత్ప్రసిద్ధుడైన మల్లయోధుని కుప్పగూల్చితివి. అప్పుడే కువలయాపీడనము అనే గొప్ప మదపుటేనుగును కుంభస్థలంపై ఒకే ఒక గుద్దుతో నెత్తురు కక్కించి చంపేశావు. ఓరి నాయనో! పిల్లలు సేసేపనులు ఇవియా? ఏమి మాయకాడవయ్యా!

ప్రభూ! కాళింగుడనే సర్పరాజు యమునా నదిలో చేరి విషం కక్కుతూ నదిని విషమయం చేసి జంతువులను పక్షులను చంపుతుంటే నీవు వాని పడిగెలైనెక్కి నర్తించి నెత్తురు కక్కించి వానిమదము నణచావు. వాని భార్యల ప్రార్థనకు వానిని మన్నించి వానికి గరుత్మంతుని భయం లేకుండా వాడి పడగలమీద నీ కాలి గుర్తులు ముద్రించావు. గోలవై (ముగ్ధుడవై) యజ్ఞపురుషుడవై, యజ్ఞ హవిస్సులను దేవతలకు పంచి యజ్ఞఫలములను ఋత్విక్కులకు అందిస్తావు. గోవాళు (గొల్లవాళ్ళు) చేసే పనులు ఇవేనా? ఏమి విడ్డూరము? ఇందరికీ ఈ లీలనే కలియుగంలో శ్రీవేంకటాద్రిపై పొడచూపావు. నీవు ఆపదమొక్కులవాడవు. బేలుదనంబున (వంచనతో) యెవరన్నా నీ మొక్కు చెల్లించకుంటే వాడి భరతం పడతావు. ఇవన్నీ చిన్న పిల్లలు చేసే పనులా స్వామీ? మేమూ నీ మహిమ గ్రహించామయ్యా!





సంపుటి: 3 కీర్తన : ఏమిచెప్పెడినో శాస్త్రరహస్యము యేమిచెప్పెడినో వేదములు

సంఖ్య : 347 పుట : 288 రాగం: పాడి

**పాడి**

**56** **ఏమిచెప్పెడినో శాస్త్రరహస్యము యేమిచెప్పెడినో వేదములు**
**తామసమై బహునాయకమాయను తత్వమెఱంగఁగఁ దరమేదయ్యా**
**॥పల్లవి॥**

**కొన్ని జంతువులు రోసినహేయము కొన్ని జంతువుల కమృతము**
**కొన్ని జంతువులదివములే రాత్రులు కొన్ని జంతువులకు**
**అన్నియు నిట్లనె వొక్కటొక్కటికి అన్యోన్యవిరుద్ధములు**
**పన్నినజీవుల కేకసమ్మతము భావించఁగ మరి ఇఁకనేదయ్యా.**
**॥ఏమి॥**

**కొందరు విడిచిన సంసారము మరికొందరికి నది భోగ్యంబు**
**కొందరివునుకులు వూర్ధ్వలోకములు కొందరివునుకులు పాతాళంబు**
**అందరు నందరె వారివారిరుచు లవిగా దిది(వి?) యనరాదు**
**కందువజీవులు విచారించేటి కార్యాకార్యము లికఁనేదయ్యా.**
**॥ఏమి॥**

**కొంతభూమి నటు చీఁకటినిండినఁ గొంతభూమి వెన్నెలగాయు**
**కొంతట సురలును కొంతట నసురలు కోరికై కొనిరి జగమెల్లా**
**ఇంతట శ్రీ వేంకటేశ్వర నీవే యిందరియంతర్యామివి**
**చింతలు వాయువు యెవ్వరిమనసునఁ జేరి నీకు శరణంటేఁగాని**
**॥ఏమి॥346**

**అవతారిక:**

వేదములలో అనేక ధర్మములు చెప్పబడ్డాయి. షట్శాస్త్రములలో మరింత విపులంగా శాస్త్ర రహస్యాలు వివరించబడ్డాయి కానీ ఒకదానికింకొకటి విరుద్ధంగా వుంటున్నాయి అందులో కొన్ని బోధనలు. అటువంటప్పుడు మానవులు యే మార్గమవలంభించాలి? ఏది విడువవలెను? ఈ తత్త్వోపదేశం కూడా బహునాయకమై అప్పుడప్పుడు తామసమును ప్రోత్సహిస్తోంది. ఏది మంచో ఏది చెడో యెరుగుట యెవరితరమయ్యా! అంటున్నారు తాళ్ళపాక అన్నమాచార్యులవారు. కొన్ని జంతువుల మల విసర్జనమే మరికొన్ని జంతువుల కాహారమవుతున్నది. కొన్ని పగలు నిద్రిస్తె కొన్ని రాత్రి నిద్రిస్తాయి. ఒకదాని బ్రతుకు ఇంకొకదానిచావు. మరి ఇది నీకు సమ్మతమా? ఒకడికి సంసారం గొప్ప ఆనందం. అది ఇంకొకడికి రోత. ఎవరి రుచి వారిది. మరిక ఉచిత కార్యమేది అనుచితకార్యమేది? భూమ్మీద కొంత (సగం) చీకటిగా వుంటే కొంత వెలుతురుగా వుంటుంది.

ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు అందరి మనస్సులలో అంతర్యామివిగా వున్నప్పటికి నీ శరణాగతులొక్కరే మనశ్శాంతితో జీవిస్తున్నారు అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ మానవులారా! ఈ శాస్త్ర రహస్యములన్నియు, ఈ వేదములన్నియునూ ఏమి చెప్పుచున్నవో తెలియాలంటే అంత తేలిక పనికాదు. ఎందుకంటే అవి తామసప్రవృత్తి గల అనేక మందిచే నాయక మాయను (ప్రబోధింపబడినవి). అటువంటప్పుడు సరిఅయిన తత్త్వమేదో కనుగొనుట అంత సులభమైన పనేనటయ్యా? కానేకాదు.





కొన్ని జంతువులయొక్క రోసిన హేయము (అశుద్ధము) మరికొన్ని జంతువులకు అమృతము వంటి భోజ్యము. కొన్ని జంతువులు దేన్ని దివము (పగలు) గా భావిస్తూ తిరుగుతున్నాయో దాన్నే కొన్ని జంతువులు రాత్రిగా భావిస్త నిద్రిస్తున్నాయి. అన్నీ ఇదే విధముగా ఒండొరులకు విరుద్ధముగానున్నవి. మరి జీవులన్నిటికీ భావించి చూచిన ఏకసమ్మతము (ఆమోదయోగ్యం) యేదయ్యా?

కొందరు యే సంసారమును రోత అని ఏవగించుకొని విడిచిపుచ్చుచున్నారో అదే సంసారము మరికొందరికి భోగ్యంబు (భోగదాయకమైన స్వర్గం). కొందరి వునికి ఊర్ధ్వలోకాలలోనైతే మరికొందరి వునికి పాతాళము మొదలైన అధోలోకములు. ఈ లోకాలలోవారు ఒకరు గొప్ప ఒకరు కాదు అని చెప్పలేము. అందరూ యెవరికివారే గొప్ప. ఇది అవుననీ అది కాదనీ అనలేము. ఇదిట్లా వుంటే జీవులకు ఉచితకార్యము అనుచుతికార్యము అని దేన్ని యెలా నిర్ణయించగలము. ఇదెట్లా సాధ్యమయ్యా? అసాధ్యము.

కొంతమేర భూమిపై చీకటి తాండవిస్తుంటే కొంత భూమి మీద వెన్నెల విఱగబూస్తుంటుంది. ఇంత జగమును ఈశ్వరుడు సృష్టిస్తే కొంత దేవతలు స్వాధీనం చేసికొనినారు కొంత అసురులు కైవసం చేసికొనినారు. వారి వీరందరి ప్రవృత్తులు వేర్వేరుగా వుంటున్నవి. ఓ శ్రీవేంకటేశ్వరా! వీరందరికీ మళ్ళీ అంతర్యామిగా ప్రవర్తిల్లుతున్నది నీవు వొక్కడవే. వీరంతా పరస్పర ద్వేషంతో అహరహరమూ, చింతతోనే జీవిస్తున్నారు. ఇక మార్గాంతరమేమిటి? ఎవ్వరు మనస్సులు నీపై నిలిపి నీకు శరణని జీవిస్తారో వారు మాత్రమే నిశ్చింతగా వుండగలరు.

సంపుటి: 3 కీర్తన : చెలగి యధర్మము పుట్టింప నీకేల మరి సృష్టింపగ నీకేల

సంఖ్య : 469 పుట : 315 రాగం: దేవగాంధారి

## దేవగాంధారి

**57** చెలఁగి యధర్మము పుట్టింప నీకేల సృష్టింపఁగ మరి నీకేల
పులులను లేళ్ల నొక్క కడుపుగా పులుమేపుదురటే మాధవుఁడా
॥ పల్లవి॥

గొనకొని పాషండులదుర్భాషలక్రోధము సహింపరాదు
దనుజులపుట్టువు వారలనుచు నిజతత్వజ్ఞానము నీ వియ్యవు
అనిశముఁ జూచిన వారికి మాకును అంతర్యామివి నీవు
పెనఁచి చీఁకటియు వెలుఁగును నొకచోఁ బెంచెదవేలే ముకుందుఁడా.
॥చెలఁ॥

ఖలుల తామసపుదేవతార్చనలు కనుఁగొని యవి యోర్వఁగరాదు
నెలకొని వారలు నరకవాసులని నీమీఁది భక్తియు నీ వియ్యవు
పొలుపుగ నిందరిలోపలఁ గ్రమ్మరఁ బూజగొనేటివాఁడవు నీవే
చలమునఁ బుణ్యము పాపము నొకచో సరిచేతురటవే గోవిందుఁడా.
॥చెలఁ॥

సతతము నీదాస్యద్రోహులతో సహయోగంబును సహింపదు
క్షితిలో నీవటువంటివారలను సృజింప కేర్పడ మానవు
హితవుగ శ్రీవేంకటేశ్వర నీవే యిహపరములకుఁ గర్తవు
గతి నీశరణాగతి యని నమ్మినఁ గల విందరికిని నారాయణా.
॥చెలఁ॥469





**అవతారిక:**

భగవానుని సృష్టి లీలను యెత్తిచూపుతున్నారన్నమాచార్యులవారు. సర్వజనుల సద్గుణపారిజాతాలు విరబూయాలన్నదే ఆ పరమాత్మ వుద్దేశ్యమైతే అసలు చెడును సృష్టించాల్సిన అవసరమేమిటి? పోనీ చెడ్డవాళ్ళని కూడా నీవే సృష్టించావు కాబట్టి యేదో వాళ్ళదారిన వాళ్ళని పోనీరాదా? మళ్ళీ వాళ్ళని అంతా చేయటానికి యెత్తరాని జన్మలు యెత్తుతావు. అసలు పుట్టించటం దేనికి? శ్రమపడి అంతం చేయటం దేనికి? అధర్మం పెరిగితే పెరగనీ. పులులను సృష్టించితే లేళ్ళను చంపకుండా వదిలిపెడతాయా? భక్తిమార్గం నీకిష్టమైతే పాషండుల నెందుకు సృష్టించావు? చీకటి వెలుతురు కలిసివుండటం జరిగే పనియేనా? తామసులు చేసే పూజలను కూడా స్వీకరిస్తావు. నరకంలో బాధలుపడేవాడు, ఒక్కనాడు కూడా నేను చేసిన పాపానికి శిక్ష అనుభవిస్తున్నాననుకోడు. వాడు బాధలు పడుతున్నంతసేపూ నిన్ను నిందిస్తూనే వుంటాడు. మరి వాడి పాపం పెరగక యేమవుతుంది? వాడికీ తండ్రివి నీవే కదయ్యా? మరి వాడి గతి అలా యెందుకుపెట్టావు? నీ దాసుల్ని యేడిపించేవాళ్ళనీ నీవే పుట్టించి మళ్ళీ వాళ్ళని అంతం చేయటానికి అనేక శ్రమలు పడతావు. ఇహపరములు రెంటికీ నీ శరణాగతియే దారి అని తెలుసుకోవటానికే యెన్ని జన్మలు వ్యర్థమైనవో తెలియదు. ఏమిటిస్వామీ! నీ లీల?

**భావ వివరణ:**

ఓ మాధవుడా! చెలగి (అతిశయముతో) అధర్మమును పుట్టించుట నీకేల? మరి నీవు సృష్టించిన దానిని మళ్ళీ సృష్టించుట (వెల్లడియవునట్లు) చేసెదవేల? ఇదేమి పద్ధతి స్వామీ! పులులను లేళ్ళను ఒకచోట తిరుగమని చెప్పి బలవంతమైన పులుల్ని మేపుతారటయ్యా?

ఓ ముకుందా! పాషండులను (వేదములను నిరసించే దుర్మతులు) దుర్భాషలాడి నిన్నే నిందిస్తుంటారు. వాళ్ళు క్రోధాన్ని ఏమాత్రమూ సహింపరాదు. నీవే వాళ్ళది దనుజుల పుట్టుక కాబట్టి వారికి నీవు తత్త్వ జ్ఞానమునియ్యవు. ఇదేమి విచిత్రము? ఇటు మావంటి నీ శరణాగతులకు ఆ పాషండులకూ అంతర్యామివి నీవే కదా! అనిశము (ఎప్పుడూ) ఇదియే కదా! సత్యము. చీకటిని వెలుగును ఒకేచోట వుంచటం సాధ్యమయ్యే పనియేనా? వెలుతురు వస్తూనే చీకటి మటుమాయమైపోతుంది కదా! స్వామీ!

ఓ గోవిందుడా! ఖలులు (పాపాత్ములు), తామసులు (తామస ప్రవృత్తిగల నీచులు) ఒకవేళ దేవతార్చనలు చేసినా వాటిని ఓర్వగరాదు (సహించరాదు). అవునా? వాళ్ళు నరకవాసము చేయతగినవారని నిర్ణయించి వారికి నీమీద భక్తి కలిగేటట్లు యెన్నటికీ చేయవు. అయితే, వీరందరి మతిలో తిష్టవేసికొనివారు ఆ విధంగా చేయుటకు కారకుడెవ్వరు? నీవే కదా! క్రమ్మర (మరల) వాళ్ళ పూజలు కూడా స్వీకరిస్తున్నది నీవే కదా! వీరూ, నీ భక్తులూ చేసే పనులు పాపములు పుణ్యములు అయినట్లయితే ఈ రెండిటినీ ఒకచో సరిచేతురటయ్యా? (ఒకేచోట వర్ధిల్లునట్లు చేస్తారుటయ్యా?) ఇదెక్కడి విచిత్రము!!

ఓ నారాయణుడా! నీ దాస్యము, నీ దాస్యద్రోహులను, యేనాటికీ మన్నించదు. వారి సహయోగము యేనాటికీ సహింపరానిది. పోనీ నీవు అట్లాంటి ద్రోహులను సృష్టించుట మానుకొంటావా అంటే... నీవు వాళ్ళనీ భూమ్మీద పుట్టిస్తూనే వున్నావు. అది నీవు మానుకోవు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ ఇహలోకంలో మంచి జరగాలన్నా, ఆ పరలోకంలో సద్గతి దక్కాలన్నా నీ అనుగ్రహం కావలసినదే. వీటికి కర్తవూ నీవే. అయితే, నీ శరణాగతులకు నీమీద నమ్మిక కలుగుతుంది కాని నిన్ను శరణననివానికి ఒక్కనాటికీ నీకు నమస్కరించాలని కూడా అనిపించదు. అదే నీ మాయ.





సంపుటి: 3 కీర్తన : ఎన్నడు నేనిక బుద్దెరిగేదియీశ్వర నిను దగిలెడిది
సంఖ్య : 88 పుట : 59 రాగం: బౌళి

**బౌళి**

**58 ఎన్నఁడు నే నిఁక బుద్దెరిఁగేది యీశ్వర నిను నేఁ దగిలెడిది**
**విన్నపమిదియే నీకే భారము వీని గెలువనావసమౌనా. ॥ పల్లవి॥**

**తగిలెడి నీనయనేంద్రియములు తగఁ జూచినయందెల్లను**
**తగిలెడినీశ్రవణేంద్రియములు తగినలోకవార్తలకెల్లా**
**మగుడఁగనేరవు జన్మజన్మలముల మనసు వీనికే సహాయము**
**తెగ వెన్నటికిని యింద్రియసంపద తీగెలుసాగుచు నొకటొకటి.**
**॥ఎన్నఁ॥**

**యెక్కెడిని నానాఁటికి మదమెంతైనా నజ్ఞానమున**
**యెక్కెడి నీసంసారమే హరియెదుటనే మత్తాయిగొన్నట్లు**
**చిక్క డెంతయిన మోక్షమార్గమున జీవుఁ డిందుకే లోలుఁడు**
**దిక్కమెకమువలెఁ గిందికిమీఁదికిఁ దిప్పెడిఁ గర్మము దేహమును.**
**॥ఎన్నఁ॥**

**మెఱయుచుఁ బెరిగెడి నీయాసలు గడు మీఁదమీఁద లంపటమగుచు**
**మఱియునుఁ బెరిగెడి పుణ్యపాపములు మలసి రాసులై పెక్కగుచు**
**యెఱఁగను శ్రీవేంకటేశ్వర యెంతో ఇఁక నాలోపలిదుర్గ (ర్గు?) ణములు**
**మఱఁగుచొచ్చితిని నేనిన్నాళ్లకు మరి నా భాగ్యము నీ చిత్తము**
**॥ఎన్నఁ॥88**

**అవతారిక:**

మానవ జీవితంలో మూడవవంతు నిద్రకే సరిపోతున్నది. మూడవ వంతు జీవన భృతి సంపాదించుకొనుటకు సరిపోతున్నది. ఈ రెండు

వ్యాపారాలలో భగవంతుని తలచుకొనే అవకాశం మానవమాత్రునకెవ్వనికీ వుండదు. ఇక మిగిలిన ఆ కాస్త సమయంలో జీవన సంగ్రామం, సంసార సుఖదుఃఖాలు, సహజీవులయెడ రాగద్వేషాలు, ఇత్యాదివన్నీ. ఇక తత్త్వచింతనకు సమయమేది? కనీసం భగవత్‌శరణాగతికి అవకాశమేది? పెద్దల అభిప్రాయమేమంటే శ్రీహరికృప యేజీవిపై కలుగుతుందో ఆ జీవి మాత్రమే శ్రీహరిని ఆశ్రయిస్తాడు. ఆయనకు కృప లేకపోతే రోజూ ఆ స్వామిని చూస్తున్నా ఒక్కరోజు కూడా ఆయనకు నమస్కరించడు. ఇది నిజం. అద్భుతమైన ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు స్వామీ! నాకు ఇంద్రియాలనిచ్చి వాటికి బానిసను చేశావు. మనస్సునిచ్చి అహంకార మమకారాలపాలుచేశావు. అజ్ఞానమునిచ్చి సంసారమత్తుని చేశావు. మోక్షమార్గం అంటే లోలత్వములేని జీవుణ్ణయినందువలన దిక్కుతెలియని మృగంలా తిరుగుతూనేవున్నాను. అదిగో అప్పుడు నీకృప కలిగి నాలోని దుర్గుణాలనుండి బయటపడి నిన్ను ఆశ్రయించాను. నా భాగ్యము నీ చిత్తము తండ్రీ! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ ఈశ్వరా! ఇక నేను యెన్నడు నీ బుద్దెరిగేది (నీ గురించిన జ్ఞానమును సంపాదింతును?) నేను నిన్ను యెప్పుడు దగిలెడిది (నీపై రక్తుడనైవుంటాను?) నేను చెప్పబోతున్న ఈ నాశత్రువులను గెలవటం నావలన అవుతుందా? నా విన్నపము ఇదే స్వామీ! వీటిని గెలిచే భారము ఇక నీదే.

ప్రభూ! నా గురించి యెంత తక్కువ చెప్పుకొంటే అంత మంచిది. నీవు నాకు నయనేంద్రియముల (కళ్ళను) ఇచ్చావు. నేనేం చేస్తున్నాను? చూచినయందెల్లా తగిలెదను (చూచిన ప్రతిదానిమీదా రక్తిని పెంచుకొంటున్నాను.) నీవు నాకు శ్రవణేంద్రియములను (చెవులను) ఇచ్చావు. వాటితో నేనేం చేస్తున్నాను? లోకంలో నేను వింటున్న





అనవసరమైన వార్తలపట్ల ఆకర్షితుడనవుతున్నాను. జన్మజన్మముల వాసనలను మరువలేని నా మనస్సు మగుడగనేరవు (వాటినుండి ఆసక్తిని మరల్చుకోలేదు). అది వీనికే (ఈ ఇంద్రియములకే) సహాయం చేస్తుంటుంది. ఈ విధముగా ఈ నా ఇంద్రియముల సంపద (వైభోగము) ఒకటొకటి తీగెలుసాగి (లతలవలె పెనవేసుకొని, యెన్నటికీ తెగవు. వాటిని తెంపటం నావల్లనేమవుతుంది స్వామీ!

ఓ దేవదేవా! వీటికి తోడు నాకు బోలెడంత అజ్ఞానం వున్నది. దానివల్ల నానాటికి నాకు మదము యెంతైనా యెక్కువవుతోందే కాని తగ్గటం లేదు. ఓ శ్రీహరీ! మత్తాయిగొన్నట్లు (మత్తు పదార్థాలు సేవించినవాడిలాగా) ఈ సంసారపు వ్యామోహంలో తగులుకు పోయాను. ఇక నీ జీవుడున్నాడే (జీవాత్మ) వాడు ఇందుకే (ఈ సంసార సుఖదుఃఖాలకే) లోలుడై (లోనయి) యెంతయినా (యెన్నటికీ) మోక్షమార్గమున చిక్కడు. ఇంకేముంది నా కర్మము నన్ను పట్టుకొని నాదేహమును దిక్కులుతెలియని జంతువును పరుగులు పెట్టించినట్లు కిందకి మీదకి (భువి దివి మధ్య) పరుగులు పెడుతున్నది (వస్తున్నది పోతున్నది). దీనికెన్నడూ విముక్తి లేదు. ఇక నీదే భారం స్వామీ!

ప్రభూ! తళుక్ తళుక్‌మని మెరిసే నా ఆశలు పెరుగుతున్నాయేగాని తరుగుట లేదు. వాటివల్ల నాకు ఈ లంపటాలన్నీ వరుసగా తగులుకొంటున్నాయి. ఇక ఈ లంపటాల వలన నేను లెక్కలేనట్లు పాపపుణ్యాలు చేస్తూనే వున్నాను. అవి రాసుల్లాగా కుప్పలు తెప్పలుగా పెరిగిపోతూనే వున్నాయి. పాత కర్మఫలితం పూర్తిగా అనుభవించకుండానే కొత్తది "జమ" అయిపోతున్నది. తండ్రీ! నా గతేమిటి? ఓ శ్రీవేంకటేశ్వరా! యెఱగను (నేను తెలియలేకున్నానయ్యా) నాలోపలి దుర్గుణాలెన్ని వున్నాయో నా అంచనాకు అందటం లేదు. నేను ఇన్నాళ్ళకు (ఈనాటికి) నీ మరుగుజొచ్చాను (నిన్నాశ్రయించాను). మరి ఇక నీ చిత్తము నా భాగ్యము (నీదయ నా ప్రాప్తం).

సంపుటి: 2 కీర్తన : అతిసులభం బిదె శ్రీపతి శరణము
అందుకు నారదాదులు సాక్షి
సంఖ్య : 41 పుట : 28 రాగం: బౌళి

**బౌళి**

**59 అతిసులభం బిదె శ్రీపతి శరణము అందుకు నారదాదులు సాక్షి**
**ప్రతిలే దిదియే నిత్యానందము బహువేదంబులె యివే సాక్షి**
**॥ పల్లవి॥**

**వేసరకుమీ జీవుఁడా వెదకివెదకి దైవమును**
**ఆసపాటుగా హరి యున్నాఁ డిదె అందుకుఁ బ్రహ్లాదుఁడు సాక్షి**
**మోసపోకుమీ జన్మమా ముంచినయనుమానములను**
**సేసిన భక్తికిఁ జేటు లేదు యీసేఁత కెల్ల ధ్రువుఁడే సాక్షి ॥అతి॥**

**తమకించకుమీ దేహమా తగుసుఖదుఃఖంబుల నలసి**
**అమితము నరహరికరుణ నమ్మితే నందుకు నర్జునుఁడే సాక్షి**
**భ్రమయకుమీ వివేకమా బహుకాలంబులు యీఁదీఁది**
**తమితో దాస్యము తను రక్షించును దానికి బలీంద్రుఁడే సాక్షి**
**॥అతి॥**

**మరిగివుండుమీ వో జిహ్వా మరి శ్రీవేంకటపతినుతులు**
**అరయఁగ నిదియే యీడేరించును అందుకు వ్యాసాదులె సాక్షి**
**తిరుగకుమీ విజ్ఞానమా ద్రిష్టపుమాయలకును లోఁగి**
**సరిలే దితనిపాదసేవకును సనకాదులబ్రదుకే సాక్షి ॥అతి॥ 41**

**అవతారిక:**

భక్తిరస ప్రధానమైన చక్కటి కీర్తననందిస్తున్నారు అన్నమాచార్యుల వారు. దీనినాస్వాదించి తరిద్దాం. భక్తి మార్గంలో పరమాత్ముడైన





శ్రీమన్నారాయణుని కృపను పొందినవారలనేకులున్నారు. నారదుడు, ప్రహ్లాదుడు, ధ్రువుడు, అర్జునుడు, బలిచక్రవర్తి, వ్యాసుడు, సనకసనందనాది మహర్షులు ఇత్యాదులంతా సాక్షి అంటున్నారు అన్నమయ్య. నవవిధభక్తిమార్గములంటే – శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము. ఒక్కొక్కరు ఒక్కొక్క విధానమునెన్నుకొని పరమాత్మకృపను పొందారు. దారి యేదయినా గమ్యం ఒక్కటే అని నిరూపించారు. ఈ కీర్తన ప్రత్యేకత యేమంటే... భక్తి మార్గాలలో తారతమ్యమున్నా గమ్యం ఒక్కటే అని చెబుతున్నప్పటికీ ఆత్మనివేదనము అనే శరణాగతి సర్వశ్రేష్ఠము అని పెద్దలు చెబుతారు. అలనాడు గజేంద్రుడు యెన్నుకొని ముక్తిని పొందిన మార్గమదే. “నీవే తప్ప నితఃపరంగబెరుగ, మన్నింపన్ దగున్ దీనునిన్” అని మొరబెట్టి వేడితే... “సిరికిన్ జెప్పక, శంఖచక్రయుగమును కూడా చేబట్టక” పరుగు పరుగున వస్తాడట పరమాత్మ. కాకపోతే చిక్కొక్కటే ఆయన మనం గుర్తుపట్టే, నామాలయ్యరూపంలో రాడు. ఆయన యే రూపంలో యెప్పుడు యెట్లా రక్షిస్తాడో వూహకందదు. ఇది సత్యం. హిరణ్య కశిపుడు ప్రహ్లాదుని ప్రశ్నిస్తాడు, “ఏమిరా నిన్ను ఆ శ్రీహరి రక్షిస్తాడుటురా” అని. ప్రహ్లాదుడంటాడు “మరి? నన్నెవరు రక్షిస్తున్నారనుకొంటున్నావు?” ఇదీ భక్తి అంటే. నమ్మకం. ఆ తిరుమలయ్యను నమ్మండి చాలు.

**భావ వివరణ:**

ఇదె (ఈ మార్గమే) అతి సులభము. అదే శ్రీపతి శరణము (శరణాగతి). అందుకు సాక్షులు వేరెవ్వరో కాదు. నారదుడు మొదలైన వారే సాక్షి. ఈ శరణాగతి ప్రతిలేనిది (సాటిలేనిది). ఇదియే నిత్యానందము (సదా ఆనందమునిచ్చునది). వేదములన్నియూ ఇవే సాక్ష్యమై ఈ విషయాన్ని సమర్ధిస్తున్నాయి.

ఓ జీవుడా! దైవమును వెదకి వెదకి వేసరకుము (శ్రమపడవద్దు). ఆ శ్రీహరి, ఆసపాటుగా (నీపై గొప్ప ఆపేక్షతో) వున్నాడు. అందుకు సాక్షి

వేరెవ్వరో కాదు... స్వయంగా ప్రహ్లాదుడే సాక్షి. ఓ జన్మమా! మోసపోవద్దు. శ్రీహరిని యెంత సేవిస్తే అంత ఫలితముంటుంది. నీ భక్తిలో ముంచిన అనుమానములుంటే (అసంఖ్యాకమైన అపనమ్మకములుంటే) అది భక్తికి చేటు. దీనికి సాక్ష్యమెవరో తెలుసా ధ్రువుడు అనే ముక్కుపచ్చలారని బాలుడు. అతడు నారాయణుని దయనెంత పొందాడంటే ధ్రువమండలంలో "తార"యై జగద్విఖ్యాతుడైనాడు.

ఓ దేహమా! తమకించకుమీ (తొందరపడవద్దే). సుఖదుఃఖాలు జీవికి అనివార్యము. అవి వస్తూనే వుంటాయి పోతూనే వుంటాయి. నమ్మితే ఆ నరహరి కరుణ, అమితము (అంతులేనిది). అందుకు సాక్షి వారూ వీరూ కాదు. స్వయంగా అర్జునుడే సాక్షి. ఎన్ని బాణం దెబ్బలు తిన్నాడు ఎంత గాయపడ్డాడు తన సఖుని కోసం? ఓ నా వివేకమా! బహుకాలంబుల ఈ సంసార సాగరాన్ని ఈది ఈది ఇక నీవల్ల కాదని భ్రమపడవద్దు. శ్రీపతి దాస్యమును చేబూనుము. తమితో (ఆసక్తితో) నీవాపని చేస్తే నిన్ను శ్రీపతి తప్పక రక్షిస్తాడు. ఇందుకు బలిచక్రవర్తియే సాక్షి. నారాయణుడే ఆయనకు కావలివాడై రక్షిస్తున్నాడంటే ఈ దాస్యభక్తికి సాటి వున్నదా?

ఓ జిహ్వా! (ఓ నాలుకా!) మరి (ఇంకా) ఈ శ్రీవేంకటేశ్వరుని నుతుల పట్ల (కీర్తనలపట్ల) మరగివుండుము (వ్యసనపడుతూ వుండుము). అరయగ (చూడబోతే) ఇదొక్కటే నిన్ను ఈడేరించును (తరింపజేయును). ఇందుకు సాక్ష్యమెవరో తెలుసా చతుర్దశ పురాణాలను క్రోడీకరించిన వ్యాసమహర్షి మొదలైన గొప్ప గొప్ప ఋషులు. ఓనా విజ్ఞానమా! ద్రిష్టపు మాయలకు (కుశంకలను కలిగించు ఆ దేవదేవుని మాయలకు) లోగి (లోనయి) తిరగకుమీ (దిమ్మరిలాగా తిరుగవద్దు). ఈ శ్రీవేంకటేశ్వరుని పాదసేవకు సరిలేదు (సమానమైనది లేనేలేదు). దీనికి స్వయంగా సనకాదులబ్రతుకే సాక్షి. నేటికీ ఆ సనక సనందనాది ఋషులు అదృశ్యరూపులైవచ్చి ఆ ఏడుకొండలవాడిని సేవిస్తూనేవున్నారు.





సంపుటి: 2 కీర్తన : ఎట్టిదో మీమాయావిలాసము యెఱిగిన నెఱగనీదు

సంఖ్య : 293 పుట : 196 రాగం: లలిత

**లలిత**

**60 ఎట్టిదో మీమాయావిలాసము యెఱిఁగిన నెఱఁగనీదు**
**అట్టె మాగురునసుమతినే ప్రత్యక్షమవైతివిగాని ॥ పల్లవి॥**

**కరుణాకరా మిమ్మునుఁ గని తెలియఁగలేను**
**ధర మీ మహిమలు వినివిని తగ నరుదందుదును**
**నరహరి నీవు నాలో నుండఁగ నమ్మక పురాణకథలందు**
**అరయఁగ మీచరితలు చెప్పఁగ నాసతోద మిముఁ దలంతును ॥ఎట్టి॥**

**జగదీశా మీనామంబులు జపించనలయుదును**
**వెగటుగ నీచిత్రసృష్టి చూచి మిము వెదకుదు నింతటను**
**నగధర మీపై భక్తి సేయఁగ మనంబున నొడఁబడను**
**పగటున మీరిచ్చువరములకొరకే పలుమారు**
**మీకు మొక్కుకొందును ॥ఎట్టి॥**

**శ్రీవేంకటేశా నీమూరితి చింతించి చేపట్టఁగలేను**
**దేవుఁడ వనియెదువిశ్వాసమునకే తిరముగఁ గొలిచెదను**
**శ్రీవనితాధిప వేదాలు మిమ్మునుఁ జెప్పఁగా నే తర్కింపుదును**
**వేవేలుపరుషలు సేవింపఁగ నీవే కర్తవని నిశ్చయింతును ॥ఎట్టి॥293**

**అవతారిక:**

ఇది ఈ "పొడవుకు పొడవైన పురుషోత్తమా"! అనే, అన్నమాచార్యులవారి సంకీర్తనా యజ్ఞంలో 11వ సంపుటములోని

"షష్ఠిపూర్తి కీర్తన". ఈనాడు నా ఆనందం వివరించటానికి నా భాషా జ్ఞానం చాలదు. భగవదేచ్ఛ అన్నట్లు ఈ కీర్తనల ఈనాటి నా మానసిక స్థితిని ప్రతిబింబిస్తున్నది. ఆనందం కృతజ్ఞత కన్నీరు ఉప్పెనలావస్తున్నాయి. ఆ శ్రీనివాసుని నేను యేమని పొగడను? పనికిరాని గడ్డిపువ్వువంటి నాకు ఆయన పాదాలవద్ద చోటిచ్చాడు. ఇంకా కొన్నాళ్ళు బ్రతకటం కాదు నా కోరిక ఈ నా జన్మలోని లోపాలనన్నింటినీ మన్నించి నా ఆత్మ తిరుమల శిఖరాలపై తిరిగి తిరిగి ఏనాటికైనా శ్రీవేంకటేశ్వరుని వద్ద స్థిరపడితే నేను కోరేదింకేమీ లేదు. అదే నాకు ముక్తి ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు శ్రీహరితో అంటున్నారు "ప్రభూ! మీ మాయావిలాసము యెటువంటిదో యెఱిగిన నెఱగనీదు... ఆవిధంగా మా గురువులు శ్రీరామానుజులవారి అనుమతి మూలంగానే మీరు మాకు ప్రత్యక్షమయ్యారు" అంటున్నారు. గురుకృపలేనిదే ఈశ్వరునెరుంగుట దుర్లభము. ఆయనకృప లేకపోతే ఎన్నిసార్లు తిరుమల వెళ్ళినా కనబడేది విగ్రహమే, దేవుడు కాదు. ఆ స్వామిని చూచికూడా దర్శించనట్లే. ఓ దేవదేవా! వేదము చదివినా నీ వునికిని తర్కించే దౌర్భాగ్యుడను. అందుకే నీ మూర్తిని చూస్తూ మనస్సులో చింతించి నిలుపలేక పోతున్నాను నీవే దేవుడవనే స్థిరమైన విశ్వాసంతో నిన్నే కొలిచెదను. నీకృప లేక నేను నిన్నెట్లు "చూడగలను" స్వామీ! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! మీమాయావిలాసము యెట్టిదో యెఱిగిన నెఱగనీదు (తెలియాలంటే తెలియనీయదు). అట్టే (ఆవిధంగా) మా గురుని అనుమతినే (మా గురువు శ్రీరామానుజులవారి కృపతోనే) నీవు ప్రత్యక్షమైతివి గానీ, నిన్ను దర్శించుట మా తరమా?





ఓ కరుణాకరా! మిమ్మల్ని యెదురుగా చూస్తూ కూడా మిమ్ము తెలుసుకోలేకున్నాను. మీ మహిమలను గురించి వినికూడా ఆఁ పోదూ ఇవన్నీ అరుదు (జరిగేవికావు) అంటుంటాను. ఓ నరహరీ! నీవు నాలోనే వున్నావని పెద్దలంటుంటే నమ్మక పురాణ కథల్లో చెప్పినట్లు నీవు వుంటావని నిన్ను అలా దర్శించాలని ఆశతో తలంచెదను ఇక నాకు నిన్నెరుగుట యెట్లు సాధ్యపడుతుంది?

ఓ జగదీశ్వరా! కాసేపు నీ నామము స్మరించే సరికే నాకు విపరీతమైన అలసట వచ్చేస్తున్నది. చిత్ర విచిత్రమైన మీ సృష్టి చమత్కారాన్ని చూచి మీ తత్త్వాన్ని గ్రహించాలని ప్రయత్నిస్తాను. ఇంతటా (ఈ సృష్టిలో) మిమ్ము వెదుకుదును. కాని నిన్ను కనుగొనలేను. ఓ నగధరా! నీపై భక్తి నిలుపుదామంటే మనస్సు పరిపరివిధాల పోతుందేకాని నిన్ను ఒడబడదు (అంగీకరించదు). ఎంతసేపూ నీవేదో వరాలిస్తావనే ఆశతోనే అనేకమార్లు మీకు మ్రొక్కుతానుకాని నిజమైన నిస్వార్ధ భక్తితో కాదు. ఇక నేను ఏవిధంగా మోక్షానికి అర్హుడినయ్యా?

ఓ శ్రీవేంకటేశ్వరా! మీ మూర్తిని చింతించి (ధ్యానించి) చేపట్టనశక్తుడను. అయినా నీవే దేవుడవనే స్థిరమైన విశ్వాసంతో నిన్ను కొలిచెదను. ఓ శ్రీవనితావల్లభా! నీవు ఇటువంటి వాడివని వేదము స్పష్టముగా చెబుతుంటే నేను పనికిరాని తర్కములను చేస్తుంటాను. వేవేల పరుషలు (అసంఖ్యాకులైన పురుషులు) నిన్ను సేవించుటకు కర్తవు (కారణభూతుడవు) నీవేనని గ్రహించితిని. అంతయు నీవే హరి పుండరీకాక్షా! అయినా నిన్ను ఇదమిద్ధంగా నెఱుంగుట నా తరమా! శ్రీహరీ! శరణన్న వానికి నీ అంతట నీవే తెలుస్తావు. అంతే మరి.

సంపుటి: 2 కీర్తన : ఇప్పుడే నేనొడబడ మరువగ దగదు జెప్పితి
సంఖ్య : 302 పుట : 202 రాగం: సామంతం

**సామంతం**

**61** ఇప్పుడే నే నొడఁబడ మరవఁగఁదగదుజెప్పితి యెల్లనాఁడు
నెప్పున నేనెంతకల్లరినైనా నీదాసుఁడనని యందురుగా ॥ పల్లవి॥

మఱతునో తలఁతునో నిన్ను మాఁటల నేతప్పు గలుగునో
యెఱఁగక నీదాసులఁజూచి యేమని పలుకుదునో
నెఱసిననాకర్మఫలంబులు నీకు సమర్పణ సేసితిని
మఱి నామీఁదట నేరము లెంచక మాధవ నన్నిటు రక్షించవే ॥ఇప్పు॥

అలతునో సొలతునో నే నీయందు భక్తిసేతునో సేయనో
యెలమిని నీకు నివేదించక యేమేమి భుజియింతునో
తలఁచేటినామనసే నీకును ధనముగాఁ గప్పము వెట్టితిని
పలుమరు నన్నును తగవుకుఁదియ్యక పరమాత్మా ననుఁ గావఁగదే ॥ఇప్పు॥

నేరనో నేర్తునో నీకైంకర్యము నేమము నేమేమి మానితినో
నీరూపము నే సేవించి యెక్కడనే సనుమానించితినో
మేరతోడ మావారు చెప్పఁగా మిమ్మింతట నే నమ్మితిని
వారిఁ జూచైన శ్రీవేంకటేశా వరదుఁడవై మము మన్నించఁ గదవే ॥ఇప్పు॥302

**అవతారిక:**

'కల్లరి' అంటే అబద్ధాలకోరు అని అర్థం. చీటికిమాటికీ చిన్న చిన్న అబద్ధాలు చెప్పటం నాకు అలవాటయింది స్వామీ కాని నేను నీ దాసుడినయ్యా! దాసుడి తప్పులు దండముతో సరి అంటారు కదా! ఇక దండన మాటెందుకు? నేనెంత కల్లరినైనా, ఇది ఆరువందల సంవత్సరాలనాటి తెలుగు. అందువల్ల కొద్దిగా పదప్రయోగంలో తికమక





అంతే. ఓ ప్రభూ! నాలోని లోపాలనన్నింటిని నాడే నీకు మనవి చేసికొన్నాను. ఇప్పుడు నీవు నన్ను వదిలివేస్తే నేనేమైపోతానయ్యా? నేను నీ ఒడబడను (నీవెలా చెబుతే అలా చేసేస్తుంటాను). నన్ను మరువతగునా స్వామీ? అంటున్నారు తాళ్ళపాక అన్నమాచార్యులవారు. అలాగని నాలో దుర్గుణాలను చూచి సమర్ధించమనికూడా చెప్పలేను. ఒకవేళ నావల్ల తప్పు జరిగినా నేరము లెంచక నన్ను రక్షించు. ఈ రోజంటే నాకు శక్తి వున్నది. తెల్లవారితే జీవించి వుంటానో లేదో తెలియని బ్రతుకునాది. ఈనాడు లక్ష్మీపతివైన నీకు నేనేమి ధనమీయగలను, యెంతని యీయగలను? అందుకని నా మనస్సునే నీకు కప్పముగా (టాక్స్) కట్టేస్తాను. ఇంకా నన్ను వెలివేసి నాతో పోట్లాడితే నేనేమి చేయగలనయ్యా? నీ కైంకర్యమునకు నీ ఆగమాలు యెన్నో విధానాలను పెట్టాయి. నియమాలను విధించాయి. మా గురువులు నీవు దీనజనరక్షకుడవని నీపై నమ్మకం తప్ప నీవు మానుంచి అన్యమేమీ ఆశించవని చెప్పారు. అదిమాత్రం చేయగలను ప్రభూ! నన్ను యేమిచేసినా నీ ఇష్టం. వాళ్ళను (మా గురువులను) చూచి అయినా నన్ను రక్షించు తండ్రీ! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నాడు (ఇదివరకే) యెల్లనేను చెప్పితి (నీకు చెప్పుకొన్నాను). ఇప్పుడు నేను నీ 'ఒడబడను' (దాసుడను). నన్ను మఱవదగదు నేను నెప్పున కల్లరిని (ఏదో ఒక ఉపాయంతో నేను అనేక అబద్ధాలు చెప్పే అలవాటువున్నవాడిని). అయినా నన్ను నీ దాసుడు అనే కదా! అంటారు. అందుకని యేదోవిధంగా నీవే నన్ను అనుగ్రహించాలి.

నిత్యజీవితంలో పెద్దపెద్దవాళ్ళే అనేక తప్పులు చేస్తున్నారు, ఇక నేనెంత? నిన్ను తలతునో మరతునో తెలియదు. అనుకోకుండా నీ గురించి యేమన్నా తప్పు మాట్లాడతానేమో? ఒకవేళ నీదాసులను యేమైనా పొరబాటున అని నొప్పిస్తానేమో? నీవు ఆనాడు గీతలో

చెప్పినట్లు నా కర్మఫలములన్నీ నీకే అర్పణ చేసేను. ఓ మాధవా! ఇంకా నన్ను దోషము లెంచక రక్షించు స్వామీ!

నేను కూడా మానవమాత్రుడనైనందుచేత త్వరగా అలసిపోవుట నాకు సహజము. సరిగ్గా తగిన సమయానికి నేను నా ప్రేమను భక్తినీ నీపై ప్రకటించగలనో లేదో? నాకు అనారోగ్యంవల్లనో మరెందుచేతనో నీకు నివేదించకనే (నైవేద్యం పెట్టకుండానే) భుజిస్తానో యేమో? ఒక్కొక్కప్పుడు అతి సంతోషంలో నన్ను నేను మరచి కూడా నేనా పొరబాటు చేయవచ్చును. అందుకనే తలచేటి నా మనస్సును (ఆలోచించగల నా మేధస్సును) నీకు ధనముగా కప్పము కట్టితిని స్వామీ! ఓ పరమాత్మా! పలుమరు (చీటికీమాటికీ) నన్నును తగవుకు దియ్యక (నాతో పోట్లాట పెట్టుకోకుండా) నన్ను గావగదే (సంరక్షింపుము స్వామీ!)

ప్రభూ! నేను నీకు కైంకర్యము (ఊడిగము) చేసేమాట వాస్తవమే. కానీ అందులోని నేమములన్నింటినీ (నియమములన్నింటినీ) సరిగా అనుసరిస్తానో లేదో, ఒకవేళ కష్టము అని మానివేస్తానేమో? నీ రూపమునాయెదుట వున్నా, నిన్ను సేవిస్తానో లేక అనుమానముతో దీనివల్ల నాకేమి ఉపయోగమని సరియైన సమయానికి విడిచిపెడతానేమో? మేరతో (క్రమక్రమముగా) మావారు (వైష్ణవగురువులు) చెప్పగా చెప్పగా మిమ్ము (దేవదేవుడవైన నిన్ను) నేను నమ్మితిని. ఓ శ్రీవేంకటేశ్వరా! నేనెటువంటివాడనైనా, వారిని (మా గురువులని) చూచియైనా నీవు వరదుడవైనందున మమ్ము మన్నించగదవే (క్షమించరాదుటయ్యా?) పోనీ వీడు కల్లరిలే అనుకొని అయినా నన్ను మన్నించు తండ్రీ!





సంపుటి: 19 కీర్తన : మానరా నవ్వు మానరా వద్దు మానరా
సంఖ్య : 403 పుట : 269 రాగం: సామంతం

### సామంతం

**62** మానరా నవ్వు మానరావద్దు మానరా
మాతో మానరా యేల మానరా నీవు
మానకుంటే నిన్ను నిందకు వినగా
మాటల దిద్దిక మానరా ॥పల్లవి॥

వారివీరితోడ వావులు చెప్పెంపే-
వట్టిదోసమేల కట్టేవురా
తేరకొన నన్నుఁ జూచి వట్టి యాస-
దేర నుస్సుర నేఁటికి రా
పోరి పోరి నీవే నిజమరి నంటా
బొంకుచు నన్నేల ముట్టేవురా
కోరి వూరకున్నవారి కింతేసి-
కొడిమె లేఁటికి వచ్చీరా ॥మాన॥

చక్కనివారికి నీయెదుట నే॥పల్లవి॥దు
సారె నిలువరాదటరా
వొక్కమాఁటలోనే నీవింత గరఁగి
వొళ్లు చెమరించనేఁటికిరా
చిక్కనిచన్నులు నాకుఁ గలిగితే
చింతఁ బొరలఁగక నీ కేలరా
మొక్కలాన నీవు సేసేరోఁతలకు
మొదలనే నాకు సిగ్గవురా ॥మాన॥

కారణములేక వూరివారితోడ
కాలుదొక్క నేలవచ్చేవురా
నీరువంక తుంగవంటీవాఁడ వింతే
నీతోడిపొందుకు నేనోపరా
కూరిమితోడుత శ్రీవేంకటేశ్వర
కూడితివి నిన్ను నేమందురా
కోరినకోరికలెల్లాఁ దలకూడె
గోరనన్ను నూఁదనేఁటికిరా ॥మాన॥403

**అవతారిక:**

ఈ సరస శృంగార కీర్తనలో అన్నమాచార్యులవారు నాయికయై నాయకుడైన స్వామివారితో తనతో యెగతాళిగా నవ్వటం మానమని ప్రాధేయపడుతున్నారు. నీ మాటలతో మమ్ము హింసించటం మానమని అంటున్నారు. అలనాటి జానపద తెలుగు అయినందువలన ఈ కీర్తన అంత తేలికగా అర్థంకాదు. వారితోటి వీరితోటి వాపులు చెప్పి పంపేవు. అట్టి దోసముయేల కట్టేవురా అని అడుగుతున్నారు. కోరి వూరకున్నవారితో ఇంత కొడిమెలేటికి వచ్చీరా అని అడుగుతున్నారు. కాస్త అందంగా కనబడితే ఆమెనీయెదుట నిలువరాదటరా? ఒక్కమాటతో నన్ను కరిగించి వేస్తావే నీకిటుకులు వ్యూహాలు నాకు తెలియవని అనుకొంటున్నావా? అసలే నాకు సిగ్గు ఎక్కువ. దానికితోడు నీ ప్రవర్తన శృతిమించుతున్నది. నిష్కారణంగా వూరి వారితో కాలుదొక్కనేలరా అని నిష్ఠూరంగా అంటున్నారు.

ఓ శ్రీవేంకటేశ్వరా! కూరిమితో నన్ను కూడినావు ఇక నేను కోరిన కోరికలన్నీ తలకూడినవి. ఇంకేమీ కోర నన్ను నూదనేటికిరా అని ప్రశ్నిస్తున్నారు. ఇదీసంగతి. ఆనాటి తెలుగుకు ఈనాడు నిఘంటువులవసరమయ్యాయి. ఏమి చేస్తాం చెప్పండి? ఆనాటి తెలుగు మాటలు నేటి నుడికారంలో యెలామారిపోయాయో గమనించండి.

**భావ వివరణ:**

ఓ ప్రియా! నీకొంటె నవ్వులు మానరా, మాతో ఈ విరసము నీకు దగదు, ఇదంతా యెందులకు? నీవు నీ ప్రవర్తన మార్చుకోకుంటే, మేము





నీపై నిందలను సహింపలేము. ఇంకా నీవు నీ మాటలతో శిక్షించుట మానరా! మా మాటలు వినరా!

నీవు వారితో (వారితోను, వీరితోను) వావులు చెప్పంపేవు (నీకు నాకూ యేదో వావీవరుసా వుందని అందరికీ చెబుతున్నావు. అట్టి దోసమేల కట్టేవురా (అటువంటి తప్పుడు మాటలు యెందుకు చెబుతున్నావయ్యా? నన్ను తేరకొనచూచి (తేరిపారచూచి) వట్టియాస (వ్యర్థమైన ఆశ)తో, వుస్సురనయేటికిరా (వుస్సురుమని నీవు నిట్టూర్చడం వలన ప్రయోజనమేమిటి?) పోరిపోరి (పోయిపోయి) నీవే నిజమరినంటా (సత్యహరిశ్చంద్రుడనన్నంతగా) బొంకుచు (పచ్చి అబద్ధాలు చెబుతూ) నన్నేల ముట్టేవురా (నన్నెందుకు తాకుతావయ్యా?) కోరివూరకున్న వారితో కొడిమెలేటికి వచ్చీరా (పాపపు కొంటెపనులు యెందుకు చేస్తావయ్యా?)

నేడు (ఈనాడు) చక్కనివారు నీ యెదుట నిలువరాదటరా (అందమైన ఆడది నీ కళ్ళలో పడకూడదటయ్యా?) నీవు అందగాడవే వొప్పుకుంటాను. అంతమాత్రాన నాబోటి బేలను కరిగించి (మైమరపించి) నా ఒళ్ళు చెమర్చునట్లు చేయవలెనా? నాకు చిక్కని చన్నులు కలిగితే (బింకమైన స్తనయుగ్మమున్నంతమాత్రాన) నాగురించిన చింత నీకెందుకయ్యా? మొక్కలాన (మోసపూరితంగా) నీవు చేసే రోత కలిగించు పనులు తలుచుకుంటుంటేనే నాకు అంతులేని సిగ్గు కలుగుతుందయ్యా!

ఓ రసికశిఖామణీ! నిష్కారణంగా వూరివారితో (పరాయివారితో) కాలుదొక్కనేలవచ్చేవురా (దగ్గరవుతావెందుకురా?) నీవు నీరువంక తుంగవంటివాడవు (నీటిలో కొట్టుకుపోయే కట్టెపుల్లలలాంటివాడివి). నీకు స్థిరత్వం లేనేలేదు. నీతోటి పొందు వద్దనే వద్దు. నిన్ను నేనేమాత్రం సహించలేను. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు నన్ను కూరిమితో (ప్రేమతో) కూడితివి (చేరువయితివి), నిన్ను నేనే మనగలనయ్యా! నేను కోరుకున్న కోర్కెలన్నీ నెరవేరినవి. కోరనన్నున్ ఊదనేటికిరా (నాకు యేల ఈర్ష్యను కలిగింతువయ్యా!)

సంపుటి: 2 కీర్తన : ఉపకారిదేవుడు అపకారిగాడు
సంఖ్య : 384 పుట : 258 రాగం: గుజ్జరి

**గుజ్జరి**

**63** ఉపకారి దేవుఁడు అపకారి గాఁడు ॥ పల్లవి॥

దేహం బొసఁగెను దేవుఁడు తనుఁ దెలియఁగ శాస్త్రము గడియించె
దేహాంతరాత్ముఁడు మరి దేహచైతన్యుఁడా దాను
దేహి యేలోకంబున కేఁగిన దేవుఁడు దా వెంటనే యేగును
దేహి కోరినట్టే కమ్మర దేవుఁ డనుమతి ఇచ్చీఁగాన ॥ఉప॥

చేయుటకును చేయకమానుటకును జీవుఁడు స్వతంత్రుఁడాయంటేను
కాయపుసుఖములు గోరఁగఁ గర్తట కడగనుటకుఁ గర్తగాఁడా
యీయెడ నాయెడ నంతర్యామే యిన్నిటికినిఁ బ్రేరకుఁ డింతే
దాయక పాయక తనతలఁపుకొలఁదీ దైవమేసృజియించీఁగాన ॥ఉప॥

ఇవి యెఁరిగి చిత్తమా నీ వితనందే అభిరతి సేయుము
సదయుఁడు మనశ్రీవేంకటగిరిసర్వేశ్వరుఁడు సత్యుఁడు
మొదలనే యీయర్థము కిరీటితో మొగి నానతి ఇచ్చినాఁడు
అదే "సమోఽహం సర్వభూతేషు" అని గీతలో నున్నది గాన
॥ఉప॥ **384**

**అవతారిక:**

కొంతమంది అజ్ఞానులు అద్భుతమైన భగవద్గీత భగవత్తత్వాన్ని చెబుతుంటే దాన్ని వక్రీకరించి దేవుడు యేదో కఠినాతి కఠినమైన శిక్షలనమలు చేసే న్యాయాధిపతి అని దయా దాక్షిణ్యాలు లేని "ఎక్జిక్యూషనర్" అనే అభిప్రాయం కలిగిస్తుంటారు. ఈ కీర్తనలో





అన్నమాచార్యులవారు అది తప్పు అభిప్రాయమనీ, దేవుడు ఉపకారియే కాని పగసాధించే అపకారి కాదని బోధిస్తున్నారు. ఏ కారణం వల్లనో కానీ తరచుగా రెండు చరణాలుండవలసిన "పల్లవి"లో ఒక్క చరణం మాత్రమే వున్నది. దీనికి నేడు మనం చేయగలిగిందేమీ లేదు. ఎక్కడెక్కడో తిరుగుతున్న ఆత్మకు తగిన దేహము నిచ్చు జన్మనిచ్చేవాడెవరు? దేవుడే కదా! అంతేకాదు వాడికి జ్ఞానం కలిగించి శాస్త్రము నేర్పి అనుక్షణం అంతర్యామివలె మంచిచెడ్డలు విడమరచి దేహి వెంటనే వుంటూ వాడి ప్రాణోత్క్రర్షణ దాకా వాడి (జీవుడి) వెంటనేవుండే వాడే దేవుడు. అంతెందుకు వాడికి రాబోయే జన్మకూడా వాడి ఆఖరిక్షణపు ఇచ్ఛ ప్రకారమే వస్తుందంటున్నారు. అన్ని జీవులలోనూ వుండేది శ్రీవేంకటేశ్వరుడే కాబట్టి ఓ చిత్తమా! నువ్వు ఇతనంటే అభిరతి (ఆపేక్ష) చేయుము అని బోధిస్తున్నారు. ఇది నేడు అన్నమయ్య చెబుతున్నమాటకాదు, స్వయంగా పరమాత్మే కిరీటి (అర్జునుడి)తో చెప్పాడు "సమోఽహం సర్వ భూతేషు" అని. అన్ని జీవులలోనూ అంతరాత్మగా నేనేవున్నానని ఆ గీతావాక్యానికి అర్థం.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఇది గ్రహించండి సర్వేశ్వరుడైన ఆ దేవుడు మన తండ్రి. ఆయన మనకు ఉపకారిమాత్రమే, అపకారి యెన్నటికీ కాదు.

మనం తల్లి కడుపులో ఈ రూపంతో "పడుతున్నామా? లేదే స్త్రీ పురుష జీవకణాలసంగమం మూలంగా పిండోత్పత్తి జరుగుతోంది. దానికి మనం కర్తలం కాదు కదా! మరి మనతల్లి కడుపులోనే మనకు ఒక దేహము నిస్తున్నదెవరు? దేవుడే కదా! తల్లి కడుపులో వుండగానే ఈ జీవుడికి శాస్త్ర జ్ఞానమును బోధిస్తున్నదెవరు? ఆ దేవుడే. పిండరూపి ఒక ప్రాణి ఆకారం దాల్చిన తరువాత ఆ ఆకారంలోకి ప్రాణాన్ని జొప్పించేదెవడు? ఇంకెవరు

ఆ సర్వాంతర్యామే కదా! అప్పుడు ఆ బిడ్డ అమ్మకడుపులో కదలుతూ గర్భవాస నరకాన్ని అనుభవిస్తుంది. ఇక ఆపై ఆ దేహి యేలోకం వెళ్ళితే దేవుడు కూడా వాడి వెంటే వెళతాడు. అనుక్షణం వాడికి హితవు బోధిస్తుంటాడు. అయితే అహంకారంతో వాడు వినడు అన్నమాట వేరే విషయం. దేహియెలా కోరుకుంటే దేవుడు వానికి అలా జీవించటానికి, కమ్మర (మరల) అనుమతిస్తాడు, ఆ దేవుడు. అందుకే కొందరు యోగులు, కొందరు భోగులు అవుతున్నారు. అయితే వారి కర్మఫలం అనుభవించేటప్పుడు మాత్రం వారికే స్వాతంత్ర్యం వుండదు.

ఏదన్నా కర్మ చేయుటకైనా, చేయకుండుటకైనా జీవుడు స్వతంత్రుడా? అంటే అదీ చెప్పుట సాధ్యముకాదు. కాయపు సుఖములు (తన శరీరంతో పొందవలసిన సుఖములు పొందటానికి వాడికి అనుమతి నిచ్చిన దేవుడు, వాటిని అనుభవింపజేసే కర్తకూడా తానే కదా! కాదంటే యెలా నమ్ముతాము? కాబట్టి ఈయెడ (ఈ ఇహలోకంలోను, ఆ పరలోకంలోను అన్నిటినీ ప్రేరేపించేవాడు అంతర్యామి వొక్కడే. ఆ అంతర్యామి కూడా సాక్షీభూతుడే. అతను కూడా, దాయకపాయక ఈ దేహికి దగ్గరాకాదు, దూరమూ కాదు తన ఆలోచనకు తగ్గట్లు దేవుడే ఆ జీవుణ్ణి సృజియించి వాడికి అరిషడ్వర్గాలను అంటగడుతుంటాడు.

ఇది అంతా నేర్చిన ఓ చిత్తమా! నీవు ఇతనంటే అభిరతి సేయము (ఆపేక్ష చూపుము). మన శ్రీవేంకటగిరి సర్వేశ్వరుడు, సదయుడు (అపారమైన దయగలవాడు), సత్యుడు (సత్యవాక్పరిపాలకుడు.) ఆయన మొదలనే (ద్వాపరయుగమునాడే) కిరీటితో (అర్జునునితో) మొగినానతిచ్చెను (పూనికతో గీతావాక్యముగా అనుమతిచ్చాడు). ఏమని? “ఓ అర్జునా! సర్వభూతములయందు నేనే అంతర్యామిగానున్నాను”. మరి మనకీ భేదభావమెందుకు చెప్పండి, మరి?





సంపుటి: 2 కీర్తన : జీవుని కేకొలము శ్రీహరి చేరువబంధువుడీతడు
సంఖ్య : 393 పుట : 264 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

**64 జీవుని కేకాలము శ్రీహరి చేరువబంధువుఁ డీతఁడు**
**భావములోపలిపెరరేఁపకుఁడై భక్తి చేకొనును యీతఁడు ॥ పల్లవి॥**

**పరమున నిహమున వెంటవెంటనే పాయనిబంధువుఁ డీతఁడు**
**ధరఁ దనుఁదలఁచిన మారుకుమారై తా రక్షించును యీతఁడు**
**విరివిగ నింద్రియవిషయభోగముల విందులు వెట్టును యీతఁడు**
**వురగతిఁ జిత్రపురూపుల దేహపుటుడుగర లిచ్చును యీతఁడు**
**॥జీవు॥**

**పడిఁ గలకాలము యిరువదియొక్కటవావులబంధువుఁ డీతఁడు**
**బడిబడిఁ జైతన్యంబై యిన్నిటఁ బనులకు నొదగును యీతఁడు**
**జడిగొని యేకాంతలోకాంతమై మతిసంగతి నాప్తుఁ డీతఁడు**
**పొడలుచు వైదికలౌకికముల నొకపొత్తునఁ గుడుచును యీతఁడు**
**॥జీవు॥**

**ఘననిధినిక్షేపములిచ్చేటివుపకారపుబంధువుఁ డీతఁడు**
**అనయము వెరవకుమని యేకాలము నభయం బొసగును యీతఁడు**
**ననిచిన శ్రీవేంకటేశ్వరుఁడై యిటు నాపాలఁ గలుగు నీతఁడు**
**పనివడి అరులను సూడువట్టి కడుఁ బగసాధించును యీతఁడు**
**॥జీవు॥**

**అవతారిక:**

“పెరరేచుట” అంటే ప్రేరేపించుట అని అర్థం. ఏకాలముననైనా జీవునికి శ్రీహరి యొక్కడే దగ్గరబంధువు. ఈతడెక్కడో వైకుంఠంలో

వుండడు. మన భావములోనే వుండి అన్నీ తానే ప్రేరేపిస్తాడు. ఆ క్రమంలో తనపై భక్తిస్థిరపడ్డవారిని చేరువయై ఇతడే చేకొంటాడు అంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ కీర్తనలోని చాలా చరణాలు చర్వితచరణమే. జీవులకు వారివారి కర్మానుసారముగా తనకొక్కడికే తెలిసిన శ్రేష్ఠమైన పద్ధతిలో దేహములు అనునట్టి వుడుగరలిస్తాడట ఈతడు. చాలా వేగముగా కదలిపోయే కాలములో ఇరువదియొక్క విధములుగా ప్రాప్తించే బంధువు ఈతడు. జీవులందరిలో చైతన్యం రూపంలో నెలకొనివుండే సర్వాంతర్యామి ఈతడే. జీవులచేత వైదికమైన పనులు చేయించేదీ ఈయనే లౌకికమైన పనులు చేయించేదీ ఈయనే. భ్రమవల్ల అవన్నీ మనమే చేశాం అనుకొంటూంటాము. కానీ చేయించే అంతర్యామిని గుర్తించం.

**భావ వివరణ:**

ఏకాలమును (యెప్పుడైనా) శ్రీహరి చేరువ బంధువు (దగ్గరచుట్టము). ఈతడు భావములోన (అంతరంగమున) పెరరేపకుడై (ప్రేరేపకుడై) భక్తిమార్గము ద్వారా మనల్ని చేకొనును (అనుగ్రహిస్తాడు).

ఇతడు ఈ జీవులకు పరమున (పరలోకములందును) ఇహమున (ఈ ప్రపంచమునందుననూ) పాయని బంధువు (ఎన్నడు తోడు విడిచిపెట్టని బంధువు). ఈతడు ధరన్ (ఈ భూమిమీద) తను దలచిన (ఆయనను ధ్యానించిన) తాను మారుకుమారై (మాటిమాటికీ) రక్షిస్తాడు. అంటే, వీడు చేసే భక్తికి ఒక్కసారి రక్షిస్తే చాలులే అని వూరకుండడు, యెన్నిసార్లైనా రక్షిస్తాడు. తరుణ ప్రాయంలో జీవి ఇంద్రియ విషయాసక్తుడై యుండుట సహజము. ఆ సమయంలోమ జీవికి విషయవాంఛపెంచి చక్కగా భోగించునట్లుజేసి రకరకములైన అనుభవములను విందులు వెట్టును





(ఆస్వాదింపజేస్తాడు). ఉరుగతి (తనకొక్కడికే తెలిసిన శ్రేష్ఠమైన విధానమున) ఈతడు (ఈ దేవదేవుడు) చిత్రవిచిత్రములైన ఆకారములు గల దేహపుటడుగరలు (దేహములు అనునట్టి కానుకలను) ఇస్తాడు.

ఈతడు (ఈశ్రీహరి) వడిగలకాలమున (వేగముగా కదలిపోవు కాలమున) ఇరువది యొక్కటి విధాలుగా అవాపుల బంధువు (ప్రాప్తించెడి బంధువు). ఈతడు బడిబడి (తోడు నీడై వుంటూ) ఇన్నిటా (ఈజీవులన్నిటిలో) చైతన్యస్వరూపుడై పనులకు నొదగును (ఆ జీవి చేసే చిత్త వికారముతో కూడిన పనులన్నీ తానే చేస్తున్నట్లు భ్రమ కల్పిస్తాడు). అయితే నిజానికి ఆయనకే వికారములూ వుండవు. జడిగొని (యెన్నోశ్రమలకోర్చి) జీవుడు ఒంటరిగా లోకాంతరవాసములు చేస్తుంటే మతిసంగతి (ఆజీవి మతిలోనే వుంటూ) కాపాడే ఆప్తుడీతడు. లౌకిక వ్యవహారములనేకాక, ఈతడు వైదిక ధర్మమునుకూడా నిలిపి ఒకే పొత్తున యెవరికి కావలసింది వారు ఆచరించునట్లు చేస్తాడు.

ఈ ఐహికప్రపంచంలో సుఖంగా జీవించాలంటే ఘనమైన నిధినిక్షేపాలుండాలి. ఈతడు వాటిని కూడా సమకూర్చే ఉపకారపు బంధువు. అనయము (ఎల్లప్పుడూ) భయపడవద్దని యే సమయముననైనా అభయము నొసగే రక్షకుడితడే. ననిచిన (చిగురించిన) శ్రీవేంకటేశ్వరుడై ఈతడు నాపాలగలుగు (నాయందు అనుగ్రహంతో వున్నాడు.) ఈతడు నా అరులను (కామక్రోధాధి అరిషడ్వర్గమును), కడుసూడువట్టి (గొప్పగా పగసాధించి) అంతమొందిస్తాడు.

సంపుటి: 2 కీర్తన : కలుగుట కలిగిననాడే నే ఘనపాపములకు దొలంగీనా

సంఖ్య : 424 పుట : 286 రాగం: గుండక్రియ

## గుండక్రియ

**65** **కలుగుట గలిగిననాఁడే నే ఘనపాపములకు దొలంగీనా**
**యెలమి నేనిపుడే యెరిఁగితిని యిన్నాళ్లీమతి లేదు ॥ పల్లవి॥**

**జనియించిననే నిటకమునుపుసకలయోనిగతజన్మములు**
**కనుఁగొని యవె నే సారెకుఁ బలుమరు ఘనవర్ణాశ్రమధర్మములు**
**అనుభవించినవే సకలార్థంబులు అయిహికవిషయములన్నియును**
**మనసున వాకున శ్రీహరి నొకని నే మఱచియుఁ దలఁచుట లేదు ॥కలు॥**

**తిరిగినవే నే నాసలకొరకును దిక్కు లన్నియును నేను**
**యిరవుగ తొల్లియు నెఱిఁగినవే యీసంసారపుసుఖము లివి**
**పొరలినవే నేఁ గామినీజనులపొందుల సుఖములభోగములు**
**యెరవులడొకటే శ్రీహరిదాస్యం బిది గతియని యెరుఁగుటలేదు ॥కలు॥**

**గడియించినవే నేఁ బూర్వకాలమున ఘనమగుసంపద లిన్నియును**
**నొడిగినవే నే శబ్దజాలములు నోరఁ గొలఁదు లివి యిన్నియును**
**తడఁబడి నే నిటు సకలోపాయపుధర్మము లిన్నియుఁ జూచితిని**
**యెడపక శ్రీవేంకటేశ్వరు శరణం బిటువలెఁ జేరుటలేదు ॥కలు॥ 424**

**అవతారిక:**

కలుగుట కలిగిన నాడే నేఘనపాపములకు దొలంగీనా అనే పల్లవిలోనే కొంత తికమక కనబడుతున్నది. ఈ దేహికి ఒకానొక దేహము కలుగుట,





కలిగిన నాటినుంచే నేను ఘోరమైన పాపములను చేయుటకు శ్రీకారం చుట్టాను. ఈ ధర్మసూక్ష్మం నేను ఇప్పుడే గ్రహించాను. ఇన్నాళ్ళూ నాకా తెలివి లేదు అంటున్నారు అన్నమాచార్యులవారు. ఇంతకుమునుపు కలిగిన నా గత జన్మలలో అనేక యోనులయందు నా జన్మలు జరిగినవి. ఆయా జన్మలలో ఆయా వర్ణాశ్రమధర్మాలను పాటించాను. సకలార్ధములను అనుభవించాను. ఐహిక విషయ సుఖములను అనుభవించాను. వింతలలోకెల్లా వింతయేమిటంటే శ్రీహరిని మనోవాక్కులద్వారా తలచనందువల్లనే ఒకసారి ఆయనను మఱచితే మళ్లీ ధ్యానించుట జరుగుట లేదు. అజ్ఞానాంధకారంలో నిరంతరం మగ్గిపోతూనే వున్నాను. ఎన్నిసార్లు పుట్టినా తినడం తిరగడం పెరగడం కామక్రోధవశుడనై తిరగటం ఆ భ్రాంతితోనే చివరి శ్వాస వదలటం. ఎప్పుడూ జరుగుతున్నదిదే. ఏ జన్మలోనైనా నీ శరణుపొందితేగాని దీనికి అంతువుండదు. మరి నా గతేమిటి తండ్రీ!

**భావ వివరణ:**

ఓ జీవులారా! కలుగుట కలిగిననాడే (ఈ దేహికి యేదో ఒక దేహము కలుగుట సంభవించిననాడే) నేను ఘనపాపములకు (ఘోరమైన దుష్కృత్యములకు) తొలంగీని (సమాయత్తమయ్యాను). దురదృష్టమేమంటే యెలమి (పూనుకొని) ఇవన్నీ నేను ఇపుడే యెరిగితిని. నాకు ఈ మతి (జ్ఞానం) ఇన్నాళ్లూ లేదు.

గత జన్మములలో నేను ఇటకు మునుపు (ఇదివరలో) సకలయోని జనియించినాను (యెంతోమంది గర్భవాసంలో పెరిగి వారికి పుట్టినాను). సారెకు (జన్మించిన ప్రతిసారీ) అనేకమార్లు ఆయా వర్ణాశ్రమ ధర్మాలను పాటిస్తూ జీవించాను. సకలార్ధంబులు (ధర్మార్ధ కామములనే పురుషార్ధములను) అయిహిక విషయ సౌఖ్యములను అనుభవించనవే

మరల మరల అనుభవించాను. సరే ఇవన్నీ అజ్ఞానజనిత జీవలక్షణాలని, సర్దిచెప్పుకుందామనుకొంటే నా మనస్సున మరియు వాక్కున శ్రీహరిని మఱచి, తలచుటయే మానివేశాను. దీని ఫలితమేమిటో తెలియునా? మళ్ళీ జన్మలు మళ్ళీపీకులాటలు మళ్ళీ రోగాలు మళ్ళీ చావు.

ఈ దిక్కులున్నాయి చూశారా? ఎన్నాళ్ళనుంచో ఇవి ఇలాగేవున్నాయి. ఏ మార్పూ లేదు. నేను నా ఆశలు తీర్చుకొనుట కొరకు వీటిల్లో తెగ తిరిగాను. ఇప్పుడు నేను పొందుతున్న ఈ సంసారసుఖాలు మాత్రం కొత్తవా? కావు తొల్లియు (ఇదివరలోనూ) నేను ఇరవుగ (సుస్థిరంగా) నెరిగినవే. నేను కామినీ జనుల పొందులతో శారీరక సుఖములను భోగములను అనుభవించుచూ పొరలినవే (తలమునకలయినవే). ఈనాడు ఇందులో కొత్తేమీ లేదు. సమయానికి ఎరవులాగా ఆదుకొనే దొక్కటే వున్నది. అదే శ్రీహరి దాస్యము. అయితే దురదృష్టమేమంటే ఈ విషయం జీవుడు గ్రహించుట లేదు.

ఇన్నియు సంపదలునూ, నేను పూర్వకాలమున ఘనముగా గడియించినవే. ఇందులో క్రొత్తయేమీలేదు. ఈ శబ్దజాలములన్నియు (సమ్మోహనపరచే శబ్దములన్నియు) ఒడిగినవే (ఇదివరకే అనుభవించినవే). నానోటితో పలికినవే. ఈ విధముగా అనేక జన్మలలో తడబడి మెల్లిమెల్లిగా సకలోపాయ ధర్మములను మరల మరల సాధించినవే. ఇదంతా ప్రతిజన్మలోనూ యెడపక (యెడతెరపిలేక) జరుగుతున్నదే. కానీ ఓ శ్రీవేంకటేశ్వరా! నా దౌర్భాగ్యమేమిటిది తండ్రీ! ఏ జన్మలోనూ నిన్ను ఆశ్రయించి శరణుపొందుట లేదు.

మరేమిటి నా గతి?





సంపుటి: 2 కీర్తన : సకలోపాసకులకు నందును సగుణంబే ప్రమాణము

సంఖ్య : 412 పుట : 278 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

**66 సకలోపాసకులకు నందును సగుణంబే**
**సకలమునీంద్రులు పూజించే యాసాకారమె ప్రమాణము ॥పల్లవి॥**

**సగుణంబని నినుఁ గొందరు సరి నిర్గుణమని కొందరు**
**వగలఁ బెక్కుగతిఁ జదివినకొలఁదుల వారికివారే వాదింతురు**
**అగణితస్వతంత్రుఁడవుగాన అల వాల్మీకి ఇట్టిట్టనకే**
**ఆగు "నిర్గుణాయ గుణాత్మనే" యని ఆనతి ఇచ్చుటే ప్రమాణము ॥సక॥**

**"సోహం" బని కొందరు "దాసోహం" బని కొందరు**
**సాహసవృత్తుల రెండుదెరంగుల సకలవివేకులు భజింతురు**
**దేహధారియై "దాసోహం" బని తేరి శుకుఁడు మీలోఁ గలసె**
**సోహపుభావన సర్వజగత్తులఁ జూపిన దేప్రమాణము? ॥సక॥**

**ఆరుశాస్త్రముల నారుమతంబుల నారుగర్మములనైనాను**
**యారీతిల మిము శరణని కొలువక యెవ్వరి కుపాయము లేదు**
**నారదాదులగుభక్తు లిందరును నానాగతు లరసి చూచి**
**సారపుశ్రీవేంకటపతి మీకే శరణనుటే ప్రమాణము ॥సక॥ 412**

**అవతారిక:**

ఈ కీర్తనకి యెంత వివరణ ఇచ్చినా, పరిపూర్ణ వివరణ కాదు. మనబోటి సామాన్యులు ఆ రీతి దుస్సాహసం చేయటం మంచిదికాదు. శ్రుతి వాక్యాలకు వివరణ ఇవ్వజూడటం, చురకత్తి (చాకు)తో చెట్టుకొమ్మను నరకాలనుకొనేటంత అవివేకమే. పరిపక్వదశలో

అన్నమాచార్యులవారు చెప్పిన ఈ కీర్తనలో అనేకమైన భగవదుపాసనలలో సాకార నిరాకారరూపునిగా రకరకాలవారు ఆశ్రయిస్తున్నా సాకారునిగా శ్రీహరి శరణు పొందటమే శ్రేష్ఠమంటున్నారు. శుక, నారద వాల్మీకి, శౌనికాదిమునులకు భగవంతుని నిర్గుణ నిరాకారరూపం తెలియదా? మరి వారెందుకు యుగయుగాలలో ఆయనను సాకారుడుగా అర్చించారు. అదెటువంటి ప్రమాణము? శ్రుతి వాక్యం "సోహం" భావన కాధారమేమిటి? ఆత్మయే. తాను అనే భావన. "నేను" అని అంతా భావిస్తున్న ఈ శరీరం, నిజానికి "నేను" కాదు. ఇది అనిత్యమై గుణములచే పరివృతమై కాలపరిమాణము కలిగి కాలానుగుణముగా మార్పులు చెంది నశించునది. దీనిలో ఆత్మవున్నంతవరకే ఇది "నేను" కనుక ఆ చైతన్యమే నేను, నేనే ఆ చైతన్యము. అది లేక నేను లేను. ఇది ఒక పద్ధతిగా అర్థంకాని తత్వాన్ని అర్థం చేసికొనే ప్రయత్నం జరుగుతోంది. నిర్గుణమే ఆత్మ గుణముగా వుండటం అంటే ఒక్క మాటలో చెప్పగలిగినది కాదు. మానవ సహజమైన గుణముల కతీతుడు ఈ శ్రీవేంకటేశ్వరుడు. సరే, మరి భక్త వాత్సల్యమేమిటి? ఆశ్రితపక్షపాతమేమిటి? స్తోత్రప్రియత్వమేమిటి? ఏది నిజం? నేటికి అతి సామాన్యుని వేధిస్తున్నవీ సందేహాలే.

**భావ వివరణ:**

సకలములైన వుపాయములలో సగుణమే (విశిష్ఠ గుణములున్న కరుణానిధిగా) కీర్తించుటే ప్రమాణము (సర్వోన్నతముగా నిర్దేశించబడినది). ఎందుకంటే ధ్యానయోగంలో నిష్ణాతులైన మునీంద్రులు కూడా ఈ దేవదేవుని, సాకార రూపునిగానే (ఒక విశిష్ఠమైన ఆకారం వున్న స్వామిగానే) పూజించినారు. ఇదియే ప్రమాణము వేఱొండు ప్రమాణమేల?

ఓ శ్రీహరీ! నిను సగుణంబని (సర్వోన్నతగుణములు కలవాడవని) కొందరు భావించారు. కొందరు నిర్గుణమని తలచారు (యే గుణమూ లేనివాడివని భావించారు. వగలన్ (కౌశలముతో) అనేక విధములగు





చదువులు చదివినవారు వారిలో వారే వాదించుకొని ఏవేవో నిశ్చితాభిప్రాయాలతో వుంటారు. ఓ పరమాత్మ! నీవు అగణితస్వతంత్రుడవు (చెప్పలేనంత స్వాతంత్రం కలవాడవు). అందుకే, అలనాడు వాల్మీకి మహర్షి అట్టిట్టని సంశయాత్మకంగా చెప్పకుండా నిన్ను "నిర్గుణాయ గుణాత్మనే" (యేగుణములకు లోనుగాని ఆత్మయే గుణముగాగల) సర్వోన్నతుడవని కీర్తించాడు. ఇదియే ప్రమాణము. ఇంతకు మించి వేరొకటి కావలెనా?

కొందరు జ్ఞానులు "సోహం"బని పరమాత్ముని ధ్యానించారు. ఆత్మయే నేను, నేనే ఆత్మ, రెండు లేవు. ఉన్నది అద్వైతమే, అని నిశ్చయించారు. కొందరు ఓ దేవదేవా! నీవే ఆదియునూ అంతమునూకూడా. నీకు "దాసోహం" (నేను సదా భృత్యుడనే) అనే భావనతో కొందరు ఆరాధిస్తుంటారు. కాని శుకమహర్షి వంటి మహనీయులు దేహధారులైకూడా, దేహరహితులవలె నిర్గుణులై నీకు దాసోహమని, సోహం భావన దాసోహ పరాకాష్ఠయే అని నిరూపించారు. సర్వ జగత్తునకు వారట్లు చూపినదే ప్రమాణము. ఇంతకు మించి ప్రమాణమేమున్నది?

ఆరు శాస్త్రములు (తర్క, వ్యాకరణ, ధర్మ, మీమాంస, వైద్య, జ్యోతిషములు), ఆరుమతములు (వైష్ణవము, శైవము, శాక్తేయము, గాణపతము, సౌరము, కాపాలికము), షట్కర్మములు (యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము) – మొదలైనవి యెన్ని చేసినా యేమి చేసినా, ఓ ప్రభూ! నీకు శరణు అనక యేరీతిని యేవుపాయమూ కడదాకా రక్షించలేదు. ఎందుకంటే యెక్కడ సంశయం పుడుతుందో, జ్ఞానం అక్కడ చస్తుంది. అందుకే నారదాదులు అనేక రకాలుగా ఆలోచించి భక్తియే సులభమని చాటినారు. సారముగల ఓ శ్రీవేంకటేశ్వరా! అందుకే నేనూ నీ శరణమే ప్రమాణము అని భావించి స్వీకరించాను.

సంపుటి: 15 కీర్తన : కొండా చూతము రారో కొండుక తిరుమలకొండా

సంఖ్య : 460 పుట : 309 రాగం: భూపాళం

## భూపాళం

67 కొండా చూతము రారో కొండుక తిరుమలకొండా
కొండని యడిగిన వరము లొసఁగు మా కొండల తిమ్మయ కొండా
॥పల్లవి॥

మేరువు మును స్తుతియింపఁగను వారిజసంభవుఁడూ
పేరు కలుగు నవరత్నంబులు బంగారము కల్పతరువూ
మేరకు మీఱఁ గని నెలవున నారుగ నిడెనొకో యనఁగా
ధారుణి బ్రహ్మాండములకు నాధారంబగు మా కొండా ॥కొండా॥

గరుడాచలం బనఁగా శ్రీవేంకటశైలం బనఁగా
గిరులకు నేలికె యగు ననంతగిరి దా నీ గిరి యనఁగా
సిరులాయఁ జనమగు యంజన శబరి యనెడి నామములా
పరగఁగ నాలుగు యుగముల వెలసిన ప్రబలంబగు మా కొండా
॥కొండా॥

పొదలూ సొంపగు నింపుల పూఁబొదలూ వాసన నదులూ
కొదలూ గల తామరకొలఁకులపై మెదలుఁ దుమ్మెదలూ
కదలి మలయానిలు వలపులపస కదళీవనములనూ
మొదలుగా నెల్లప్పుడు నీ సంపదలు గల మా కొండా ॥కొండా॥

జంతువులెల్లను మునులూ సకలమైన దేవతలూ
జంతువుల యెలుఁగులు వేదసారంబగు హరినుతులూ
చింతామణులట రాళ్లెల్లను సిరులనెలవు లా గుహలూ
సంతతసౌభాగ్యంబుల నొప్పెడు సందడిగల మా కొండా ॥కొండా॥





వొకచో బ్రహ్మాదులు మునులును వొకచో నింద్రాదులునూ
వొకచో భాగవతులు యతులు శ్రుతులు వొకచోఁ జంద్రార్కులు
వొకచో తీర్థంబులు గిరులను వొకచో యోగీశ్వరులూ
అకలంకత తనుఁ గోరి తపము సేయ నాస లెఱుఁగు మా కొండా
॥కొండా॥

శుకములతోఁ జదువుదురా శుకబ్రహ్మాదులు శ్రుతులూ
తకదిమ్మని యాడించు మయూరతతిని యోగీశ్వరులూ
సకలపురాణంబులు విందురు మఱి పికశారికలచే మునులూ
పకటితముగ నీ విద్యల నొప్పెడు భాగ్యముకల మా కొండా
॥కొండా॥

స్వామితీర్థములకును స్వామిపుష్కరిణియునూ
పామరులా యమరులఁ జేయును పాపవినాశనమూ
తా మహిఁ గోరిక లిచ్చుఁ గుమారధారయు పాండవసరసీ
కామితఫలదాయిని ఆకాశగంగయుఁ గల మా కొండా ॥కొండా॥

యిదియె క్షీరాంబుధి యనుచు మరి యిదియె ద్వారక యనుచు
యిదియె నందవ్రజ మనుచును మరి యిది దా నయోధ్య యనుచూ
యిదియె వైకుంఠం బనుచును యిది పరతత్త్వంబనుచు
యిదియె పరమపదం బనుచు వేదములు యెన్నఁగఁ గల మా కొండా
॥కొండా॥

తలఁచిన శుకశౌనకాదులకు తలఁచిన తలఁ పొసఁగినా
తలఁపులోపల నెలకొన్నా దయతో నన్నేలినా
చెలువుఁడు మా వేంకటరాయుఁడు సిరులనెలవు చేకొన్నా
కలియుగ వైకుంఠం బను నామము గలిగి వెలయు మా కొండా
॥కొండా॥

**అవతారిక:**

ఇది అన్నమాచార్యులవారి సుపుత్రుడైన పెదతిరుమలాచార్యులవారు చెప్పిన పొడవుకు పొడవైన కీర్తన. పురుషోత్తముని తిరుమలకొండ వైభవాన్ని కీర్తిస్తున్నారు. కలియుగవైకుంఠమని కొనియాడబడుతున్న ఈ కొండ. "తిమ్మయ్య కొండా! నీవు వరములొసగే కొండవు కదా! మమ్మల్ని కూడా కటాక్షించు అంటే కోరిన కోర్కెలనెల్లా తీర్చే కొండ ఇది అంటున్నారు. "రారో కొండుక" అంటే సంతోషంతో రాండి... అని అర్థం.

ఇక చాలామందికి తెలిసిన సంగతేమంటే జానపదులు శ్రీవేంకటేశ్వరుని, కొండల తిమ్మయ్య అని పిలుస్తారు. "కొండమీదకోతి" అని ఆ పదానికి అర్థం. ఒక్కసారి కోతి మన వస్తువును పట్టుకొన్నదంటే... తనతోపాటు గుంజుకెళ్ళిపోతుంది. తన ఇష్టమైతేనే వదలిపెడుతుంది. ఒకవేళ మనం అరచిగోలచేస్తే విసిరిపుచ్చి పడేసి తన దారిన తను పోతుంది. ఈ కొండల రాయుడిది కూడా అదే తత్త్వం. ఒక్కసారి వదిలేశాడంటే చివరికి చేతికంటగట్టినా విదలించి పారేస్తాడు. ఎంత ఆలోచిస్తే అన్ని కొంగ్రొత్త భావజాలమును నెలకొనునట్లు చేస్తుందీ కీర్తన. శుక శౌనకాది ఋషులకు అయినా ఈ శ్రీవేంకటేశ్వరుని కొండమీద వుంటే ఆ వైకుంఠంలో వున్నట్లే కదా! అనిపింపజేసే అద్భుతమైన కొండ సుమండీ! అంటున్నారు. నిజానికి ఇంతదూరం రానక్కరలేదు... తలపులలో దీనిని తలచుకొన్నా చాలును. నిజమైన స్నేహితుడైన ఆ కొండల తిమ్మయ్య తన దయనంతా కురిపిస్తాడు అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! కొండను దర్శిద్దాము కొండుక రారో (సంతోషంతో రాండయ్యా!). ఇదియే తిరుమల కొండ. ఇది కొండల తిమ్మయ్య అని పిలువబడుతున్న మా శ్రీవేంకటేశ్వరుని కొండ. నీవు కొండవు కదా! మాకు కొండంత వరములు కావాలి దయచేసి ఇవ్వు అనంగానే ఆ వరాలనిచ్చే కొండేనండీ ఇది.

పూర్వకాలమున మేరుపర్వతము బ్రహ్మదేవుని పరమభక్తితో కొలిచి తన కోరికదీర ఈ శైలమును కన్నది. ఆరు భాగములుగానున్న ఈ సుదూర





సువిశాలమైన కొండపై పేరుబొందిన నవరత్నములు, బంగారము కల్పతరువూ కూడా వున్నాయని ప్రతీతి. అయ్యలారా! ధారుణి (ఈభూమిమీద) అండపిండ బ్రహ్మాండములకు ఆధారభూతమైనది ఈ కొండయే సుమా!

ప్రజలారా! ఈ కొండ ఈనాటిది కాదు. ప్రబలంబగు (మిక్కిలి దృఢమైన) ఈ కొండ నాలుగు యుగముల క్రితమే వెలసినది. ఈ కొండ ఆరు ముఖ్య శిఖరములను ఆరు పేర్లతో పిలుస్తారు. గరుడాచలము, వేంకటాచలము, గిరులకు యేలికయైన అంజనా చలము, వృషభాచలము, శేషాచలము, శబరి అచలము అని వివిధ నామములతో సుప్రసిద్ధమైనదీ కొండ. అంతులేని సిరిసంపదలు ఈ కొండమీద వున్నాయని వేరే చెప్పాలా!

అందమైన పొదరిండ్లు, చూడచక్కనై గుబాళించే పూపొదలున్న ఒడ్లు గల నదములు, కొదలూగల తామరకొలనులు (అతిశయించుచున్న తామరపూవులు నిండిన) కొలనులున్నవి. ఆ తామరలపై తుమ్మెదలు అశేషముగా మెదలుతూనే వుంటాయి. ఆ కొలనులపై మలయానిలయము వీస్తూనేవుంటుంది. వలపు భావనలునూ చిగురిస్తాయి. ఇక దీనిపై (కొండపై) నున్న కదళీ (అరటిపండ్ల) తోటలు సంపదలనిస్తూనే వుంటాయి.

అయ్యలారా! అనాదికాలంనాటి 'మునులు' ప్రశాంతత కోసం ఈ కొండమీద జంతువుల రూపంలో తిరుగుతుంటారు. వారిని జూచి దేవతలూ అదే పనిచేస్తున్నారు. అందుకనే ఈ కొండపై జంతువుల అరుపులు గర్జనలు కావు, వేదఘోషలు. సిరులుసింగారించుకొనిన ఈ కొండ గుహలలోని రాళ్ళన్నీ కూడా చింతామణి వంటి విలువైన రత్నాకరములు. ఎల్లప్పుడు సందడి తాండవించే ఈ కొండ, నిరంతరమూ సౌభాగ్యములనిస్తూనే వుంటుంది.

ఈ కొండమీద ఒక్కొక్కప్పుడు కోరి కోరి బ్రహ్మాది దేవతలు, ఇంద్రాది దిక్పాలకులు, మునులు, భాగవతులు, యతీంద్రులు, వేదములు, తపస్సు చేసుకొంటుంటారు. చంద్రుడు సూర్యదేవుడు కూడా సాకారులై ఈ కొండమీద గల తీర్థములవద్ద తపస్సు చేస్తుంటారు. ఈ కొండమీద శిలా

రూపంలో యోగీశ్వరులు తపస్సమాధిలో వుంటారు. వారందరి కోరికా నిష్కళంకమైన తపస్సమాధియే. ఇంత విశిష్ఠమైనది మా తిరుమల కొండ.

ఈ కొండపై పక్షులకు కూడా గొప్ప ప్రాబల్యమున్నది. శుక మహర్షివంటివారు చిలుకలకు కూడా చదువుచెబుతుంటారు. బ్రహ్మాది దేవతలు వాటికి వేదములు వినిపిస్తారు. యోగీశ్వరులు విశ్రాంతికై ఈ కొండమీది నెమళ్ళకు నృత్యములు నేర్పుతుంటారు. మునులు కూడా ఆటవిడుపుగా, చిలుకా గోరింకలు తమని అనుకరిస్తూ వల్లించే పురాణాలను వాటి కంఠస్వరంలో విని ఆనందిస్తుంటారు. ఈ కొండమీద ఇటువంటి విద్యా ప్రదర్శనలు జరుగుతూనే వుంటాయి.

ఇక ఈ కొండమీదనున్న తీర్థములన్నియు పావనములే, సకల తీర్థములకు స్వామి (ప్రభువు) యైన స్వామిపుష్కరిణి, అనే కోనేరు పాపనాశనమనే స్వచ్ఛమైన జలపాతము, కుమారధార అనే జలధార, పాండవుల సరసీ అనే సరస్సు మొదలైన అనేక జలధారలతోపాటు ఆకాశగంగవంటి కామితఫలప్రదాయియైన తీర్థములు ఈ తిరుమల కొండపై లెక్కకు మిక్కుటముగా నున్నవి.

ఈ తిరుమల కొండ పవిత్రతతో క్షీరసాగరమునుబోలినది. శ్రీకృష్ణుని ద్వారకా నగరమువలె సురక్షితమైనది. ఇది నందవ్రజమువలె జానపదుల స్వర్గము. అయోధ్యా నగరమువలె జగత్ప్రసిద్ధమైనది. ఇది వైకుంఠమువలె ఆదినారాయణుని ఆవాసము. ఇదియే పరతత్త్వము అనికూడా చెప్పబడినది. ఇదియే వేదములు ఘోషించు పరమపదము అను కైవల్యధామము. ఈ కొండవంటి మోక్షస్థానము లేనే లేదు.

ఈ దేవదేవుడు శుకశౌనకాది మహర్షుల తలపులలో తలచిన తలపు నొసగెడివాడు (ఆయనను ధ్యానించాలనే ఆలోచన కలిగించినాడు). ధ్యానించినంతమాత్రాన దయతో అనవరతమూ నన్నేలిన చెలువుడు (స్నేహశీలి) మా వేంకటరాయుడు, సిరులనెలవైన అలమేల్మంగ చేకొన్న (ఆవాసము చేసికొనిన) కలియుగ వైకుంఠమనే పేరుతో వెలసిన ఈ మా కొండయే తిరుమలకొండ.





సంపుటి: 2 కీర్తన : సత్యముసేయగవచ్చును సర్వేశ్వర యీమాటకు

సంఖ్య : 269 పుట : 180 రాగం: బౌళి

**బౌళి**

**68 సత్యముసేయఁగవచ్చును సర్వేశ్వర యీమాటకు**
**నిత్యము నీవే యెఱుఁగుదు నేనేమీ నెఱఁగఁజుమీ ॥ పల్లవి॥**

**సులభుఁడవౌదువు వొకమరి చూడఁగ దుర్లభుఁడవౌదువు**
**తలఁపింతువు మఱపింతువు తగఁ బ్రాణములోనుండి**
**పలికింతువు అక్షరముల పరగ నవే వ్రాయింతువు**
**వెలియఁగ నీవే వెలిగా వేరొకటి నేఁ జేయఁజుమీ ॥సత్య॥**

**వొనరఁగఁ బూజలు గొందువు వొక్కొకపరి మానుదు వటు**
**కను మా యింతువు నిదురలఁ గడు మేల్కొలుపుదువు**
**ఘనముగ నజ్ఞానిఁ జేతువు కరునతో జ్ఞానిఁ జేతువు**
**ననుఁ బుట్టించితి నీవే నా కాపని గాదుసుమీ ॥సత్య॥**

**నాలో నుందువు వొకపరి నగి శ్రీవేంకటగిరి నుందువు**
**పాలింతువు లాలింతువు భవమీదేరింతువు**
**పోలింప సంసారిఁ జేతువు భువి నీదాసునిఁ జేతువు**
**కాలముఁ గర్మము నీవే కపటము నే నేరఁజుమీ ॥సత్య॥269**

**అవతారిక:**

ఏది సత్యము ఏదసత్యము? ఏదిన్యాయము? యేది అన్యాయము? ఏది సవ్యము ఏది అపసవ్యము? ఈ ప్రశ్నల పరంపరకు సరియైన వివరణ నివ్వగలిగినవారెవరు? ఆ సర్వేశ్వరుడే కదా! నిత్యమూ ఈ విషయమును మాబోటి అజ్ఞానులకు యెఱుక జెప్పుదువు. ఎట్లా యెఱుకచెబుతాడు? వారివారి అనుభవాలద్వారా. మరి ఎవరి అనుభవం వారిదే. ఓ దేవదేవా!

నేనేమి యెఱుగను సుమా! అన్నీ తెలిసినవాడవు నీవే అంటున్నారు అన్నమాచార్యులవారు. తనయెదలోని ఉత్తుంగతరంగాల్లా యెగిసిపడుతున్న భావజాలాన్ని చక్కని కీర్తనలో ఇమిడ్చారు. ఆ సర్వాంతర్యామి ఒకసారి తిరుమల శిఖరాలపై వుంటాడు. ఇంకోసారి తన హృదయంలోనే వుంటాడు. ఒక్కోసారి తనే మనల్ని లాలించి పాలిస్తాడు. భవసాగరం దాటింపజేస్తాడు. ఒకసారి (అంటే ఒక జన్మలో) సంసార సాగరంలో తలమునకలయ్యేట్లు జేస్తాడు. ఇంకో జన్మలో నీపై భక్తి కుదిరి నీ దాసుడయ్యేట్లు చేస్తావు. నేనే కపటమునూ యెరుగనయ్యా! నా కాలమూ కర్మమూ రెండూ నీ చేతుల్లోనే వున్నాయి అంటున్నారు. నామాట నమ్మండి ఈ కీర్తనకి ఇదే క్రమంలో పదిరకాల వివరణనివ్వవచ్చును.

**భావ వివరణ:**

ఓ సర్వేశ్వరా! యీ నేను చెప్పబోవు మాటలు సత్యవచనములు. అయితే వాటిని నీవు ఒకపరి అబద్ధంకూడా చేస్తావు. ఒకప్పుడు వాటినే నిజం చేస్తావు. మరి యెప్పుడు సత్యము చేస్తావో, యెప్పుడు చేయవో, అది నిత్యమూ నీవే యెఱుగుదువు. నేనేమాత్రమూ యెఱుగను సుమా!

ఒకమరి (ఒకజన్మలో) సులభముగా నీ దర్శనమిస్తావు. మరొకసారి నిన్ను చూడాలంటేనే దుర్లభమౌతుంది. ఒకసారి వున్నట్లుండి నీ తలపు (స్మరణ) కలుగునట్లు చేస్తావు. ఒకసారి యేవేవో అనవసరమైన విషయాలు గుర్తుకు వస్తాయి కాని "శ్రీవేంకటేశమ్ శరణం ప్రపద్యే" అని గుర్తుకు రానే రాదు. ఒకసారి నాలో ప్రాణ స్వరూపుడవై నాతో పలికిస్తుంటావు. అందరూ ఈ పలుకులు నావి అనుకొంటున్నారు. కానీ అవినీవు పలికించినవే. నేను పలికిన ఆ మాటలను అక్షరముల రూపములలో నీవే వ్రాయించుచున్నావు. చూచువారికి ఈ కీర్తనలు నేను వ్రాస్తున్నట్లు వుంటుంది. కానీ నేనేమీ వెలిగా (వేరేవిడిగా) యేమీ చేయుటలేదు. కానీ నేను వేఱుగ యేమీ చేయజాలనుసుమా! కదలువాడవు కదలించువాడవు కూడా, నీవే.





ఒకసారి నీపై భక్తి కలుగుతుంది. అప్పుడు నిన్ను వున్నట్లుండి పూజిస్తుంటాను. నీవూ చిరునవ్వుతో నా పూజలను స్వీకరిస్తావు. ఒకసారి యేదోముంచుకుపోయినట్లు అనవసరమైన "యావ"తో కళ్ళెదురుగావున్న నీకు నమస్కరించక తిరుగుతుంటాను. మేము కనుమూసి నిద్రించుటకు, కనుతెరిచి "ఆహా! యెంత చక్కగా నిద్రపట్టింది" అని మేల్కొనుటకు కారకుడవు నీవే ప్రభూ! ఒక పర్యాయము వీడెంత మూర్ఖుడురా అని నలుగురూ అనుకొనేటంత అజ్ఞానిని చేస్తావు. మళ్ళీ నీవే నాపై కరుణతో జ్ఞానిని చేస్తావు. ఇవన్నీ అటుంచి అసలు నన్ను పుట్టించింది యెవరు? నీవే కదా! నాతల్లీదండ్రిని నేను కలిపానా? నేనే అమ్మకడుపులో చేరానా? నేనే పెరిగి బయటకు వచ్చానా? నేనే దినదిన గండం నూరేళ్ళ ఆయుస్సులాగా పెరిగి ఈనాటికి దీన్ని వ్రాసే స్థితికి వచ్చానా? ఇవన్నీ చేసింది నేను అని భ్రాంతి కలిగించి అన్నీ నీవే చేస్తున్నావు. రేపు "నేను" వుండను. అది చేసేదికూడా నీవే. నాకాపని గాదు సుమా!

ఓ శ్రీవేంకటేశ్వరా! ఒకపరి నాలోనే అంతర్యామిగా వుందువు. ఒకపరి తిరుమల శిఖరాలపై సర్వాంతర్యామిగానుందువు. ఒకపరి నన్ను పరిపాలింతువు. ఒకపరి చిన్నిపాబీయిని బుజ్జగించినట్లు బుజ్జగిస్తావు. భవమీదేరింతువు, (జన్మచరితార్థంబవునట్లు చేస్తావు). పోలింప (యుక్తమనిపించునట్లు) నీవే మమ్మల్ని సంసార వ్యామోహంలో కట్టిపడవేస్తావు. ఉన్నట్లుండి ఈ నిర్భాగ్యుడిపై జాలి కలిగి నీవే "ఇక ఈ ఆటచాలును లేరా!" అన్నట్లు నీదాసుణ్ణి చేసికొంటావు. అప్పటికి నా కాలము కర్మము కలిసొచ్చాయన్నమాట. నీవే దిక్కనే జ్ఞానం సుస్థిరంగా వుండేట్లు చేసే శక్తీ నీకే వున్నది. నీ కృపలేకపోతే మళ్ళీ మొదటికే వస్తాను. తండ్రీ! నేనే కపటమును యెరుగ జుమ్మీ! (నాకేమోసమూ తెలియదు స్వామీ!) నన్నేలుకోవయ్యా!

సంపుటి: 15   కీర్తన : ఇది నీ మాయో యింద్రజాలమో యేమియు నెఱుంగను
సంఖ్య : 410   పుట : 276   రాగం: దేసాక్షి

**దేసాక్షి**

**69** ఇది నీ మాయో యింద్రజాలమో యేమియు నెఱుంగను
సదరపు నా కర్మవశంబున నే సంకల్పించెదనో యెఱుంగను
॥పల్లవి॥

నరకము లనుభవించే యప్పుడు నా యాతనాదేహంబు
నరములతో నఱకుదురు యమభటులు నలియ దప్పటిఁ జరుగును
సరి నసిపత్రములు నాఁటు సమయ దెంతైనాఁ జిగిరింపుచుండు
వరుసఁ దప్తలోహ తైలంబులలో వైతురు పోవదు వెను తగులు
॥ఇది॥

అంతట నొకతల్లికడుపునఁ బుట్టుదు అతికోమలమగుమేను మోచుకొని
వంతుల బాల్య కౌమారయౌవన వయసులఁ బెక్కు భావము కాదు
కాంతలఁ గవయదు రక్తమాంసములుఁ గమ్మటి నూరునుయేమిటాఁ
వింతగా నాహారంబులు గొందును వెస నాఁకలియునుఁ దీరదు
॥ఇది॥

మెఱయఁగఁ గలలోన నన్నియుఁ గందును మేలుకాంచితే సటలౌను
మఱచితిఁ దలఁచితి సర్వాపరాధములు మతి యున్నియు నేఁ జేసితిని
తఱితో శ్రీవేంకటేశ నాపాలిటి దైవమ యలమేల్మంగపతి
గుఱిగా నా విన్నప మవధరించు గోవింద గోవింద గోవిందా ॥ఇది॥

**అవతారిక:**

తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు చెప్పిన ఈ అధ్యాత్మ కీర్తన నాస్వాదించండి. మామూలు ఇంద్రజాలికులు చేసే కనికట్టు విద్య చూచి





అబ్బురపడిపోతుంటారు సామాన్యులు కాని ఈ దేవదేవుడు అందరివంటి మోళికాడు అని భ్రమపడకండి. ఈయన మాయనుగాని, ఇంద్రజాలమునుగాని ఎరిగినవారెవ్వరునూ లేరు. మరి ఇక నేనెట్టెరుగుదనయ్యా! నేనే కర్మలను చేస్తూ వాటి ఫలితముననుభవిస్తున్నట్లు పైకి కనుపించుచున్నా నిజానికి ఇవన్నీ నేను సంకల్పించెదనా? నేనేమీ యెరుంగనయ్యా! బహుశా నా కర్మవశమున నీవే సంకల్పిస్తావు కాబోలును అంటున్నారు. నా విన్నపమును అవధరించవయ్యా! యాతనాశరీరంతో నేను నరక బాధలనుభవిస్తున్నప్పుడు, నాకీ సౌమ్యత నీపై భక్తీ వుంటాయా? అందరిలాగ నేను కూడా, బాధ తాళలేక నిన్ను నిందిస్తానేమో? తండ్రీ! అర్భకుడిని అనినాపై దాక్షిణ్యం చూపించవయ్యా! పోనీ ఆ గండం గడిస్తే... మళ్ళీ నన్ను ఇంకొక అమ్మకడుపులో పడేస్తావు. మళ్ళీ పుట్టుక బాల్యము కౌమారము యవ్వనము వృద్ధాప్యమూ మరణమూ ఇంతేనా? మళ్ళీమళ్ళీ ఇదేనా? నీవే యేదో చేసి నన్నీ పీడనుంచి వదిలించవయ్యా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఇది (ఈ ప్రపంచము) నీ ఇంద్రజాలము వలన కల్పింపబడిన మాయయా? నేనేమియు యెఱుంగలేకున్నాను. సదరపు (సమానమైన) నా కర్మకొలదీ నేనే సంకల్పించుచున్నానో లేక భగవత్ ప్రేరేపితమో నేనెఱుంగను.

ఇప్పుడు జరుగుచున్న నా జన్మగురించే ఆలోచిద్దాం. నేను చనిపోగానే నరకమే సంప్రాప్తించవచ్చును. ఆ నరకమును అనుభవించేటప్పుడు నాకు ఒక యాతనా శరీరమునిస్తారట. ఆ శరీరాన్ని కాలిస్తే మంట పుడుతుందేకాని తగలబడిపోదు. దాన్ని కోస్తే తీవ్రమైన నొప్పి కలుగుతుందేకాని నెత్తురు రాదట. కట్టెలతో కొడితే ఎముకలు విరిగినంత బాధ కలుగుతుంది కానీ ఒక్క యెముక కూడా విరగదట. ఆహా!

యమభటులు నరకములు తెగునట్లు ఈ యాతనా శరీరాన్ని నరుకుతారుట "అసిపత్రము"లని కత్తులవంటి ఆకులుగల చెట్లు ఆ నరకంలో అసంఖ్యాకంగా వుంటాయట. నన్ను ఆ చెట్లు యెక్కిస్తారట. వరుస దప్పకుండా లోహపు పాత్రలలో మరుగుతున్న నూనెలో ఈ యాతనా శరీరాన్ని వేపుతారట (వేయించెదరట) అట్లా చేస్తేనేకాని, వెనుతగులు (గత జన్మకర్మ) పోవదు (తీరదు). అసిపత్రవనంలో ఈడ్చినా ఆయాతనాశరీరం, సమయదు (నశించదు), అలిసిపోదు, అప్పటి (మరల మరల) యాతన అనుభవించడానికి సిద్ధమే. ఓ పరమాత్మా! ఇంత శిక్ష అవసరమా ప్రభూ! మొదటనే మాకు చెడు అంటకుండా చేయరాదా?

సరే, యమలోకబాధలయ్యాక, మళ్ళీ ఈ జీవిని ఇంకొక తల్లి కడుపులో ప్రవేశపెడతావు. ఆ తరువాత నిర్ణీత సమాయానికి అతి కోమలమైన లేత శరీరం మోస్తూ నేలపై చేరుతాను. వంతుల (వరుసగా) బాల్యము, కౌమారము, యౌవనము అను వయస్సులలో ఆయా దశలకు సహజమైన భావావేశములను పొందుతుంటాను. అనేకమంది కాంతలను గూడుదును. ఆ శరీరంలో రక్త మాంసములున్నంత వరకు ఆ ఆకలి తీరేది కాదు. ఏరోజుకారోజే పరగడుపు. ఆ తృష్ణకు అంతే వుండదు.

నిద్రించినపుడు యేవికారము భ్రాంతి, రాగద్వేషములు లేని నిశ్చలుడనే. కలలో కూడా అంతే. కానీ మేల్కొనగానే సటలౌను (కపటము మొదలవుతుంది). అన్ని వికారాలు అరిషడ్వార్గాలూ మళ్ళీ అంతా యధాతథంగా జరుగుతూనే వుంటాయి. అన్ని అపరాధాలూ నావల్లనే జరుగుతాయి. ఇవన్నీ మతివుండి నేను జేసినవే. వీటికి నేను బాధ్యుడను కానని యెలా అనగలను? ఓ శ్రీవేంకటేశ్వరా! తఱితో (ప్రయత్నముతో) నేను నీ దాసుడనైనాను. అలమేల్మంగ విభుడవైన ఓ ప్రభూ! నాపాలి దైవము నీవేనయ్యా! గుఱితో నా విన్నపమును మన్నింపుమయ్యా! ఓ గోవిందుడా! అవధరింపుమయ్యా! (అనుగ్రహింపుమయ్యా!)





సంపుటి: 2 కీర్తన : ఇదియే కావలెనని తాఁ గైకొని
యిచ్చగించువాడే ఘనుడు

సంఖ్య : 209 పుట : 140 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

**70** ఇదియే కావలెనని తాఁ గైకొని యిచ్చగించువాఁడే ఘనుఁడు
వదలకురో హరిదాసులమత మిది వర్ణించెద నోవివేకులాలా
॥పల్లవి॥

దేవుఁడుగలఁడని మదిలోఁ దెలియుటే జన్మఫలంబు
తావుగ నాతని నెప్పుడు దలఁచుటే తన భాగ్యము
శ్రీవైష్ణవ ధర్మము దప్పక చెలఁగుటయే వైభవము
దేవతాంతరంబులన్నియు మానినదియే సుకృతంబు ॥ఇది॥

కామక్రోధము లుజ్జగించుటయే కల్యాణానుభవము
చేముంచి పాపము సేయకమానుటే చెప్పఁగ లాభము
నేమముతోడుత విరక్తుఁడగుటే నిర్మలానందము
వేమరు నాచార్యసేవసేయుటే విచారింపఁగ దాఁచినధనము
॥ఇది॥

ప్రకృతివికారములకుఁ జొరకుండుటే పరమమైనసాత్వికము
సకలబంధములఁ బెడఁబాసినదే సామ్రాజ్యపదము
ప్రకటింపఁగ నలమేలుమంగకును పతియగు శ్రీవేంకటవిభుని
అకలంకుఁడై కొలిచియుండుటే యనంతమహిమాతిశయంబు
॥ఇది॥**209**

**అవతారిక:**

'ఇచ్చగించుట' అంటే అంగీకరించుట అని అర్థం. మనస్ఫూర్తిగా నాకు ఇదే కావాలి అని శ్రీహరిశరణాగతి స్వీకరించినవాడే ఘనుడు. హరిదాసుల మతమైన ఈ శరణాగతిని యెట్టి పరిస్థితుల్లోను వదలకురో! అని మరీ మరీ చెబుతున్నారు అన్నమాచార్యులవారు. ఈ విషయాన్ని మీకు వర్ణించి మరీ చెబుతాను. ఓ వివేకులారా! నన్ను నమ్మండయ్యా! అంటున్నారు. శ్రీవైష్ణవుల సిద్ధాంతమైన శ్రీహరి సర్వాంతర్యామి అనే సత్యాన్ని నమ్మండి. దేవతాంతరములను వదలివైచి గొప్ప సుకృతమును పొందండి. గురువుల సేవ చేయుటకంటే మనము భవిష్యత్ జన్మల కొరకు దాచుకొన్న ధనము వుండదు, అని అంటున్నారు. అలమేల్మంగా రమణుడైన శ్రీవేంకటేశ్వరుని నిష్కళంకుడై సేవిస్తూ వుండటమే అనేక మహిమాన్వితుడై యుండుట. ఈ కీర్తనలో ఆచార్యులవారి భావాన్ని వివరించాలంటే ఒక వాక్యం సరిపోదు.

**భావ వివరణ:**

శ్రీవైష్ణవ ధర్మాన్ని స్వీకరించి, ఏదోవిధిలేక వున్నట్లు కాకుండా, ఇదియే నాకు కావాలి అని గైకొని (స్వీకరించి), యిచ్చగించువాడే (మనస్ఫూర్తిగా అంగీకారముతో) శరణాగత దీక్షాపరుడైన వాడే, ఘనుడు. ఓ వివేకవంతులారా! ఈ వివరం మీకు వర్ణించి చెబుతాను, కానీ హరిదాసులమతమైన ఈ వైష్ణవమును వదలకురో! (వదలిపెట్టవద్దు సుమా!)

మానవజన్మనెత్తిన దానిఫలితమేమిటి? జంతువులకు లేనిది, పక్షి కీటకాలకు రానిది అయిన భగవంతుని స్మృతిని పొందటం. కొందరికి మానవజన్మనెత్తినా దైవచింతనలేకయే నూరేళ్ళు గడిచిపోతుంది. స్మృతి కలుగుట ఒక యెత్తయితే తావుగ (సుస్థిరంగా) యెప్పుడు నాతని (ఆశ్రీహరిని) ధ్యానించుటయే నిజమైన భాగ్యము. ఇక "వైభవము"





అనిదేన్నంటారా తెలుసా? పదిమంది ముఖస్తుతి చేస్తుంటే రీవిగా పోవటం కానేకాదు. మనోవాక్కాయకర్మలా శ్రీవైష్ణవ ధర్మమును తప్పక పాటించుటయే నిజమైన వైభవము. సుకృతము అంటే యేమిటో గ్రహించి చూస్తే శ్రీహరియే సర్వస్వంబని, దేవతాంతరంబులు పాటించిన ఫలితం శూన్యమని గ్రహించుటయే సుకృతము. అది కలుగనంతవరకు హరియే హరుడో అని గింజుకుంటూనే వుంటారు.

మా శ్రీవైష్ణవులకు సకలకళ్యానుభవమేమిటో తెలియునా? కామక్రోధములను వుజ్జగించుటయే (తొలగించుకొనుటయే). ఏమి జరిగినా అందులో మాకు లాభమేమిటి? అని ఆలోచిస్తారు కొంతమంది. కాని మాకు ఈ శ్రీహరి దాస్యము వలన కలిగే లాభమేమిటంటే.. చేముంచి (కావాలని) పాపములను సలుపకుండుటయే. ఇక నిర్మలానందము అని పెద్దపెద్దమాటలు చెబుతుంటారు. అదెక్కడోలేదు. విరక్తి భావనలోనే వున్నది. నియమబద్ధుడై విరక్తుడై జీవించుటయే నిర్మలానందము. లౌకిక జీవనానికి, ధనం కావాలి మరి ఈ శ్రీవైష్ణవులకు దాచివుంచిన ధనం యేమన్నావున్నదా? వేమరు (పలుమార్లు) తమ ఆచార్యుల (గురువుల) సేవచేయుటయే మాకు మూలధనము.

ఇక వైష్ణవ దీక్ష స్వీకరించాక కూడా, సహజమైన ప్రకృతి వికారములకు లోనుగాకుండుటయే మేము నమ్మే పరమసాత్త్విక జీవనము. మాకు వైష్ణవ సామ్రాజ్యపదములో చోటు దక్కినదంటే మేము మాకు జన్మవలనగాని జీవనమువలనగాని సంక్రమించిన సంబంధ బాంధవ్యములనన్నింటినీ విడనాడుటయే. ఇక బాహాటంగా ప్రకటించాలంటే దేవి అలమేల్మంగ మనోవల్లభుడవైన ఓ శ్రీవేంకటేశ్వరా! శ్రీవైష్ణవులకు అనంత మహిమాతిశయముతో ఒప్పుట అంటే కనికట్టు విద్యలు చేయుటకాదు, అకలంకుడై (నిష్కళంకుడై) శ్రీహరినే కొలుస్తూ జీవించటం.

సంపుటి: 15 కీర్తన : సకల దేవతలు నీ శరీరమని సర్వేశ్వర నినుదలచుట

సంఖ్య : 409 పుట : 275 రాగం: రామక్రియ

### రామక్రియ

**71** సకలదేవతలు నీ శరీరమని సర్వేశ్వర నిను దలఁచుట మేలు
వికట మేల నిను యేకాగ్రబుద్ధిని వేడుకతో సేవించే నిఁకను
॥పల్లవి॥

శివదుర్గారవిగణాధిప క్షేత్రపాలక సహితముగా
భువిలో మిమ్మును పంచపూజగాఁ బూజింతురు కొందరు
తివిరి యిందరును బంతినే పొత్తుల దేవరలై పొరి చూపు సేతు రని
వివరముగా నిన్నేఁ గొలిచితి నీ వే వహించుకొని రక్షించవే ॥సకల॥

బహువిద్యాధర బేతాళ బ్రహ్మరాక్షసగణాదుల
సహచరుఁగా మిమ్ముఁ గామ్యకర్మముల సారె భజింతురు కొందరు
మహిమలు చూపుచు వేల్పులదండై మనసులవంతులు
వెదకుదు రనుచును
విహితధర్మమని నిను శరణంటిని వెలయఁగ నను దయఁజూడఁ గదే
॥సకల॥

అతిమాయాయంత్రతంత్రమంత్రాంతరసాధనయుక్తముగా
యితరులు గొందరు చిల్లరతెరువుల యెనయించి మిమ్ము నర్చింతురు
తతి నివి తమలో నన్యోన్యవిరుద్ధము లని యపాయసహితము
లనియును
గతి యంటిని యలమేలుమంగకును పతి శ్రీవేంకటేశుఁడ కావవే
॥సకల॥





**అవతారిక:**

దేవతాంతరములు పాటించువారు మా దేవుడు గొప్ప మీ దేవుడు తక్కువ లేదా మీదేవుళ్ళందరూ మాదేవి భృత్యులే అని వాదించుకొంటూ వారి వారి భావాలకనుగుణంగా పురాణ గాథలతో సమర్థిస్తూ భక్తిమార్గాన్ని గాలికి వదలివేసి కర్మకాండలు, పూజలు, శాంతులు, హోమాలతో పబ్బంగడుపుతున్నారు. అత్యవసరమైన ఏకాగ్రబుద్ధి (ఒకే ఒక లక్ష్యంపై మనస్సు) లోపిస్తున్నది. శ్రీమన్నారాయణుడు విరాట్పురుషుడు. సమస్త దేవతలు ఆయన శరీరం నుంచి అంకురించినవారే. ఆ సర్వేశ్వరుని ఆ విధంగా దలచుట మేలుకదా! అంటున్నారు పెద తిరుమలాచార్యులవారు. ఆయనను ఏకాగ్రత కలిగిన మనస్సుతో సంతోషపూర్వకంగా సేవించుట మేలు కదా! వికటమైన ఆలోచనలు వైషమ్యములెందుకు అంటున్నారు. శివుడు దుర్గ అని వేర్వేరు దేవతలను పూజిస్తున్నారు. మనబోటి వారము అల్పులము. మనకు వరబలోపేతులైన రాక్షసులు కూడా పీడించుటకు లేరు. ఓ ప్రభూ! మాకు జీవనం సజావుగా సాగి నీపై దృఢమైన భక్తి కలిగితే అదే పదివేలు. నిన్ను శరణంటే భూత, భేతాళ బ్రహ్మరాక్షస గణములు కూడా యేమీ చేయలేవు. మరి వాటి సాయంకోరి అశాస్త్రీయ విధానాలతో అర్చించే వారినేమనగలము?

**భావ వివరణ:**

ఓ సర్వేశ్వరా! సమస్త దేవతలు నీ శరీరమె (నీ శరీరం నుండి ఆవిర్భవించినవారే). అటువంటప్పుడు పేరుపేరునా వారందరినీ ఆరాధించే బదులు నిన్నొక్కని సేవిస్తే చాలదా? వికటమేల (వికటముగా ఆలోచించుట దేనికి?) ఇకను (ఇకపై) నిన్నే ఏకాగ్రబుద్ధితో (కేంద్రీకరింపబడిన బుద్ధితో) వేడుకతో (సంతోషముగా) సేవించేను.

కొందరు శివుడు, దుర్గ, సూర్యుడు, గణపతి - ఆయాక్షేత్రములకు పాలకులను భావనతో పంచపూజగా ఈ లోకంలో ఆరాధిస్తున్నారు. కానీ తివిరి (ప్రయత్నంతో) ఆలోచిస్తే, బంతినే (వరుసగా) వారు వారివారి

పొత్తులలో దేవతలై, పొరిచూపుసేతురు (సంరక్షించుచున్నారు). ఇవన్నీ ముందే గ్రహించి, మేము వివరముగా (సక్రమముగా) మిమ్మే (శ్రీహరివైన తమరినే) గొలిచితిమి. మరి నేను శాస్త్ర ధర్మములనెరిగిన ప్రజ్ఞాశాలిని గాను. అతి సామాన్యుడను. నాలోని లోటుపాట్లను సహించి నా భారము నీవే వహించి నన్ను రక్షించు ప్రభూ!

ఇంకా కొంతమంది వుంటారు. వారు విద్యాధరులనే మాయామర్మములు తెలిసిన దేవతలను పూజిస్తారు. మరి కొందరుంటారు వారు భేతాళ బ్రహ్మరాక్షసులవంటి క్షుద్ర గణములను వుపాసిస్తారు. అటువంటివారు మిమ్ము కూడా కామ్య కర్మల సాధనకోసమే (ఇష్టమైన భౌతిక సుఖాపేక్షకోసమే) పూజిస్తారు. వారంతా మహిమతో నీవు వారి వాంఛలను నెరవేరుస్తావనే ఆశతోనే నీ వెంటపడుతున్నారు. అటువంటి మహిమల దండ (వరుస) గా యెవరు యెక్కడ ప్రదర్శిస్తే ఈ “భక్తజనం” తండోపతండాలుగా అక్కడికి పరుగులుపెడుతుంటారు. వారు విహిత ధర్మమును పాటించరు. ఇట్టివారల గోల నాకేలనని నేను నిన్నే శరణు మహాప్రభో! అన్నాను. వెలయగ (వర్ధిల్లునట్లుగా) నన్ను అనుగ్రహించు స్వామీ!

అతి గొప్ప మాయను ప్రదర్శించు మరికొందరు మంత్రతంత్రోపాసకులు నోరుతిరగని యేవేవో మంత్రాలతోను రక్షరేకులువంటి యంత్రములను కట్టి నమ్మించి చిల్లరదేవుళ్ళను కొలుస్తుంటారు. వీరికి కావలసినది ఇష్టకామ్యఫలసిద్ధి. ప్రపంచపు మంచి చెడ్డలు వీరికి అక్కరలేదు. కాని ఇటువంటి క్షుద్రవిద్యలన్నీ ఏదోఒకనాడు వారి కొంపనే ముంచుతాయి. అపాయమువాటి వెన్నంటే వుంటుంది. పైగా అవి శాస్త్రవిరుద్ధము కూడా. ఓ శ్రీవేంకటేశ్వరా! ఓ అలమేల్మంగపతీ! మాకు యెందుకయ్యా! ఈ తలనొప్పి. నాకు దిక్కు నీవే అని నిన్ను ఆశ్రయించాను. ఇక పాలముంచినా నీట ముంచినా నీ దయ నా ప్రాప్తం. అంతే.





సంపుటి: 2 కీర్తన : ఇదియే ఉపాయమిక నాకు
నిందుల కంటె మరి లేదు.
సంఖ్య : 210 పుట : 141 రాగం: కేదారగౌళ

## కేదారగౌళ

**72** ఇదియే ఉపాయ మిఁక నాకు నిందులకంటె మఱి లేదు
మది నితనిదాసులదాసుఁడనై మహిమలతోఁ గడుమెఱసేఁగాక
॥ పల్లవి॥

కడచితినా నాజన్మములు గక్కన మానిసినైనంతనే
విడిచితినా పాపముసేయక వేవేలుచదివినయంతనే
అడఁచితినా సంసారవారధి అఖిల దేవతలఁ గొలిచినయంతనే
బడిబడి హరినామము నుతించి నేఁబావనమయ్యేఁగాక
॥ఇది॥

గెలిచితినా యీమాయను నేఁ గెరలి తపంబులు నేసినంతనే
తలఁగితినా నరకములు చొరక ధరయెల్లా నేలినంతనే
తెలిసితినా తత్వరహస్యము తిరముగ కులజుఁడనయినంతనే
యిలలో శ్రీపతి శరణుచొచ్చి నేనిన్నిటఁ బుణ్యుఁడ నయ్యేఁ గాక
॥ఇది॥

వదలితినా నాదుర్గుణములు వరుసతోఁ జుట్టాలు గలిగినంతనే
వెదకితినా ముక్తి మార్గమును విద్య లెఱిఁగినేర్చినంతనే
యిదివో శ్రీవేంకటేశుఁడు నాకును యేలికయై మన్నించఁగను
పదిలముగా నాతనిసేవచేసి పరమానందుఁడ నయ్యేఁగాక
॥ఇది॥**210**

**అవతారిక:**

అజ్ఞానం అంధకారంవంటిదైతే జ్ఞానం దీపము వంటిది. రెండోది రాకుండా మొదటిది పోదు. జ్ఞానం చదువువలన వచ్చేమాట నిజమేకాని భక్తిలేని చదువువల్ల వచ్చే జ్ఞానం అహంకారదోహదమే కాక, భక్తి మార్గానికి అవరోధమే అవుతుంది.

అందుకే విశిష్ట మతాచార్యులు దాస్యయే సరియైన దారి. శరణాగతియే పరమోపాయమని చెప్పారు. ఎన్ని జన్మలెత్తినా, యెంతమంది గర్భవాస నరకం అనుభవించినా, యెన్నిసార్లు తనువు చాలించినా ఈ జీవి నేర్చుకొనేదేమీ వుండదు. ఎప్పటికప్పుడు పరగడుపే. ఏ ఒక్క జన్మలోనూ ఎన్ని విద్యలు నేర్చినా ముక్తి మార్గం పట్టుకోలేకపోయాను, అంటున్నారు అన్నమాచార్యులవారు. శ్రీవేంకటేశ్వరుని ఆశ్రయంలో చేరి శరణాగతితో ఆతని సేవచేస్తూ జీవిస్తేనే పరమానందమనేముక్తి దక్కుతుంది. లేకపోతే యెన్నాళ్ళయినా ఇదేపీకులాట. ఇదే భ్రాంతి, ఇదే అజ్ఞానం, ఇదే అహంకారం, ఇవే జననమరణాలు, ఇవే కౌగిళ్ళూ, ఇవే కన్నీళ్ళూ, ఇవే సుఖదుఃఖాలు. దీని దుంపతెగ దీనికి అంతూలేదు, పొంతూ లేదు.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! నాకు ఇదియే (ఈ శ్రీవేంకటేశ్వరుని శరణాగతియే) ఉపాయము. ఇందుల కంటే (ఇంతకంటే) మరిలేదు (మరింకొకటి లేనేలేదు). నామదిలో కూడా ఇతని దాసుల (హరిదాసుల) దాసుడనై యెన్నో మహిమలతో శోభించెదను గాక!

ఈనాడు నాకు మానవజన్మ దొరికింది. నా జన్మంబు గడచితినా (ఈ జన్మల చక్రభ్రమణం దాటితినా?) అబ్బేలేదు. మానవ జన్మ వచ్చిన వెంటనే నా అజ్ఞానం పోలేదే? వేవేల చదువుల (అనేకమైన శాస్త్రములను చదివినంతమాత్రాన) పాపము సేయక విడిచితినా? అబ్బే లేదే. అఖిల





దేవతలను కొలిచినంతమాత్రాన సంసారవారధిని (సంసార జలధిని) అడచితినా (దాటగలిగానా?) అవెన్ని చేసినా యేమీ కాలేదు. బడిబడి (క్రమక్రమముగా) శ్రీహరినాశ్రయించి హరినామాన్ని పట్టుకొన్నాను. ఆ హరినామం నుతించి పావనుణ్ణయ్యాను కానీ లేకపోతే ఈ జన్మల సుడిగుండాల్లో పడి తిరుగుతూనే వుండేవాడిని.

సరే, ఏదో జన్మలో తపస్సును కూడా చేసే వుంటాను. అంతమాత్రాన కెరలితినా (అతిశయించానా?) పోనీ ఈ విష్ణుమాయను గెలిచితినా? లేనేలేదు. ఏదో ఒక జన్మలో రాజ్యంకూడా పొంది పరిపాలించి వుంటాను. "రాజ్యాంతే నరకంధువం" అన్నట్లు రాజ్యపాలనలో యెన్ని పాపాలు చేశానో, ఎన్ని నరకములలో తగిలితినో (తప్పించుకొన్నానో?) తిరముగ (స్థిరముగా) అగ్రకులజుడనై జన్మించినంతమాత్రాన, విబూధికట్లు పంగనామాలూ పెట్టుకొన్నంత మాత్రాన తత్త్వరహస్యము తెలుసుకొన్నానా? అబ్బే లేదే. ఇదిగో ఈ శ్రీపతి శరణాగతి వలన, నేను ఇన్ని విధములా పాపవిముక్తుడనై, పుణ్యుడనైతిని.

నాకు ఎంతోమంది గొప్ప గొప్ప వ్యక్తులు చుట్టాలు అయ్యారు. అందువల్ల నాకు ఒరిగినదేమిటి చెప్పండి? వరుసగానున్న నా దుర్గుణాలలో ఒక్కటంటే ఒక్కదాన్నయినా వదలిపెట్టానా? అనేక విద్యలు నేర్చాను. అనేక ధర్మాలు నేర్చాను. ఏమిలాభము? యెన్నడైనా ముక్తి మార్గం పొందుదామని తలపెట్టానా? ఇదిగో మన కళ్ళయెదుట వున్నాడే ఈ మహానుభావుడు శ్రీవేంకటేశ్వరుడు, ఈయన నాకు యేలికయై నన్ను మన్నించాడు. ఇంకేముంది? పరమానందుడనై మోక్షగామినై, పదిలముగా (జాగ్రత్తగా) ఆయన సేవచేస్తూ తరిస్తున్నాను. ఇంకా ఇంతకంటే ఇంకేమికావాలి చెప్పండి.

సంపుటి: 15 కీర్తన : వెదకి వెదకి చొప్పు లెత్తుచును విచారించితి నిన్నాళ్లు

సంఖ్య : 411 పుట : 276 రాగం: సాళంగనాట

సాళంగనాట

73 వెదకి వెదకి చొప్పు లెత్తుచును విచారించితి నిన్నాళ్లు
యిదివో కంటిని శ్రీవేంకటగిరి యెదుటనే నీ శ్రీపాదములు
॥ పల్లవి॥

ఘనతులసీకాననంబులో కాఁపురముసేతు వనఁగాను
అనిశమ్ముఁ బద్మవనంబునను ఆడుచునుండుదు వనఁగాను
నిను నీ దాసులు పాడేచోట్ల నెలవై యాలింతు వనఁగాను
యినమండలమున నుండుదు వనఁగా యీ మాట విని నేను
॥వెదకి॥

పైకొని క్షీరాంబుధిలో నెప్పుడు పవళించివుందు వనఁగాను
వైకుంతంబున వెలుఁగొందుచు సర్వము భావించే వనఁగాను
దాకొని జీవులలో నెప్పుడు నంతర్యామివై వుందు వనఁగాను
లోకము నీవై వుండదు వనఁగా లోలత నీమాట విని నేను ॥వెదకి॥

పరమయోగీంద్రులు తలపోయుచునున్న భావముతో నుండువనఁగాను
పరిపరివిధముల పుణ్యకర్మము పాయక చరింతు వనఁగాను
గరిమల నెప్పుడు అలమేల్మంగ కౌఁగిటిలో వాఁడ వనఁగాను
యిరవుగ శ్రీవేంకటేశుఁడ వనఁగా యీ మాట విని నేను ॥వెదకి॥

**అవతారిక:**

వెదకి వెదకి చొప్పులు యెత్తుచు ఇన్నాళ్ళూ విచారించితిని, ఇదిగో ఇన్నాళ్ళకు శ్రీవేంకటగిరి మీద నీ పాదములు కంటిని - అంటున్నారు





తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు పల్లవిలో. అంటే యేమిటి? "ఓ శ్రీవేంకటేశ్వరా! వెదకి వెదకి నీ జాడ వివరములను విచారించి ఈ వేంకటగిరి మీద నీ శ్రీపాదములను కనుగొన్నానయ్యా!" అని ఆ పల్లవి అర్థం. మనం నేడు వాడుతున్న తెలుగునకు అన్నమయ్య కాలంనాటి తెలుగునకు యెంత వ్యత్యాసం వున్నదో గమనించండి. ఏయే పరిస్థితుల్లో తను శ్రీహరిని వెతికాడో కూడా వివరిస్తున్నారు. ఆయన సర్వాంతర్యామి. ఎక్కడైనా వుంటాడు, ఎలాగైనా వుంటాడు. పరమయోగీంద్రుల హృదయపంజరాలలో వుంటాడు. పద్మవనంలో శ్రీనివాసుడై సుందరీమణులతో నృత్యం సలుపుతూ వుంటాడు. ప్రతి జీవిలోనూ దాగికొని అంతర్యామివలె వుంటాడు. ఈ లోకమే నీవైనప్పుడు నీవీ లోకంలో యెక్కడుంటావో యెలా వుంటావో యెవరు చెప్పగలరు? యెలా చెప్పగలరు? అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! చొప్పులు యెత్తుచును (నీజాడ వివరములను) ఇన్నాళ్ళు వెదకి వెదకి విచారించితిని (వాకబు చేశాను). ఇదివో ఈ శ్రీవేంకటగిరి యెదుటనే నీ శ్రీపాదములను (మంగళకరమైన పాద పద్మములను) కంటిని (దర్శించాను). ధన్యుడినయ్యాను తండ్రీ!

దేవా! కొంతమంది యేమన్నారంటే, ఈ స్వామి తిరుమల శిఖరాలపైనున్న తులసీవనంలో కాపురముంటాడు అన్నారు. వారట్లనగా విని అక్కడంతా వెదికాను. మరికొందరు ఈ స్వామి, అనిశమ్ము (యెల్లప్పుడూ) పద్మవనములో సుందరమైన వనితల నడుమ చలోక్తులాడుతూ కనబడతాడన్నారు. ఆ వనమంతా అణువణువు గాలించాను. అటుపైన ఇంకొందరు లేదు లేదు ఈయన నాదబ్రహ్మ, గాన ప్రియుడు కాబట్టి ఈయన దాసులు యెక్కడ ఈయన కీర్తనలు

మధురంగా పాడుతుంటారో ఈయన అక్కడే తిష్ఠ వేసికొని కూర్చొని తన్మయత్వంతో వింటుంటావన్నారు. నీ కీర్తనలు పాడే చోట్లకు పరుగులెత్తి గాలించాను. ఇంకొక గడుసువాడు స్వామి యినమండలము (సూర్యమండలంలో) వుండటం నేను విన్నానన్నాడు. ప్రభూ! నాకు నిన్ను సూర్యమండలంలో వెదికే సత్తావున్నదా? కానీ నా అదృష్టం కొద్దీ ఈ శ్రీవేంకటగిరి మీదనే నీ పాదములను కనుగొన్నాను.

ఓ శ్రీనివాసా! పురాణేతిహాసాలను చెప్పే ఒకాయన మీరు పురాణాలు వినరా? స్వామి క్షీరసాగరమున ఆదిశేషునిపై పవళించియుంటాడు, యెప్పుడూ అక్కడ వెదకమన్నారు. మరి కొందరు నీవు భూమ్మీదసాగరమే దాటలేవు చాలు చాల్లే ఆయన వైకుంఠంలో వెలుగొందుతుంటాడు అక్కడనుండే భావనలో నీ భావనా శక్తిచేత సర్వము గమనిస్తుంటావని అన్నారు. ఇంకొక వేదాంతి యేమన్నాడంటే, ఈయన దాకొని (దాగికొని) సర్వజీవులలో యెప్పుడు అంతర్యామిగా (ఆత్మరూపంలో) వుంటాడు అన్నారు. ఇంకొకాయన లోకమే పరమాత్మ. పరమాత్మయే లోకము. లోకంలో ప్రతిచోటా ఆయన వుంటాడన్నారు. ఎన్నిచోట్లు వెదకను? ఇదిగో ఈ వేంకటగిరిపై నావెదకులాట ఆపేశాను.

జ్ఞానులైన కొందరు "యోగిహృద్యాన గమ్యం" అనేమాట వినలేదా? ఈస్వామి, పరమయోగీంద్రుల తలపోతల భావనా రూపుడవై వుంటావన్నారు. పరిపరివిధములైన (అనేక రకములైన) పుణ్యకర్మలు (యజ్ఞయాగాది క్రతువులు) చేసే చోట, పాయక (విదలకుండా) చరింతువన్నారు (తిరుగుతుంటావన్నారు). ఇంకొక శృంగార ప్రియుడైన కవి ఈయన యెప్పుడూ దేవి అలమేల్మంగ కౌగిలిలో యెప్పుడు వాడక (నిశ్చింతగా) వుంటావన్నారు. ఇరవుగా శ్రీవేంకటేశ్వరుడు, ఈయనే అన్నారు. మరి నేను ఇంకాయెక్కడో వెదకటందేనికి?





సంపుటి: 15 కీర్తన : ఆ మూరితియే యీ మూరితి అందునిందు భేదములేదు

సంఖ్య : 441 పుట : 296 రాగం: వరాళి

**వరాళి**

**74 ఆ మూరితియే యీ మూరితి అందునిందు భేదములేదు**
**సోమార్కనేత్రుఁడ విశ్వరూపములు చూచినవారమే మును నేము**
**॥ పల్లవి॥**

**బలిమితోడ వత్సాపహరణమున బ్రహ్మకు నీమాయ చూపితివి**
**విలసిల్లఁగ రణభూమిని నరునకు విశ్వరూప మటు చూపితివి**
**అలరిన నీ రూపు జలమధ్యంబున అక్రూరున కటు చూపితివి**
**చెలఁగి కుమారస్వామికి నారూపు శ్రీవేంకటగిరిఁ జూపితివి**
**॥ఆ మూరితి॥**

**దైవికముగ దుర్యోధనుసభను ప్రతాపము నీ రూపు చూపితివి**
**ఆ విధముననే నీ రూప ముందంకునాశ్రమమున నటు చూపితివి**
**నీవిధ మెఱుఁగని భీష్మకునకు మఱి నిర్మలరూపము చూపితివి**
**శ్రీవేంకటగిరి నా రూపంబే చేరి పరుషలకుఁ జూపితివి**
**॥ఆ మూరితి॥**

**పుట్టినపుడే వసుదేవునకు చతుర్భుజముల నీ రూపు చూపితివి**
**జట్టిగ గొల్లెతలకు రూపము రాసక్రీడలలోఁ జూపితివి**
**యిట్టే నారదునకు ద్వారకలో యింటింట నీరూపు జూపితివి**
**పట్టుగ శ్రీవేంకటేశ్వర ఆ రూపమె మాకిప్పుడు చూపితివి**
**॥ఆ మూరితి॥**

**అవతారిక:**

తనయెదుట కనుపిస్తున్న సుందరమూరితియైన శ్రీవేంకటేశ్వరుని నిలువెత్తు మూర్తిని చూస్తూ పులకితగాత్రుడైన పెదతిరుమలాచార్యులవారు పాడిన రమణీయమైన కీర్తన నాస్వాదించండి. ఆనాడు రేపల్లెలో అన్ని లీలలను చూపిన ఆ మూరితి (ఆ శ్రీకృష్ణమూర్తి) ఈ మూరితీ ఒక్కరే. అందునిందు భేదములేదు అని ధృవీకరిస్తున్నారు. మేము కూడా భాగవత గాథలు చదివాము. ఓ రవిచంద్ర నేత్రుడా! నీ విశ్వరూపమును గూర్చి మేమూ విన్నాములే స్వామీ! అని కీర్తిస్తున్నారు. నారాయణతత్త్వము నెఱింగిన వాడినని నారదమహర్షికి గొప్ప గర్వం వుండేది. పరమాత్మ తత్త్వమేమంటే తన ప్రియ భక్తుడు చెడిపోతుంటే చూస్తూవూరుకోడు. వాడిని తిరిగి సక్రమమైన దారిలో పెట్టేదాకా ఆయన విశ్రమించడు. నారదుని మనసులో శ్రీకృష్ణునిపై శంకమొదలయింది. పదియారువేలమంది రాచకన్నెలను నరకాసురుని చెఱనుండి విముక్తి ప్రసాదించాడు శ్రీకృష్ణుడు. కాని, వారు చెఱబట్టబడిన మమ్ము చెఱవిడిపించిన రక్షకుడవుగాన మాకు భర్తవై మమ్ము వుద్ధరించమన్నారు. తనకే కోర్కెలేకపోయినా వారి విన్నపమును మన్నించి పరిణయమాడినాడు స్వామి. కానీ పదియారువేలమందికి భర్తగా న్యాయం చేయగలడా అనే సందేహం నారదునికీ వచ్చింది. ఆయన తిన్నగా ద్వారకవెళ్ళి నిజం నిగ్గు తేల్చాలనుకొన్నాడు. కాని నారదుని దిమ్మతిరిగినంత పనయింది. ద్వారకలో పదివేలమంది కృష్ణులు పదివేల ఇండ్లలో పదివేల రకాలైన గృహస్థాశ్రమధర్మాలు నిర్వహిస్తూ కనుపించాడు. అదీ కృష్ణలీల అంటే.

**భావ వివరణ:**

ఆ మూరితియే (అలనాడు రేపల్లెలో ద్వాపరయుగంలో శ్రీకృష్ణలీలలను ప్రదర్శించిన ఆ మూర్తియే) యీమూరితి (ఈనాడు ఈ తిరుమల శిఖరాలమీద పొడవుకు పొడవైన పురుషోత్తమునివలె దృగ్గోచరమవుతున్న





శ్రీవేంకటరమణమూర్తి). అందునిందు భేదములేదు. మేమూ, భాగవత కథా శ్రవణముచేత మును (పూర్వము) సూర్యచంద్రులే నేత్రములుగా విలసిల్లిన విశ్వరూపుని మా హృదయమున చూచిన వారమే (దర్శించినవారమే). కావాలంటే ఆ లీలల్లో కొన్నింటిని పునశ్చరణ చేస్తాను విని తరించండి.

ఓ దేవా! బ్రహ్మదేవుడు, వత్సాపహరణమును చేశాడు. (నీవు బాలకృష్ణునివలె ఆవుదూడలను కాస్తుంటే, నిన్నేడిపించాలని లేగదూడలను గోపాలురను మాయం చేశాడు.) నెల రోజులపాటు రేపల్లెలో ప్రతి గోపబాలుని ఇంట్లో కృష్ణుడు తానే ఆ బాలుడైవుండి ఆనందపరచాడు. అసలేం జరుగుతున్నదో అర్థంకాని బ్రహ్మ కాళ్ళబేరానికి రాక తప్పలేదు. ఆనాడు బ్రహ్మకు నీమాయ చూపితివి. కురుక్షేత్ర రణరంగమున అర్జునునకు జ్ఞానమొసంగుటకు నీవిశ్వరూపమును ప్రదర్శించితివి. అక్రూరుడు కృష్ణుని కంసునివద్దకు కొనిపోవుచున్న సమయమున రథమునందును అక్రూరుడు అర్ఘ్యమిచ్చుచున్న యమునలోనూ ఒకే సమయమున, కనుపించి ఈతడు మానవమాత్రుడు కాదని తెలియజేసినాడు. ఒకనాడు శివపార్వతీనందనుడైన కుమారస్వామి వైకుంఠంలో శ్రీహరిని దర్శిద్దామని వెళుతుంటే, తాను ఈ కలియుగమున శ్రీవేంకటగిరిపైననే వున్నానని శ్రమపడి వైకుంఠం రావలసిన అవసరం లేదనీ శ్రీవేంకటగిరిపైననే తన దివ్యదర్శనమిచ్చాడు.

అలనాడు కురుసభలో రారాజు దుర్యోధనుడు శ్రీకృష్ణుని బంధించి పాండవులకు కృష్ణుని అండ రూపుమాపాలని సంకల్పించాడు. ఆనాడు ఆగ్రహోదగ్రుడైన శ్రీకృష్ణుని కనీసం తేరిపార చూడలేకపోయింది దుష్ట చతుష్టయం. మరి ఆ దేవదేవుని ప్రతాపమట్టిది. ఉదంకుడను మహర్షికి

ఈగోపబాలుడు వెర్రి గొల్లవాడు కాదు విష్ణుమూర్తియేనని స్ఫురింప జేసినాడు. శ్రీకృష్ణుని మామగారు రుక్మిణీదేవి తండ్రికి కూడా రుక్మిణీదేవిని అపహరించిన యాదవుడు కృష్ణుడు తన పుత్రుడైన రుక్మిని సగము మీసము గొరిగి అవమానించాడని వైషమ్యం వుండేది. అది అతనిముక్తికి అవరోధమయిందని కరుణతో తన శ్రీహరిరూపము చూపి, నిర్మల చిత్తునిచేసి, మరీ మోక్షమిచ్చాడు. అదే రూపాన్ని ఈనాడు నాబోటి అనామకులు కూడా చూచి తరించేటందుకు మానవమాత్రులందరికీ నీ వరదహస్తం చూపి పాపవిముక్తులను చేస్తున్నావు.

మూడు జన్మలలో నీకు తండ్రియై నీ ప్రేమానురాగములను పొందిన వసుదేవునకు నీవు శిశువువై జన్మించిన మరుక్షణముననే అతని పుణ్యవిశేషమున శ్రీమన్నారాయణుడే స్వయంగా తనకు పుత్రుడైనాడనే స్ఫురణనిచ్చినాడు. ఆనాడు రాసక్రీడాసమయమున పండు వెన్నెలలో యమునా తటివద్ద, నారీ నారీనడుమ ఒక మురారియై, హరికీ హరికీ మధ్య ఒక వయ్యారియై అది స్త్రీ పురుష సంగమము కాదనీ ఆత్మపరమాత్మల సంగమమని వారికి దివ్యానుభవం కలిగించాడు. ఒకనాడు నారదుడంతటి మహర్షికి భ్రమ కలిగి పదివేలమంది రాచకన్నెలను పరిణయమాడిన కృష్ణుడు వారికి పతిగా న్యాయమెలా చేయగలడని శంక కలిగింది. పరీక్షించుటకు ద్వారకయ వెళ్ళిన నారదునికి ఇంటింటా ఒక కృష్ణుడు భర్త బాధ్యతలు నెరవేరుస్తూ కనుపించి కనువిప్పు కలిగించాడు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఆనాటి భాగవతులంతా నీ మహిమ దర్శించుటకు అన్ని తిప్పలు పడ్డారు. కాని మేము నేడు సునాయాసంగా తిరుమలలో ఆ భాగ్యాన్ని పొందుతున్నాము.





సంపుటి: 15 కీర్తన : ఎక్కడ వోయెనో జాతస్మరత్వము
యేమిసేయగలవాడను నేను
సంఖ్య : 437 పుట : 294 రాగం: గుజ్జరి

**గుజ్జరి**

**75** ఎక్కడ వోయెనో జాతస్మరత్వము యేమిసేయఁగలఁవాఁడను నేను
దిక్కు నీవే హరి నన్నుఁ గాచుటకు దేవదేవ యిఁక బోధించవే
॥పల్లవి॥

తిరముగ జన్మాంతరమున సంపాదించిన సుజ్ఞానంబున
స్మరించి యీ పుట్టుగునఁ గడమ నే సాధించెద నని యంటినా
అరయఁ దల్లిగర్భంబున వెడలినయపుడే అన్నియు మఱచితిని
ధరలోపల నే విడువక ద్రావిన మరులుఁబాలు నను మంకుఁజేసెను
॥ఎక్కడ॥

అంతట నేఁ బెద్దపెరిగి బుద్ధెఱిఁగి అటు నీమాయాప్రపంచముసను
చెంతల బహువిధసృష్టిలోఁ దగిలి చిక్కువడుచు నే భ్రమసితిని
చింతించే నే మఱిపెక్కులు చదువుచు చిత్తములో
బహుసంశయములఁబడి
అంతట నంతట జరగి జరగి కడు నజ్ఞానముపాలైతిని
॥ఎక్కడ॥

ముదిసినపిమ్మట లోభమోహములు ముంచుకొనఁగ నటు లోలుఁడ నైతి
వదలక భువిపై బ్రహ్మదేవుఁ డటు వ్రాసినవ్రాతలు నిజమాయె
చెదరక యలమేల్మంగ విన్నపముచేకొని శ్రీవేంకటేశ కాచితివి
బ్రదికితి నిఁక నాచార్యునియానతి ఫలియించెను నా భాగ్యమువలన
॥ఎక్కడ॥

**అవతారిక:**

ఓ శ్రీహరీ! నేనేమి చేయగలనయ్యా! జన్మాంతరములనుండి నేను సంతరించుకొన్న జ్ఞానం ఎక్కడికి పోయింది? ఇట్టి పరిస్థితుల్లో నాకు దిక్కు దేవదేవుడవైన నీవే కదా! పోనీ ఈ జన్మలో నేను సంపాదించిన సుజ్ఞానం నాకు వచ్చే జన్మలోనన్నా ఉపయోగపడుతుందిలే అనుకొందామంటే ఇంకొక అమ్మకడుపులో పడగానే క్రితం జన్మవరకూ నేను సంపాదించిన జ్ఞానమంతా ఇగిరిపోతున్నది, అని వాపోతున్నారు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. మరుజన్మలో జ్ఞానం లభ్యమవటం అటుంచి ఈ మాయా ప్రపంచంలో గల పెక్కు భ్రమలనుండి బయటపడి చదివిన చదువుల సారం గ్రహించి చిత్తములోగల పెక్కు సంశయములను నివర్తించుకోలేకనే పోయాను. జీవితం గడుస్తున్నకొద్దీ నా అజ్ఞానము పెరిగిందే కాని తరుగలేదు. వయసు పెరుగుతున్న కొద్దీ లోభమోహములు కూడా పెరిగి ముంచేశాయే కాని తక్కువకాలేదు. చివరికి మా ఆచార్యులవారి కృపవలన నా భాగ్యము ఫలించి శ్రీవేంకటేశుని దారినబడి బ్రతికిపోయాను అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నా జాతస్మరత్వము (పుట్టుకతో వచ్చిన స్మరణ) ఎక్కడ వోయనో (యెక్కడకు పోయిందో) తెలియదు. నేను యేమి చేయగలవాడను? నన్ను గాచుటకు (రక్షించుటకు) ఓ శ్రీహరీ! నాకు దిక్కునీవేయై ఈ సుజ్ఞానమును బోధించవయ్యా!

నేను నా గత జన్మలలో నేర్చిన సుజ్ఞానమును, తిరముగ (స్థిరముగా) స్మరించి ఈ జన్మలో సాధించెదములే అనుకొంటే అది జరిగే పనిలా నాకు కనబడటం లేదు. ఈ జన్మలో నాతల్లి కడుపులోనుంచి బయటకు పడగానే





అన్నీ మఱచిపోయాను. నా గత జన్మస్మృతి ఒక్కటి కూడా మిగలలేదు. ధరలో (ఈభూమిపై) కొత్తతల్లి చనుబాలు త్రాగుతూనే నేను విడువక మంకుజేసేను (మొండిపట్టుదల, ఏడ్చి అయినా సాధించుకోవాలనే మనస్తత్వం) దినదిన ప్రవర్ధమానమైనది.

అంతట (ఆపైన) నేను పెద్దగా పెరుగుతున్న కొలదీ బుద్దెఱుగుట (మంచి చెడ్డలు తెలియుట) మొదలయ్యింది. అటు (ఆ విధముగా) నీమాయా ప్రపంచంలో, బహువిధములైన నీ సృష్టి వైచిత్రిలో తగులుకొని చిక్కువడుచుయ నేను భ్రమసితిని (భ్రమలోపడి చేతకానివాడనయ్యాను).

భ్రమలోపడి గొప్ప పండితుడనవ్వాలని కనబడ్డ శాస్త్రాలన్నీ చదివాను. పెక్కులు చింతించి (అనేకమైన విషయములను నేర్చినాను.) దానివల్ల నా సంశయములు ఇబ్బడికి ముబ్బడి అయినాయే గానీ నాకేమీ మేలు కలుగలేదు. సందేహాలతో, తర్క కుతర్కాలతో ముందుకు సాగిన కొలదీ ఇంకా యెక్కువ అజ్ఞానంపాలైతిని. ఈ చక్రభ్రమణంలో అనేక దుర్గుణాలూ వచ్చి చేరుతాయి. సరే, చూస్తుండంగానే ముదిసిన పిమ్మట (వయస్సు పెరుగుతున్నకొలదీ) లోభము మోహమూ నన్ను తగులుకొని ముంచుకొనగ (యేమార్చగా) అటు (ఆ విధముగా) లోలుడనైతిని (స్వాధీనుడనై పోయాను). ఆ విధముగా బ్రహ్మదేవుడు పట్టుబట్టి వ్రాసిన నా నుదుటి వ్రాతలు నిజమైనవి. అయినదేదో అయినది, నేను భయపడక మా అమ్మ అలమేల్మంగకు అనేక విన్నపములు చేసి ఆమె నాధుడైన శ్రీవేంకటేశుని నన్ను కాస్త కరుణించమని మా స్వామికి చెప్పమని మొఱబెట్టుకొన్నాను. అప్పుడు ఆ స్వామి నన్ను రక్షించాడు. ఇక బ్రతికిపోయాను. మా ఆచార్యుని ఆజ్ఞ ఫలించింది. నా భాగ్యమువలన నేను ధన్యుడనయ్యాను.

సంపుటి: 15 కీర్తన : జగన్నాథా నీకొక్కనికి శరణు చొచ్చితిమి కావగదే

సంఖ్య : 403 పుట : 271 రాగం: భూపాళం

**భూపాళం**

**76** **జగన్నాథా నీ కొక్కనికి శరణు చొచ్చితిమి కావఁగదే**
**అగపడి మాలో నున్నాఁడ వనుచు నానతియిచ్చెను మా గురుఁడు**
**॥పల్లవి॥**

**కలదు వొకానొకయదృష్ట మందురు కనుఁగొనలే రెవ్వరును**
**తొలుతు జనించిన జన్మము లెంతురు తెలియ నశక్యములు**
**యెలమిని స్వర్గము గలదట ముందర కెక్కడనున్నదో మిన్నులపై**
**వెలుపల నిట్టి విశేషంబులు నే వెతకఁగ నా తరమా**
**॥జగ॥**

**పొదుగుకొన్న దిదే కర్మమెయందురు పొడచూపుటలేదెక్కడను**
**యెదిటిది మాయాకల్పితమే యట యెట్లు గురుతుపడు మాకును**
**కదిసి చరాచరములకు నెప్పుడును కాచుకొన్నది విధియని చెప్పేరు**
**విదితము లైనవి యెక్కడెక్కడని వెతకఁగ నా తరమా**
**॥జగ॥**

**అనుభవించువాఁ డాత్ముఁడే యందురు అణురూపం బని తలఁచఁగ రాదు**
**తనువు సాధనము సర్వంబున కట తగులిదె కంటిమి దృష్టముగా**
**ననయంబును శ్రీవేంకటేశ్వరా యలమేల్మంగవిభుఁడా**
**నినుఁ గొలిచితి నిన్నిటికీ సెలవుగా నీమహి మెఱుఁగఁగ నా తరమా**
**॥జగ॥**





**అవతారిక:**

భగవంతుడైన శ్రీమన్నారాయణుడు యెక్కడో వైకుంఠపురంలో మందారవన ప్రాంతంలో రమాదేవితో వినోదంగా పాచికలాడుతూ వుండడు. ఆయన యోగి హృదయావనములలో సంచరించెడు పరమహంస. జగన్నాథుడైన ఆయనొక్కని ఆశ్రయిస్తే చాలదా? అందుకనే తనతండ్రి అన్నమాచార్యులవారి వలెనే తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు కూడా ఓ జగన్నాథా! నీకొక్కనికే శరణు జొచ్చితినయ్యా! నన్ను కావగదే అని వినమ్రులై వేడుకొంటున్నారు. మా గురుపుంగవులు యేమి చెప్పారో తెలుసునా స్వామీ! నీవు వైకుంఠంలోనూ లేవు యోగుల హృదయాలలోనూ లేవు. నీవు మాలోనే అంతర్యామిగానున్నావు. నీకోసం అక్కడ ఇక్కడా వెదకుట అర్ధంలేని పని. ఈ పౌరాణిక విశ్వాసంతో స్వర్గం కోసం ఆశించడం యెంత అర్ధంలేని పని? ఈ మాయాపరివృతమైన జగములో అన్నీ అనిత్యాలే. చరాచరమైన యన్నిటిని ప్రేరేపించి నడిపించునది "విధి"యట మరి ఆ విధి లీలలను అర్థం చేసికొనుటకు యెక్కడెక్కడని వెతకను? సరే ఈ విధికి భోక్త (అనుభవించువాడు) ఆత్మ అయితే మరి అతనెక్కడుంటాడు? యెలావుంటాడు? ఓ తిరువేంకటేశ్వరా! అనవసరమైన ఈ జ్ఞానంతో అజ్ఞానినైపోతానేమో? అయ్యా! వీటన్నిటినీ అర్థం చేసుకొనే శక్తి నాకున్నదా? అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ జగన్నాథా! నేను అశక్తుడనయ్యా! నీ మహిమ నీ లీలావిలాసము నెరుగుటకు నేనెంతవాడనయ్యా! నీకొక్కనికి నేను శరణుజొచ్చితిని. నన్ను గావగదే (రక్షింపగదే!) మా గురువులు నీవు మాలోనే వున్నావని ఆనతిచ్చినారు. మరి మాకొకసారి నీ అనుభవము కలిగించరాదా స్వామీ!

అదృష్టమనేది కలదు కలదనే పెద్దలంతా చెబుతున్నారు. కాని అదెవ్వరికినీ కనబడుట లేదు. ఈ అదృష్టము మన తొలి జన్మములలో

చేసికొన్న పుణ్యవిశేషమే... ఈ జన్మలో అదృష్టం వలె వున్నట్లుండి దర్శనమిస్తుందంటున్నారు. మరి దాని తీరుతెన్నులు తెలిసికొనుటకు శక్యమగుటలేదు. కొంతమందేమంటున్నారంటే యెలమి (వికాసముతో) మంచి పనులు చేసి ఆ స్వర్గంలో చక్కగా సుఖాలు అనుభవించండయ్యా! అంటున్నారు. అదెక్కడో మిన్నుల (ఆకాశంలో) వుందట. ఓ సర్వేశ్వరా! వెలుపల (ఆ నింగిలో) ఇటువంటి విశేషాలను పనివేళా వెదకుట నావలన అవుతుందా తండ్రీ!

ఇదిట్లావుండగా మరికొంతమంది వుంటారు. వారు మంచి జరిగినా చెడు జరిగినా నీ కర్మ వశంబుననే జరిగిందంటున్నారు. ఏదో ఒకటి జరుగకుండా యెలావుంటుంది చెప్పండి. సాధ్యంకాదు కదా! మన యెదుటునున్న ఈ ప్రపంచమంతా మాయా కల్పితమట. సరే, బాగానేవున్నది మరి మేము, ఈ మాయను యెట్లు గుర్తించగలము? చరాచరమైన ఈ జగత్తులో "విధి" అనే అభేద్యుడు యెప్పుడూ కాచుకొని కాటువేయటానికి సిద్ధంగా వుంటాడట. ఆ కాటునుంచి తప్పించుకోవటం యెవరి తరమూ కాదట. ఈ విధంగా ఈ విధి గురించి చెబుతుంటే దీనికోసం నేను యెక్కడెక్కడని వెదకను? అది నా తరము అవుతుందా తండ్రీ!

పెద్దలు అనుభవజ్ఞులూ యేమి చెబుతున్నారంటే, భోక్త (కర్మఫలముననుభవించేవాడు) ఆత్మయేనట. వాడు అణురూపంలో దేహమంతా నిండివుంటాడట. కానీ తనువు (ఒక శరీరం) లేకపోతే జీవి తన కర్మఫలముగా వచ్చే సుఖదుఃఖాలను యెలా అనుభవించగలడు? తగువిదె (వచ్చిన చిక్కుముడి ఇదే). ఓ శ్రీవేంకటేశ్వరా! అలమేల్మంగమ్మ మనోవల్లభా! అనయంబు (సదా) నిన్ను గొలిచితిని. ఇన్నిటికీ (ఈ జరుగుతున్న వాటన్నిటికీ) నీ మహిమే సెలవు (ఆజ్ఞ) వంటిది. దానిని యెఱుగుట నా తరమా ప్రభూ!





సంపుటి: 15 కీర్తన : కాదని తోయగ నెంతటివారలు ఘనసంసారులు నరులను సురలును

సంఖ్య : 267 పుట : 181 రాగం: బౌళి

**బౌళి**

**77 కాదని తోయఁగ నెంతటివారలు ఘనసంసారులు నరులును సురలును**
**నీ దాసులతో సంగతిసేయఁగ నిర్మలచిత్తం బయ్యీఁగాక ॥పల్లవి॥**

**హరి నీ మాయె విజృంభించు నట నడఁచే మన నెవ్వరితరము**
**దరిగొని నీకె మొక్కఁగ తానే మన్నించీఁగాక**
**నిరతి నీ యాజ్ఞ జగతిఁ జెల్లునట నెట్టన నిది గడచేవా రెవ్వరు**
**ధరణిలో నీ వారమని యీడుకొనఁగ తప్పులుపట్టక కాచీఁగాక**
**॥కాదని॥**

**ధాత నీ సుతుఁడు పుట్టించువాఁడట తగదని తోయగ నెవ్వఁడోపునిఁక**
**ఆతుమలో నిను ధ్యానము సేయఁగ నతఁడే మొగమోడీఁగాక**
**ఘాతల మదనుఁడు మదమురేఁచునట కాదని గెలువఁగఁగలరా యెవ్వరు**
**రాతిరిఁ బగలును నిన్నె జపించఁగ రతిఁ గైవస మయ్యీఁగాక**
**॥కాదని॥**

**నీ కల్పిత మగు కర్మమంటునట నెఱి విడిపించఁగ సమర్థులెవ్వరు**
**చేకొని నీవేగతి యని యుండఁగ చిక్కులఁబెట్టక చనుఁగాక**
**యీ కడ శ్రీవేంకటేశ్వర నీవే యెందుఁ జూచినా నంతరాత్మ వట**
**పైకొని నిన్నే నమ్మివుండఁగాఁ బ్రసన్నుఁడవు నీవయ్యేవుగాక**
**॥కాదని॥**

**అవతారిక:**

ఎంతటివారలకైనా ఈ సంసారము నిత్యము, సత్యము, సంతుష్టము అనే అనిపిస్తుంది. ఎన్ని కష్టాలుపడుతున్నా ఇదంతా మా ప్రారబ్ధం

అనుకొంటారేగాని, లోపం అది కల్పించే మాయలోవుందని గ్రహించలేరు. కానీ శ్రీవేంకటేశుని దాసులు మాత్రం ఈ ఝుంఝూటము నుంచి బయటపడి నిర్మలాంతఃకరణతో విలసిల్లుతారంటున్నారు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు.

వైరాగ్యం కలగాలంటే శ్రీహరి కృప కావలసిందే. ఆయన దయలేకపోతే ఈ సంసారం మీద యేనాటికీ విరక్తి కలుగదు. అయ్యో! ఇట్లా చేసివుంటేబాగుండేదే? ఇదంతా ఆ దుర్మార్గుడివల్ల అయింది, అనే వైషమ్యభావాలతో తను శాంతితో వుండడు, ఇంకొకరిని శాంతితో వుండనీయడు. ఇదంతా హరిమాయయే. మాకెంత జ్ఞానవైరాగ్యాలున్నా నీ కొడుకులతో వస్తున్నదయ్యా! చిక్కంతా. మీ పెద్దబ్బాయి బ్రహ్మయ్యగారు వ్రాసినవ్రాత కాదనగలమొనగాడెవరయ్యా! పోనీ మీ చిన్నబ్బాయి మదనుని నిగ్రహించగల ధీరుడున్నాడా? రేయింబవళ్ళూ నీ ధ్యాసవుంటే యేమోగాని మామూలు మానవమాత్రులు రతిగైవసముకాకుందురా? ఓ దేవదేవా! నీవే అంతర్యామివని సుస్థిరమైన నమ్మికతో వుంటే గాని నీవు మాయందు ప్రసన్నుడవగుట అనునది అంత తేలికగా జరిగేపని కాదు స్వామీ! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నరులకైనా సురులకైనా, మరి వారెంతటివారైనా నీమాయావృత ఘన సంసారమును తరించుటకు సాధ్యమా? ఎంతటివారలకైనా దీనిని కాదని తోయగ (నిరాకరించుట) సాధ్యమా? కానేకాదు. కాకపోతే ఒక సౌలభ్యమేమంటే నీ దాసులతో సంగతిసేయగ (స్నేహపూర్వకమైన సేవ చేస్తే) నిర్మలచిత్తం బయ్యీగాక! (పరిశుద్ధ చిత్తము గలవారై రాగద్వేష రహితులై వుండగలరు).

ఓ శ్రీహరీ! నీమాయ విజృంభించునైజము కలదియట, మరి దానిని అణచటం యెవరి తరము అవుతుంది? దరిగొని (దానిని ఆశ్రయించి, శరణని) నీకే మొక్కంగ నీ మాయ తానే మమ్మల్ని మన్నించి





అనుగ్రహిస్తుంది.. నీవు నిరతితో (కావాలని విధించిన) ఆజ్ఞలను కాదనగల సామర్థ్యమెవ్వరికి వుంటుందయ్యా! నెట్టన (అనివార్యమైన) ఇది నీ ఆజ్ఞను వుల్లంఘించుట యెవరితరమవుతుంది ప్రభూ! మరి ఇక దారేమిటి? ధరణిలో (ఈ భూమ్మీద) నీవారమని (నీ దాసులమని) యాడుకొనగ (చెప్పుకొంటూ సన్మార్గంలో వుంటే) అప్పుడు నువ్వు తప్పులు పట్టక (మా నేరము లెంచక) కాచేవు (రక్షిస్తావు).

నీ సుతుడు అయిన ధాత (బ్రహ్మదేవుడు) పుట్టించువాడట. అదీ నీ ఆజ్ఞ ప్రకారమే. మరి ఇక ఆయన వ్రాసిన వ్రాతను తగదని తోయగా (వద్దని నిరాకరించటం) యెవడికి సాధ్యం? నిన్ను దేవదేవుడని నా ఆత్మలో మనస్ఫూర్తిగా నమ్మి నీ ధ్యానము చేస్తే, అతడే మొగమోడీగాక! (నీ కృపకు పాత్రుడవుతాడు). ఆ శ్రీహరికి ఇంకో ఘాతలమైన (ఘోరమైన) కొడుకు వున్నాడు. వాడిపేరు మదనుడు (మన్మధుడు). వాడి వుద్యోగమే మదమును పెంచుట. “కామాతురాణాం నభయం నలజ్జా” వాడినెవ్వరూ గెలువలేరు. పైగా వాడి వశమైతే సిగ్గూ మర్యాదకూడా వదలివేస్తారు. మరి ఆ రతీదేవి మొగుడు అజేయుడా? రేయింబవళ్ళు నిన్నే (శ్రీహరినే) జపించగ ఆ మన్మధుడు కైవసమవుతాడు (స్వాధీనమవుతాడు).

ఓ ప్రభూ! నీవు కల్పించిన ఈ కర్మము ఒక్కసారి అంటుకొన్నదంటే ఇక జిడ్డులాగ వదలదు. దాని నుండి మమ్మల్ని విడిపించగల సమర్థులెవరయ్యా? చేకొని (దానిని భరించి) అయిందేదో అయింది, స్వామీ నీ దయ మా ప్రాప్తం, నీవేగతి, అనివుంటే ఆయన చూసి చూడనట్లు వదలివేస్తే చిక్కులు బెట్టక చనుగొని (పోతుందేమోగాని) ఆ కర్మను నిరోధించడం యెవరి తరమవుతుంది? ఓ శ్రీవేంకటేశ్వరా! యెందుజూచినా నీవే మా అంతర్యామిగా వున్నావు. పైకొని (పూనుకొని) నిన్నే నమ్ముకొని వుంటే నీవు ప్రసన్నుడవయ్యేవు. అంతే ఇంకో దారి లేనే లేదు.

సంపుటి: 15 కీర్తన : విన్నప మిదియే వేవేలకు గోవిందా
సంఖ్య : 459 పుట : 303 రాగం: గుజ్జరి

## గుజ్జరి

78 విన్నప మిదియే వేవేలకు గోవిందా
సన్నుతించెదను నావలనఁగలుగు సర్వాపరాధము లెంచకుమీ
॥పల్లవి॥

యెఱుఁగమినాది యెఱుక నీపని యేమరి సంసారినైన యిన్నాళ్లను
మఱతును నేను మఱవవు నీవు మదమున సిరు లుప్పతిల్లఁగా
కొఱగాను నేను కొఱగలవునీవు కొమ్మలవలపులఁ దగిలితిఁ గనక
మఱి నీవేగతి రక్షింపుము నామర్మము నీచేతనున్నది సుమ్మీ
॥విన్నప॥

నేరమి నాది నేరుపు నీది నేఁ బుట్టుగులకు లో నైనయపుడే
కోరుదు నేను కోరవు నీవు గొనకొని యాపదలు పైకొనఁగా
దూరుదు నేను దూరవు నీవు తొరలి పురాకృతకర్మము లప్పుడు
యే రీతినైనా నీవే దిక్కింక యిదె నీకు శరణుచొచ్చితిఁజుమ్మీ
॥విన్నప॥

తలచమి నాది తలఁపు నీది యిటు తగ నంతర్యామివి గతకాలము
కొలుచుట నాది కొలువుగొనుట నీది కూరిమితో నే నీకు మొక్కఁగా
ఫలము నాది నాఫలదుఁడవు నీవు పరికింపఁగా శ్రీవేంకటేశ్వర
బలువుఁడవు నీవు నన్ను నేలు నా పాలిదైవమవు నీవే సుమ్మీ
॥విన్నప॥





**అవతారిక:**

ఓ గోవిందుడా! నీకు నా విన్నపమిదేనయ్యా! నిన్ను సన్నుతించెదనుగాని, నావలన కలుగు సర్వాపరాధములను మన్నించవయ్యా! అని కీర్తిస్తున్నారు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. ఎఱుగమి అంటే అజ్ఞానం అని అర్థం. ఓ సర్వేశ్వరా! నాదంతా అజ్ఞానం నాకు జ్ఞానము నిచ్చుటయే నీపని. ఈ సంసారబంధాలలో కట్టుబడి వుక్కిరిబిక్కిరి అయిపోయి యిన్నాళ్ళూ యేమరుపాటనేవున్నాను నేను. అయినా నీవు నన్ను మరువలేదు. నేరమంతా నాదే. నేరుపంతానీది. నీవే కోరిక లేని వాడివి. నాకోరికలకు అంతూ పొంతూ లేదు. ఎలాగైనా నీవే దిక్కువలె నన్ను కాపాడాలి. నాఫలప్రదాతవు నీవే అని గ్రహించేసరికి కాలమంతా గడచిపోయింది. ఏదో విధంగా నాపాలదైవమువై నీవే నన్ను కరుణించాలి. ఏలననగా నీవు లోకపాలకుడవైన శ్రీవేంకటేశ్వరుడవు నేను నీ దాసానుదాసుడను.

**భావ వివరణ:**

ఓ గోవిందుడా! నా విన్నపము ఇదేనయ్యా! నిన్ను వేవేలకు (అనేక విధముల) సన్నుతించెదను. నావలన గలుగు సర్వాపరాధములను (నా అపరాధములనన్నింటినీ) యెంచకుమీ (పరిగణించకుమయ్యా!) నన్ను మన్నింపుము.

ఓ ప్రభూ! ఎఱుగమి నాది (అజ్ఞానమంతా నాదే). నీపని యెఱుక (మాబోటివారికి జ్ఞానమునీయుటయే నీ వ్యాపనము). ఇన్నాళ్ళూ నేను సంసారలంపటంలో ఏమరి (మదపుతో) వున్నాను. నిన్ను మఱచిపోయాను. కాని నీవు నన్ను మఱువవు. ఈలోగా నేను ఐశ్వర్యవంతుడనయ్యాను. నెత్తిమీదకి కళ్ళువచ్చినట్లయింది నాకు. నేను కొఱగాను (అప్రయోజకుడనైపోయాను). కాని నీవు మాత్రం కొరగలవు

(ప్రయోజకుడవే). ఎందుకంటే కన్నుమిన్నుగానక, కొమ్మలవలపుల దగిలితిని (స్త్రీలతో శృంగార కలాపములను జరిపాను). ఇప్పుడు నా మర్మము నీచేత నున్నది (నాయొక్క బలహీనతలనన్నింటినీ నీకు చెప్పివేశాను). నాహృదయం తేలికబడింది. మఱి నీవేగతి. నన్ను రక్షించను నీచేతనున్నది. రావయ్యా! నన్ను కాపాడు.

ఓదేవా! నాది నేరమి (అజ్ఞానము). నీది నేరుపు (ఆర్తులను సమయానికి ఆదుకొనే ప్రజ్ఞ). పుట్టుకకు లోనైనయప్పుడే (జన్మను పొందుతూనే) కోరుదునేను (నా బుర్రనిండా) కోరికలే. (తల్లి స్తన్యం ఒకటి త్రాగుతూనే ఇంకోదాన్ని భద్రంగా చేత్తో దాచుకొంటాను). అంత కాపీనం నాకు పుట్టుకతోనే ఇచ్చావు). నీవు ఏ కోరికా లేని నిర్మోహివి. నేను ఈ కోరికలవల్ల అంతులేని ఆపదలను కొనితెచ్చుకొంటున్నాను. నా కోరికలకు అడ్డంవచ్చారని కనబడ్డవాడినల్లా దూరుదును (నిందిస్తాను). నీకు శత్రువే లేడు కనుక నీవెవ్వరినీ నిందించవు. దీనివల్ల పురాకృతకర్మలు నాకు అంటుకొంటున్నాయి. దీంట్లోంచి బయట పడటం నాతరం కావటంలేదు. ఇక నీవే దిక్కూ అని నీ శరణుచొచ్చితిని.

స్వామీ! నాది తలచమి (ధ్యానించకపోవుట అనే అపరాధము). నీది (నీ వ్యాపారము) మాకు నీపై తలపు కలిగించుట. మేము ఆ తలుచుకోవటం కూడా మానేస్తామేమోనని మా అంతర్యామిగానేవుంటూ అనుక్షణం గుర్తుచేస్తూనేవుంటావు. గత కాలమునుంచీ నీవు అలాగే వున్నావు. మరి నిన్ను కొలుచుట నాకర్తవ్యమేకదా! ప్రేమతో మాసేవలు స్వీకరించటం నీపని. నీకు భక్తితో మ్రొక్కితే మోక్షము అనే గొప్పఫలమునిస్తావు. మరి ఆ ఫలమునాదే కదా! నీవు మాత్రం నిష్కాముడవైన ఫలప్రదాతవు. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇదంతా పరికింపగా నాకేమితోస్తున్నదంటే నీవు బలవుడవు (సర్వసమర్థుడవు). నన్ను యేలే నాపాలిదైవము నీవేతండ్రీ!





సంపుటి: 15 కీర్తన : ఎంతగాలంబైనదప్పుదు యెవ్వరికి నేమనగ వచ్చును

సంఖ్య : 275 పుట : 185 రాగం: దేవగాంధారి

## దేవగాంధారి

**79 ఎంతగాలంబైనఁ దప్పదు యెవ్వరికి నేమనఁగ వచ్చును**
**దొంతికడవలలోని కొలుచులు తొలుత పుణ్యములు ॥ పల్లవి॥**

**కలిమి గలదని వుబ్బ వలవదు కడఁగి లేదని సగ్గ వలవదు**
**కలసి కలలోఁ గన్న సుఖదుఃఖముల చందములు**
**వలనుగా రాట్నంపు గుండ్రలవరుస లీ జన్మంబు లెల్లను**
**చెలఁగి దైవము మున్నె సృష్టించినది యీవిధము ॥ఎంత॥**

**నేరనని దైన్యం బదేటికి నేర్తునని గర్వం బదేటికి**
**నారుకొను వడగండ్లగుళ్ళవి నమ్మనే రాదు**
**కోరి మనసునఁ బాలు దాగినగుఱుతు లీ భోగంబు లెల్లను**
**వారివారికి నాత్మగుణములు వసుధ నిలిచినవి ॥ఎంత॥**

**పెద్దదొర నని మీఱఁ దగదు పేద నని తా దాఁగఁదగదు**
**పొద్దువొద్దును చంద్రబింబముపోల్కి వెలసినది**
**అద్దుకొని శ్రీవేంకటేశ్వరుఁ డన్నిటికిఁ దను నేలి కావఁగ**
**బుద్ధి యెఱుఁగుచు లోకపూజ్యతఁ బొసఁగుటే శుభము ॥ఎంత॥**

**అవతారిక:**

ఎవ్వనికైనాగానీ యెంతకాలమైనగానీ ఈ కర్మఫలమును అనుభవించక తప్పదుగాకతప్పదు అంటున్నారు. తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. దీనిని యేమనగలము. తొలిజన్మలలో చేసిన పుణ్యములున్నాయే అవి

దొంతిగా బెట్టిన కడవలలో, కొలిచిపెట్టబడిన పదార్ధములవలె యేకుండలో యెంత అనుభవించటానికి వుంటుందో యెవ్వరికీ తెలియని పరిస్థితి. ఏది ఎంతకాలం అనుభవిస్తామో తెలియదు. అందుకని వివేకవంతులు కలిమికి వుబ్బరు, లేమికి నిబ్బరం కోల్పోరు. అజ్ఞానినని దైన్యం పనికిరాదు. జ్ఞానినని విఱ్ఱవీగే గర్విష్టి యెంత అధోగతి పాలవుతాడో అజ్ఞానిననుకొనే రికామికూడా సంఘానికి చేటే. వడగండ్లు పడితే యెవరికైనా అపకారం జరుగవచ్చును యెందుకంటే వడగండ్లు పడటానికి ఒక పద్ధతి ఒక ప్రాతిపదిక యేమీ వుండదు కదా! ఎవ్వడు యెంతటివాడైనా శ్రీవేంకటేశ్వరుని కృపవుంటేనే బుద్ధిమంతుడై లోకపూజ్యత సంపాదిస్తాడు శుభములను పొందుతాడు. హరికృప లేకపోతే యెంతయెత్తుకెదిగినా అక్కడనుంచే అధః పాతాళానికి పడిపోతాడు.

**భావ వివరణ:**

ఎంతకాలంబైనను, జీవులకు తొల్లిటి కర్మఫలమును అనుభవించక తప్పదు. ఎవ్వరికిని (ఎవ్వరినైనా) యేమనగవచ్చును (యేమని అనగలము?) తొలుత పుణ్యంబులు (తొలి జన్మలలో చేసిన పుణ్యకార్యములు) దొంతికడవలలోని (ఒకదానిపై ఇంకొకటి దొంతరగా పేర్చిన కుండలలోని) కొలుచులు (కొలిచియుంచబడిన పదార్ధములు). దేంట్లో, యేది యెంత వున్నదో యెవ్వరికీ తెలియదు.

కలిమి గలదని వుబ్బి (పొంగిపోవుట) వలవదు (తగదు). కడగి (యెంతప్రయత్నించినా) కలిమి లేదని సగ్గవలవదు (క్షీణించియుండుట తగదు). ఈ సిరి సంపదలున్నాయే, ఇవి కలలోగాంచిన సుఖదుఃఖములవంటివి. కలలో ఐశ్వర్యమైనా క్షణికమే దుఃఖమైనా క్షణికమే. అవునా? వాటి చందముగానే (మాదిరిగానే) ఇవి





శాశ్వతమనుకోరాదు. ఈ జన్మలున్నాయే, ఇవి రాట్నంపు గుండ్రల వరుసలు (రాట్నం గుండ్రముగా తిరుగుతున్నప్పుడు ఒకసారి వున్నతమైన యెత్తుకెళ్ళిన 'కమ్మీ' ఇంకోసారి అన్నిటికంటే అడుగునకు పోతుంది.) మానవుని విజృంభణలు వెలవెలబోవుటలు - రెండూ తాత్కాలికమే. ఏది యెప్పుడు, యెలా జరుగవలెనో దైవమమున్నె (ఇదివరకే) సృష్టించి (నిశ్చయించి) ఈ విధమును నిర్దేశించినాడు.

నేరనని (నేనేమియు నెరుంగనని) దైన్యమదేటికి (దీనత్వమెందులకు?) అట్లే, అన్నియూ నేర్చితినని గర్వమెందులకు?) ఎన్నడూ వడగండ్లవాన ఆరుకొనినదని (తగ్గుమొగం పట్టిందని నమ్మి) బయటకు పోగూడదు. ఉన్నట్లుండి మళ్ళీ పడితే చచ్చామన్నమాటే. మనిషి అనుభవించే భోగాలున్నాయే... అవి మనస్సులో పాలుత్రాగినట్లు స్మృతియేమన్నా వుంటుందేమో కాని, అది సంతోషాన్నివ్వదు. ఆ అనుభవాలన్నీ ఆత్మానుభవాలు. అవే ఆత్మ గుణములులన్నట్లు భ్రమ కలిగిస్తాయి. నిజానికి ఆత్మ నిర్గుణి.

శ్రీవేంకటేశ్వరుడు దేవదేవుడు, సర్వోన్నతుడు, పురుషోత్తముడు. ఆయనముందు నేను పెద్ద దొరనని యేరాజ్యాధిపతియైనా, విఱ్ఱవీగ వచ్చునా? అట్లే నేనేమిలేని కుచేలుడనని దాగతగదు (క్రుంగిపోయి వుండుటయూ తగదు). చంద్రబింబం పౌర్ణమినాటి తన వెలుగుని ఆకారాన్ని చూసికొని అదే శాశ్వతము నేనెప్పుడూ ఇలాగేవుంటాననుకొంటే అదియెంత నిజమో నిమ్నోన్నతాలు భగవత్ప్రసాదములు, (మననిపైకితెచ్చేవాడూ ఆ శ్రీపతే. అదః పాతాళానికి తొక్కేసేవాడూ శ్రీనాథుడే.) మన ప్రారబ్ధకర్మననుసరించి అవి వస్తుంటాయి. పోతుంటాయి. జగములన్నింటికి నియామకుడు, యేలిక శ్రీవేంకటేశుడే. మనం అస్వతంత్రులము. ఇది జ్ఞప్తియందు వుంచుకొని లోకపూజ్యుడై వర్ధిల్లుటయే శుభము. లేదా ఎంత వున్నతిపొందినా ఒక రోజున "ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటే వున్నాను" అనవలసివస్తుంది.

సంపుటి: 3 కీర్తన : ఇందుకంటే మరి యికలేదు హితోపదేశము వోమనసా

సంఖ్య : 101 పుట : 68 రాగం: బౌళి

**బౌళి**

**80 ఇందుకంటే మరి యిఁకలేదు హితోపదేశము వోమనసా**
**అంది సర్వసంపన్నుఁడు దేవుఁడు ఆతనికంటే నేరుతుమా ॥పల్లవి॥**

**కల దొకఁటే ధర్మము కల్పాంతమునకు నిలిచినది**
**తలఁకక మీశరణుచొచ్చి మీదాసుఁడ ననెడి దొకమాఁట**
**వలవనిజోలే యింతాను వడి నిదిగాక యేమిసేసినను**
**సులభ మిందునే తొల్లిటివారలు చూరలుగొని రదేమోక్షంబు**
**॥ఇందు॥**

**మొదలొకటే యిన్నిటికి ముందర వెనకా వచ్చేది**
**వొదుగుచు గోవిందునిదాసులకు నొక్కమాటే మొక్కినఁజాలు**
**తుదకెక్కనివే యితరములు దొరకొని మరేమిసేసినను**
**బదికి తిరిందునే పరమవైష్ణవులు పలుచదువులలో వినరాదా**
**॥ఇందు॥**

**తగులొకటే విడువరానిది తతి నెన్నటికినిఁ జెడనిది**
**వొగి శ్రీవేంకటపతినామజపము వొకమాటే అబ్బినఁ జాలు**
**నగుబాటే యింతాను నానాఁటి కేమేమిసేసినను**
**తగునీబుద్ధుల నడచిరి మున్నిటిదైవజ్ఞులు పూర్వాచార్యులును**
**॥ఇందు॥ 101**

**అవతారిక:**

ఓ మనసా! ఇంతకంటే చక్కని హితోపదేశము ఇంకొకటుండదు. సర్వసంపదలను అనుగ్రహించగలిగిన సత్తా వున్న దేవుడెవరయ్యా అంటే





ఈ శ్రీహరియే. ఘటనాఘటన సమర్థుడు. పదునాల్గు భువనములను ఉదరములో దాచుకొనిన నారాయణునికంటే గొప్పదైవమును నేరుతుమా? అని ప్రశ్నిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఎవరెవరో ఏవేవో ధర్మాలు చెబుతున్నారు. ప్రచారం చేస్తున్నారు. వాటిని శ్రీహరియే నియమించాడని కూడా చెప్పుకొంటున్నారు. నీరు పల్లమెరుగు నిజము దేవుడెరుగు అన్నారు. నిజమేదో మాకెలా తెలుస్తుందయ్యా? కానీ నీ దాసులు అవలంభిస్తున్న శరణాగతియే అత్యుత్తమమైనదని నేనూ నమ్ముతున్నాను. పరమవైష్ణవులు శరణాగతితో సరిపోల్చదగిన మోక్షసాధనను కనిపెట్టారయ్యా! గోవిందుని దాసుల దాస్యమును స్వీకరించితే వారి ప్రవచనాలను వింటూ సంసారబంధ విముక్తుడై శ్రీవైష్ణవులు చెప్పే విష్ణు తత్త్వమునర్థం చేసికొంటే మోక్షం దానంతటదే సిద్ధించదా? వారి సాంగత్యంలో ఒక్కసారి శ్రీవేంకటపతి నామజపము యొక్క రుచి తెలిసి ఆ నామజపము అలవాటయిందంటే మోక్షం దానంతటదే సిద్ధిస్తుంది. పూర్వాచార్యులందరూ నడచినబాట అదే సుమా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ మనసా! ఇందు (త) కంటే చక్కటి హితోపదేశము, ఇకలేదు (ఇంకొకటి లేదు). అది గ్రహించి సర్వసంపన్నుడు (సమస్త సంపదలనీయగలవాడు), దేవుడు (దేవదేవుడైన శ్రీహరి) ఆతనికంటే నేరుతుమా (నేర్చినవారమా), కాదే?.

నిలిచి, కల్పాంతమువరకు మానవులకు పాటించదగిన ధర్మము ఒక్కటే కలదు. దానిని పాటించియే తీరవలెను. తలకక (భయపడకుండా) మీ శరణాగతి చొచ్చిన మీదాసుడనని త్రికరణశుద్ధిగా నమ్మియుండుటే చాలును. నీదాసుడననే ఒక్కమాట వలననిజోలె (యెన్నడూ యెండిపోని చద్దిమూట వంటిది). వడి (శీఘ్రముగా) ఇంతకంటే యేమిచేసినను

సులభముగా మోక్షము సిద్ధించదు. తొల్లిటివారు (పూర్వకాలమునాటి ఋషులు యోగులు) ఇదే చూరగొనిరి (ఈ పద్ధతినే కొల్లవెట్టి) మోక్షమును సాధించిరి.

మొదలొకటే ఇన్నిటికి (ప్రతిదానికీ ఆరంభం యెక్కడో వొకచోట వుంటుంది). మనముందర, మనవెనుక వచ్చే తోడు యెవరనుకొంటున్నారు? ఒదుగుచు (శ్రద్ధతో అణకువతో) నీవు గోవిందుని నామమే జపించెడి ఆతని దాసులకు ఒక్కమాటు మ్రొక్కితే జాలును. ఇతర మార్గములన్నియు తుదకెక్కనిలే (కడతేర్చలేనివే). దొరకొని (పూనుకొని) ఇతరములు మరేమి సేసినను పెద్ద ఉపయోగం వుండదు. పరమవైష్ణవులందరూ బతికితిరిందుననే (ఈ శ్రీహరి దాస్యమువలననే బ్రతికిరి). పలుచదువులలో (వేదములన్నింటిలోనూ) వినరాదా? (ఈవిషయాన్నే ఘోషిస్తుంటాయి కదా!)

అయ్యా తగులొకటే విడరానిది (విషయములయందు ఆసక్తి విడచిపెట్టలేనిది). తతి (నీపై ఆసక్తి మాత్రము) యెప్పటికినీ చెడనిది. ఒక్కమాటు శ్రీవేంకటేశ్వరుని నామజపమునందు అభిరుచి అబ్బిన జాలును, జన్మసార్థకమయితీరుతుంది. ఇదిగాక ఇతరోపాయములు యెన్ని చేసినా యేమి చేసినా యింతానూ నగుబాటే (ఇదంతా నవ్వులపాలయ్యే కసరత్తు మాత్రమే). నానాటికి (యెన్నాళ్ళకైనా) యేమేమిసేసినా ప్రయోజనం శూన్యమే. తగు నీ బుద్ధుల నడచిరి. మున్నిటి (పూర్వకాలమునాటి) దైవజ్ఞులు (దివ్యజ్ఞానముగలవారు). పూర్వాచార్యులు (పూర్వ కాలంనాటి ఆచార్యులందరూ) ఈ మార్గముననుసరించే ముక్తిని పొందిరి.





సంపుటి: 3 కీర్తన : నారాయణనే నస్వతంత్రుడను నాకు పనిగా దేనియును

సంఖ్య : 392 పుట : 264 రాగం: భూపాళం

**భూపాళం**

**81 నారాయణ నే నస్వతంత్రుఁడును నాకా పనిగా దేవియును**
**ధారుణిలోపలఁ బుట్టించితివి తరువాతిపనులు నీకే సెలవు.॥ పల్లవి॥**

**శ్రీపతి నీకే సమర్పితంబై శేషంబైనది యాతుమ దొల్లే**
**యేపున విషయములందులోఁ దగిలి యేమయిన నీకే సెలవు**
**చూపర బసురము తొరలు వోయినను సొమ్ముగలుగునాఁడే పరవంజుక**
**పైపైఁ దానే వెదకి తెచ్చి కాపాడఁగ నతనికి భారముగాన**
**॥నారా॥**

**యీడులేక శ్రీహరి నీవుండెడియీ దేహపునీపరికరమూఁ**
**బాడిగఁ బంచేంద్రియములు పట్టుక బడిఁదిప్పెడి నీకే సెలవు**
**వోడక యధికులు తమ దాసులు మరివొకరిపంపు లటు సేయఁగను**
**చూడరు తమబలములనే విడిపించుక తామే రక్షింతురు గాని**
**॥నారా॥**

**శ్రీవేంకటపతి నీవే నన్నిటు సృష్టించిన జీవుఁడ నింతే**
**కావిరి నజ్ఞానము నన్నిటువలెఁ గప్పిన నది నీకే సెలవు**
**ధావతిఁ దలిదండ్రులు తమబిడ్డలతనువులఁ బంకము లంటినను**
**యేవిధముల నీరార్చి పెంతు రటు ఇన్నిట నీవే గతినాకు.**
**॥నారా॥ 392**

**అవతారిక:**

మానవుడు అస్వతంత్రుడు. వాడి పురాకృత కర్మానుసారమే వాడి క్రొత్త జన్మ క్రొత్త దేహము కలుగుతున్నాయి. మానవ జన్మనెత్తిన రెండు జీవులలో ఒకడు దేహధారుధ్యంతో ఆరోగ్యంతో ఆనందంగా వుండవచ్చును.

ఇంకొకడు భూమిమీద పడ్డదాదిగా వుసూరుమని నిత్యరోగియై జీవించవచ్చును. ఎవరికేది ప్రాప్తమో యెవ్వరు చెప్పగలరు? మానవునికే విధమైన స్వాతంత్ర్యమూ ఇందులో లేదు. అయినా దీని గురించి ఆలోచించటం నాపని కాదు అంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ ధారుణిలో మమ్మల్ని పుట్టించినవాడవు నీవు. తరువాత మాచేత యేమి చేయిస్తావో నీకే సెలవు. నీఇష్టం మా ప్రాప్తం. ఈ ఆత్మకి ఈ బంధాలు పీకులాటలు తగిలించినవాడవు నీవే విషయములలో పడి నిన్ను మఱచునట్లుకూడా నీవే చేస్తావు. ఇంట్లో గొడ్డు వొకటి దారితప్పి యెక్కడికోపోతే యజమానిదానిదారిన దానిని వదలివేస్తాడా ప్రభూ! దాన్ని నాలుగు దెబ్బలు వేసి యైనా ఇంటికి తెచ్చుకోవాలికదా! స్వామీ! ఈదేహానికి పంచేంద్రియములద్వారా జ్ఞానం నీవు కల్పించావు. కాని దీన్ని వాటికి లొంగకుండా కాపాడవలసిన భారముకూడా నీదే. ఈ తిప్పలనుంచి మమ్ము కాపాడగలిగినవారు నీదాసులే. ఇతరులకా శక్తియేదీ? చివరిగా అద్భుతమైన మెలిక పెడుతున్నారు అన్నమయ్య. ఓ శ్రీవేంకటేశ్వరా! నేను అజ్ఞానినే, అసమర్ధుడినే కాదనను. తమ బిడ్డలు అసమర్ధులని తల్లీదండ్రీ వారిని వదలివేస్తారటయ్యా! ఇదెక్కడి అన్యాయం? తనబిడ్డ అశుద్ధమంటించుకొంటే తల్లి వాడిని చక్కగా కడిగి సాంబ్రాణివేసి బాగుచేయాలా లేక ఆ ముటికిలోనే అఘోరించు అని వదలివేయాలా? నీవే చెప్పవయ్యా! అన్నమయ్యకు సాటిలేరు. రారు. రాబోరు.

**భావ వివరణ:**

ఓ నారాయణుడా! నేను అస్వతంత్రుడను. ఇవేవీ నాకుగానే చేసినపనులు కానేకావు. ధారుణిలో (ఈ భూమ్మీద) నన్ను పుట్టించింది మొదలు, తరువాత నా పనులన్నీ నీకే సెలవు (నీ చిత్తము ప్రకారమే జరిగాయి). నాకు మంచి జరిగినా నీవే చేశావు చెడు జరిగినా నీవే చేశావు. నేను నిమిత్తమాత్రుడను.

ఓ శ్రీపతీ! ఈ నా ఆత్మవున్నదే... ఇది అశేషముగా (కొంచెంకూడా దాచుకోకుండా) తల్లె (ఇదివరకే) నీకే సమర్పితమైనది. ఏపున (సమృద్ధిగా)





దానికి విషయసుఖములను అంటగట్టావు. ఇక ఇదియేమవుతుందో, దీని గతేమిటో నీకే సెలవు (నీకే తెలియాలి). స్వామీ! కాస్త ఆలోచించు. ఒక పశువుల కాపరి వుంటాడనుకో. వాడి గొడ్డు ఒకటి తొరలువోయిన (దారితప్పిపోతే), అది పరవంజుక (పరాధీనమైనదిలే అని దాని యజమాని దాన్ని వదలివేస్తాడా? సొమ్ముగలుగునాడైనా విడిపించుకొంటాడు కదా! నేను కూడా దారి తప్పి బందిలిదొడ్లో పడ్డాను తండ్రీ! ఆ యజమాని పైపై దానే వెదకి తెచ్చిదాన్ని కాపాడుకోడా? అది అతని భారముగాన ఈ గొడ్డును కాపాడే భారమూ నీదేనయ్యా!

ఓ శ్రీహరీ! నీవు యీడులేక (అనాదిగా) వుండెడి దేహపు పరికరము (సాధనము). దీనిలో (ఈ దేహాన్ని) బాడిగకు (వాడుకోడానికి) తీసికొని పంచేంద్రియములు అనే దుర్మార్గులు, బడిపట్టుక (ఒడిసిపట్టుకొని) దిప్పెడిని (తమ ఇష్టంవచ్చినట్లు ఆడిస్తున్నారు). నీకే సెలవు (నీ చిత్తము మా ప్రాప్తము). ఇందులో మేము చేయగలిగింది కూడా యేమీ లేదు. నా ఒక్క మనవి ఆలకించుము స్వామీ! తమరి దాసులను అవతలవాడెవడో వుపయోగించుకొంటుంటే యజమాని చూస్తూ వూరకుండవచ్చునా? తమ బలగములను పంపి తమ దాసులని అవతల దుర్మార్గులనుంచి విడిపించుకోవాలా వద్దా? వారిని రక్షించేది పోయి అవతలి వారికి వదలివేస్తారా స్వామీ! అన్యాయం కదా!

ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ జీవుడిని సృష్టించింది నువ్వు. నిజానికి వీడుకూడా జ్యోతిస్వరూపుడే. కాకపోతే ఈ జీవుడిని కావిరి (నల్లని) అజ్ఞానము అనే పొర కప్పివేసింది. అన్నిటివలెనే (అందరిలాగానే) ఈ జీవి అజ్ఞానంతో సతమతమైపోతున్నాడు. ఇక నీకే సెలవు (ఆపై నీదయ మా ప్రాప్తం). స్వామీ! ధావతి (దిట్టతనముతో) తల్లిదండ్రులు తమ బిడ్డలు ఆడుకొంటూ బురదలో పడిపోతే, నామాట వినలేదు కాబట్టి వీడికి తగిన శాస్తి అయిందని కసితో వదలివేస్తారటయ్యా! వాళ్ళని ప్రేమగా కడిగి, తుడిచి పెంచరటయ్యా? ఇన్నిటా నీవే నాకు గతి అని యేనాడో చెప్పాను కదా!

సంపుటి: 3 కీర్తన : నీవొక్కడవే సర్వాధారము నిన్నే నెరిగిన నన్నియు నెరుగుట

సంఖ్య : 222 పుట : 149 రాగం: బౌళి

**బౌళి**

**82 నీవొక్కఁడవే సర్వాధారము నిన్నే యెరిఁగిన నన్నియు నెఱఁగుట**
**భావించి యింతయుఁ దెలియఁగవలసిన బ్రహ్మవేత్తలకు నిదిదెరువు.**
**॥ పల్లవి॥**

**నీయందె బ్రహ్మయు రుద్రుఁడు నింద్రుఁడు నీయందె దిక్పాలకులు**
**నీయందె మనువులు వసువులు రుషులు నీయందె విశ్వాఖ్యదేవతలు**
**నీయందె వురగులు యక్షరాక్షసులు నీయందె గరుఁడగంధర్వులు**
**నీయందె పితరలు సిద్ధసాధ్యులు నీయందె ద్వాదశాదిత్యులు**
**॥నీవో॥**

**నీవలననె కిన్నరకింపురుషులు నీవలననె విద్యాధరులు**
**నీవలననె యచ్చరలు చారణులు నీవలననె నక్షత్రములు**
**నీవలననె గ్రహములు చంద్రుఁడును నీవలన (నె?) నభోంతరిక్షములు**
**నీవలననె జలధులు పవమానుఁడు నీవలననె గిరులును భూమియును.**
**॥నీవో॥**

**నీలోననె నదులును నగ్నియు నీలోననె సచరాచరములును**
**నీలోననె వేదశాస్త్రము మొదలగు నిఖిలశబ్దమయము**
**నీలోననె అన్నియు నిన్నర్చించిన నిఖిలతృప్తికరము**
**శ్రీలల నాధిప శ్రీవేంకటేశ్వర శ్రీవైష్ణవులకు నిది మతము.**
**॥నీవో॥ 222**

**అవతారిక:**

బ్రహ్మవేత్త అంటే పరబ్రహ్మతత్త్వమునెరిగిన ఘనుడని అర్థం. సర్వులకు ఆధారము శ్రీహరియే. ఆయననొక్కనీ యెరిగిన అన్నియును యెరిగినట్లే





అంటున్నారు అన్నమాచార్యులవారు. ఇదంతా భావించి తెలియవలసిన బ్రహ్మవేత్తలకు నిదియే తెరువు అంటున్నారు. అంటే, బ్రహ్మవేత్తలందరి గమ్యమూ ఆ శ్రీహరియే అని అర్థం. శ్రీహరిని దెలియకుండా ఎంత శాస్త్రజ్ఞానమున్నా వ్యర్థమే. మరి ఆ పరబ్రహ్మ తత్త్వమెటువంటిది? అది అనంతం. ఆదిమద్యాంతరహితం. అది విరాట్ రూపం. ఆ విశ్వరూపంలోనే సమస్త దేవతలు, ఋషులు, మనువులు, విశ్వాఖ్యదేవతలు, యక్షరాక్షసులు, పితృదేవతలు మొదలైనవారంతా వున్నారు. ఆ మహానుభావుని వలననే కిన్నెర కింపురుషులు విద్యాధరులు అప్సరసలు, గ్రహములు, సాగరములు, వాయుదేవుడు, సూర్యచంద్రులు కూడా ఈ జగతిలో ఆవిర్భవించినవి. అగ్ని, నదులు సమస్త చరాచరములన్ని నీలోననే యున్నవి. వేదశాస్త్రము మొదలైన శబ్దమయమైన విద్య అంతయూ నీలోననే వున్నది. ఓ శ్రీసతీవల్లభా! మా శ్రీవైష్ణవులకు ఇదియే మతము తండ్రీ! అన్యమేదియు లేదు అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఈ సమస్త విశ్వమునకు, నీవొక్కడవే సర్వాధారము. నిన్నొక్కని నెరిగిన అన్నియును యెఱుగుటతో సమానము. బ్రహ్మవేత్తలయినవారి లక్షణమేమంటే, ఇంతయునూ (ఇదంతా) భావించి తెలియవలసిన జ్ఞానం వారికుంటుంది. వారికి ఈ పరబ్రహ్మమే తెరువు (గమ్యము).

ఓ విశ్వరూపా! నీయందే బ్రహ్మదేవుడు, రుద్రుడు, ఇంద్రుడు కూడా వున్నారు నీయందే అష్టదిక్పాలకులూ వున్నారు. నీయందే మనువులు, వసువులు, సమస్త ఋషులూ వున్నారు. నీయందే సమస్త వురగ జాతులు (సర్పములు మొదలైన జాతులు అన్నియునూ వున్నవి. యక్షరాక్షసులు కూడా నీయందే వున్నారు. పక్షిజాతికి చెందిన గరుడులు, గంధర్వులూ, విశ్వాఖ్య దేవతలు నీయందేవున్నారు. సమస్త పితరులు (పితృదేవతలూ)

సిద్ధులు సాధ్యులూ నీయందేవున్నారు. ఓ విరాట్ రూపా! ద్వాదశాదిత్యులు (పన్నెండుమంది ఆదిత్యులు) నీయందేవున్నారు.

ఓ అనంతా! కిన్నెరలు కింపురుషులు అనే దేవ గణములు (నరశరీరము, అశ్వపుతలలతో గానవిద్యయందు ఈ దేవగణములు నిష్ణాతులు. వీరికి కుబేరుడు యేలిక) సదా నీకు ఉల్లాసమును కలిగింతురు. విద్యాధరులనే గంధర్వులు చదువులలో దిట్టలు, పండితులు. వీరు అనేక స్తోత్రములను ఆశువుగా చెప్పుచుందురు. దేవనర్తకీమణులైన అప్సరసలు నీవలననే జన్మించిరి. చారణులు అనే దేవగణముల కర్తవ్యము ఆకాశమున సంచరించుచు వార్తా సేకరణము, వార్తావ్యాపనము. వీరు నిరంతరము ఆ దేవసమాచారమును విస్తరింపజేతురు. దేవా! ఇంకా చెప్పేందుకేమున్నది? ఓ సర్వేశ్వరా! చంద్రుడు, గ్రహములు, నక్షత్రములు అనంతాకాశంలో అనంతకాలము నుండి ఒక నియమానుసారముగా నిర్ణీత కక్ష్యలలో సంచరించుచున్నవంటే నీవలన కాదా? సాగరములన్నియు చెలియలికట్టకు కట్టుబడివున్నది నీవలన కాదా! పవమానుడు (వాయుదేవుడు) నీ ఆజ్ఞానువర్తియే కదా! కులపర్వతములను ఒక గాడిన పెట్టినవాడవు నీవు. ఈ భూభ్రమణ నియంత నీవు కాక వేరొకరున్నారు?

ఓ విరాడ్రూపా! అగ్ని, నదీనదములు, సమస్త చరాచరములు (చలనము గలిగినవి చలనము లేనివి) నీలోనే వున్నవి. సమస్త వేదశాస్త్రములు నీనుండే ఆవిర్భవించాయి. నిఖిల శబ్దము (ఓంకారము) నీనుండియే పుట్టినది. ఈ విధముగా అన్నీ నీలోనుంచి ఆవిర్భవించినవి కనుక నిన్నర్చించిన నిఖిలమంతయు తృప్తిచెందును అనుట వాస్తవమగును కదా! అందుకనే ఓ శ్రీరమణీవల్లభా! శ్రీవేంకటేశ్వరా! మేము శ్రీవైష్ణవులము. మాకు సర్వం విష్ణుమయమే. ఇదే మా మతము.





సంపుటి: 3 కీర్తన : ఎక్కడిదివివేక మెంతవారికిని
యిన్నియు నీమాయదోయక లేదు
సంఖ్య : 326 పుట : 220 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

**83** ఎక్కడిదివివేక మెంతవారికిని యిన్నియు నీమాయఁ దోయక లేదు
పక్కన అజ్ఞానపుజీవులయీపాప మిట్లనే వుండఁగను. ॥పల్లవి॥

విచ్చనవిడి నటు కౌరవులెదుటను విశ్వరూపు చూపినయపుడు
యిచ్చల నిను నమ్మఁగలేకేకా యింద్రజాలమనిరి
తచ్చన నిప్పటి నాస్తికజనులును తగునీసాకారము చూచి
నిచ్చలుఁ గల్లని నిరాకారము నిజమని తర్కించక మానుదురా
॥ఎక్క॥

గరుడవాహనము శంఖచక్రములు కనియుండియు ద్వాపరజనులు
ధరలో నినుహరిఁమూర్తిని తెలియక తమయాదవుఁ డొకఁడితఁడనిరి
సరుస దేవతాంతరములఁ గొలిచేటిచంచలచిత్తులు ఇఁక నిన్నే
పరదైవంబననేరరు సరిగా బ్రహ్మాదులలో నొకఁడవందురు.
॥ఎక్క॥

యెఱిఁగినదాసులు యెఱుఁగుదురు నీ వెక్కుడనుచు యేకాలమును
యెఱఁగనిపామరు లెఱఁగరు నిను మతి నెంతైనా నాఁడు నేఁడును
తఱితో శ్రీవేంకటేశ్వర నినుఁగని తగుశరణాగతులున్నట్లు
మఱుఁగున నుండిన ప్రాకృతులకు నీమహిమలు గానఁగఁదరమవునా
॥ఎక్క॥ 326

**అవతారిక:**

ఓ దేవదేవా! యెంతవారికైనా వివేకమెక్కడుంటుంది. నీమాయను తోయగ నసాధ్యము. అజ్ఞానం యెవరి పక్కన విడువకనుంటుందో ఆ జీవులు పాపముచేస్తూనే వుంటారు. వారి జీవనం ఇట్లానే వుంటుంది. అంటున్నారు అన్నమాచార్యులవారు. పురాకృతకర్మ యెలావుంటుందంటే అది దిక్కుతోచనివ్వదు. ఉదాహరణకు కౌరవులనే తీసికోండి. శ్రీకృష్ణుని మహిమను వారు నమ్మక ఇంద్రజాలం చేస్తున్నాడన్నారు. గొల్లవాడేమిటి విశ్వరూపమేమిటి? అని ఆక్షేపించారు. గరుత్మంతుని, శంఖ చక్రాలను, నరకాసురుని వధ నాడు ద్వారకావాసులను చూసిగూడ వీడు కృష్ణుడు కాడు విష్ణుడు అని గ్రహించలేకపోయారే! యాదవులంతా యెవరెవర్నో ఇంద్రుడిలాంటివారిని పూజించారు కానీ ఈ శ్రీహరి మాదిక్కని స్వామిని మోక్షం కోరలేదే? శ్రీహరి శరణాగతి బొందిన దాసులకు మాత్రమే ఆ జ్ఞానం వుంటుంది. మిగతా వారందరికీ అజ్ఞానం వుంటుంది. అంతే తేడా ఆయనను శరణననివారు యేనాటికీ ప్రాకృతులుగానే వుండిపోతారు. వాళ్ళకి సమస్తమూ ప్రకృతి ద్వారా పుడుతుంది. కలియుగలంలో రోజులు గడుస్తున్నకొలదీ అటువంటి తార్కికులెక్కువవుతారు.

**భావ వివరణ:**

ఓ శ్రీహరీ! ఇన్నియు (సృష్టిలో జరుగుచున్న విపరీతములన్నియు) నీ మాయవలననే ఆవిర్భవించినవి. కాని ఒక్కరికి కూడా తగిన సమయానికి ఆ విషయం తోచదు. ఎంతవారికైనా, ఆ వివేకమంతా యేమైపోతుందో తెలియదు. వారి పక్కనే అజ్ఞానులైన జీవులు అష్టకష్టాలూ అనుభవిస్తూ దేవుణ్ణి తిట్టుకొంటారే కాని యీ పాపం ఇట్లా వుండటానికి నా ప్రారబ్ధం కారణమనుకోడు.

ప్రభూ! ఆనాడు కురు సభలో విచ్చనవిడినట్లు (సర్వస్వతంత్రుడవై) నీవు నీ అనంత విశ్వరూపమును ప్రదర్శిస్తే దుర్యోధనాదులు నీవు ఇంద్రజాలం





ప్రదర్శిస్తున్నావనుకొన్నారు. ఒక్కడన్నా ఈతడే శ్రీహరి అని నమ్మాడా? మరి ఇప్పటి నాస్తికులు హేతువాదులు యేమి చేస్తున్నారు? అసలు భగవంతుడికి రూపం వుంటుందా? వున్నా ఆయన నీ మొక్కుబళ్ళకు మొహం వాచి వుంటాడా? అన్యమతస్థులు కూడా వైకుంఠం పోతారా అని తర్కించి నవ్వుకొంటారు. ప్రభూ! నీదయ లేకపోతే నీవిచ్చిన మానవ జన్మ అంతా అలా అడవిగాచిన వెన్నెల వలె వ్యర్థమైపోతుంది.

ఆనాడు నీవు శ్రీకృష్ణుడివై విశ్వకర్మచేత సముద్రమధ్యంలో ద్వారకా నగరాన్ని నిర్మింపజేస్తే నీ యాదవులంతా యెగిరి గంతులు వేశారే కాని ఈ గరుత్మంతుడేమిటీ, గదశంఖచక్రాలేమిటీ, నరకాసురుడంతటి రాక్షసుణ్ణి చంపటమేమిటి? ఈయన విష్ణువే అని ఒక్కడన్నా నిన్ను మోక్షం కావాలని అడిగాడా! ఇకపోతే మరి కొంతమంది దేవతాంతరములులు (ఒక దేవుడు గొప్ప, ఒకరు అంత గొప్పకాదు అని) పాటిస్తుంటారు. నీవే పరదైవము (పరమాత్మ)వని వారెన్నటికీ గుర్తించలేరు. సరిగా (సరి కదా!) ఆఁ యేముందీ ఈయన జగతిని రక్షణ బాధ్యత చేపట్టిన త్రిమూర్తులలో ఒకడు అంటారు. వారికి నీవు ముక్తినెలా ఇస్తావు తండ్రీ! ఇవ్వలేవు.

నీకు శరణుజొచ్చిన నీదాసులు యేకాలముననైనా నీవేదిక్కని చివరికి నీ సాయిజ్యం పొందుతున్నారు. వారు నీ భగవత్తత్త్వమును యెరిగినవారు. ఇక నీ తత్త్వమునెరుగని పామరులు యేనాటికీ నీ మహిమను గుర్తించలేరు. నాడును (ఆ ద్వాపరయుగంలోనూ) నేడునూ ఈ కలియుగంలోను వారు నీ తత్త్వము నెరుగనేలేదు. ఓ శ్రీవేంకటేశ్వరా! తతితో (నీకోసం మథనపడ్డవారికే) నీ శరణాగతి లభిస్తుంది. వారంతా నీ మరుగున వుండటానికి నిన్ను ఆశ్రయించి ముక్తిని పొందుతారు. కాని ప్రాకృతులు (పామరులు) వున్నారే.... వారు తిర్కిస్తూనే తనువు చాలిస్తారు. వారికి నీ మహిమ గానగ తరమా (గ్రహింపసాధ్యమా?) కానేకాదు.

సంపుటి: 2 కీర్తన : నీకెటు వలసె నటుసేఇ నీచిత్తము నా భాగ్యము
సంఖ్య : 373 పుట : 251 రాగం: మలహరి

**మలహరి**

**84** **నీకెటు వలసె నటుసేఇ నీ చిత్తము నా భాగ్యము**
**యేకడనైనా లక్ష్మీకాంతుఁడ ఇదియే పో నావిన్నపము ॥ పల్లవి॥**

**నాగుణములే యెంచితినా నరకకూపములు చాలవు**
**ఆగతినే నాకర్మములూ అనుభవించి తీర్చేనంటే**
**నీగుణములే యెంచితివా నిఖిలసంపదలు చాలవు**
**యీగి నను఼ గరుణించి యెపుడు నీవిచ్చేనంటేను. ॥నీకె॥**

**నా పాపములే లెక్కించితినా నదులయిసుకలును జాలవు**
**యేపున నెంతైనాఁ గలదు అది యెన్నఁడు దీరును దేవా**
**చేపట్టి నీవు రక్షించినయాజీవుల నెంచితివా తొల్లి**
**చూపట్టెడియాయాకసంబుపై చుక్కలకంటే ఘనము ॥నీకె॥**

**మతి నాసుద్దులు యెంచఁగ నెంచఁగ మంచముకిందే నూయి**
**గుతి నీకథలివి వినబోతే నివే కొండలుఁ గోటానఁగోట్లు**
**నెఱవుగ శ్రీవేంకటేశ్వర నీకే నే శరణాగతి చొచ్చితిని**
**తతి దరిచేర్పఁగఁ గూడువెట్టఁగా దైవమ నీకే భారము.॥నీకె॥ 373**

**అవతారిక:**

"అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అనే భావనకు వచ్చేసిన అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో నీకెట్లా తోస్తే అట్లా చెయ్యవయ్యా! నీదయ మా ప్రాప్తం అంటున్నారు. ఓ లక్ష్మీవల్లభా! యెట్లాగైనా ఇక నా విన్నపమంటూ వుంటే ఇదేనయ్యా! ఇంకా నన్నేం చెప్పమంటావు? నా గుణములనెంచటానికి యేమీ లేదు. నా కర్మలు చూద్దామంటే యెన్ని నరకాలనుభవించినా నే చేసిన పాపములు చాలవు.





ఇక నీ గుణాలను చూద్దామంటే సకల సద్గుణాభిరాముడవు నీవు. ఏ సంపదనైనా ఈయగలవు నీవు నన్ను కూడా కాస్త కరుణించవయ్యా అంటున్నారు. ఇక నేనెన్ని పాపాలు చేశానో లెక్కించడం యెవరివల్ల నవుతుంది? మనదేశంలోని నదులలోవున్న ఇసుకలో యెన్ని ఇసుకరేణువులున్నాయో అన్ని పాపాలైనా చేసి వుంటాను. లేకపోతే నాకు ఇన్ని కన్నీళ్ళెందుకు విధిస్తావు? అంతా నా తప్పే ప్రభూ! నీవు జగద్రక్షకుడవు ఆకాశంలో యెన్ని నక్షత్రాలున్నాయో అంతమంది జీవులనన్నా నీవు రక్షించివుంటావు కదా! మరి నన్నెందుకు వదిలేశావు? తండ్రీ! నేనేం పాపం చేసినా నన్ను రక్షించాల్సింది నీవే కదా! నా కథలు విప్పి చెప్పాలంటే మంచము నూతిపై వేసికొని పడుకున్న పిచ్చివాడి కథలా వుంటుంది. ఆ పిచ్చోడు యెప్పుడు భావిలోపడతాడో యెవరు చెప్పగలరు? ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంకా మాటలెందుకయ్యా! శరణు మహానుభావా! శరణు. నన్ను దగ్గరకు తీసుకొంటావో తిండికూడా పెడతావో పెట్టవో నీ ఇష్టం ప్రభూ! నీదయ నా భాగ్యం. నా భారం నీదే తండ్రీ!

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీకెటువలసె నటు సెఇ (నీకెట్లా కావాలంటే అట్లా యేయవయ్యా! నీ చిత్తము నా భాగ్యము (నీ ఇష్టము నా ప్రాప్తము.) ఓ లక్ష్మీవల్లభా! యేవిధంగానైనా నీ ఇష్టమేనయ్యా! కానీ నా విన్నపము మాత్రం ఇదే. నన్ను కాస్త దయా దృష్టితో చూడు.

ప్రభూ! పోనీ నా గుణములనెంచి చూద్దామంటే నన్ను వుంచడానికి రౌరవాది నరకకూపాలెన్నివున్నా నన్ను శిక్షించుటకు చాలవు. ఆ గతినే (అదే విధంగా) నా కర్మలన్నీ అనుభవించి కర్మ విముక్తుడనవ్వాలంటే ఎన్ని నరకయాతనలు అనుభవించి తీరుద్దామన్నా నేను చేసిన కర్మలను సరితూచలేము. సరే! ఇక నీ గుణములనెంచుదామంటే నీవు సకల సద్గుణాభిరాముడవు. సృష్టిలోని సంపదనంతటినీ ఇచ్చినా నీ అంత

సంపద సరితూగదు. నన్ను కరుణించి యెప్పుడు నీవు నీ కృప ఇచ్చావంటే మాత్రమే నేను బ్రతుకుతాను. లేదా నాగతి అధోగతే.

ఓ దేవా! పోనీ నేను చేసిన పాపాలేమన్నా తక్కువగా వున్నాయిలే అని తృప్తిపడదామా అంటే అబ్బో! యేమి చెప్పమంటావు స్వామీ! ఈ ప్రపంచంలో వున్న నదుల ఒడ్డులలో యెంత ఇసుక వున్నదో, దాంట్లో యెన్ని ఇసుక రేణువులున్నాయో యెవరన్నా చెప్పగలరా? వాటిని లెక్కించ సాధ్యమా? నా పాపాలు కూడా అంతే స్వామీ! నేను అన్ని పాపాలు చేసి వుంటాను ప్రభూ! ఏపున యెంతైనా గలదు. దేవా (చక్కగా చెప్పాలంటే యెంతైనా వున్నది స్వామీ!) ఓ ప్రభూ! నీవు చేపట్టి (నిర్వహించి) రక్షించిన ప్రాణులెన్నో చెప్పాలంటే యెవ్వరివల్ల నవుతుంది? తొల్లి చూపట్టెడి (అనాదిగా కనిపిస్తున్న) ఈ ఆకాశంలో యెన్ని చుక్కలున్నాయో యెవరు చెప్పగలరు? కానీ ఆ చుక్కల (నక్షత్రాల) కంటే ఘనము (యెక్కువ) నీవు అనుక్షణం రక్షించే ఈ ప్రాణుల సంఖ్య.

దేవా! మఱి నా సుద్దులు (పాతకథలను) చెప్పాలంటే, నాకే చిన్నతనంగా వుంటుంది. ఎవరన్నా పరుండిన మంచముక్రింద నుయ్యి (బావి) వుందనుకోండి, వారెంత భయం భయంగా పడుకొంటారు. నా సంగతీ అంతే. అనుక్షణం చావు భయంతోనే బ్రతికాను. నాగుఱి (ధ్యాస) నీపై మరల్చి నీ కథలను విందామంటే అవి కొండలవలె కోటానుకోట్లు వున్నాయి. అందుకనే ఓ శ్రీవేంకటేశ్వరా! నేను నిన్ను నెఱవుగా (అధికుడవని) శరణాగతి చొచ్చితిని (శరణార్థినయ్యాను). దైవమ ( ఓ దేవా!) నీకే భారము (అంతా నీదే భారమయ్యా!) తఱి (సరైన సమయానికి) దరిజేర్పగ (నన్ను ఒడ్డుకు చేర్చే) భారం నీదే. నాకు "కూడువెట్టగ" (తిండిపెట్టే) బాధ్యత కూడా నీదే తండ్రీ! లేకపోతే నాగతేమిటి ప్రభూ!





సంపుటి: 3 కీర్తన : కమ్మరను జీవునికిని ఇది కారణమేమియు లేదట
సంఖ్య : 257 పుట : 174 రాగం: బౌళి

**బౌళి**

**85** కమ్మరను జీవునికిని ఇది కారణ మేమియు లేదట
ఇమ్ముల రాజూ నెరఁగని వెట్టెట యెవ్వరికెక్కును నారాయణా.

॥పల్లవి॥

యిలలో జీవునివిషయభోగమున నెందునుఁ బొరయనివాఁడవట
చలమా యేల పుట్టించితివీ సంసారవారధిని
కలకాలము నీగర్భగోళమునఁ గాఁపురముండఁగ నిటు చేసి
ఫల మేమిగట్టుకొంటివి భావము దెలుపవే నారాయణా.

॥కమ్మ॥

నడపెడి యాజగము లన్నియు నటనలు నీవట తొలుతనే
యెడయక యిందే వినోదించెదవు యెడ్డతనంబా నీ కేమి
జడియక నీవే సేసినచేఁతలు సర్వమును నిలుపఁగవలదా
కడుగఁగనేఁటికి నెంగిలిబూరెట కడవేయనేల(?) నారాయణా.

॥కమ్మ॥

పరగినయీకర్మమార్గములు బంధహేతువని చెప్పితివి
యిరవుగను వేదమార్గములు నేలా కాచుక తిరిగెదవు
గరిమల శ్రీవేంకటేశ్వర యిచ్చాకల్పితములు యిన్నియు నీకు
సరినెరిగించితి విఁకనీచిత్తము సర్వేశ్వర వోనారాయణా.

॥కమ్మ॥ **257**

**అవతారిక:**

ఈ కీర్తనలో పల్లవిని సమన్వయపరచటం కొంచెం కష్టమే. కమ్మరను అనే పదానికి మరల అని అర్థం వున్నది. జీవుడు మరల మరల పుట్టుటకు ఇది కారణము కానే కాదట. రాజు యెవడవుతున్నాడు వెట్టివాడు యెవడవుతున్నాడు తెలిసేదెవరికి? ఓ నారాయణుడా! ఈ విషయం యెవ్వరికర్థమవుతుంది? నీకొక్కడికే ఈ చిక్కుముడి విడుతుంది. ఎందుకంటే యేజీవుడు యెప్పుడు, యెవ్వరికి జన్మిస్తాడు అనేదానిమీద ఒక నిర్ణీత నిర్దిష్ట సూత్రములేవీ వుండవు. మేమందరం జీవాత్మల రూపంలో నీ గర్భగోళములో హాయిగా వున్నాం. అట్లాంటి మమ్మల్ని హాయిగా నీ బొజ్జ లేనేవుండనీయక అనవసరంగా మమ్మల్ని పుట్టించడం దేనికి? అన్ని బాధలు పెట్టడం దేనికి? పోనీ నీవు నడుపుతున్న ఈ జగములు నిత్యములు, సత్యములు అనుకొందామా అంటే యెంతమాత్రం కాదు. ఎవడన్నా యెంగిలి బూరెలు కడుక్కుని తింటాడా నారాయణా! కర్మమార్గమెప్పుడూ బంధహేతువే. ఆ బంధాలు చచ్చేదాక వదలవు. అందుకనే జ్ఞానమార్గమే మోక్షహేతువు. జ్ఞానం నీదయ లేక రాదు. సర్వేశ్వరుడవైన శ్రీవేంకటేశ్వరా! ఈ సృష్టి అంతా నీ ఇచ్ఛాకల్పితము. నీ చిత్తము మా ప్రాప్తము అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓ నారాయణుడా! ఈ నేను చెప్పబోయే 'తత్త్వము' యెవ్వరికెక్కును (యెవడికర్థమవుతుందీ?) మన శాస్త్రమేమి చెబుతున్నది? కమ్మరను (మరల) జీవునికిని, ఇది (వాడి పుట్టుక) కారణము (వాడి జీవన విధానానికి నిదర్శనము కానే కాదట.) రాజుగా పుట్టినా వెట్టివాడు (బానిస) గా పుట్టినా వాడిజీవితం అలాగే వుంటుందని చెప్పలేము.

ఓ నారాయణా! ఆత్మరూపియైన జీవునికి, ఇలలో (ఈ లోకంలో) విషయ భోగాలమీద (వైవాహిక సుఖములపై) ఆసక్తియే వుండదట. మరి పెద్దవుతున్న కొలదీ చలము (మత్సరము) పెరిగి వాడికి ఈ సంసార





సాగరాన్ని అంటగడుతున్నావు. వాడు (ఆ జీవాత్మ) కలకాలము నీ గర్భగోళంలో ప్రశాంతంగా కాపురముండనివ్వవచ్చును కదా! ఇటుసేసి ఫలమేమి గట్టుకొంటివి? (ఇట్లా పుట్టించి, వాడి కనేక భ్రమలు కల్పించి, భ్రష్టుణ్ణి చేసి నీవేమి లాభం పొందావు?) అసలు నీ భావము యేమిటో చెప్పవయ్యా!

ఈ చతుర్దశ భువనాలూ నీవు నడుపుతున్నవే. ఇవన్నీ నీవు ఆడించినట్టే ఆడుతున్నాయి. ఇందులో అణుమాత్రం సందేహం లేదు. నీవు అక్కడ కూర్చొని తొలుతనె (మొదటినుంచీ) వినోదించెదవు (ఈ జగన్నాటకమును చూస్తూ హాయిగా ఆనందపడుతున్నావు). నీకేమీ యెడ్డెతనంబు ప్రభూ! (నీకీ మొండితనం, మంకుపట్టు యెందుకు తండ్రీ!) నీవు జడియవలసిన (భయపడనక్కర) లేదు కదా! నీవు చేసిన పొరబాట్లను నీవు సరిచేసుకోవచ్చు కదా! నిన్ను కాదనేవాడెవడు? సర్వమునూ నిలిపివేసి సవరిస్తే కాదనేదెవడు? ఓ నారాయణుడా! ఎవడన్నా యెంగిలి బూరెలు కడుక్కుని తింటాడా? ఎవడి కర్మో నాకు అంటడమేమిటి? వాడితోపాటు నేను బాధలు పడటం యేమిటి?

స్వామీ! పోనీ ఇదంతా, నిజం కాదు అనుకొందామా అంటే భగవద్గీతలో నీవే చెప్పావు. కర్మమార్గము కూడా మోక్షసాధనమే అయినప్పటికీ అది బంధహేతువు (అనేక బంధములను కల్పించి వాటితో కట్టుబడిపోయేట్లు చేస్తుంది). అటువంటివన్నీ ఆపి జ్ఞానమార్గమే స్థిరపడునట్లు చేసి ఈ జీవికి మరల జన్మలేకుండా చేయవచ్చును కదా! వేదమార్గాన్ని కాచుకొని తిరిగినవాడివి దాన్నే నిలపవచ్చును కదా! గరిమల (మహిమాన్వితుడవైన) ఓ శ్రీవేంకటేశ్వరా! ఇవన్నీ నీ ఇచ్ఛాకల్పితములు (నీవు కావాలనే కల్పించినవి). నీవు సర్వేశ్వరుడవైన నారాయణుడవు. నేటికి నాకు సరి నెరిగించితివి. ఇక నీ చిత్తము మా ప్రాప్తము.

సంపుటి: 3 కీర్తన : ఇతని మరచితిమి యెదుటనే యుండగా
సంఖ్య : 306 పుట : 207 రాగం: గుజ్జరి

## గుజ్జరి

**86 ఇతని మఱచితిమి యెదుటనే యుండఁగ యిన్నాళ్లును నే మెరఁగక**
**ప్రతిలే దితనికి జీవకోట్లకుఁ బ్రాణబంధుఁ డితఁడు ॥పల్లవి॥**

**ముందు నేను ఘనగర్భనరకమున మునిఁగియున్ననాఁడు**
**బొందితోడనే సుఖదుఃఖంబులఁ బొరయు తోడునీడితఁడు**
**అంది స్వర్గనరకాదులు చొచ్చిన అక్కడఁ దావెనువెంటనే**
**చందపునాయాతుమలోఁ బాయనిసర్వాత్మకుఁ డితడే. ॥ఇత॥**

**ఆనిపట్టి నేఁ బాపపుణ్యములు అనుభవించవలెనన్నపుడు**
**మానుపనొల్లఁడు తాఁ బెరరేఁచును మతి కనుకూలం బితఁడు**
**నానావిధులనుఁ బొరలి యలపుతో నలి నే నిద్రించేటప్పుడు**
**తాను ఆ పరిణామంబులకు తగులైవుండును యీతఁడు ॥ఇత॥**

**తలచిన దగ్గరుఁ దడవక యుండిన దవ్వయివుండు నితఁడు**
**కలిసి మెలసి ఇహపరము లొసంగఁగఁ గాచుకవుండును యీతఁడు**
**మెలఁగుచు సాకారముతో నున్నాఁడు మేటిశ్రీవేంకటపతి యితఁడు**
**వలసిన వావులరూపులు దాల్చినవాఁ డొకఁడేపో యీతఁడు.**
**॥ఇత॥306**

**అవతారిక:**

జీవుడు జన్మించాలంటే తల్లిగర్భవాసము తప్పదు. అది ఒక నరక కూపము. ఎంతటివారికైనా ఆ గర్భనకరంలో నవమాసములుండక తప్పదు. అప్పుడు వాడికి ఆ యాతనలో తోడు నీడా యెవరు? ఆ శిశువు





జన్మించాక వాడికి జీవితాంతమూ సుఖ దుఃఖాలలో తోడు నీడా యెవరు ఆ పరంధాముడే. వాడు చచ్చాక స్వర్గమొచ్చినా నరకమొచ్చినా వాడి ఆత్మకు తోడు శ్రీహరే. ఈ విధంగా సాగే ఈ అద్భుతమైన కీర్తనలో అన్నమాచార్యులవారు జీవకోట్లన్నిటికీ ప్రాణ బంధువైన ఇతనికి ప్రతి లేదు అంటున్నారు. మరి అటువంటి ఈ మహానుభావుని మఱచిపోతే మనము క్షమార్హులము కానేకాదు. మనం పాపపుణ్యాలను అనుభవిస్తున్నప్పుడు కూడా మనకు సద్భావనలు కలుగునట్లు ప్రేరేపించే రక్షకుడితడే నంటున్నారు. తనను తలచిన వారికి దగ్గరవాడు తలవని వారికి దవ్వులవాడు అంటున్నారు. "వలసిన వావుల రూపులు దాల్చిన వాడొకడేపో యీతడు" అంటున్నారు. అంటే యేమిటో కాస్త ఆలోచించండి. బుర్రకు పదునుపెట్టండి. శ్రీవేంకటేశ్వరుని తలుచుకోండి. అంత శ్రమ వద్దనుకొంటే... భావవివరణ చదవండి.

**భావ వివరణ:**

ఇన్నాళ్ళునూ యెదుటనే యుండగా, యేమీ యెరుగక ఇతనిని మఱచితిమి. కానీ ఇతనికి ప్రతిలేదని (సాటివారెవరూ లేరని) ఇతడు సృష్టిలోని జీవకోట్లకు ప్రాణబంధువని అర్థమయింది.

ముందు (అలనాడు) నేను ఆనాటి నాతల్లి గర్భకుహరము అనే నరకంలో ఆ వుమ్మనీటిలో మునిగి తేలుతూ తొమ్మిది నెలలు ఓదేవదేవా నన్ను రక్షించు. ఈ గర్భ నరకం నుంచి నాకు విముక్తి కలిగించు. ఈ జన్మలో అసలు యెన్నటికీ తప్పులు చేయను అని మౌనంగా రోదిస్తుంటే, బుజ్జగించి నా బొందితోనే ఆత్మరూపివై తోడుండి నా సుఖదుఃఖాలను పంచుకొని, పొరయు (వర్ధిల్లెడి) తోడునీడ ఈ ప్రభువే. అంతకుముందు నేను స్వర్గంలో వున్నానో నరకంలో వున్నానో నాకు తెలియదు కాని అక్కడ కూడా నేను చొచ్చినప్పుడు (ప్రవేశించినపుడు) తాన్ వెనువెంటనే వుండి నా ఆత్మ చందమున (నా ఆత్మారామునివలె) ఒక్కక్షణమైనా నన్ను బాయని

(విడువని) సర్వాత్మకుడు (సర్వులలో ఆత్మరూపియైన పరంజ్యోతి) ఈతడే. ఇతనిని మఱువతగునా?

ఆనిపట్టి (ధరించి) నేను తొల్లింటజేసిన పాపపుణ్యములను అనుభవించక తప్పదు అన్నప్పుడు తాను మానుపనొల్లడు (వాటిని మాన్పించి తప్పించడు). కాని నాకు ధైర్యస్థైర్యములనిచ్చి, యెంతటివారికైనా చేసిన కర్మ అనుభవించక తప్పదు నాన్నా! అని ఓదార్చి నా మతిని దానికి అనుకూలము చేస్తాడితడు. అంతెందుకు, నాదైనందిక జీవితంలో కూడా ఏరోజుకారోజు నేను అనేక విధములుగా నిద్రిస్తుంటే తాను కూడా ఆ 'సుషుప్తిని' అనుభవించి నిద్రలో యేవేవో లోకాలలో విహరిస్తున్న నా ఆత్మను నాకు మెలకువ రాగానే తిరిగి దాన్ని నా బొందిలో ప్రవేశపెట్టేవాడెవరున్నారు ఈతడే సుమా! అటా నాకు తగులైవుండెడితోడు ఈ దేవదేవుడే.

అదటుంచి ఈ స్వామిది ఒక వింత విధానము. తనను తలచిన దగ్గరుండును. తనను తలవకయుండిన దవ్వననేవుండును (దూరంగానే వుంటాడు). మనకు ఇహలోకమున ఈప్సితములు పరలోకమున మోక్షము ఇవ్వవలసి వచ్చినప్పుడు తదనుగుణంగా నిష్పక్షపాతముగా ఇహపరముల నొసంగువాడు ఈతడే. మాబోటి సామాన్యులు ఈ పరాత్పరుని నిరాకార రూపం దర్శించలేరని తిరుమలశిఖరాలపై సాకారముతో మెలగుచునున్న ఈ మేటి వేరెవ్వరో కాదు మన శ్రీవేంకటేశ్వరుడే. ఇతడు "వలసిన వావులరూపులు దాల్చిన వాడు" (మనము కోరుకున్న చుట్టరికంతో ఆవిర్భవించి ఆ రూపములో ఆ జన్మయందు అందరినీ అలరిస్తాడు.) అటువంటివాడే... పో... ఈ దేవదేవుడు.





సంపుటి: 3 కీర్తన: వెట్టిమానుపరెవ్వరు వేదురు నాయంత విడువను

సంఖ్య : 75 పుట : 49 రాగం: గుజ్జరి

**గుజ్జరి**

**87 వెట్టి మానుప రెవ్వరు వేఁదురు నాయంత విడువదు (ను?)**
**ముట్టఁబాలలోఁ బుట్టిన ముంచిన వెట్టెయ్యా. ॥పల్లవి॥**

**జగములు రక్షించఁ బాల్పడి సర్వేశ్వరుఁడే వుండఁగ**
**అగణితుఁ డాతనిశక్తి యల్పముగాఁ దెలిసి**
**జిగి నాసంసారరక్షణ సేసెదనంచునుఁ దిరిగెద**
**నగుఁబాట్ల యల్పుఁడ నే నావెట్టిదేయయ్యా.**

**॥వెట్టి॥**

**అంతర్యామై దేవుఁడు అటు సుఖదుఃఖము లొసఁగఁగ**
**అంతయు మనుజులు సేసేరని నేఁ దిరిగితిని**
**బంతినే నావంటిజీవులబడిఁ దిరిగాడుచుఁ గర్మపు-**
**దొంతులఁ జిక్కిననా వెట్టితోడనే యిదేయయ్యా.**

**॥వెట్టి॥**

**శ్రీవేంకటపతి యెదుటనే చేకొని వరము లొసఁగఁగ**
**దావతిపడి యితరుల నేఁ దగులుచు నడిగితిని**
**యీవేళనే నాగురుఁడును యీ దైవము నిటు చూఁపగ**
**తో వెరిఁగిటు నే బతికితి తొల్లెల్ల వెట్టినయ్యా.**

**॥వెట్టి॥72**

**అవతారిక:**

పుట్టిన ప్రతిమనిషికి వేపకాయంత వెఱ్ఱి వుంటుందట, పెద్దల చలోక్తి ఇది. ఇందులో నిజం యెంతుందో తెలియదు కాని మామూలు పరిస్థితుల్లో జ్ఞానులవలె ప్రవర్తించే వారంతా ఒత్తిడికి గురి అయినప్పుడు వింతగా వెఱ్ఱివారివలె ప్రవర్తిస్తుంటారు. నేనూ అంతే. వేదురును (పిచ్చివానివలెనే ప్రవర్తిస్తుంటాను). నా వెఱ్ఱిని మాన్పేవాడూ లేడు, పోనీ నేను నాయంతట నేను మానుకుంటానా అంటే అది జరిగే పనికాదు అని తేలిపోయింది. ఈ వెఱ్ఱి యెటువంటిదో తెలుసా? ముఱ్ఱుబాలలో బుట్టినది. అంటే భూమ్మీదపడగానే నాతల్లి తాపిన మొట్టమొదటి స్తన్యంతోనే ముంచినవెఱ్ఱి ఓ అయ్యా ఇది నేను చచ్చినా నన్ను వదలదు. సరే మనమంతా వెఱ్ఱి వాళ్ళమే అనుకొందాం మరి ఈ వెఱ్ఱి మాన్పగలిగిందెవరు? దైవమును మనకు సాక్షాత్కరింపజేసి అజ్ఞానం పోగొట్టి వెఱ్ఱి మానుపగలిగిన వైష్ణవ గురువులు సాయం చేస్తే మనం ఈ వెఱ్ఱి నుంచి బయటపడగలము అంటున్నారు అన్నమాచార్యులవారు. తనదెటువంటి వెఱ్ఱితనమో కవి వర్ణించిన తీరు వున్నదే.. అది నభూతో నభవిష్యతి. చదివితే మీకే తెలుస్తుంది.

**భావ వివరణ:**

ఎవ్వరూ నా వెఱ్ఱితనమును మానుపలేకున్నారు. పైగా వేదురు నన్ను (నన్ను వేదింతురు). పోనీ ఈ నా వెఱ్ఱితనాన్ని నా అంతట నేను విడిచిపెడతానా అంటే, విడిచిపెట్టను, ఓ సర్వేశ్వరా! ఇది ముఱ్ఱుబాలతో (తల్లి కడుపులోంచి శిశువు బయటపడగానే తల్లికి చేపే చనుబాలతో) పుట్టిన వెఱ్ఱువేషాలు. ఓ అయ్యా! ఇది ముంచినవెఱ్ఱి (వివశుణ్ణి చేసే వెఱ్ఱితనము).





అహో! చతుర్దశభువనాలను రక్షించుటకు పాల్పడి (సిద్ధపడి) ఆతడువుండగా సర్వేశ్వరుడైనప్పటికీ, అగణితుడు (యెన్నుటకు అసాధ్యంబైన) ఆతని శక్తిని అల్పముగా (భావించి) జిగి (శోభాయమానంగా) నా సంసార రక్షణ చేసెదనటంచు తిరిగెద (ప్రయత్నముతో పరుగులు బెట్టుచుంటిని). నేను అల్పుడనయ్యా! ఎన్ని నగుబాట్లు పొందినా నాకు బుద్ధిరాదు. నా వెఱ్ఱి ఇదేనయ్యా!

అంతర్యామియై దేవుడు నాలోనే వుండి నాకు సుఖదుఃఖములను రెంటినీ ఇస్తుంటే సత్యం తెలుసుకోలేక అంతయూ మనుజులు సేసేరని నేను అనేకమందిని వ్యర్థముగా నిందించుచున్నాను. బంతినే (వరుసగా) నావంటి జీవులబడి (సాంగత్యంలో) తిరుగాడుచూ, దొంతికర్మల (ప్రారబ్ద కర్మలు, దైవిక కర్మలు అను రెండు రకముల కర్మలలో) తగులుకొని చిక్కువడి వెఱ్ఱివాడనై ఇదే తిరుగుతున్నానయ్యా!

ఈ శ్రీవేంకటేశ్వరుడు నాయెదుటనే నిలుచుండి చేకొని (పూనుకొని) వరము లొసగగా (వరములననుగ్రహిస్తుంటే) దావతిపడి (కక్కుర్తిపడి) ఇతరులను నేను తగులుచు (తగులుకొని) అడిగితిని (యాచించితిని). ఈవేళనే (ఈరోజే) ఈ గురువు యేమని సెలవిచ్చారో తెలియునా? ఈ దైవము నిటుచూడగా (ఈ దేవదేవుని దర్శించినంత మాత్రమున) తోవనెరిగి నా జీవనగమ్యము తెలిసి నేను బ్రతికితిని. లేకుంటే నా తొల్లెల్ల (తొలి జన్మలన్నీ) వెఱ్ఱినయ్యా! (మూర్ఖునివలె తిరుగాడితినయ్యా!)

సంపుటి: 3 కీర్తన : అక్కడ నెక్కడినరకము ఆమాటే కల్లా
సంఖ్య : 340 పుట : 229 రాగం: ధన్యాసి

**ధన్యాసి**

**88 అక్కడ నెక్కడినరకము ఆమాటే కల్లా**
**దిక్కుల ని(నిం?) దె ఇన్నియుఁ దీరుచుకొంటిమయ్యా. ॥ పల్లవి॥**

**తనువిది మలమూత్రంబుల (లు?) దాకొనియుండినపట్టము**
**దినదినమును వుచ్చిష్టపుదిడ్డఁ దూరెదము**
**జననము నెత్తురు నెమ్ములు సారెకు నూరెడిగుంతలు**
**మని మని నరకము చొచ్చిన మనుజుల మిదె నేము. ॥అక్క॥**

**మదనజలంబులకాలువ మా పెద్దలపూర్వంబులు (?)**
**పొదలినపుత్రులయిసిళ్లపుట్టలు వెట్టెదము**
**యెదుటనె సంసారంబులు యెదయనికారాగృహములు**
**మది మది నరకముచవిగొనుమనుజుల మిదె నేము. ॥అక్క॥**

**పుట్టినదే నగ్నత్వము బూతో బండో యెరఁగము**
**చిట్టంట్లవాచవులగుజీవుల మ్రింగెదము**
**నెట్టన శ్రీవేంకటేశ్వర నీతోఁ గూడఁగ జగములు**
**మట్టినచోటేమట్టేమనుజుల మిదె నేము. ॥అక్క॥ 340**

**అవతారిక:**

జీవితచరమాంకంలో తను అప్పటివరకు నమ్మిన ధర్మాలు, న్యాయాలూ, పురాణాలూ కేవలం మానవకల్పితాలని స్వర్గనరకాలు మానవుని ఒక సక్రమ మార్గంలో పెట్టడానికి మానవుడే కల్పించుకొన్న అబద్ధాలే. ఇవేవీ నిజం కావు. ఇవన్నీ మా కల్పితాలే. కానీ ఒక్కటే నిజం.





జగత్తు శ్రీహరి ప్రేరణతో తనకు తానే ప్రకృతి రూపంలోవ విస్తరిస్తోంది. తనకు తానే నశిస్తోంది. తనకు తానే వృద్ధి చెందుతున్నది. తనకు తనే అని యెందుకంటున్నామంటే సృష్టి స్థితి లయలు మానవ కల్పితం అని భ్రమ కలిగినా ప్రకృతి ద్వారా ఆ మూడు వ్యవహారాలు జరుగుతుంటే మానవుడు కేవలం నిమిత్తమాత్రుడైన ప్రేక్షకుడు. పుట్టేడప్పుడు బట్టలేకుండా పుట్టి, దహనమయ్యేటప్పుడు బట్టలేకుండానే దహనమయ్యే మనిషికి మధ్యలో ఇదే నగ్నత్వము "బూతు" అయిపోయింది. మరి మదనజలంబుల కాలువలలో మునిగి తేలుతున్ననాడు ఈ 'బూతు' గుర్తుకు రాలేదా? అసలు నీపుట్టుక యెటువంటిది? నీ తల్లి కడుపులో నీ మలమూత్రాలమధ్య నీ వుచ్చిష్టము (చొల్లు) నీవే తాగుతూ యెంత హేయంగా పుట్టావు? నెత్తురు ముద్దలా బ్రతికిన రోజులు గుర్తులేవా? మరి యేమి చూసుకొని నీ మిడిసిపాటు. ఇంకా నీవు అశక్తుడవని అర్థంకాలేదా? ఇంకా శ్రీవేంకటేశుని దిక్కనవా? అయితే నీ చావు నువ్వు చావు, అన్న ధోరణిలో ఈ కీర్తన చెప్పారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

అక్కడనెక్కడ నరకము? (నరకమనేది అక్కడెక్కడో వున్నదా?) ఈ మాటే కల్లా (పరమ అసత్యం), అయ్యా! (ఓ దేవదేవా!) ఇందే (ఈ భూలోకంలోనే) దిక్కులను (ఈ యెనిమిది దిక్కుల మధ్యనే) ఇన్నియు దీరుచు కొంటిమి (మా పాప పుణ్యాలకు మేమే ఫలితం అనుభవిస్తున్నాం. సంతోషంగా వున్నప్పుడు స్వర్గం అనుకొంటూ, యేడుస్తున్నప్పుడు నరకం అనుకొంటున్నాము. అంతేనయ్యా!

మా పుట్టుక యెటువంటిది? మల మూత్రముల మధ్య దాకొని (నివసిస్తూ), దినదినమూ మా ఉచ్ఛిష్టము (ఉమ్మి) మేమే తాగుతూ, మా తల్లి కడుపులో యెంత హేయముగా దూరివున్నాము? అప్పటి నా రూపం

నేను గుర్తుకు చేసికొంటే గర్వపడేందుకేమున్నది? నా జననమెట్టిది? నెత్తురోడుతున్న యెముకలగూడు. ఈ అందానికి తగ్గట్లు దీంట్లో తొమ్మిది రంధ్రాలు. చుట్టూ చిమ్మచీకటి. దుర్గంధం. ఉమ్మనీటిలో తేలుతూ తొమ్మిది నెలలు ఆ నరకం అనుభవించినా బుద్ధిరాలేదు. మళ్ళీ మళ్ళీ అదే విధమైన నరకం అనుభవిస్తూ యెన్నిసార్లు పుట్టానో లెక్కే లేదు. ఓ అయ్యా! నేను అంత సిగ్గుమాలిన మనుజుడినయ్యా!

మదనజలములతో నిండి పొర్లుతున్న కాలువలలో జలక్రీడలాడటంలో మా పెద్దలంతా అఘుండులు. వారికి వారే సాటి. మేము అటువంటి గ్రంధసాంగుల వంశంలో జన్మించి మేమేమీ తక్కువ తినలేదన్నట్లు వారి దురలవాట్లనే పుట్టలు పెట్టినట్టు పెంచుకొంటూ ఇంకా ఇంకా చెడు వ్యవహారాలు నడిపేము. ఈ సంసారము విడిపించుకోలేని కారాగృహమని అర్ధమయ్యే సరికి అంతా అయిపోయింది. ఇప్పుడు నరకము ఆపైన యెక్కడో లేదు, మా మనస్సుల్లోనే వున్న మనుజులమని అర్ధమయింది. అయ్యా! ఇప్పుడు నేను చేయగలిగింది కూడా యేమీ లేదయ్యా!

ఓ దేవా! మేము పుట్టినదే నగ్నత్వముతో. మా పుట్టుకకు కారణమే బూతుపని. అది మంచో చెడో తెలియకుండానే వెంపర్లాడి సాధ్యమైనంతవరకు అనుభవించాము. మా కోపతాపాలను యేమాత్రమూ అణుచుకోలేము. మాకు వాచాలత్వము అధికము. మాతోటి జీవులనే మింగేసే స్వభావం గల క్రూరులము. ఎన్ని పుట్టుకలైనా ఎన్ని తడవలైనా ఇదే దరిద్రం. దీనికి తెరిపిలేదు. అదిగో ఒకానొక జన్మలో నీ కృప మాపై ప్రసరించింది. ఓ శ్రీవేంకటేశ్వరా! నీతో గూడగా, మట్టినచోటే మట్టే (చచ్చినచోటే మళ్ళీ చచ్చే) మనుజులమైనప్పటికీ ఇదే మేము నీ శరణుజొచ్చాము.



పొడవ్పకు పొడవైన పురుషోత్తమా

సంపుటి: 15 కీర్తన : ఏమని చెప్పుట మా యజ్ఞానము
యెఱిగి యెఱిగి తెలియగ లేము

సంఖ్య : 257 పుట : 173 రాగం: లలిత

**లలిత**

**89** ఏమనిచెప్పుట మా యజ్ఞానము యెఱిఁగి యెఱిఁగి తెలియఁగ లేము
శ్రీమాధవ నీ మఱుఁగు చొచ్చితిమి చిత్తగించి దయఁ జూడఁగదే
॥పల్లవి॥

నీవు రక్షకుఁడవై భువినుండఁగ నే గడియించే దిఁకనేమీ
జీవాంతరాత్ముఁడవై యుండుదు వట చేకొని కావక మానేవా
వేవేలుగఁ బుట్టించఁ గర్తవట వెలయించఁగ నీ భారముగాదా
భావించనేరక వట్టి స్వతంత్రము పయివేసికొనుచుఁ బరగేము
॥ఏమని॥

పలుతెఱఁగుల నీ నామము లుండగ పాపములకు వెఱవఁగ నేలా
బలిమి నీ ముద్రలు యంతటఁ జెల్లఁగ పైకొనునా యింక నరకములూ
తలఁక కభయహస్తము నీ వెత్తఁగ దాసుల కిఁక నెక్కడిభీతి
నిలుపఁగ నేరక మనసువెంబడి నే నిచ్చనిచ్చలునుఁ బొరలేము
॥ఏమని॥

అది నీ రూపము తిరువారాధనయై యుండఁగ వెదకఁగ నేలా
పదిలపుటాచార్యుఁడు గలుగఁగ నిహపరముల త్రో వడుగఁగ నేలా
వుదుటున వరములు శ్రీవేంకటేశుఁ డొసఁగఁగ నే కోరఁగ నేలా
తుద మొదలెంచక యిన్నాళ్లు నేమఱి దొరకొని యింక నుతియించేము
॥ఏమని॥**257**

**అవతారిక:**

ఓ శ్రీమాధవా! మా అజ్ఞానం గుఱించి ఏమి చెప్పుదునయ్యా! యెఱిగి యెఱిగీ మళ్ళీ అదే అజ్ఞానాంధకారములో బడి కొట్టుమిట్టాడుతున్నాము. మేము జ్ఞానపు తోవను తెలియలేకున్నాము. ఇక చేయునదేమి లేక నీ మఱుగు చొచ్చితిమి. చిత్తగించి మమ్ము దయజూడవయ్యా! అంటున్నారు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. నీ రూపము నా ఆరాధనయై యుండగా మా ఆచార్యులవారు ఇహపరములనొసగే నీ త్రోవను మాకు పరిచయము చేశారు. ఓ శ్రీవేంకటేశ్వరా! మాకు కావలసిన వరములన్నీ నీవే ఒసగుతుంటే ఆద్యంతముల గురించి ఆలోచించక మా కోరికలన్నీ నీ చిత్తమునకే వదలివేసి నిన్ను నుతించుచూ యున్నాము అని అంటున్నారు. ఎందుకంటే కోరికలకు ఆది అంతమూ వుండవు. అవి ఉత్తుంగ తరంగాల్లా యెగిసిపడుతూనే వుంటాయి, అంటున్నారు. సర్వపాపములను నివారించు నీ దివ్యనామము మాకు తోడు నీడ వలె వుండగా మాకు పాపముల గురించిన భయము యెందులకు అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ మాధవా! మా అజ్ఞానమును గురించి యేమని చెప్పేది ప్రభూ! ఇది అజ్ఞానము అని యెఱిగి యెఱిగి (తెలిసి తెలిసి) మళ్ళీ అదే తెలియగలేము (మేము అజ్ఞానులవలె ప్రవర్తిస్తున్నామని) తెలుసుకోలేకపోతున్నాము. ఇక మాకు దిక్కు గానరాక నీ మఱుగు చొచ్చితిమి (నిన్ను ఆశ్రయించాము). తండ్రీ! చిత్తగించి దయజూడగదే! (కాస్త మనస్సుపెట్టి కరుణించవయ్యా!)

స్వామీ! నీవు రక్షకుడవై ఈ లోకంలో మాకు వుండగా ఇంకా నేను గడియించేదేమి (సాధించవలసినదేముంది?) అన్ని జీవులలోనూ అంతరాత్మవై నీవే వుంటావంట. మరి నిన్ను నీవు కావక మానేవా (రక్షించుకోకుండా మానేస్తావా?) అందుకనే ప్రతి జీవీ జీవన పోరాటం





చేస్తుంది. ఈ జీవులను అనేక రకాలుగా అనేక సామర్థ్యములతో పుట్టించి పెంచుతున్న కర్తవు నీవేనట. మరి వీటి రక్షణ భారం నీదికాకపోతే ఇంకెవరిదయ్యా! దీంట్లో ఇంత తిరకాసు వుందని భావించలేని మూర్ఖులం ప్రభూ! మాకు మేమే స్వతంత్రులం అని రొమ్ము విరుచుకొంటాము, అన్నీ మాపై వేసికొని చివరికి దిక్కు తెలియక అల్లాడుతాము.

ప్రభూ! నీ నామములు పలుతెఱంగులు (నీవు వేయి నామాల వేలుపువు). అందులో ఏ ఒక్కటైనా మా పాపాలను పటాపంచలు చేస్తుంది. మమ్మల్ని నరకమునకు తీసికొని వెళ్ళే ధైర్యం యెవరు చేస్తారు? ఎందుకంటే ప్రాణాలు లేని మా కళేబరము మీదకూడా నీ శంఖ చక్రముల ముద్రలు కనబడుతూనే వుంటాయి. ఇక యమభటులు మా దగ్గరకు రాగలరా? అదిగో ఎత్తిపట్టుకొన్న నీ అభయహస్తము వుండగా నీ దాసులమైన మాకు భయమెక్కడిది స్వామీ! అయితే తప్పంతా నాదే తండ్రీ! మా మనస్సును నీపై నిలుపలేని అర్భకులము. అట్లా నిలుపలేక, నిచ్చనిచ్చలును బొరలేము, (ప్రతిరోజూ వ్యర్థపరుస్తున్నాము).

దేవా! మంగళప్రదమైన నీ రూపము నా నిత్యారాధనలో నా తోడుండగా నిన్ను యెక్కడెక్కడో వెదకవలసిన అవసరమేమిటయ్యా? మా ఆచార్యుడు పదిలముగా (జాగ్రత్తగా) మాకు సరి అయిన దారి చూపుతుంటే, ఏవేవో వ్యర్థమైన వరములను నిన్ను అడుగుట యెంత పనికిమాలిన పని? శ్రీవేంకటేశ్వరుడు ఇహపరములను రెంటినీ ఈయగల సర్వేశ్వరుడు. ఆ స్వామికి నాకేమివ్వాలో తెలియదా? నేను ప్రత్యేకించి వేరే అడుగవలెనా? అయితే... ఇన్నాళ్ళూనూ తుది మొదలెంచక (అడ్డు అదుపూ లేకుండా) ఏమఱి దొరకొంటిమి (అజాగ్రత్తగా వ్యవహరించాము). అయినదేదో అయినది, ఇక నిన్ను నుతించుచునే జీవింతుము.

సంపుటి: 15 కీర్తన : అలసితిని పుణ్యపాపముల ఆకలిబడి నేను

సంఖ్య : 384 పుట : 258 రాగం: నాట

**నాట**

**90** అలసితిని పుణ్యపాపముల ఆఁకలిఁబడి నేను
గెలిచితిని నిన్నుఁ గొలిచి యింకఁ గీర్తింపుచు నిర్మలుఁడ నైతిని
॥పల్లవి॥

యింక నేను ఈ పదులనాలుగులోకములు చొచ్చి యెన్నాళ్లు దప్పించుకొనువాఁడ
యింక నేను నేఁజేసిన దానంబులు చూపి యెందాఁకాఁ బెనఁగెడువాఁడ
యింక నేను నాపుత్రమిత్రులనడుమ నెట్టు దాఁగఁగలవాఁడ
యింక నేను యిల దివ్యతీర్థముల వెంటవెంట నెక్కడని పారేఁగలవాఁడ
॥అలసితి॥

యింక నేను నానాదేవతల మఱుగునను యేది గొలఁది దొబ్బగలవాఁడ
యింక నేను బహుజంతురూపములు గైకొని యే పగిదిని బొంకఁగలవాఁడ
యింక నేను మంత్రములు జపించి యే రీతి మాయల గెలిచేటివాఁడ
యింక నేను సంసారము చూపి యేమని నమ్మించఁగలవాఁడ
॥అలసితి॥

యింక నేను నీదాసుఁడనై ఇటువలె నుండఁగలవాఁడ
యింక నేను నీవేగతి యని యిహముఁ బరముఁ జేకొనువాఁడ
యింక నేను అలమేలుమంగకు యీశ్వరుఁడవైన శ్రీవేంకటేశా
యింక నేను ఆచార్యననుమతి హృదయములోపలఁ దలఁచువాఁడ
॥అలసితి॥





**అవతారిక:**

పాపపుణ్యాలెటువంటివంటే, వాటినాచరిస్తూ జీవుడు అలిసిపోతాడు. ఆకలిని కూడా మఱచి పోతాడు. కాని ఈ ప్రయాణం విశ్రాంతి లేనిది. పుణ్యమే చేసే ప్రయత్నంలో కొంత పాపమాచరించటమూ కద్దు. మరి దీనికి తరుణోపాయం యేమిటి? ఆ సర్వేశ్వరుని గొలుచుటయే. ఆయనను కీర్తించుచూ నిర్మలులైన వారికి ఆ దేవదేవుని కరుణను గెలుచుట పెద్ద విశేషము కాదు. పదునాల్గు భువనాలు తిరిగినా నేనేవో దానధర్మాలు చేశానని యెంతకాలం తప్పించుకొని తిరుగుతాను? నా భార్యాపుత్రుల మధ్య యెంతకాలం దాగివుంటాను? ఏదో ఒక జన్మలో ఏదో ఒక జంతువు రూపం దాల్చకుండా యెట్లా వుంటాను? ఈ సంసారమును చూపి నేను యేమని నమ్మించగలవాడ స్వామీ! నేను నీ దాసుడవలెనే జీవించుట కిష్టపడతాను. నా ఆచార్యుని ఆనతిని సదా నా హృదయంలో నిలుపుకొని ఓ శ్రీవేంకటేశ్వరా! సదా నిన్నే ధ్యానించువాడ అంటున్నారు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. అంటే ఇప్పటివరకు అయినదేదో అయినది పాపపుణ్యాలు చేస్తూ బ్రతుకు గడిపేసేను. కాని ఇంక వాటితో నాకు పనిలేదు. నిన్ను కీర్తిస్తూ నిర్మలుడనై నీసేవలోనే తరిస్తాను. ఆ విధంగా నిన్నునూ గెలిచెదను అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ సర్వేశ్వరా! ఈ పాపపుణ్యముల ఆకలిబడి (ఆకాంక్షకు చిక్కువడి) నిరంతరమూ అయ్యో! పాపాలు చేస్తున్నాననే బెంగతో, యేవేవో పుణ్యకార్యాలు చేయాలనే తపనతో తిరిగి తిరిగి అలసితినయ్యా! (అలసిపోయాను స్వామీ!) ఎట్టకేలకు నిన్ను కీర్తింపుచు నిర్మలుడనైతిని. నిర్మలచిత్తునకు మోక్షప్రాప్తి సుగమమే కదా! ఆ విధంగా నిన్ను గెలిచితిని.

ప్రభూ! ఇంకా నేను ఈ పదునాల్గు భువనములలో చొచ్చి (దూరి) యెన్నాళ్ళు తప్పించుకొని తిరుగగలను? ఇంకా నేను గతంలో చేసిన దానముల పట్టికజూపి నాకు మళ్ళీ జన్మవద్దని పెనుగులాడెదను? ఇంకా నా పుత్రుల నడుమ మిత్రుల గుంపులో దాగుకొని వీరిని వదలలేనని ఇంకా బ్రతుకుతాననే వ్యామోహం యెట్లా పెంచుకోగలను? ఇంకా నేను యే పుణ్యతీర్థాల వెంట పరుగులు పెట్టగలవాడను. ఓ దేవదేవా! ఇక నావలన కాదు. ఈ పాపపుణ్యాలగోల నాకు వద్దు. నీ శరణుచొచ్చితిని.

దేవా! ఇంకా నేను పలు అన్యదేవతల నాశ్రయించి యేవేవో ఇష్టకామ్యములు పొందుటకు యెందుకు వెంపర్లాడవలెను? ఇంకా నేను యే జంతువుల జన్మలు, పామరులపుట్టుకలు పొంది అబద్ధములాడుతూ ఇదే రొంపిలో పడి కొట్టుమిట్టాడను? ఇంకా నేను యే మంత్రశాస్త్రము చదివి ఉద్ధరింపబడాలి? అది ఒక మాయాజాలం. ఇంకనైనా దానిని గెలవకున్న జీవితమంతా వ్యర్థమే కదా! స్వామీ! ఇంకా నేను ఈ సంసారమును చూపి ఇదే నిత్యసత్యమని యేవిధంగా ఇతరులను నమ్మించగలను. దీన్ని చూచి నిత్యమనుకొనే వెఱ్ఱివాళ్ళు వుంటూనే వుంటారు. అది వేరే విషయము.

ఓ పరాత్పరా! ఇది నా నిశ్చయము. ఇంక నేను నీ దాసుడనై ఇకమీదట జీవిత శేషము గడపగలవాడను. ఇంక నేను ఇహపరములను చేకొని వాటికై నా ప్రయత్నము అనవసరమని నీవే గతియని నమ్మిన అన్నీ నీవే చూసుకొంటావని నిశ్చింత వహించాను. అలమేలుమంగ విభుడైన శ్రీవేంకటేశ్వరుడు ఇంక నా వాడని నమ్మితే యే బెంగా వుండదు. ఇంక నేను నా ఆచార్యుల అనుమతితో హృదయంలో ఈ తిరుమలేశునే ప్రతిష్ఠించుకొని, ఆ శ్రీహరినే దలచుచూ నా జన్మ చరితార్థము చేసికొంటాను.





సంపుటి: 1 కీర్తన : నిత్యులు ముక్తులు నిర్మలచిత్తులు నిగమాంతవిదులు వైష్ణవులు

సంఖ్య : 414 పుట : 277 రాగం: మాళవి

**మాళవి**

**91 నిత్యులు ముక్తులు నిర్మలచిత్తులు నిగమాంతవిదులు వైష్ణవులు**
**సత్యము వీరల శరణని బ్రదుకరో సాటికిఁ బెనఁగక జడులాల**

**॥పల్లవి॥**

**సకలోపాయశూన్యులు సమ్యగ్ జ్ఞానపూర్ణులు**
**అకలంకులు శంఖచక్రలాంఛను లన్నిటఁ బూజ్యులు వైష్ణవులు**
**వొకటిఁ గోరరు వొరులఁ గొలువరు వొల్లరు బ్రహ్మాదిపట్టములు**
**అకటా వీరల సరియనఁ బాపం బారుమతంబుల పూఁతకోకలన్**

**॥నిత్యు॥**

**మంత్రాంతర సాధనాంతరంబులు మానిన పుణ్యులు విరక్తులు**
**యంత్రపుమాయలఁ బొరలు పరులకు యెంతైనా మొక్కరు వైష్ణవులు**
**తంత్రపు కామక్రోధవిదూరులు తమ నిజధర్మము వదలరు**
**జంత్రపుసంసారులతో వీరల సరియని యెంచఁగఁ బాపమయ్య**

**॥నిత్యు॥**

**తప్పరు తమ పట్టినవ్రత మెప్పుడు దైవ మొక్కఁడే గతి యనుచు**
**వొప్పగు తమ పాతివ్రత్యంబున నుందురు సుఖమున వైష్ణవులు**
**కప్పిన శ్రీవేంకటపతిదాసులు కర్మవిదూరులు సాత్త్వికులు**
**చెప్పకుఁ డితరుల సరిగా వీరికి సేవించఁగ నే ధన్యుఁడ నైతి**

**॥నిత్యు॥**

**అవతారిక:**

వైష్ణవుల ప్రాశస్త్యాన్ని వర్ణిస్తున్నారు అన్నమాచార్యులవారు. వారు (వైష్ణవులు) నిత్యులు, భవబంధములనుండి ముక్తిని పొందినవారే. నిర్మలాంతఃకరణతో వేదాంత పరిపూర్ణులు మావైష్ణవులని సవినయంగా చెబుతూనే ఓ జడులారా! సాటికి బెనగక వీరల శరణని బ్రతకరో అని నచ్చచెబుతున్నారు. అంటే ఓ తెలివితక్కువ దద్దమ్మల్లారా! నేను అంత గొప్పవాణ్ణి కావాలి, వీడెంతో అంత పేరు సంపాదించాలని పెనగులాడక ఈ వైష్ణవులను శరణని బ్రతకండి. సత్యముగా మీరు కూడా పుణ్యులై ముక్తులవుతారు అంటున్నారు. ఎందుకని ప్రశ్నరాక ముందే ఆయనే సవివరంగా వైష్ణవుల నెందుకు సేవించాలో వివరిస్తున్నారు. జంత్రపు సంసారులతో వీరిని సరిపోల్చవచ్చునా యెంతపాపం మూటకట్టుకొంటున్నారు అని అంటున్నారు. అంటే అసలు అర్థమేమిటంటే సంసారపుయావ గలిగిన మానవులంతా జంత్రపు సంసారులేనట. అంటే సూత్రముచే కట్టబడి ఆడే బొమ్మలు సూత్రం పట్టుకొని ఆడించే వాడి ఇష్టప్రకారం ఆడుతవి కానీ వాటికే స్వాతంత్రం వుంటుంది? అలాగే మనని ఆడిస్తున్నది ఆ శ్రీవేంకటేశ్వరుడు మన మస్వతంత్రులం అని భావము.

**భావ వివరణ:**

ఓ జడులారా! (మూర్ఖులారా!) సత్యము (నిజముగా) వీరిని (ఈ వైష్ణవులను) శరణని బ్రతుకరో (శరణాగతిని పొంది జీవించండి). సాటికి బెనగక (సాంసారికమైన గొప్పతనము కోసం వెంపర్లాడక, మరీ జీవించండి. ఎందుకంటే ఈ వైష్ణవులు నిత్యులు (చిరంజీవులు), ముక్తులు (బ్రతికి వుండగానే ముక్తిని పొందినవారు), నిర్మలచిత్తులు (పవిత్రమైన అంతఃకరణ కలవారు), నిగమాంతవిదులు (వేదాంత వేద్యులు.)

ఇంకా వీరి లక్షణాలను చెబుతాను, సావధానులై వినండి. వీరు సకలోపాయ శూన్యులు (జీవనోపాధికి కావలసిన కుటిలోపాయములేవీ





తెలియనివారు). సమ్యగ్జ్ఞానపూర్ణులు (ఆత్మజ్ఞానమునందు నిష్ణాతులు). అకలంకులు (కళంకము లేనివారు). శంఖ చక్రముల ముద్రలు లాంఛనములుగా శరీరంపై ధరించియున్నవారు. ఇటువంటి వైష్ణవులు పూజనీయులు కాక మరేమిటి? ఒకటీ గోరరు (వీరికి యేదీ అక్కరలేదు). అన్యులను పూజించరు, బ్రహ్మ మొదలైన పదవులనిచ్చినా వీరు తృణీకరిస్తారు. ప్రపంచంలో వున్న ఆరు రకములైన ఇతర మతములు వీరికి (వైష్ణవులకు) సరియన పాపంబు, అకటా (సమానమనుటయే పాపమయ్యా!) ఎందుకంటే ఆ ఆరుమతములు పూంతకోకలు **(నేడు కట్టుకొని రేపు విడిచేసే చీరెలవంటివి).**

ఈ వైష్ణవులు మంత్రోపాసనలు, వాటి సాధనోపాయములను విసర్జించిన పుణ్యులు. ఎందుకంటే వీరు విరక్తులు (రక్తియే లేనివారు). యంత్రములు తయారుచేయటాన్ని నిరసిస్తారు. విష్ణుదేవునికి వారి గురువులకు తప్ప వేరెవ్వరికీ వీరు మొక్కరు. కామక్రోధములకు ఆలవాలమైన తంత్రవిద్యలనిన వీరికి అసహ్యము. సంసారపు యావ గలిగిన మానవులంతా జంత్రపు సంసారులు (తోలు బొమ్మల్లాగా ఆడే అస్వతంత్రులు). వారితో ఈ వైష్ణవులను పోల్చుటయే మహాపాపము.

విశిష్టమైన వీరి ఇంకొక లక్షణం చెబుతాను వినండి. వీరు తలపట్టిన దీక్షను యెన్నడూ విడువరు. ఎప్పుడూ ఆ పరాత్పరుడే దిక్కు అనే భావనతోనే వుంటారు. ఎలాగైతే పతివ్రత భర్తయే సర్వస్వమను కొంటుందో వీరూ శ్రేష్ఠమైన తమ పాతివ్రత్యముకూడా తమ ఆశయమనే భావనలో సుఖముగా వుంటారు. సర్వజగములను కప్పిన (ఆక్రమించిన) శ్రీవేంకటేశ్వరుని దాసులైన ఈ వైష్ణవులు కర్మలాచరించుటకు విముఖులు. సాత్త్విక ప్రవృత్తి కలిగినవారు. ఇట్టి ఈ వైష్ణవులకు అన్యులు సమానులనికూడా అనరాదు. వీరిని సేవించి నేను ధన్యుడనయ్యాను.

సంపుటి: 15 కీర్తన : సర్వజ్ఞత్వము వెదకఁగ నొల్లను సందేహింపఁగ నొల్లను

సంఖ్య : 463 పుట : 310 రాగం: దేవగాంధారి

**దేవగాంధారి**

**92** సర్వజ్ఞత్వము వెదకఁగ నొల్లను సందేహింపఁ నొల్లను
సర్వజ్ఞుండును నాచార్యుండే సర్వశేషమే నా జీవనము
॥ పల్లవి॥

యెఱఁగఁగ నొల్లము విజా&ఞనపుగతి యెఱుకలు నే మిటు సోదించి
యెఱిఁగి యితరులను బోధించెద మను యీ పెద్దరికము నొల్లము
యెఱిఁగేటి వాఁడును యాచార్యుండే, యెఱుకయు సర్వేశ్వరుఁడే
యెఱుకయు మఱపును మానివుండుటే యిదియే పో మా విజ్ఞానము
॥సర్వ॥

చదువఁగ నొల్లము సకలశాస్త్రములు సారెకు సారెకు సోదించి
చదివి పరులతో యుక్తివాదములు జగడము గెలువఁగ నొల్లము
చదివేటివాఁడును నాచార్యుండే, చదువును నా యంతర్యామే
చదువుకుఁ జదువమికియుఁ దొలఁగుటే, నానాసాత్వికభావమే నా తెలివి
॥సర్వ॥

అన్నిటికిని నే నధికారిననెడి యహంకారము నొల్లను
కన్నులఁ జూచుచు నందరితో నేఁ గాదని తొలఁగా నొల్లను
మన్నన శ్రీవేంకటేశ్వరుకరుణను మా యాచార్యుఁడే అధికారి
వున్నరీతినే అస్తినాస్తులకు నూరకుండుటే నా తలఁపు
॥సర్వ॥





**అవతారిక:**

అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో తమకి సర్వజ్ఞత్వము అక్కరలేదంటున్నారు. తమ ఆచార్యులవారి మహిమ మీద తమకు యెటువంటి సందేహమూ లేదనీ అలా సర్వజ్ఞుడైన తమ ఆచార్యుడే తమకు సర్వస్వం అంటున్నారు. తన జీవనము సర్వశేషము అంటున్నారు. అంటే తమ జీవితం వారి అనుగ్రహమే అని అర్థం. ఎఱిగేటి వాడు ఆచార్యుడట. ఆయన ఇచ్చిన యెఱుక సర్వేశ్వరుడట. మరి మా సంగతేమిటి? మాకు ఒకసారి యెఱుక వుంటుంది. ఇంకొకసారి మఱపు వుంటుంది. మా విజ్ఞానం అంతకు మించిలేదు. కనుకు గురుకృపలేక తాము అశక్తులం అంటున్నారు. తమకి శ్రీవేంకటేశ్వరుని కృప కలగాలంటే కూడా తమ ఆచార్యులవారి అనుగ్రహం వుండాలి అంటున్నారు. ఆచార్యుడే అధికారియట. అస్తినాస్తులకు అంటే భగవంతుని వునికి నిరూపణ కావాలన్నా పరలోకములేదనే మూర్ఖపువాదన సమసిపోవాలన్నా ఆచార్యునికృప కావలసిందే. ఇక నా ఆలోచన యేమింటంటారా? వూరకుండుటయే అని నిష్కర్షగా చెబుతున్నారు అన్నమయ్య.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! మేము సర్వజ్ఞత్వము (సమస్తం తెలిసినవాడు అనిపించుకొనుటకు) వెదకగ నొల్లము (ప్రయత్నించుట కిష్టపడము). సందేహింపగ నొల్లము (నిత్యశంకితునివలె బ్రతుకనిచ్ఛగించము). సర్వజ్ఞుడని పిలువదగినవాడు మా ఆచార్యులవారొక్కరే. ఈ నా జీవితమున్నదే, అది సర్వశేషమే (అంతయూ వారి అనుగ్రహమే.)

మేము విజ్ఞానపు తీరుతెన్నులను తెలిసికొనుటకు ప్రయత్నించనుకూడా ప్రయత్నించము. నేము (మేము) ఇటు (ఇకపై) యెఱుకలు సోదించి

(భగవంతుని యెఱుగుటకై వెదకులాడెదను). ఎఱిగి యితరులను బోధించెదము అను మా పెద్దరికము నొల్లము (తెలిసినవారమైనందున మా పెద్దరికము నిలబెట్టుకొనుటకు ఇతరులకు ఆచార్యత్వము నిర్వహించుటకు కూడా మేము అంగీకరించము). ఎఱిగేటివాడు ఆచార్యుడే (ఆచార్యులు మాత్రమే జ్ఞాని అని పిలువదగినవారు). ఆయన అందించే యెఱుకయే (జ్ఞానము కూడా) ఆ సర్వేశ్వరుడే. మరి ఇక నీ విజ్ఞానమేమిటయ్యా! అని నన్ను అడుగుతారేమో... జ్ఞానము అజ్ఞానము గురించిన చింతలన్నీవ విడనాడి మా ఆచార్యులను సేవిస్తూ జీవించటమే, మాకు తెలిసిన విజ్ఞానము.

మాకు ఇంకొక లక్షణము వున్నది. సారెకు సారెకు శోదించి (ప్రతిసారి పరిశోధించి) సకల శాస్త్రములను చదువగ నొల్లము (షట్శాస్త్రములలో పాండిత్యానికి ప్రయత్నించుటకు ఇష్టపడము). ఆ విధంగా చదివి ఇతరులతో తర్కించి యుక్తితో ఇతరులను వాదనలో ఓడించుటకు కూడా మేము ఇష్టపడము. ఎందుకంటే నిజానికి చదివేవాడు మా ఆచార్యుడే ఆ చదువును అర్థం చేసికొనే శక్తివున్నవాడు నాలో అంతర్యామిగావున్న పరమాత్మ. చదవుట చదువకుండుట రెంటినీ విడనాడి అనేక సాత్విక భావనలతో ప్రశాంతంగా జీవించుటయే నా తెలివి (జ్ఞానము).

మాకు ఇంకొక విలక్షణమైన సద్గుణమున్నది. మేమే అన్నిటికీ అధికారులము అనే అహంకారమంటేనే మాకు అసహ్యము. మా కన్నుల యెదుటవున్నవారిని చూచుచు వారిని లెక్కసేయక తొలగిపోయి మా ఔన్నత్యము ప్రకటించుకొనుట అంటే కూడా మాకు అసహ్యమే. సగౌరవంగా శ్రీవేంకటేశ్వరుని కరుణను మాకు అందించటానికి సర్వాధికారి కూడా మా ఆచార్యుడే. ఇక ఆయన రక్షణలో ప్రశాంతంగా ఊరక యుండుటే మా తలపు (ఆలోచన). ఆస్తినాస్తి విచికిత్స... ఇట్లాంటి వ్యర్థమైన ఆలోచనలవల్ల లాభమేమిటి ఆలోచించండి.





సంపుటి: 15 కీర్తన : ఇదె నీ చిత్తం బింక నా భాగ్యము యిన్ని విన్నపము లిందునే వున్నది

సంఖ్య : 318 పుట : 214 రాగం: గౌళ

### గౌళ

**93** ఇదె నీ చిత్తం బింక నా భాగ్యము యిన్ని విన్నపము లిందునే వున్నది
హృదయములోపల నీ వున్నాఁడవు యెఱుఁగని యర్థం బించుక లేదు
॥ పల్లవి॥

మొగి నాయుష్యము నూరేండ్లు ఇంక ముందరఁజేసెదఁ బుణ్యములనుచును
తగ నా యిచ్చల వలసినట్ల నేఁ దప్పె ననక భోగించితిని
జిగి నొకదేవత ననుచరించను సేసినధర్మం బొకటీఁగానను
నిగిడి వృద్ధునైతి నింతలోనను నీ ముందర నే నిలిచితిని
॥ఇదె॥

అనేకకాలము బ్రహ్మకల్పము నడలయందు నే జన్మించి ముక్తి వడతునని
పొనుఁగుచు నిహమే కోరుచు నాసల పుట్టుగులకు నొడిగట్టితిని
అనిశము మునులను అవలంబించను ఆధార మొక్కటి సంపాదించను
తనిసి యిదివో దుర్బలుఁడనైతి నీ దయాదృష్టినే తగిలితిని
॥ఇదె॥

శ్రీవేంకటగిరి పరమపపావనము చేరియందు నీ సేవ సేతునని
త్రోవచూచుకొని యిన్నాళ్ళ (?) దనుక దొరకొని వేడ్కల మెలఁగితిని
భావములో నొక యుక్తియు వెదకను పరులు నాకు రక్షకులని తలఁచను
చేవమీఱి నిర్భరుఁడ నైతిని శ్రీసంకల్పాశ్రితుఁడ నైతిని
॥ఇదె॥

**అవతారిక:**

ఓ దేవదేవా! ఇకపై నీ చిత్తము నా భాగ్యము. నేను అశక్తుడను. నీవు వున్నది నా హృదయంలోనే కదా! ఇక నీకు తెలియని నా ఆలోచన యేమివుంటుంది తండ్రీ! నా విన్నపములను కూడా నోటితో చేయవలసిన పనియే లేదు. నీవు సర్వజ్ఞుడవు. నీకు అర్థంకానిదేముంటుంది ప్రభూ! అంటున్నారు తాళ్ళపాక పెద తిరుమలాచార్యులవారు. ఈ కీర్తన వింటుంటే వృద్ధులైన అన్నమాచార్యులవారి ఆత్మవారి ఆత్మజునిలా పాడుతున్నట్లుంది. నూరేళ్ళాయువు వున్నదిలే అనుకొని భోగాన్వేషణలోనే బ్రతికాను. చూస్తుండగానే జుట్టు నెరిసింది. పళ్ళు వూడిపోయాయి. ముసలి ఒగ్గునైపోయి నీ ముందు నిలిచాను. ఇక నా గతేమిటి ప్రభూ! అయిందేదో అయిపోయింది. ఇన్నాళ్ళూ ఏదో ఒక రోజు శ్రీవేంకటగిరి చేరి అక్కడ నీ సేవ చేసికుంటూ వుందాములే అని రోజులు దొర్లించేశాను. ఏవేవో వేడుకలతో కాలం వెళ్ళబుచ్చాను. కాని ఈనాటికి జ్ఞానోదయమయ్యింది. ఇక పరులెవ్వరూ నా రక్షకులని భావించనుగాక భావించను. "నేను చేవమీటి నిర్భరుడనైతిని శ్రీసంకల్పాశ్రితుడనైతిని" – అంటున్నారు. అంటే యేమిటి? మరి ఆ తండ్రికొడుకు కదా! అంత తేలికగా కవిత్వం చెబుతాడా? మీకు భావ వివరణ వెదకక తప్పేట్లు లేదుమరి.

**భావ వివరణ:**

ఓ శ్రీహరీ! ఇంక, ఇదె నీ చిత్తము నా భాగ్యము (నీ దయ నా ప్రాప్తము) తండ్రీ! ఇన్ని విన్నపములు (నేను చేయదలచుకొన్న అభ్యర్థనలన్నీ) పూర్తి అయినవి. అన్నీ నా హృదయంలోనే వున్నవి. నీవు అంతర్యామివై నా హృదయంలోనే వుండగా నీవు యెఱుగనిదేదన్నా వుంటుందా?

స్వామీ! నీవు నాకు నూరేండ్ల జీవితము నిచ్చావు. ఆఁ అన్నాళ్ళువుంది కదా! ఇకముందు పుణ్యం చేసెదనులే అని నేను నా ఇచ్ఛవచ్చినట్లు





జీవితం గడిపాను. నేను తప్పేననక భోగించితిని (ఇది తప్పు ఇది ఒప్పు అనే విచక్షణ లేక భోగములనుభవించితిని). కనీసం ఒక్కదైవమూర్తిని కూడా పూజించనైతిని. వారిని అనుసరించలేకపోయాను. పోనీ, ధర్మకార్యాలేమన్నా చేశానా అంటే యేదీ చేయనే లేదు. ఇంతలోనే నేను చూస్తుండగానే వృద్ధాప్యం నన్ను చుట్టుముట్టింది. నేను అశక్తుడనై నీముందు ఇలా నిలబడి పోయాను. ఓ సర్వేశ్వరా! ఇక నీ చిత్తము నా భాగ్యము.

దేవా! ఇదే నా మొదటి జన్మ అందుకనే అలా పొరబాట్లు జరిగాయి అనుకొందామా, అంటే అది నిజం కాదు. అనేక బ్రహ్మ కల్పాల క్రితమే నేను, కాలానుగుణంగా అనేక జన్మలనెత్తాను. ఎంతసేపూ ఇహలోక సుఖాల ధ్యాసయే. ఆశాపాశమే. కోరికలే. నా అదృష్టవశాత్తు ఈ జన్మలో ఈ వృద్ధాప్యంలో ఎట్టకేలకు ముక్తిని పొందాలనే కోరిక పుట్టింది. అయ్యో! మునులు ఇంతకుముందే అందించిన ఒక్క ముక్తిమార్గమునూ ఇంతకాలమూ పట్టుకోలేదని బాధపడ్డాను. వారి ఆధారమునొక్కదానినీ అవలంభించలేకపోయాను. మరి నాకు అంత దీక్ష లేదు కదా! ఇదిగో ఇలా పశ్చాత్తాప పడుతూనే దిగులుతో మరీ దుర్బలుడనైపోయాను. ఇప్పుడు వూరు పొమ్మంటోంది, వల్లకాడు రమ్మంటోంది. నీ దయాదృష్టికోసం తగలితిని (వెంపర్లాడుతున్నాను).

ఓ శ్రీవేంకటేశ్వరా! పరమపావనమైన నీ సప్తగిరిని చేరుకొని అందు నీ సేవ చేతునని ఇన్నాళ్ళనుంచి అనుకొంటూనే కాలం వెళ్ళబుచ్చాను. మళ్ళీ వేడుకలలో మునిగిపోయాను. ఇది నీ మాయ కాక మరేమిటి తండ్రీ! మనస్సులో కూడా నవవిధ భక్తి మార్గములలో ఒక్కదానిని అయినా అవలంభించలేదు. అప్పుడు పరులు నాకు రక్షకులు కారనే జ్ఞానోదయమైనది. నా రక్షకుడవు నీవేనని గ్రహించితిని. చేవమీటి నిర్భరుడనైతిని (నేను పెల్లుబికిపోయాను). శ్రీ సంకల్పాశ్రితుడనైతిని (మంగళకరమైన భగవత్ చింతనతో నిన్ను ఆశ్రయించాను). నేను ధన్యజీవినయ్యాను.

సంపుటి: 15 కీర్తన : ఏమఱఁజనదు బ్రతికేటికాలము యెఱిఁగిన మహాత్ములకును

సంఖ్య : 267 పుట : 180 రాగం: బౌళి

**బౌళి**

**94 ఏమఱఁజనదు బ్రతికేటికాలము యెఱిఁగిన మహాత్ములకును**
**శ్రీమంతుఁడగు హరినే తలఁచిన చీఁకటు లన్నియుఁ బెడఁబాయు**
**॥పల్లవి॥**

**చేరి వుండెడిది బ్రహ్మలోకమట శ్వేతుఁడను రాజట భువిమీఁదికి**
**కారణమున నేతెంచి నిత్యమును కళేబరం బట తన కాహారము**
**అరయ సంపద లే పనికి వచ్చునట లోకాంతరగతి నే మున్నది**
**శ్రీరమణునికే శరణుచొచ్చినను చెడనిభోగములు చేచేతఁగలుగు**
**॥ఏమఱఁ॥**

**చేసినక్రతువులు నూఱట నహుషుఁడు చెలఁగుచు దేవేంద్రపట్ట మేలెనట**
**దోస మించుకంతకుఁగా భువిపైఁ దూలుచుఁ బామై పడియెనటా**
**ఆసలఁ గర్మము నెట్టునమ్మెడిది అమరత్వము ఫలమది యెట్లెంచుట**
**వాసుదేవునిఁ గొలిచి తా నతనివాఁడై యుండిన నెలకొను శుభము**
**॥ఏమఱఁ॥**

**వెలయఁగ త్రిశంకుఁ డనియెడి రాజట విశ్వామిత్రుని పరిగ్రహం బట**
**అలరిన చండాలత్వ మొందె నట యంతరిక్షమున నుండెనటా**
**బలుములు యెందాక వెంటవచ్చు నుపాయంబులు మతి చెప్పఁగనేలా**
**యిలధరుఁడగు శ్రీవేంకటేశ్వరుని నెఱిఁగి దాసుఁ డగుటే సత్ఫలము**
**॥ఏమఱఁ॥**





**అవతారిక:**

ఈ కీర్తనలో తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు పురాణగాథలను వుటంకిస్తున్నారు. తన తండ్రి అన్నమాచార్యులవలనే ఈయన పౌరాణిక గాథల ప్రస్తావన గొప్ప ప్రహేళికలావుంటుంది. మామూలు పాఠకులకు అంత సులభగ్రాహ్యం కాదు. కాలము విలువ తెలిసిన మహాత్ములు ఏమఱుపాటు విడనాడి తాము బ్రతికి వున్న కాలమంతా చక్కగ సద్వినియోగం చేసికొనుటకే ప్రయత్నిస్తారు. లక్ష్మీవల్లభుడైన శ్రీహరి ధ్యానించగానే అజ్ఞానాంధకారము తొలగిపోతుంది అంటున్నారు. ఈ కీర్తనలోని పురాణగాథలు అందరికీ తెలిసినవి కానందువల్ల వాటిని వివరించాలనివున్నా స్థలాభావనచేత వివరింపలేని పరిస్థితి వచ్చింది. పురాణ కాలంలో బ్రహ్మలోకవాసియైన ఒక రాజు వుండేవాడట. ఆయనపేరు శ్వేతుడు కానీ ఆయన నిత్యమూ భూలోకానికొచ్చి ఒక మానవ కళేబరాన్ని ఆహారంగా తీసికొంటూవుండేవాడట. లోకాంతరస్థితిని పొందిన ఆ రాజుగారికి యెన్ని సిరిసంపదలున్నా నిరుపయోగమే కదా! ఆ రాజు ముందే శ్రీహరి శరణు పొందియుంటే ఆయనకా తిప్పలన్నీ తప్పేవి కదా! అంటున్నారు పెదతిరుమలయ్య. ఈ విధంగా ఈ కీర్తనలో ఇంకా నహషుడి గాథ, త్రిశంకుడి గాథ కూడా ప్రస్తావించబడ్డాయి. అవికూడా విపులంగా వివరించాలంటే ఇక్కడ సాధ్యపడదు. చదువరి నన్ను మన్నించక తప్పదు, మరి.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! యెఱిగినమహాత్ములకును (భగవత్ తత్త్వము తెలిసిన మహానుభావులకు) కాలము ఏమఱజనదు (కాలము యొక్క ప్రభావమును

మరువతగదు). ఎంతటివారినైనా కాలము కబళించి వేస్తుంది. బ్రతికియున్న కాలమును శ్రీమంతుడైన శ్రీహరినే తలచుచు సద్వినియోగము చేసికొనవలెను. అట్లు చేసిన చీకటులన్నియు (అజ్ఞానాంధకారము) యెడబాయును (మనలను విడిచిపెడుతుంది).

ఒక పురాణగాధను విని ఈ నా మాట యెంత సత్యమో గ్రహించండి. పూర్వకాలంలో శ్వేతుడు అనేరాజు వుండేవాడు. ఆయన బ్రహ్మదేవునికి ప్రీతిని కలిగించి, ఆ బ్రహ్మవద్దనే వుండెడివాడు. కానీ ఆయన పురాకృత కర్మననుభవించుటకు అనునిత్యమూ భూలోకమునకు వచ్చి ఒక మానవ కళేబరాన్ని (శవమును) ఆహారముగా స్వీకరించేవాడు. మరి ఆయన సిరి సంపదలలో శ్రీమంతుడు. ఏలోకమైనా యధేచ్ఛగా వెళ్ళగలిగిన శక్తి ఆతనికున్నది. ఇక అటువంటి అసామాన్యుడి గతి యేమయినదో చూశారా? అటువంటి భోగాలు యెందుకయ్యా? శ్రీరమణుడైన శ్రీహరిని శరణుచొచ్చిన వారికి యెన్నటికీ చెడని భోగములు కోకొల్లలుగా సమకూడుతాయి. మరి బ్రహ్మలోక వాసము లెందుకు శవాల్ని పీక్కుతినటం యెందుకు చెప్పండి.

పూర్వం నహుషుడనే మహర్షి నూరు క్రతువులు చేసి దేవతలకు ప్రీతిపాత్రుడుగా వుండేవాడు. ఒకానొక శాపం చేత దేవేంద్రుడు తన పదవినీ, లోకాన్ని వదలిపెట్టవలసి వచ్చింది. దేవతలు ఋషులు నహుషుణ్ణి దేవేంద్ర పదవిలో వుంచారు. గర్వం తలకెక్కిన అతడు ఒకనాడు ఇంద్రుడి భార్య శచీదేవి కూడా తనకు కావాలన్నాడు. నారదుని సలహా మేరకు ఆవిడ సప్తఋషులు మోస్తున్న పల్లకీనెక్కివస్తే అతని కోరిక తీరుస్తానన్నది. ఆ కామాతురుడు అంతపనీ చేశాడు. పైగా వారిలో పొట్టివాడైన





దుర్వాసుడు వేగంగా పోవటంలేదని "సర్పసర్ప" అని కాలితో తన్నాడు. ఆగ్రహోదగ్రుడైన ఋషి వాణ్ణి సర్పము అవుదువుగాక అని శపించి వాడి పీడను నివారించాడు. కాబట్టి అమరత్వము దక్కినా గర్వం నెత్తికెక్కటం తప్ప లాభమేమిటి? చేసిన కర్మనెట్లా నమ్మేది? దాన్ని అనుభవించక తప్పదు కదా! మరి ఈ గోల అంతా యెందుకు? వాసుదేవుని కొలిచి అతనివాడైవుంటే సర్వశుభములు కలుగుతాయి కదా!

పూర్వం ఇక్ష్వాకువంశజుడైన త్రిశంకుడు అనే చక్రవర్తి వుండేవాడు. వాడికి సశీరంగా స్వర్గం వెళ్ళాలనే కోరిక కలిగి గురువు వసిష్ఠుని అభ్యర్థించాడు. ఆయన వాడిని మందలించాడు. వాడు విశ్వామిత్రుని ఆశ్రయించాడు. వశిష్ఠుడిపై మత్సరంతో విశ్వామిత్రుడు వాణ్ణి తన తపశ్శక్తినంతా వెచ్చించి స్వర్గం చూపించాడు. వాణ్ణి దేవేంద్రుడు చండాలుణ్ణి చేసి ఒక్క తన్నుతో తలక్రిందులుగా భూమిపై పడేట్లు చేశాడు. విశ్వామిత్రుడు మూర్ఖపు పట్టుదలతో త్రిశంకుని కోసం త్రిశంకు స్వర్గాన్నే సృష్టించాడు. చివరికి తన తపోబలమంతా పోగొట్టుకొన్నాడు కాబట్టి మన తపోబలమైనా మననెంతవరకు ఉద్ధరిస్తుంది చెప్పండి. మరి ఈ ఉపాయాలన్నీ వ్యర్థమే కదా! భూవల్లభుడైన శ్రీవేంకటేశ్వరుని తెలుసుకొని ఆయన దాసులైతే సత్ఫలితములన్నీ అసంఖ్యాంగా కలుగుతాయి. ఇది నిజం.

సంపుటి: 15 కీర్తన : వేగిర మేటికిని వేసట లేటికిని విష్ణుని సొలయగ నేల

సంఖ్య : 151 పుట : 100 రాగం: పాడి

**పాడి**

**95** వేగిర మేఁటికిని వేసట లేఁటికిని విష్ణుని సొలయఁగ నేల
సాగిలిమొక్క నతఁడు మన్ననలు జరపినపాటి జరపీగాక ॥ పల్లవి॥

తనవేలే తన కన్నుదాఁకినను తా నెవ్వనిఁ గోపించీని
తన కర్మమే తన్నుఁ జేయఁగ దైవము దూరఁగనేల
అనుభవింపుచును హరినే కొలిచిన అలమట లన్నియు హరిచూచి
పొనుఁగక తమలో దుర్దోషంబులు పొమ్మన్నపుడే పోయీఁగాక
॥వేగిర॥

కడుపులోపలికి మింగిన రత్నము కడుచోట్ల వెదకఁగ నేల
బడిఁదన యంతర్యామి దా మఱచి పలువేల్పులఁ గొలువఁగ నేల
విడువక శ్రీపతినామమంత్రమే వేడుకఁ దలఁచఁగఁ దలఁచఁగను
చెడకుండా నతఁడు పావనము సేసినప్పుడే సేసీగాక
॥వేగిర॥

కర్మము నతఁడే కార్యము నతఁడే కడఁగిన శ్రీవేంకటవిభుఁడూ
నిర్మించినట్లవు నిన్నియు మరి నేఁ డనుమానము లేల
ధర్మం బితనికి యే కాలంబును దాసుల రక్షించే బిరుదు
అర్మిలి యితనిఁ గొలిచినఁ జాలును అందనిపదవులు నందీఁగాక
॥వేగిర॥

**అవతారిక:**

ఓ భక్తులారా! మీరెందుకు తొందరపడుతున్నారు? యెందుకు శ్రమపడుతున్నారు. మీ కష్టాలన్నిటికీ కారణం మీరు విష్ణుని మరచుటయే.





ఆయన మనందరి తండ్రి అమిత దయాళువు. కేవలం సాష్టాంగనమస్కారమునాచరించిన మాత్రమున ఆయన తనకు మన్ననలను జరిపినట్లే భావిస్తాడు – అంటున్నారు తాళ్ళపాక పెద తిరుమలాచార్యులవారు. ఇది నిజమని నీవెట్లా చెప్పగలవు అని అంటారేమో.... నే చెప్పేది వినండి, పొరబాటున మనవ్రేలు తగిలి కన్ను గాయపడితే ఆవ్రేలిపై కోపించి యెవడన్నా దాన్ని చితకకొట్టుకుంటాడా? వ్రేలూ వాడిదే, కన్నూ వాడిదే. అందుకని వదలివేస్తాడు. అవునా? ఆ స్వామి యెవరినైనా యెందుకు శిక్షిస్తాడు? మానవుని కర్మము వలన దైవము నిష్పక్షపాతంగా మన్నిస్తాడు లేదా తన్నిస్తాడు. తన్నించాడని స్వామిని నిందించుట తగునా? మన పిల్లవాడు ఒకవేళ రత్నాన్ని మింగితే, పోనీలే అది వాడి కడుపులో భద్రంగా వుంటుందిలే అని ఊరుకొంటామా? అది యెంత విలువైన రత్నమైనా కడుపులోకి పోతే మృత్యువే. దానికోసం ఎక్కడెక్కడో వెదకితే లాభంలేదు. కడుపులోనే వెదకాలి, ఎలాగైనా బయటకు తీయాలి. అంతర్యామియై నీలోనే ఆ శ్రీహరివుంటే యెక్కడెక్కడో గుళ్ళుగోపురాల చుట్టూతా తిరుగుతావు. యెంత వెఱ్ఱివాడివిరా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! వేగిరమేటికి (మీరెందుకు తొందరపడుతున్నారు?) వేసట లేటికిని (యెందుకింత శ్రమపడుతున్నారు?) విష్ణుని సొలయగనేల? (నారాయణుని మఱువ తగునా?) అతడు (ఆ శ్రీహరి) సాగిలిమొక్కన్ (ఒక సాష్టాంగ నమస్కారమును చేసినంత మాత్రమున) మన్ననలు జరిపినపాటి జరిపీగాక (తనను మన్నించినట్లే భావిస్తాడు).

తన వేలు పొరబాటున తనకంటిని పొడిచిందని కోపించి యెవడన్నా దాన్ని చితకకొట్టుకుంటాడా? మరి తాను చేసిన కర్మవలన తాను చిక్కులు తెచ్చుకొని కష్టాలు పడుతుంటే అందుకు దేవుని దూరుగనేలా (నిందించుట యెందులకు?) తమ కర్మఫలము తామనుభవించుచూ

శ్రీహరి ధ్యాస విడువక కొలిచిన, ఆయనే అలమటలన్నీ (చింతలన్నీ) చూచి, వారిలోని దుర్దోషములు (చెడు పాపములను) తొలగిపోండి అన్నప్పుడు ఆ పాపములు వాటంతట అవే తొలగిపోతాయి. హరికృప కలిగేదాకా పాపాలు చేసేవాడికి తాను పాపము చేస్తున్నా యేదో గొప్పపని చేస్తున్నట్లు పశ్చాత్తాపం కూడా పొందడు.

మన పిల్లవాడు పొరబాటున ఒక రత్నాన్ని మింగితే, పోనీలే విలువైనదాన్నే మింగాడు దాన్ని వాడి కడుపులోనే వుండనిద్దాములే అనుకొని వూరకుంటారా? వాడి కడుపులోంచి దాన్ని బయటకు తెప్పిస్తారు కదా! విలువైనది కదా! అని యెక్కడెక్కడో వెదుకుతారా? శ్రీమన్నారాయణుడు అంతర్యామివలె మనదేహంలోనే వుండీ అనుక్షణం కంటికి రెప్పలా కాపాడుతుంటే, యేమఱుపాటుతో అర్థం లేకుండా రకరకాల పరదేవతలను ఆరాధించుట నిరుపయోగము కదా! మనము చేయవలసినదల్లా, శ్రీపతినామ మంత్రమును సంతోషముతో ధ్యానించగా యేదో ఒకనాటికి ఆస్వామే తప్పక మనని పుణ్యాత్ములను చేస్తాడు. అంతదాకా మనము చేయవలసిందల్లా, ఆయనపై విశ్వాసం సడలకవుండుటయే.

ఇంకొక గొప్ప రహస్యమేమంటే జీవుల కర్మము వేరెవరో కాదు ఆ శ్రీహరియే. ఆ కర్మవశమున వారు చేయు కార్యములు కూడా ఆ శ్రీహరియే. ఇవన్నీ కూడా పూనుకొని శ్రీవేంకటేశ్వరుడే నిర్మించినట్లు అవుతాయి. ఇందులో ఈషణ్మాత్రమైనా అనుమానము లేదు. ఈతడు నిర్వధికంగా నిర్వహించే ఇంకొక ధర్మమువున్నది. అదేమిటంటే, యేకాలంబును (యేనాడైనా) తన దాసులను తప్పక రక్షించుటయే. ఇతనిని అర్మిలి (ఆపేక్షతే) గొలిచిన చాలును అందుకోటానికి అసాధ్యమైన అనేక పదవులను ఆయనే అందిస్తాడు. ఈ మాట పరమసత్యము.





సంపుటి: 2 కీర్తన : ఆనతియ్యగదవే అందుకే కాచుకున్నాడను
సంఖ్య : 301 పుట : 201 రాగం: సామంతం

## సామంతం

**96 ఆనతియ్యఁగదవే అందుకే కాచుకున్నాఁడను**
**పూనుక నీ వెంతనేర్పరివైనా భువి మనసు పేదను నేను**
**॥పల్లవి॥**

**కొలిచేమనేబంట్లు నీకుఁ గోటానఁగోట్లు గలరు నిన్నుఁ**
**దెలిసేమనేజ్ఞానులు తెందేప లున్నారు**
**తలఁచి వరములడిగేవారలు తలవెంట్రుకలందరు వారె**
**యిల సందడిలో నాకొలవు యెటువలె నెక్కీనో ॥ఆన॥**

**పనులకుఁ బాల్పడినవారు బ్రహ్మాదిదేవతలట**
**వినుతులు సేయఁదొడఁగినవె వేదరాసులట**
**మనుకొని ధ్యానించువారు మునులెందరైనాఁ గలరట**
**వినయపు నామనవి సనవులకు వేళ లెపుడు గలిగీనో ॥ఆన॥**

**వున్నతితోడుత నిన్ను మోఁచుటకు వున్నారు గరుడఁడు శేషుఁడు నీకు**
**అన్నిటాను నీకాఁగిటిలోపల నలరీ నలమేల్మంగ**
**యెన్నఁగ శ్రీవేంకటేశా నన్నును యేలితి వింతటిలోనె**
**పన్నిననామొక్కులు నీ కేబాగులఁ జేరీనో ॥ఆన॥**

**అవతారిక:**

ఓ సర్వేశ్వరా! నీకు కొదవేమున్నది తండ్రీ! నీవు తలుచుకొంటే కానిదేమున్నది? నీవు యెంతనేర్పరివైనా నాబోటి అల్పుడిని రక్షించటానికి

నీఅంతటివాడు శ్రమపడనక్కరలేదయ్యా! నీవు వృత్తిగా ఆనతిస్తేచాలు కోటానుకోట్లైన నీ పరివారములో యెవరో ఒకరు నన్ను ఆదుకొంటారులే అనే ధీమాతో వున్నాను. స్వామీ! నేను మనసు పేదను కూడా అంటున్నారు అన్నమాచార్యులవారు. బ్రహ్మాది దేవతలంతటివాళ్ళు నీ కోసం పడిగాపులు కాస్తుంటే నాబోటి అనామకుడిని పట్టించుకొనేవాళ్ళెవరయ్యా! అంటున్నారు. ఇక నీ వాహనమైన ఖగేంద్రుడు గరుత్మంతుడున్నాడే ఆయన నిన్ను యెక్కడకు కావాలంటే అక్కడకు క్షణాలమీద తీసికొని వెళ్తాడు. ఆదిశేషుడు నీకు రక్షణ కవచంగా వుండే పానుపు కూడా. క్షణం కూడా నిన్ను వీడని నీ దేవేరి అలమేలుమంగ మాకు కన్నతల్లికంటె యెక్కువ ప్రేమను పంచిపెడుతుంటుంది. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవే నన్ను యేలితివి. ఇంకా నేను కోరుకొనేదేముంది? "పన్నిన నా మొక్కులు నీకే బాగుల జేరీనో" అంటున్నారు. అంటే యేమిటి?

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీ అనుజ్ఞ కోసమే కాచుకొని వున్నానయ్యా, నీవెంత నేర్పరివైనా ఈ లోకంలో అనేకమందివలె నేనూ మనసు పేదనైతినయ్యా! (మనస్సు నీకర్పించి నాదంటూ యేమీలేని నిరుపేదనయ్యాను). పూనుకొని నన్ను రక్షించే భారము నీదే.

ఓ ప్రభూ! మేము నీ దాసులమయ్యా! నిన్ను సేవించుటయే మా పని అనే బంట్లు నీకు కోట్లాదిమంది వున్నారు. నిన్ను నీ తత్త్వాన్నీ బాగా అర్థం చేసికొన్నామయ్యా! అనే జ్ఞానులు తెందేపలున్నారు (తండోపతండాలుగా వున్నారు). నిన్ను తలచి (ధ్యానించి) స్వామీ! మాకు ఇది కావాలి, స్వామీ! మాకు అది కావాలి అని యాచించే భక్తులు తలలో యెన్ని





వెంట్రుకలున్నాయో అంతమంది వుంటారయ్యా! ఇల (ఈ లోకంలో) అందరూ సందడి చేసేవారే. మరి ఆ హడావిడిలో నీకు, నా కొలువు యెటువలెనెక్కీనీ (నా సేవ ఏవిధంగా గుర్తుంటుంది తండ్రీ!)

ఓ సర్వేశ్వరా! స్వయంగా బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు మొదలైన దేవతలు, నీ పనులకు బాల్పడినవారే (నీ సేవకు సిద్ధమైనవారేనయ్యా!) వేదరాసులు (చతుర్వేదములు) నీకు వినతులు సేయ దొడంగినవే (నీకు విన్నపములు సేయుటకు నిర్దేశింపబడినవే సుమా!) ఇకపోతే, మునుకొని (ప్రప్రథమంగా యెంచుకొని) నీవే సర్వస్వమని భావించి సదా నిన్నే ధ్యానించే మునులు యెందరైనా గలరు (అసంఖ్యాకంగా వున్నారు). ఓ దేవా! వినయముతో కూడిన నామనవి, సనవులకు (కోరికలకు) నీకు వేళయెపుడు కలిగీనో (దొరుకుతుందో కదా!)

స్వామీ! నిన్ను వున్నతితో మోచుటకు (ఉన్నతముగా మోయుటకు నీకు ఇద్దరు యెల్లప్పుడూ సిద్ధముగా వుంటారు. అందులో మొదటివాడు గరుత్మంతుడు. స్వామిని వాయువేగ మనోవేగాలతో ఆయనకు కావలసిన చోటికి తీసికొని వెళ్తాడితడు. ఇక రెండవవాడు ఆదిశేషుడు. స్వామి సుఖంగా చుట్టలు చుట్టుకొనియున్న ఆదిశేషుడే తల్పముగా పడుకొని యుంటాడు. ఇక నీ దేవేరి అలమేలుమంగ అణుకువతో నీ కౌగిట నిండుగా అలరియుంటుంది. ఇంతటిలోనే (వీరందరితో పాటు ఇంతలోనే) నన్నుకూడా ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు వున్నతితో యేలితివి. పన్నిన నా మొక్కులు (నేను అనుకొన్న నా మొక్కుబడులన్నియునూ) నీకే బాగుల జేరీనో (సక్రమముగా చేరుతాయో లేదో)?

సంపుటి: 2 కీర్తన : ఎట్టు సేయగలవాడనో యిక నీచేతిది నావునికి

సంఖ్య : 296 పుట : 198 రాగం: లలిత

**లలిత**

**97** ఎట్టు సేయఁగలవాడనో యిఁక నీచేతిది నావునికి
నెట్టన నీదాసుఁడనైతిని నీచిత్తం బిఁకను ॥ పల్లవి॥

సారెకుఁ గొలువుసేతు చనవులు నీ విత్తు వోయనుచు
నేరకున్నాఁ బాడుదును నీవు మెత్తువనుచు
వోరిచి వుపవాసములుండుదు నొగి దయదలంతువో యనుచు
చేరి వాకిలిగాచుకుండుదు చిత్తమురావలెననుచు
॥ఎట్టు॥

కమ్మటి నిచ్చుకములు నెరపుదు కైవసముగావలెననుచు
వుమ్మడి నీగుణాలు వొగడుదు వూరక మొగమోడుదువనుచు
నెమ్మది మొక్కులు నే మొక్కుదు నేరములెంచక కాతువని
నమ్మి నిన్ను నేఁ బూజింతు నను నీ వీడేరింతువని
॥ఎట్టు॥

ఆసతో నిను భావింతు అన్నిట నన్నేలుదువనుచు
వేసరక నీమంత్రము నుడుగుదు వేగమే వరమొసఁగుదువనుచు
రాసికి నెక్కఁగ శ్రీవేంకటేశా రక్షించితి విప్పుడు నన్ను
వాసితోడ నే నిన్నుఁ దగులుదును వదలక నాపాలఁ గలవనుచు
॥ఎట్టు॥





**అవతారిక:**

ఇది ఒక శరణాగతి కీర్తన అనే చెప్పుకోవాలి. నవీన కాలంనాటి తెలుగుభాషలో చెప్పాలంటే ఈ విధంగా చెప్పవచ్చును. "నీవెట్లా చేస్తావో కాని, నా వునికే నీ చేతులలో వుంది ప్రభూ! ఆఖరికి నీ దాసుడనయ్యాను తండ్రీ! ఇకపై నీ చిత్తము నా ప్రాప్తము". అన్నమాచార్యులవారి ఈ కీర్తన మనస్సుని పిండేస్తుందంటే అది అతిశయోక్తి కాదని నా భావన. అట్లాగే ఆ స్వామి దయనుపొందటానికి తాను యేమేమి చేయగలరో కూడా హృద్యంగా వివరిస్తున్నారు. నీవాకిటిముందు పడిగాపులు కాస్తానయ్యాష నీదయ రావాలనే నా ప్రయత్నాలన్నీ అంటున్నారు. నేను చేసిన నేరాలు అసంఖ్యాకంగా వున్నమాట నిజమే కానీ నీవే నా నేరములెంచి నాపై కక్ష సాధిస్తే నేనెవరితో చెప్పుకోగలను స్వామీ! ఇక చిట్ట చివరిగా తిరుగులేని అస్త్రం సంధిస్తున్నారు. శ్రీవేంకటేశ్వరా! నీవు రాసికినెక్కినవాడివి. నన్ను ఇప్పుడు నీవు రక్షించటానికి సిద్ధపడ్డావు. ఇంకా నేను కోరుకునేదేముంటుంది స్వామీ! నీవు నాపాలగలవని. వాసితో నిన్ను దగులుదు అంటున్నారు. భావవివరణ చదివితే సందేహాలన్నీ పటాపంచలైపోతాయి మరి.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఎట్టు సేయగలవాడవో (ఏవిధముగా చేయనిశ్చయించితివో) ఇక నావునికి నీచేతిది (నా జీవితం, నీ చేతుల్లో వున్నది స్వామీ!) ఇన్నాళ్ళకు నేను నెట్టన (అనివార్యముగా) నీ దాసుడనైతిని. ఇక నా భారం నీదే. నన్నేం చేస్తావో ఇక నీచిత్తము (ఇక నీ దయ నా ప్రాప్తము).

స్వామీ! చనవులు నీవిత్తువోయనుచు (నా కోరికలను నీవు తీరుస్తావని) సారెకు గొలుతును (ప్రతిసారి నిన్ను సేవిస్తాను). నేరకున్నా (అంతబాగా

చేతకాకపోయినా) నీవు మెత్తువనుచు (మెచ్చుకుంటావని) నీ కీర్తనలను పాడుతున్నాను. ఒగి దయతలంతువని (పూనుకొని నాపై కనికరం చూపిస్తావని) వోరిచి (ఓర్పు వహించి) యెన్నియో ఉపవాస దీక్షలు చేపట్టాను. ఇదిగో ఇప్పటికి నీ వాకిట చేరి కాచుకొనివుండి, నీ చిత్తము నా భాగ్యమనుచు శరణాగతితో వున్నాను.

ప్రభూ! మరి నీవు నాకోసం యేమి చేస్తున్నావురా! అంటావేమో? నే చెప్పేది విను. నీవు నా కైవసము (స్వాధీనము) కావాలని కమ్మటి నిచ్చుకముల నెరపుదును (తీపి తీపి ప్రియవచనములను చెప్పెదను). ఊరక మొగమోడుదువని (కాస్త దాక్షిణ్యము చూపింతువని) నీ గుణములను వుమ్మడి వొగడుదు (అదేపనిగా కీర్తింతును). నా గత నేరముల గురించి దెప్పక నన్ను గాతువని (రక్షించెదవని) నీకు నెమ్మదిని (నా మనస్సులో) మొక్కులు మొక్కెదను. నన్ను నీవు ఈడేరింతువని (వర్ధిల్లజేసెదవని) నమ్మి నిన్ను సదా పూజించెదను.

ఓ దేవా! అన్ని విధములా నన్ను యేలుకొంటావని ఆశతో నిన్ను భావింతును (నా భావనలలో నిలుపుకొందును). వేగమే నే కోరిన వరములననుగ్రహింతువని, వేసరక (విసుగు లేక) నీ నామ మంత్రమును పఠింతును. అందుచేత అమిత కరుణామయుడవైన ఓ శ్రీవేంకటేశ్వరా! రాసికి నెక్కగ (నన్ను ప్రసిద్ధునిజేసి) ఇప్పుడు నన్ను రక్షించితివి. నీవు వదలక నాపాల (యందు) గలవనుచు, వాసితోడ (శ్రేష్ఠతతో) నిన్ను దగులుదును (ఆశ్రయిస్తాను). నన్ను కృపజూడు తండ్రీ!





సంపుటి: 2 కీర్తన : దైవమా నీపెరరేఁపణ లివి తప్పక వున్నవి జీవులకు

సంఖ్య : 190 పుట : 127 రాగం: మలహరి

మలహరి

**98** దైవమా నీపెరరేఁపణ లివి తప్పక వున్నవి జీవులకు
భావించి కాదనిదొబ్బి దీకొనఁగ బ్రహ్మాదులకైనను వసమా ॥పల్లవి॥

**యెక్కడ సిద్ధించు బ్రహ్మచర్యము యెదుటనే కాంతలఁ జూచినవేళను**
**చక్కఁగా మనోవ్యభిచారంబునఁ జలియించుఁగాక**
**చిక్కునే విరతి ధనధాన్యంబులు చేతికి లోనయినఁ జూచి**
**వొక్కటియై తా నుండే మగ్నమునొందిం చుఁగాక ॥దైవ॥**

**కలుగునే తనివి బహుపదార్థములు గక్కన నంగళ్లనుఁ జూచి**
**కొలఁదిమీఱఁ గడుతరితీపులతో కోరుచు నోరూరుఁగాక**
**వలనుగ సమాధి యెటువలె దొరకొను వాజవారణంబులఁ జూచి**
**యెలమితోడ ముంగిళ్లనెల్లఁ జరియింపించుఁ గాక ॥దైవ॥**

**యేరీతి నెలకొను నీమీఁదితలఁపు యిహలోకపుసౌఖ్యము చూచి**
**భారపులంపటములు పైఁ దగిలించి పనులకుఁ బురికొలుపుఁ గాక**
**ధారుణి నే నివి గెలుచుట యెన్నఁడు తగ శ్రీవేంకటనాయక నీవే**
**గారవించి రక్షింపుము నీ కిది కదునుపకారంబౌఁగాక**
**॥దైవ॥190**

**అవతారిక:**

జీవులు మంచి చేయాలన్నా చెడు చేయాలన్నా ప్రేరణ కలిగించేదెవరు? వానిలో అంతర్యామిగా వున్నదేవుడు. అందుకనే

దుర్మార్గులు కూడా మంచి చేస్తుంటారొక్కొక్కప్పుడు. మంచివారు కూడా అకృత్యాలు చేస్తుంటారు. మరి ఆయన విధానమేమిటో భావించి నేను చెడు చేయనుగాక చేయను అని దానిని దొబ్బి (గెంటేసి), దీకొనగ (ఢీకొనగా) బ్రహ్మదేవుడి తరమవుతుందా స్వామీ! అంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ కలికాలంలో ఇంత విశృంఖలత్వంతో కాంతలతో మనోవ్యభిచారం చేసే గ్రంధసాంగులుండగా బ్రహ్మచర్యదీక్ష గురించి యెవడన్నా మాట్లాడితే పక్కున నవ్వురాకుండా యెట్లావుంటుంది చెప్పండి? అంగడిలో తీపి పదార్థాలు చూచి నోరూరెడివానికి వాటిని తినకుండా తనివితీరుతుందా? ఇహలోక సౌఖ్యాలకు ఆశపడేవానికి లంపటములు తగులుకొనే పనులు చేయక తప్పదు కదా? శ్రీవేంకటేశుడు మనలను గారవించి రక్షించితే సరేసరి. లేకపోతే ఈ జీవుల గతి అధోగతే, అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దైవమా (దేవదేవా!) ఇవి నీ పెరరేపణలు (మానవులకు కలిగే ఈ భావనలన్నియూ, ప్రేరేపణలన్నియూ) నీ ఇచ్ఛానుసారమే కలుగుచున్నవి. ఇవి జీవులకు తప్పక వున్నవి. వీనిని భావించి (ఊహించి) కాదని దొబ్బివేయుటకు (త్రోసివేయుటకు), దీకొనగ (ఢీకొని యెదిరించుటకు) బ్రహ్మాదులకైనను, వసమా (సాధ్యమా?)

స్త్రీలతో సాంగత్యముపెట్టుకొని, వాళ్ళను యెదుటనే చూచిన వేళను (చూపులు వారితో కలుపగానే) బ్రహ్మచర్యము యెక్కడ సిద్ధించును? అప్పుడేమవుతుందో తెలుసునా? మనోవ్యభిచారము (మానసిక వ్యభిచారము) ఆ స్త్రీలతో చక్కగ సలుపుచూ చలియించుగాక (చలించిపోతాడు గాని స్థిరచిత్తుడు కాగలడా?) ధనధాన్యంబులను జూచి వాటి చేతికి లోనయిన (లొంగిపోయిన) వానికి విరతి (విరక్తి) చిక్కనే





(దొరుకుతుందా?) దొరకదుగాక దొరకదు. ఈపై జెప్పిన వాటి లక్షణమేమంటే మనిషిని వాటియందే మగ్నము గావించును (నిమగ్నమై లొంగిపోవునట్లు చేస్తాయి.)

విఫణివీధికి వెడలి అక్కడి అంగడులను (సరుకులమ్మే కొట్లలో) బహుపదార్థములను గక్కునే (వెంటనే) చూచినంతమాత్రాన కలుగునే తనివి (తృప్తితీరుతుందా?) కొలదిమీరి (అసంఖ్యాకంగావున్న) మధుర పదార్థాలను కోరుతూ అక్కడనే నిలుచుండిపోతే ఆనందం కలుగుతుందా? లేక మనకు నచ్చినదానిని తింటే తృప్తి కలుగుతుందా? ఎవడికైనా "వాజివారువములు" (అశ్వమేధయాగంబులను) చేసినంత మాత్రాన యోగసమాధి ఎట్లా సమకూడుతుంది? దానికి అకుంఠితదీక్ష, భగవత్కృప కావాలి కదా! యాగాలు చేసేవాడు ముంగిళ్ళలో యెలమితో చరిస్తుంటాడు (సంతోషంతో తిరుగుతుంటాడు.) అంతే.

ఓ శ్రీహరీ! ఇహలోకపు సుఖములలో మునిగి తేలేవారికి తలపు (ధ్యాస) నీమీద నెలకొను నేరీతి (స్థిరపడి యేవిధంగా వుంటుంది?) వాళ్ళగతేమిటో తెలియునా స్వామీ? దుస్సహమైన అనేక లంపటాలలో (పీకులాటల్లో) తగులుకొని యేవేవో నిరుపయోగమైన పనులు చేస్తూనే క్షణం తీరిక లేక వుంటారు. మరి నేనూ అటువంటి మానవమాత్రుడినే కదా! ధారుణిలో ఈ లోకంలో నేను వాటిని గెలచుట యెన్నడు జరిగేను? ఓ శ్రీవేంకటేశ్వరా! తగ (తగు విధముగా) నీవు నన్ను గౌరవించి రక్షింపుము నీ ఉపకారము యేనాటికీ మరువను తండ్రీ!

సంపుటి: 2 కీర్తన : అతడు లోకోన్నతు డాదిమపురుషుడు అన్నిటాను పరిపూర్ణుడు

సంఖ్య : 313 పుట : 209 రాగం: నాదరామక్రియ

## నాదరామక్రియ

**99** అతడు లోకోన్నతుఁ డాదిమపురుషుఁడు అన్నిటాను పరిపూర్ణుఁడు
చతురుఁ డితఁడే రక్షించఁగలవాఁడు శరణనిబ్రదుకవో వోమనసా
॥ పల్లవి॥

మరుతండ్రిఁ జూచిన మంచికన్నులను మరొకరిఁ జూచిన నింపౌనా
సిరివరునామమునొడిగిననోరను చిక్కినపేరులు యితవౌనా
పరమాత్ముఁదలఁచినమనసులోపలను పరులఁ దలచితే నొదఁబడునా
కరుణానిధిపుణ్యకథలువినినచెవుల కడలసుద్దులు వినసమ్మతించునా
॥అతఁ॥

నరహరిఁబూజించినయట్టికరములు నరులసేవసేయ నరుహములా
మురహరు శరణని మొక్కినశిరసున మూఢులకు మొక్క నుచితములా
హరిమందిరమునకరిగెడుపదములు అధములిండ్లకేఁగఁగ నలవడునా
పురుషోత్తము లాంఛనము మోచినమేను భువిహీన వృత్తికిఁ బొసఁగీనా
॥అతఁ॥

గోవిందుఁడే దిక్కైవుండుఘనులకు కొలిపీనా దేవతాంతరంబులు
భూవల్లభుదెసఁ బుట్టినజ్ఞానము పొంది వేరొకట నిలిచీనా
శ్రీవేంకటపతిపై నిడినభక్తి చెలులపై నునుపఁగఁ దగవవునా
దేవకినందనుఁ డితనిదాసుల దెలియఁగ జడులకుఁ దరమయ్యీనా
॥అతఁ॥





**అవతారిక:**

భక్తిరసప్రధానమైన ఇటువంటి కీర్తనలను అన్నమాచార్యులవారు లెక్కకుమిక్కుటముగా నుటంకించారు. కాకపోతే దేనిప్రత్యేకత దానిదేనని మనం గ్రహించాలి. ఆ దేవదేవుడు లోకోన్నతుడు, ఆదిపురుషుడు, అన్ని విధములా పరిపూర్ణత గలిగినవాడు. పైగా చతురుడు. అంటే సమయస్ఫూర్తి కలవాడు ఆయన గజాసురుడు, భస్మాసురుడు, జరాసంధుడు మొదలైన దానవులను మట్టుబెట్టిన విధానములను స్మరణకు తెచ్చుకోండి. నేను చెప్పేదంతా సత్యమేనని మీకే తెలుస్తుంది. అవతలివారి చావు తన చేతిలో లేదన్నప్పుడూ, వారు గోవులరూపంలో వున్నప్పుడూ ఆస్వామి ఇంకొకరితో ఆ దానవులను మట్టుబెట్టించే వైనం పరమాద్భుతంగా వుంటుంది. అందుకే ఆ స్వామి జగద్రక్షకుడు. ఆయన కోసం నీవు ప్రత్యేకించి యేమీ చేయవలసిన పనిలేదు. శరణు మహాప్రభో! అన్యధా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ అని బ్రతికితే చాలును అంటున్నారు. కరుణానిధి పుణ్యకథలను విన్న చెవులు అడ్డమైన వారి 'కడల సుద్దులు' వినవనిచ్చగించునా అంటున్నారు. కాల్చుకొని పురుషోత్తముని లాంఛనములు ధరించిన శరీరం హీనవృత్తిని స్వీకరిస్తుందా అంటున్నారు. జడులైనవారికి ఈ దేవకీనందనుని దాసుల ఔన్నత్యం యెట్లా తెలుస్తుందయ్యా! అంటున్నారు.

**భావ వివరణ:**

అతడు (ఆ దేవదేవుడు) లోకోన్నతుడు (లోకములో అందరికంటే అధికుడు). అతడు ఆదిమపురుషుడు అన్నిటాను (అన్నిటియందును) పరిపూర్ణతగలవాడు. అతడు చతురత గలిగినవాడు (సమయస్ఫూర్తిగలవాడు). సర్వులను రక్షించగలవాడునూ అతడే. అందుకే ఓ మనసా! అతనిని శరణని బ్రతుకరాదా?

మరుతండ్రిని (మన్మధుని తండ్రియైన శ్రీహరిని) చూచినట్టి కన్నులతో మరొకరిని జూచిన ఇంపౌనా (బాగా వుంటుందా?) సిరివరు (శ్రీనాధుని) నామమును పలికిన నోటితో చిక్కిన పేర్లను (యెవరెవరివో నోటికి వచ్చిన పేర్లను పలికిన యితవౌనా (హితవవుతుందా?) పరమాత్ముడైన ఈ దేవుని తలచిన మనస్సులో పరులను దలచిన ఒడబడునా (సమకూడుతుందా?) కరుణానిధియైన ఈ కమలనాభుని కథలను వినిన చెవులతో కడలసుద్దులు (ప్రక్కవాళ్ళ సంగతులు) విన సమ్మతమా (వినుటకు అంగీకరిస్తామా?) అది సాధ్యం కాదు.

నరహరియైన విష్ణుని పూజించిన చేతులతో నరాధముల సేవచేయవచ్చునా? ముర అనే రాక్షసుని హరించిన హరిని శరణని మొక్కాలికానీ ఆయనకు మొక్కిన శిరసుతో మూఢులైన మానవులకు మొక్కుట ఉచితమైన పనియేనా? శ్రీహరి ఆలయమునకు పోవుటకు నియోగించబడిన పాదములు అధముల ఇండ్లకు పోవుటకు అలవాటుపడతాయా? పురుషోత్తముడైన శ్రీపతి లాంఛనములు (వైష్ణవులు ధరించు శంఖచక్రముల ముద్రలు) మోచిన (ధరించిన) శరీరంతో ఈ భూమిపై హీనవృత్తికి పొసగీనా (చెడుపనులు చేయవచ్చునా)?

గోవిందుడే దిక్కని నమ్మిన వారికి ఆయనవుండగా దేవతాంతరములు (అన్యదేవతలు) ఘనులకు కొలిపీనా (గొప్పవారనే భావన కలుగుతుందా?) భూరమణుడైన శౌరి నెరుగుటకు కలిగిన జ్ఞానమును పొంది అది వేరొక దానికై వినియోగించవచ్చునా? శ్రీవేంకటేశునిపై కుదిరిన భక్తిని స్త్రీల కొరకు వ్యర్థము చేసికొనుట, తగవవునా (న్యాయమవుతుందా?) దేవకీనందనుడైన ఈ సర్వేశ్వరుని దాసుల దెలియుచు వుండాలన్నా జడులకు (పనికిమాలిన వారికి) తరమయ్యీనా (సాధ్యమవుతుందా)? కానేకాదు.





సంపుటి: 2 కీర్తన : ఎదురుమాటులాడితినీకు యీతప్పులు లోగొను నీవు

సంఖ్య : 299 పుట : 200 రాగం:

**100 ఎదురుమాటలాడితి నీకు యీతప్పులు లోఁగొను నీవు**
**పదరఁగఁదగదు నీకు పంతములిచ్చితిఁ గావఁగదే ॥ పల్లవి॥**

**మునుపే నే విన్నవించితిని విన నవధరించితివి నీవు**
**వెనకవేసుకో శరణు చొచ్చితిని విడువకు నన్ననుచు**
**ననుఁజూచి 'దేహి' యంటే 'నాస్తి' యనరాదు నీకు**
**ఘనయాచకుఁడను నేను కడుదాతవు నీవు ॥ఎదు॥**

**వెదకి నిను వేఁడుకొంటిని విచ్చేసితివి మాయింటికి**
**వదలఁదగదు నీ భక్తి యొసఁగు నీవాఁడను పాయకుమనుచు**
**పదిలంబుగ మొక్కినచేతులు బలిమిఁ గోయరాదు**
**యిదివో బంటును నేను యేలినవాఁడవు నీవు ॥ఎదు॥**

**మరిగి నీముద్రలు మోచితిని మన్నించితి విటు నను నీవు**
**కరుణతోడ నాయపరాధంబులు కడపు కావుమనుచు**
**యిరవై నీపేరు వెట్టితే నియ్యకొనక పోరాదు**
**నరమాత్రుఁడ నే శ్రీవేంకటేశ నాయకుఁడవు నీవు**
**॥ఎదు॥ 299**

**అవతారిక:**

అన్నమాచార్యులవారి ఈ కీర్తనకు ఏ రాగము పేరూ సూచించబడలేదు. అందుకే నేనూ ఆ సాహసం చేయలేదు. నా భావన

యేమంటే ఆచార్యులవారి ఆఖరి దశలో రచించిన కీర్తనకావచ్చును. ఎందుకంటే "ఇంతవరకూ నీకు యెదురు చెప్పాను యీ తప్పులు నీమనస్సులో పెట్టుకొని నన్ను కరుణించు. నీతో ఇన్నాళ్ళూ యెదురుచెప్పాను కాబట్టి ఈనాడు ఈ దీనునిపై పదరగన్ తగదు అంటే ఆగ్రహించుట తగినపనికాదు" అంటున్నారు. స్వామీ! "దేహి" అని అర్థించినవారికి "నాస్తి" అని మొండిచెయ్యిచూపించవచ్చునా. మరి ఈ యాచకుడిమీద నీకు చిన్నచూపు దేనికయ్యా అంటున్నారు. పదిలముగా నీకు మొక్కుతున్న ఈ నా జవసత్త్వాలు లేని చేతులను నీవే నరికేస్తే నేనెవరితో చెప్పుకోను తండ్రీ! నీ కీర్తనలను యెలా వ్రాయగలను? వ్రాయకుండా యెలా బ్రతికివుండగలను? వీడు నా ముద్రలు ధరించిన దాసుడులే అని నన్ను మన్నించావు. నేను నేడు నిన్ను పేరువెట్టితే (స్తుతిస్తుంటే) ఇయ్యకొనక పోరాదు, అంటున్నారు. ఓ శ్రీవేంకటేశ్వరా! నేను మానవమాత్రుడనయ్యా! నీవు లోకనాయకుడవు అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీకు ఎదురు మాటలాడితి (కాదని యెదురు చెప్పాను). నీవు ఈ నా తప్పులను లోగొనుము (మన్నింపుము). ఈ దీనునిపై పదరగన్ తగదు (ఆగ్రహింప తగదు). నా అజ్ఞానం కొద్దీ నీకు పంతములిచ్చితి (నీపై పంతము వహించాను). కావగదే (నన్ను రక్షించు ప్రభూ)

నేను ఇదివరకే నా బాధలను నీకు విన్నవించితిని. నీవు విని అవధరించితివి (అనుగ్రహించితివి). నన్ను విడువవలదు స్వామీ! అని నీకు శరణు చొచ్చితిని. నన్ను వెనక వేసుకో (నన్ను ఆదుకో). "దేహి" అని నిన్ను యాచిస్తే "నాస్తి" (లేదు) అని నన్ను నిరాకరించకు ప్రభూ!





యాచించడం నావృత్తి అనుగ్రహించడం నీ ప్రవృత్తి. మనమధ్య ఇంకొక సంబంధం వుంది స్వామీ! నేను ఘనయాచకుడను (ప్రసిద్ధి చెందిన యాచకుడను). నీవు కడు దాతవు (గొప్పదాతవు).

ఓ సర్వేశ్వరా! నిన్ను పెనుప్రయత్నమున వెదకి, కనుగొని మాఇంటికి విచ్చేసి నన్ను అనుగ్రహించమని వినయపూర్వకముగా వేడుకొంటిని. నీవు నా విన్నపములాలకించి మా ఇంటికి విచ్చేసితివి. నాకు నీ భక్తియే చాలునయ్యా! ఇతరములు నాకు అవసరంలేదు. నేను నీ వాడను ప్రభూ! నన్ను ఇకపై విడువ తగదు. నన్ను వదలి వేయకుమయ్యా! అని పదిలంబుగ (జాగ్రత్తగా) మొక్కిన చేతులను బలిమిని (బలవంతంగా) కోయుట తగునా స్వామీ! ఇదిగో నేను నీ బంటును (దాసుడను) నీవు నన్ను ఏలినవాడవు. నీవుకాక నన్నెవరు రక్షిస్తారు?

ప్రభూ! నేను విశిష్టాద్వైతినై నీ శంఖ చక్రముల ముద్రలను మోచితిని (ధరించితిని) వారిలో నన్ను ఆచార్యునిచేసి గొప్ప మన్ననొసగితివి. కరుణతో నా యొక్క అపరాధములను కడపు (త్రోలి పారవేయుము). నేను నిన్ను కావమనుచు (రక్షించమనుచు) యిరవై (నెలకొని) నీపేరువెట్టితే (నిన్ను స్తుతిస్తూవుంటే) ఇయ్యకొనక పోరాదు (నన్ను ఒట్టి చేతులతో త్రిప్పి పంపడం భావ్యము కాదు). ఎందుకంటే నీవు శ్రీవేంకటేశ్వరుడవు సర్వలోక నాయకుడవు. మరి నేనో నరమాత్రుడను (మానవమాత్రుడను). నీవు ఇచ్చేవాడవు నేను పుచ్చుకొనేవాడను.

సంపుటి: 1 కీర్తన : నీవు సర్వగుణసంపన్నుడవు నేనొక దుర్గుణిని
సంఖ్య : 514 పుట : 347 రాగం: మాళవిగౌళ

**మాళవిగౌళ**

**101** నీవు సర్వగుణసంపన్నుఁడవు నేనొక దుర్గుణిని
మానవు నన్నొకయెదురుచేసుకొని మనసుచూడనేలా అయ్యా
॥పల్లవి॥

యేలినవాఁడవు నీవు ఇటు నేఁ గొలిచినవాఁడ
పోలింపఁగ నీవే దేవుఁడవు భువి నే నొక జీవుఁడను
పాలించేవాఁడవు నీవు బ్రదికేవాఁడను నేను
తాలిమి నన్నొకసరిచేసుక నను దప్పు లెంచనేలా అయ్యా
॥నీవు॥

అంతర్యామివి నీవు అంగమాత్రమే నేను
చింతింపఁగ నీవే స్వతంత్రుఁడవు జిగి నేఁ బరతంత్రుఁడను
ఇంత నీవే దయఁగలవాఁడవు యెప్పుడు నే నిర్దయుఁడను
చెంతల నన్నొక మొనసేసుక నాచేఁత లెంచనేలా అయ్యా
॥నీవు॥

శ్రీవేంకటేశ్వరుఁడవు నీవు సేవకుఁడను ఇటు నేను
ఆవలనీవల దాతవు నీవు యాచకుఁడను నేను
నీవే కావఁగఁ గర్తవు నేనే శరణాగతుఁడను
కైవశమగు నను ప్రతివెట్టుక నాకథలు యెంచనేలా అయ్యా
॥నీవు॥514

**అవతారిక:**

మేము మానవమాత్రులం. సత్త్వరజస్తమోగుణోపేతులం అని పేరుకేగాని ఎక్కువపాళ్ళు తమోగుణాధికులం. కామక్రోధాది అరిషడ్వర్గ





పీడితులం. వాటిపీడవదలించుకోవటం మా తరముగావటంలేదు. మా పంచేంద్రియాలూ మామాట వినటంలేదు. ఏదో మాపై కనికరం వహించి ఇన్ని జీవరాసుల్లో శ్రేష్ఠమైన మానవజన్మనిచ్చావు. దానిని పూర్తిగా వ్యర్థం చేసికొన్నాను. నేడు కాటికి కాళ్ళుచాచుకొని కూర్చున్నాను. ఈ ఊపిరి యెప్పుడు ఆగిపోతుందో తెలియదు. ఎందుకిలా జరిగింది. నా పురాకృతకర్మ అన్నది శాస్త్రం. అది తెలుసుకొనీ నాకేమి వుపయోగం. ఓ సర్వేశ్వరా! జీవితచరమాకంలో నేనేమిటో నాకర్థమయింది. నేను దుర్గుణోపేతుడైన మానవుడను. అందితే జుట్టు అందకపోతే కాళ్ళు పట్టుకొంటాననే నిస్సిగ్గరిని. పోనీ మానసికంగా మంచివాడేలే అనికూడా చెప్పలేం. అయ్యా! నన్నెదురుగా బెట్టుకొని నా మనసుని చూచినా పరమనీచము. ఇక ఏ మొగము పెట్టుకొని నిన్ను అభ్యర్థించగలను? ఓ శ్రీవేంకటేశ్వరా! శరణు. నీవే తప్ప నితఃపరంబెరుగ. నీవు సర్వ సద్గుణ సంపన్నుడవు. జగద్రక్షకుడవు, మా అంతర్యామివి, కరుణామయుడవు. నేను నీ దాసుడను. దాసుని తప్పులు దండముతో సరి అంటారు కదా! నన్ను రక్షించు తండ్రీ. నాగత చరిత్రనెంచకు. దయతో నన్ను ఈ జననమరణ చక్రబంధం నుంచి విడిపించు, అని దీనంగా వేడుకొంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవు సర్వసద్గుణ సంపన్నుడవు. మరి నేనో...? నేను ఒక దుర్గుణిని (దుర్మార్గుడను), మానవమాత్రుడను. నన్ను యెదురు చేసుకొని (నిలదీసి) మనసు చూడనేల (చంచలము హీనగుణోపేతమూ అయిన నా మనస్సును చూచి లాభమేమిటయ్యా!)

అయినదేదో అయినది. ఇక నేడు నా విన్నపము లాలకించుము స్వామీ! నీకూ నాకూ పోలిక యేమిటయ్యా! నీవు యేలినవాడవు (పరిపాలకుడవు). నేను ఇటు (ఈ విధంగా) కొలిచే భృత్యుడను.

పోలించగా (పోల్చి చూస్తే) నీవు దేవుడవు. మరి నేనో.. ఈ భూమిపైకి నీ ద్వారా తెప్పించబడిన జీవుడను. నీవు పాలించేవాడవు (సర్వజీవులపరిపాలకుడవు). మరి నేనో... నీ దయాదాక్షిణ్యములపై బ్రతుకుతున్నవాడను. అట్టి నన్ను తాలిమితో (క్షమాగుణంతో) నన్ను సరిచేసికొనవలెను. అంతేకాని తప్పులెంచి నన్ను నిందించి దూరముచేయనేలనయ్యా!

సరే! ఇంకొక విషయం చెబుతాను, వినవయ్యా! నేను "అంగమాత్రుడను" యెముకలు, రక్తమాంసములూ వున్న కళేబరాన్ని. నీవు నా అంతర్యామివైన జీవుడవు. నీవులేకపోతే ఈ నా శరీరాన్ని మరుక్షణమే తగులబెట్టి వదలించుకొంటారు. నీవు సర్వ స్వతంత్రుడవు. మమ్ము పెంచాలన్నా త్రుంచాలన్నా నీ చిత్తము. చింతింపగ (ఆలోచిస్తే) నీవు జగన్నియంతవు. నేను పరతంత్రుడను (నీ దయాదాక్షిణ్యాలపై బ్రతికే భృత్యుడను). నీవు కరుణాసాగరుడవు. నేను దయాదాక్షిణ్యములేని నిర్దయుడను. స్వామీ! చెంతల (నన్ను నిశితంగా చూచి) నన్నొక మొనసేసుకొని (నన్ను సూటిగా ప్రశ్నించి) నా చేతలెంచనేలయ్యా! నా పనులను నిందించి లాభమేమిటి ప్రభూ!

ఇకపోతే ఇది జగమెరిగిన సత్యమే. నీవు లోకపాలకుడవైన శ్రీవేంకటేశ్వరుడవు. ఇటుచూస్తే నేను నీసేవకుడను. నీవు ఆవల నీవల దాతవు (ఇహపరములనొసగే దాతవు). నేను నీ దయ యెప్పుడొస్తుందా అని యెదురుచూసే యాచకుడను. నీవే కావగ (రక్షించుటకు) కర్తవు (కారకుడవు). నేనేమో నీ శరణార్థిని. ఇందులో మార్పేమీ లేదు. కైవసమగు (నీకు లొంగిపోయిన) నన్ను ప్రతివెట్టుక (ప్రతిపనికీ నేరములెంచి) నా కథలను (గత చరిత్రను) యెంచనేల (లెక్కించుటెందులకు) తండ్రీ!





సంపుటి: 15 కీర్తన : ఇంచుకంత ధర్మములో నున్నది యిందరిమేలును గీడును

సంఖ్య : 400 పుట : 269 రాగం: గుండక్రియ

## గుండక్రియ

102 ఇంచుకంత ధర్మములో నున్నది యిందరిమేలునుఁ గీడును
వంచనతోడుతఁ గైకొనఁదలఁచిన వారల నేరుపు లింతేకాని ॥పల్లవి॥

నరకము లనుభవించితి నని తలఁచిన నలిఁజెడుఁ బ్రారబ్ధకర్మములు
పరదారాదులఁ గలయఁ దలఁచిన పాపము లెల్లనుఁ జుట్టుకొను
సురలచరిత్రము వినినయంతలో సుకృతియై వెలయుఁ బురుషఁడు
దురతచిత్తుల విధంబులు వింటే దుష్కృత్యములకును గుఱియగును ॥ఇంచు॥

చచ్చినభావమె బ్రతికినయప్పుడు శరీరసుఖములు మఱచిన ముక్తుఁడు
యిచ్చల మృతునకు విభవముసేసిన యేడకు నెక్కుదు వృథా వృథా
యెచ్చుగ నొరులకు నిచ్చినయర్థము మీఁదమీఁద ఫలియించు
తెచ్చి లోభమున దాఁచిన ధనములు తీరక భూగతమై యుండు ॥ఇంచు॥

యిలువేలుపైన శ్రీవేంకటేశ్వరు నెఱిఁగి కొలిచినను భవ మీదేరును
పలుకర్మంబుల నెంత దొరలినా ప్రయాసములే కడుఘనము
అలమేల్మంగ పురుషకారమున ఆచార్యునుమతి మెలఁగును
వలవని లావుల వశగతుఁడైనను వానిచందములు హరియే ॥ఇంచు॥

**అవతారిక:**

కొద్దిపాటి ధర్మము చేసినా అది చివరికి మేలు కలిగిస్తుంది. అదే వంచన చేసినచో వారికి కీడు తప్పదు. ఏదికావాలో అది పొందాలంటే ఎవరివలనా అయ్యేపనికాదు. ఈ అనుభవించిన పాపం చాలును, అని పశ్చాత్తాపంతో పాపమునకు దూరముగా వుండేవానికి ప్రారబ్ధకర్మల బెడద వుండదు. అదే దుర్మార్గుల విధానమే వింటుంటే వీడూ దుస్కృత్యములే చేస్తుంటాడు. లోభి తనుతినడు పరులకు పెట్టడు. వాడిధనము భూమిపాలే అయితీరుతుంది అంటున్నారు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. చేసిన పాపము తొలగిపోవాలంటే శ్రీవేంకటేశ్వరుని కరుణ లభించకపోతే సాధ్యమే కాదు. ఆచార్యుని అనుమతితో అలమేల్మంగావిభుని భక్తితో సేవించినవారికి జన్మ ధన్యమవుతుంది. ఇందులో అణుమాత్రం సందేహం లేదు. చచ్చి శవమైనవాడికి యెంత అలంకరణ చేసినా వృథాయే కదా! అలాగే భగవద్భక్తి లేనివాడు యెన్నడూ ఆస్వామికృపను పొందలేడు. ఆయన కృపలేకపోతే యెన్ని మానవప్రయత్నాలైనా వృథా వృథా అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ప్రపంచంలో మీఅందరికీ కొన్ని మేళ్ళూ కొన్ని కీళ్ళూ జరుగుతుంటాయి. ఎందుకో తెలుసా? మీరు ధర్మమును ఇంచుకంత (కొద్దిపాటి) చేసినా మీకు మేలు జరుగుతుంది. అదే పరులను వంచనతో గైకొన (మీవశము చేసికొని) దలచినచో వారల చాకచక్యమంతా చివరికి నిరుపయోగమవుతుంది.

అయో! ఏనాడో ఏపాపమో చేశాను, ఈనాడు దాని పర్యవసానంగా నరకము (శిక్షలు) అనుభవిస్తున్నాను) అని పశ్చాత్తాపంతో వున్నవాడికి ప్రారబ్ధ కర్మలపీడ బాధించదు. పరస్త్రీవ్యామోహముగలవానికి





సమస్తపాపములూ చుట్టుకొంటాయి. సత్కార్యములు చేసి ధర్మము నిలబెట్టిన దేవతల పుణ్యకథలను వింటూ కాలము సాత్వికంగా గడిపేవారికి అది సుకృతియై (పుణ్యమై) పరిణమిస్తుంది. కానీ పురుషుడు దురితచిత్తులు (పాపాత్ముల) విధంబును వింటూ వుంటే వాటి ఉద్ధతివలన వీడూ దుష్కృత్యములు (చెడుపనులు) చేస్తుంటాడు. ఇది లోకపురీతి.

బ్రతికినయప్పుడె (జీవించివుండగానే) నేను జీవించిలేను అనే భావనతో దేహాభిమానమును వదలివైచి శరీరసుఖములను మఱచినచో ఆతడు తప్పక ముక్తుడగును. వాడికి తిరిగి జన్మించనవసరమే లేదు. మృతునకు (చచ్చినవానికి) యిచ్చల విభవము సేసిన (యెంతో వైభవంతో అలంకరణ చేస్తే) యేదకునెక్కుదు (యేమి వుపయోగము)? అదంతా వృథావృథా (శుద్ధదండుగ). ఒరులకు మెచ్చుగ (ఇతరులను మెచ్చుకొంటూ) ధనసహాయము చేస్తే, అది మీద మీద ఫలంబులనిచ్చును (అధికమైన ఫలితమునిస్తుంది). అదే లోభముతో పరులకివ్వక తాను దినక కూడబెట్టినధనము, తీరక (నిరుపయోగమై) భూగతమైవుండు (భూమిలోనేవుండి) యేనాడో యెవరికో దొరుకుతుంది. అంతే.

మనందరి ఇలవేల్పు అయిన శ్రీవేంకటేశ్వరుని తెలుసుకొని కొలిచినవానికి, భవమీదేరు (జన్మవుండదు). ఆ విధంగా కాక కర్మిష్ఠియై యెన్ని వైదిక కర్మలు చేసిన ప్రయాసములే కడు ఘనము (గొప్ప శ్రమ మాత్రమే మిగులుతుంది.) మహా అయితే ఇంకొక కర్మిష్ఠి జన్మ లభిస్తుందేమో? అలమేల్మంగ విభుని, ఆచార్యులు చెప్పినట్లు మెలగుచూ సేవించిన యేమి జరుగుతుందో తెలియునా? వలవని లావుల వశగతుడై (అనవసరమైన దర్పమునకు వశుడై) భ్రష్టుడైనవాని నడతలు హరియే సవరించగలడు.

సంపుటి: 2 కీర్తన : సరిగాదు వీడున వలదు జగమున రాజు వలసినది దేవులు

సంఖ్య : 298 పుట : 199 రాగం: సామంతం

## సామంతం

103 సరిగాఁదు వీఁడన వలదు జగమున రాజు వలసినది దేవులు
ఇరవుగ నందరు లోకములోపల యిది నానుడి మాట ॥పల్లవి॥

జగదేకబంధుఁడవట సకలజీవులకును, గుఱుతుగ
మొగముచూపవయ్యా మీకు మొక్కెదనిదె నేను
తగులైనచుట్టరికము దాఁచఁగ నిఁకనేలా
తెగరానిమమకారము తెలుపఁగవలెఁగాని ॥సరి॥

యితవైనప్రాణమవట యీచరాచరములకు, అభయము
సతత మియ్యవయ్యా మాకును సన్నుతింతు నిన్ను
మతిఁ బాయనికూటంబులు మానుప మరి యాలా
జతనంబునఁ జాలాఁబ్రియములు జరపఁగవలెఁగాని ॥సరి॥

నెలవైనయేలికెవట నీదాసులకెల్లా, వేళలు
దెలియఁజెప్పవయ్యా మిమ్మును తిరముగఁ గొలిచెదను
బలువయిన శ్రీవేంకటేశ పరాకు లిఁకనేలా
చెలరేఁగి నీసులభత్వమే చెల్లింపవలెఁగాని ॥సరి॥298

**అవతారిక:**

తావలచినది రంభ తామునిగినది గంగ అన్నారు పెద్దలు. అదే కోవలో ఒక చక్కటి నానుడితో ఈ కీర్తననాలపిస్తున్నారు అన్నమాచార్యులవారు.





"ఓ దేవదేవా! లోకంలో ఒక నానుడి వుందయ్యా! రాజుగారు వలచినదే పట్టపురాణి. అందుకని నన్ను వీడు సరియైనవాడు కాదని వదలక నన్ను ఆదరించవయ్యా! నిన్ను కాదనే మొనగాడు యెవడున్నాడు?" అంటున్నారు. నీవు సకల జీవులకు జగదేక బంధువవు. నామీదకూడా అంతులేని మమకారం చూపించాలి కానీ ఇలా నన్ను నిరాదరణకు గురిచేయవచ్చునా? నేను నీనుంచి ఆశించేది పెద్దగా యేమీ లేదు స్వామీ! నిన్ను విడిచి వుండలేనయ్యా! మరి నా కూటమిని నిరాకరించటం దేనికి ప్రభూ! నాపైకూడా కాస్త ప్రేమ చూపించవచ్చును కదా అంటున్నారు. నీవు నీ దాసులను విడనాడవట. పోనీ నాకంత అదృష్టం లేకపోయినా నిన్ను నేను యెప్పుడుసేవించుకోగలనో కాస్త ముందే చెబుతే నీకు ఇబ్బంది లేకుండా నీసేవ చేసుకుంటాను. నామీద పరాకేల తండ్రీ! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ ప్రభూ! వీడు సరిగాదు అనవలదు (ఇతడు తగినవాడు కాదు అని అనవద్దు). నీవు అవునంటే నన్ను కాదనే ధైర్యం యెవరికి వుంటుంది? ప్రపంచంలో రాజుగారు వలచిన వనితే దేవుల (దేవేరి) అవుతుంది కదా! రాజు గారిని కాదనగలిగినదెవరు? ఈ లోకంలో ఇరవుగ (సుస్థిరముగా) అందరూ అవుననే నానుడిమాట (సామెత) ఇదే కదా!

స్వామీ నీవు సకల జీవులకు జగదేక బంధుడవట. ఆ మాటకు గుర్తుగా సమ్మోహనకరమైన నీ మొగమును (వదనమును) చూపవయ్యా! నేను ఇదే మీకు మొక్కెదను. ఇక తగులైన (ఆపేక్షగల) చుట్టరికమును (మన బంధుత్వమును) దాచగనేలా (దాచిపెట్టుట యెందులకు?) తెగరాని మమకారము (తెగిపోని అనుబంధము) తెలుపగవలెగాని (బహిర్గతము చేయవలెను కాని) నీలో నీవే దాచిపెట్టుకోవటం దేనికి స్వామీ!

దేవదేవా! నీసృష్టిలో చరములు (కదలికగలిగినవి) అచరములు (కదలిక లేనివి) అని రెండు రకముల ప్రాణులున్నవి. ఈ రెండిటికీ యితవైన (హితుడవైన) నీవే ప్రాణమట. స్వామీ! సతతము (యెల్లప్పుడు) సన్నుతింతు (నిన్ను ఆరాధించెదను) మాకును అభయము నీయవయ్యా! నీలో నా కూటంబులు (కలయికలు) మతిబాయనివి (నేను యెన్నటికీ మఱువలేనివి. మరి వాటిని జతనంబున (గొప్ప ప్రయత్నంతో) మానుపయాలా (నిరోధించుట యెందులకు) తండ్రీ! నావంటి ఆశ్రితునితో చాలా ప్రియములు (యెన్నో ప్రియసంభాషణలు) జరుపగవలెగాని (జరుపవలెను గాని) ఈవిధముగా నన్ను తృణీకరించవచ్చునా? ఇది తగదు స్వామీ!

ఓ తిరుమలనాయకా! నీవు నీదాసులకెల్లా నెలవైన యేలికవట (పరిచయమైన పరిపాలకుడవట). నీ యేలుబడిలోవున్న ప్రతి ఒక్క ప్రాణి గురించి నీకు తెలియును. నీకు కోటానుకోట్ల సంఖ్యలో అర్చించేవారు వున్నారు. మరి నాబోటి సామాన్యుడికి కూడా నిన్ను సేవించే అవకాశము రావాలి కదా! నాకు వేళలు తెలియజెప్పవయ్యా! (నిన్నెప్పుడు సేవించుకోవచ్చో తెలియజెప్పవయ్యా!) అప్పుడే మిమ్ము తిరముగా (స్థిరముగా) గొలిచెదను (పూజించుకొంటాను). బలువైన (బలవంతుడవైన) ఓ శ్రీవేంకటేశ్వరా! ఇంకా నీకు పరాకులు (నిర్లక్ష్యం) యేలనయ్యా! (యెందుకు స్వామీ?) చెలరేగి (విజృంభించి) నీ సులభత్వమే (భక్తి సులభుడవనే నీ బిరుదు) నిలబెట్టుకోవయ్యా! ఇట్లా మా పంతము చెల్లింపవలెగాని మమ్ము నిర్లక్ష్యం చేయదగునా ప్రభూ!





సంపుటి: 2 కీర్తన : ఏదిగతి నేనొక్కడనే యెందరి కోపుదును
సంఖ్య : 300 పుట : 201 రాగం: సామంతం

## సామంతం

104 ఏదిగతి నేనొక్కఁడనే యెందరి కోపుదును
నీదయతో మన్నించఁగదవే నీరజనాభా ॥ పల్లవి॥

మోహాంధకారము యెక్కడచూచిన ముంచుకవున్నది
దేహాభిమానము అందుకుఁ దోడు దీకొనివచ్చీని
సాహసభూతము ఘనహింసలకే చాఁపించీఁ జేయి
దాహపుటాసలు వెనకముందరల తరవులువెట్టీని ॥ఏది॥

కోపాగ్నికణములు సారెకుఁ జుట్టుక గుబ్బతిలఁదొడఁగె
పైపై వయోవికారంబులు చలపట్టుక తిరిగీని
చాపలగర్వము యెవ్వరినైనా సాధింపించీని
తీపులధనములు మీఁది మీఁదనే తీదీపులు రేఁచీని ॥ఏది॥

భావజవిలాస మప్పటప్పటికి బలుములు చూపీని
వేవేలుసంపద లెందుచూచినా వేడుక సేసీని
శ్రీవేంకటేశ యలమేల్మంగను చేకొనుదేవుఁడా
యీవేళను నన్నేలితివి నాకు నిన్నియు తగ వసమయ్యాని
॥ఏది॥300

**అవతారిక:**

భగవంతుని శరణాగతినొందని మానవునికి నిష్కృతి లేదు. కామక్రోదవశుడై గొప్ప మోహాంధకారంలోపడి కొట్టుమిట్టాడుతుంటాడు.

వాడికోపమే అగ్ని కణాలవలె వాడిని దహించి వేస్తుంటాయి. దానికి తోడుగా గర్వమనే మాయరోగంవాడు బాగు పడతానన్నా బాగుపడనీయదు. యవ్వనం రాగానే మన్మథుడు వాడి ప్రతాపమునంతా వీడిపైననే చూపిస్తుంటాడు. ఒకవేళ వీడి అదృష్టవశమున సంపదలు లభిస్తే వీడికి దేవుడి ధ్యాసే వుండదు. రాత్రీ పగలు అనే తేడా లేకుండా ఒకటే భోగాసక్తి. ఇంత ఘోరమైన పరిస్థితులలో ఆ శ్రీవేంకటేశ్వరుడి కృప తనపై వర్షించి ఆయన తనను తన యేలుబడిలోనికి తీసికొన్నాడని అంటున్నారు తాళ్ళపాక అన్నమాచార్యులవారు. అందుకనే ఓ పద్మనాభా! నేనొక్కడనే యెంతమందికి ఓపుదును అంటున్నారు. అంటే స్వామీ! నేను ఒంటరిగా యెంతమందికి చాలుతానయ్యా! నాకు యెంతోమంది శత్రువులున్నారు నీ దయతో నీవే నన్ను అనుగ్రహించాలి అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ నీరజనాభా! (పద్మనాభా!) నేనొక్కడనే ఒంటరిగా, యెందరికి ఓపుదును (సరితూగుగలను). నాకు గతి యేదయ్యా? (తరుణోపాయం యేమిటి స్వామీ?) నీదయతో నన్ను మన్నించగదవే (నన్ను కరుణింపుము ప్రభూ!)

నా అవస్థ యెటువంటిదో యేమి చెప్పమంటావు స్వామీ! ఈ ప్రపంచంలో యెక్కడ చూచిన మోహాంధకారము తాండవిస్తున్నది. అందుకు తోడు దేహాభిమానము (నా దేహముపై నాకు సహజముగా వుండే అభిమానము) దీకొని వచ్చీని (ఢీ కొట్టుటకు సిద్ధముగా వుండనే వున్నది). నాచేత అనవసరమైన సాహసాలు చేయించే భూతం ఒకటి యెప్పుడూ నా సంయమనం చెడగొట్టి, నాచేయి ఘనహింసలకు చాపించి





(నన్ను ఘోరహింసలు చేయుటకు ప్రోత్సహిస్తున్నది). దాహపుటాసలు (దహించివేసే కోరికలు) నన్ను వెనకనుంచి, ముందరనుంచి, తరవులు వెట్టీని (తరుముకొని వస్తున్నాయి.) ఈ పీడ భరించలేను ప్రభూ!

దేవా! సారెకు (ప్రతిసారీ) నాకు కోపము వస్తుంటుంది. అది యెటువంటిదంటే దాని అగ్నికణములు నన్ను జుట్టుక (చుట్టుముట్టి) గుబ్బతిలదొడగె (అతిశయింపజేయుచున్నది). పైపై వయోవికారములు (సులభముగా అలవడే యౌవన వికారములు) చలపట్టుక (మత్సరమును పెంచి) తిరిగీని (నన్ను ఇష్టమొచ్చినట్లు తిప్పింది). చాపల్యంతో (చపలత్వంతో) కూడిన గర్వము యెవ్వరినైనా సాధించగలదు. దానికి నేనొక లెక్కనా? తీపుల ధనములు (యాతనలు పెట్టే ధన సంపదలు) మీదిమీదనే (పైపైనే) తీదీపులరేచీనీ (మదమును రెచ్చగొడుతుంది). ఈ హింస భరించలేకున్నాను ప్రభూ!

భావజ విలాసము (మన్మథుని యొక్క విలాసము) అప్పటప్పటికి (అప్పుడప్పుడూ) తన బలములు చూపీని (తనయొక్క ఉద్ధతిని చూపించినది). వేవేలు సంపదలు (అనేక వైభవములు) ఎచ్చట జూచినా వేడుకల నందించినవి. దేవి అలమేల్మంగను చేకొను (చేపట్టిన) దేవుడా! ఓ శ్రీవేంకటేశ్వరా! యీవేళ నన్నేలితివి. నాకు ఇన్నియును (ఇహపరములు రెండుకూడా) వసమయ్యానీ (వశమైనవి). నేను ధన్యుడనైతిని తండ్రీ!

సంపుటి: 2    కీర్తన : జగన్మోహనాకార చతురుడవు పురుషోత్తముడవు

సంఖ్య : 375   పుట : 252    రాగం: బౌళి

**బౌళి**

**105 జగన్మోహనాకార చతురుఁడవు పురుషోత్తముఁడవు**
**వెగటునాసోదంబు ఇది నీవెలితో నావెలితో ॥ పల్లవి॥**

**యెన్ని మారులు సేవించినఁ గన్నులూ దనియవు**
**విన్ననీకథామృతమున వీనులుఁ దనియవు**
**సన్నిధిని మిమ్ము నుతియించి సరుస జిహ్వయుఁ దనియదు**
**విన్న కన్నది గాదు ఇది నావెలితో నీవెలితో ॥జగ॥**

**కడఁగి నీప్రసాదమే కొని కాయమూఁ దనియదు**
**బడిఁ బ్రదక్షిణములుసేసి పాదములు నివిఁ దనియవు**
**నుడివి సాష్టాంగంబు చేసి నుదురునాఁ దనియదు**
**వెడఁగుఁదన మిది గలిగె నిది నావెలితో నీవెలితో ॥జగ॥**

**చెలఁగి నిను నేఁ బూజించి చేతులూఁ దనియవు**
**చెలువు సింగారంబు దలఁచి చిత్తమూఁ దనియదు**
**అలరి శ్రీవేంకటగిరీశ్వర ఆత్మ నను మోహించఁజేసితి**
**వెలయు నన్నియుఁ దేరె మును నీవెలితో నావెలితో**
**॥జగ॥ 375**

**అవతారిక:**

అతిమనోహరమైన కీర్తననాలపిస్తున్నారు అన్నమాచార్యులవారు. మనిషికి పారవశ్యం కలిగినప్పుడు శరీరంలో కొన్ని మార్పులు జరుగుతాయి. మనస్సులో కలిగిన ఆ గాఢమైన పారవశ్యమే





శరీరమంతటా కనబడుతుంటుంది. గాఢమైన ఆ భావము యెవరికి వారు అనుభవించాలేగాని ఇట్లా వుంటుందని వివరించలేము. దీనినే అన్నమయ్యకాలంలో "ఆసోదము" అనేవారు. వెలితి అంటే లోపము అని చెప్పుకోవాలి. ఈ పల్లవికి అర్థమేమంటే ఓ జగన్మోహనాకారా! నీవు గొప్ప చాతుర్యం కలవాడవే. పురుషోత్తముడని పిలువదగినవాడవూ నీవే. అది జగమెరిగిన సత్యమే. కానీ నిన్ను చూడగానే కళ్ళకుకట్టినట్లు నాలో కలిగే మార్పులు కొద్దిగా వెగటుగా కనుపించినా అది నాలోపమో మరి నీ లోపమో నాకు అంతుచిక్కకుండా వున్నది. కానీ ఒక్కటి మాత్రం నిజం. నిన్నెంత సేపు చూచినా తనివి తీరటం లేదు. నిన్నెన్నిసార్లు కీర్తించినా తనివి తీరటంలేదు. నా మోహానికి అంతేలేదు. ఓ వేంకటేశ్వరా! ఇది నీవెలితో నా వెలితో తెలియటం లేదు తండ్రీ! అంటున్నారు, అన్నమయ్య. ఇంతకీ తనియుట అంటే యేమిటో తెలుసా? తృప్తి చెందుట.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవు జగన్మోహనాకారుడవు (ముజ్జగంబులను మోహింపజేయగల సౌందర్య రూపము గలవాడు), చతురుడవు (సమయస్ఫూర్తితో నీ శత్రువులనణచినవాడవు), పురుషోత్తముడని వేదము ఘోషించే మహానుభావుడవు. కానీ నిన్ను చూడగానే ప్రస్ఫుటంగా నాలో కనుపించే, వెగటున్ ఆసోదంబు (కొద్దిగా వెగటనిపించే నాలోని మార్పులు) నీవెలితో నావెలితో (నీ లోపమో నాలోపమో) అర్థం కాకుండా వున్నది ప్రభూ!

తండ్రీ! నిన్ను యెన్ని మారులు (పర్యాయములు) సేవించినా నా కన్నులు తనియవు (తృప్తిని చెందనే చెందవు). ఇక నా వీనులు (చెవులు) తక్కువ తిన్నాయా? నీ భాగవత కథామృతమును యెన్నిసార్లు వినినప్పటికీ అవి తనియవు. మీ సన్నిధిని జేరి యెంత స్తుతించినా ఈ జిహ్వ (నాలుక) తనియదు.

విన్నకన్నదిగాదు (నీ లీల యెంత వినినా యెంతకనినా అర్థం కాకుండా వున్నది). ప్రభూ! ఇది నీవెలితో (లోపమో) నావెలితో (లోపమో) తెలియవచ్చుటలేదు.

మధురమైన నీ ప్రసాదమును యెంత స్వీకరించినా నా దేహము తృప్తి చెందుట లేదు. నీ ఆలయమును చేరి బడి బ్రదక్షిణములు (క్రమముగా ఆలయ ప్రదక్షిణలు) యెన్ని చేసినా నా పాదములు తనియవు. నీకు సాష్టాంగనమస్కారం చేస్తూ నా నుదురును భూమికి భక్తితో తాకిస్తుంటాను. కానీ అదేమిచిత్రమో! యెన్నిసార్లు నా నుదురు భూమిని తాకినా నాకు తృప్తి కలుగుట లేదు. నేను చూపించే నా వింత ప్రవర్తన కొందరికి వెడగుగా (వికారముగా) తోపవచ్చును. కానీ అది నాలోపమో లేక నన్ను వివశుని జేసి అట్లా చేయిస్తున్న నీ లోపమో, నాకు యేమాత్రం అర్థం కావటం లేదయ్యా!

ఇకపోతే నా ఈ చేతులున్నాయే ఇవి మాత్రం తక్కువ అనుకోకు. వీటికి యెన్నిసార్లు నిన్ను బూజించినా తృప్తి కలుగదు. మనిషి అన్ని అంగాలలోకి మనస్సు చక్రవర్తి వంటిది. అంతా దాని ఇష్టమే నంటుంది. ఈ నా చిత్తము (మనస్సు) నీ చెలవు సింగారములను (సుందరమైన అలంకారములను) యెంత తలచుకొనినా తృప్తి చెందదు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు నా ఆత్మలో సుస్థిరుడవై నన్ను అనుక్షణమూ మోహింపజేయుచున్నావు. ఇవన్నీ ఈనాడు నాకు వచ్చిన తిప్పలు కావు. ఇన్నియు, మును వెలియన్ తేరే (ఇవన్నీ ఇదివరకే నాలో పైకితేరి కనుపించుచునే వున్నవి తండ్రీ!)





సంపుటి: 15 కీర్తన : ఎన్నిలేవు యీ యింద్రజాలములు
యెట్టు నమ్మెడిది వో సర్వేశ్వర
సంఖ్య : 317 పుట : 213 రాగం: శుద్ధ వసంతం

## శుద్ధ వసంతం

**106** ఎన్నిలేవు యీ యింద్రజాలములు యెట్టు నమ్మెడి వో సర్వేశ్వర
మన్నించి నన్నిటు బోధింపఁగదవె మాయాతీతుఁడ విన్నిటను
॥ పల్లవి॥

తామసునకుఁ బుట్టిన సుజ్ఞానము తత్త్వవాదమునకే మొదలు
కాముకునకుఁ దోఁచిన వివేకము కాంతాళములకే సెలవవును
పామరునకుఁ బొడమిన వైరాగ్యము పరదూషణకే పనియవును
సామాన్యున కటువచ్చిన చదువులు సాధింపవు మోక్షముతెరువు
॥ఎన్ని॥

జగతి నాస్తికున కొదవిన సత్యము శపథంబులకే గుఱియౌను
మగటిమి దుర్జనుఁ డెఱిఁగినమంత్రము మారణాదులకే సాధనము
పగటున లోభి యొనర్చిన పుణ్యము ప్రత్యవాయముల కాలయము
వెగటునఁ గ్రూరుఁడు చేసిన తపమది వీరిడితనముల కాకరము
॥ఎన్ని॥

సరిఁబాపికిఁ గల దాక్షిణ్యము జారచోరులకు సహాయము
విరసవర్తనున కాచార మబ్బిన విపరీతంబులే దొరకొనును
దురితచిత్తునకుఁ జిక్కినయుక్తులు తుచ్ఛంబులపాలుగఁ జేయున్
చిరముగ శ్రీవేంకటేశ మిమ్ముఁ గొలిచినవారలే యిల నతిఘనులు
॥ఎన్ని॥

**అవతారిక:**

ఓ సర్వేశ్వరా! నీవు మాయా తీతుడవు. మాయ నిన్నేమీ చేయలేదు. నేను మానవ మాత్రుడను. మాయను నిర్జించటం నావల్ల అయ్యేపనేనా? ఇవన్నీ ఇంద్రజాలము వంటివి. గారడీవాడు ఇంద్రజాలం చేస్తుంటే అదంతా నిజంగా జరుగుతున్నదనే భ్రమ కలగటం సహజమే కదా! అట్లా కొన్నిటిని నమ్మి మోసపోయాను. కాని ఇంకా యెట్లా నమ్మేదయ్యా? కానీ ఈ నీమాయను గెలువగలిగినట్లు నన్ను మన్నించి నాకు బోధించితివి. సర్వదా నీకు కృతజ్ఞుడను. ఒక జ్ఞానికి చదువుతోడయితే గొప్ప మేలు జరుగుతుంది. ఎందుకంటే ఆ జ్ఞాని మోక్షమునకు కృషి చేసి దానిని సాధించగలుగుతాడు. సాత్త్వికులు తపోమార్గమునవలంభించి భగవంతుని కృపకుపాత్రులు కావలెను కానీ రజోగుణము కలవారు, తమోగుణము కలవారు పట్టుదలతో తపోసాధన జేసి భగవత్సాక్షాత్కారము పొందినా రావణ భస్మాసురుల వలె భ్రష్టులవుతారు గాని లోక కళ్యాణం సాధించలేరు. ఏదో విధంగా మానవమాత్రులను తృప్తిపరచటం వల్ల ఒరిగేదేమీ వుండదు. ఏవేవో సాధనల ద్వారా యెన్ని ఘనతలు పొందినా అది నిరుపయోగమే. కానీ ఆ దీక్ష పట్టుదల శ్రీవేంకటేశ్వరుని కొలుచుటకు వినియోగిస్తే అతిఘనులు కాక ఇంకేమవుతారు అంటున్నారు తాళ్ళపాక పెదతిరుమలాచార్యులవారు. మరి అన్నమయ్య సుపుత్రడేకదా!

**భావ వివరణ:**

ఓ సర్వేశ్వరా! ఈ లోకంలో మానవమాత్రులమైన మమ్ము వశపరచుకోగల ఇంద్రజాలములు యెన్ని లేవయ్యా? వాటిని అధిగమించడం నావల్ల అవుతుందా? వీటిని యేవిధంగా నమ్మగలనయ్యా? నీవు మాయాతీతుడవు (మాయకు లొంగనివాడవు). ఇన్నిటను (వీటన్నిటిలో) నన్ను మన్నించి నాకు సరియైన జ్ఞానమును బోధింపుము ప్రభూ!

స్వామీ! తామసునకు (తామసగుణముకలవానికి) సుజ్ఞానము కలిగినా ప్రయోజనము గురించి వాదన చేయుటకే వినియోగిస్తాడు. కాముకునికి





వివేకము దోచిన (తెలివితేటలు కలిగితే) కాంతాళములకే (స్త్రీ సాంగత్యానికే) ఉపయోగిస్తాడు. పామరుడికి (జడునికి) వైరాగ్యము కలిగితే దాన్ని పరదూషణకు (ఇతరులను నిందించటానికి) ఉపయోగిస్తాడు. జ్ఞానికాని సామాన్యునికి, అటు చదువులు వచ్చిన (విద్య లభించిన) మోక్షముతెరువు (ముక్తి మార్గము) సాధించుటకు ఉపయోగించవు. అవి పాండిత్య ప్రదర్శనకు సన్మానాలు పొందటానికి వినియోగిస్తాడు.

జగతిని (ప్రపంచంలో) నాస్తికుడు సత్యము చెప్పుట అలవాటు చేసికొంటే దానివలన ప్రయోజనమేమీ వుండదు. ఎందుకంటే వాడు దానిని ప్రతిజ్ఞలు చేయటానికి వుపయోగిస్తాడు. దుర్జనుడు (దుర్మార్గుడు) మగటిమి (ప్రతాపము) కలవాడైతే మంత్రతంత్రములకు మారణాదులకు (వినాశనమునకు) వినియోగిస్తాడు. లోభియైనవాడు పగటున (బాహాటముగా) పుణ్యము చేసినా అది ప్రత్యవాయములకు (పాపముగానే) పరిణమిస్తుంది, ఆ పాపమునకు ఆలయమవుతుంది. వెగటున (ద్వేషముతో) క్రూర స్వభావము గలవాడు తపస్సు చేసినప్పటికీ అది వీరిడితనములకు ఆకరము (అవివేకముతో కూడిన వరములడుగుటకే వుపయోగపడుతుంది).

పాపాత్మునకు దాక్షిణ్యమే వుండదు. ఒకవేళ వున్నా వాడి దాక్షిణ్య జారులకు (వ్యభిచారులకు), చోరులకు (దొంగలకు) సహాయపడుతుంది కాని మరేమీ కాదు. విరస వర్తనము గలవాడు ఆచారవంతుడైతే విపరీతముగా ప్రవర్తిస్తాడుగాని మరొకలా ప్రవర్తించడు. దురిత చిత్తునకు (పాపచింతన కలిగిన వానికి) యుక్తులు జిక్కిన (యుక్తిమంతుడైతే) ఆ యుక్తులన్నీ తుచ్ఛమైన పనులు చేయటానికే వినియోగిస్తాడు. ఓ శ్రీవేంకటేశ్వరా! చిరముగ (చిరకాలముగా) మిమ్ము భక్తితో కొలిచెడివారికే వసుధలో చాలా గొప్పవారనే కీర్తి దక్కుతుంది.

సంపుటి: 1 కీర్తన : కోరుదు నామది ననిశము గుణాధరు నిర్గుణు కృష్ణుని

సంఖ్య : 141 పుట : 96 రాగం: మలహరి

### మలహరి

**107 కోరుదునామది ననిశము గుణాధరు నిర్గుణు కృష్ణుని**
**నారాయణు విశ్వంభరు నవనీతాహారుని॥ ॥పల్లవి॥**

**కుండలిమణిమయ భూషణు కువలయదళ వర్ణాంగుని**
**అండజపతి వాహనుని అగణిత భవహరుని**
**మండనచోరక దమనుని మాలాలంకృత వక్షుని**
**నిండుకృపాంబుధి చంద్రుని నిత్యానందునిని॥ ॥కోరు॥**

**ఆగమపుంజ పదార్థుని ఆపత్సఖ సంభూతుని**
**నాగేంద్రాయత తల్పుని నానా కల్పునిని**
**సాగబ్రహ్మమయాఖ్యుని సంతత గాన విలోలుని**
**వాగీశ్వర సంస్తోత్రుని వైకుంఠోత్తముని ॥కోరు॥**

**కుంకుమవసంత కాముని గోపాంగన కుచలిప్తుని**
**శంకర సతీమణి నుతుని సర్వాత్ముని సముని**
**శంకనినాద మృదంగుని చక్రాయుధ విదీప్తుని**
**వేంకటగిరి నిజవాసుని విభవ విధాయకుని ॥కోరు ॥**

**అవతారిక:**

అనిశము అంటే యెల్లప్పుడూ అని అర్థం. ఈ శ్రీకృష్ణుడు యెటువంటివాడు? సకల సద్గుణములను ధరించినవాడు. అంతేకాకుండ ఈయన నిర్గుణుడు, నారాయణుడు, విశ్వమంతయూ నిండిన దేవదేవుడు. నేడు మనల్ని నవనీతాహారుడై మురిపిస్తున్నాడు. అంతే కాదు నేను యెల్లప్పుడూ నామనస్సులో ఈయననే కోరుదును అంటున్నారు





అన్నమాచార్యులవారు. ఈ కీర్తనలో తాళ్ళపాకవారు వాడిన విశేషణాలూ, వర్ణనలు రమ్యాతిరమ్యములు. ఉదాహరణకు కువలయ దళవర్ణాంగుడు అంటే యెవరు? నల్లకలువపువ్వుల దళములవంటి రంగుగల శరీరాంగములు కలిగినవాడు. అంటే శ్రీకృష్ణుడు. ఏమిటారంగు ప్రత్యేకత? అది వుత్తనలుపుకాదు ఒక విధమైన మెరుపుకల నలుపు. అంత నిశిత వర్ణన ఆచార్యులవారి ప్రత్యేకత. ఈ కీర్తనలో ఇంకొక ప్రత్యేకతయేమిటంటే చాలా పదాలకు నిఘంటువు లేకపోతే అర్థం తెలియదు. అదట్లావుంచి కొన్ని పదాలకు నిఘంటువు వున్నా అర్థం తెలియదు. భావించాల్సిందే. దీనికి తోడు పదములు అటూ ఇటైనవి. "మండన చోరకదమనుడు" అనే విశేషణాలూ వున్నా "సాగ బ్రహ్మమయాఖ్యుడు" అనే మాటలు సులభగ్రాహ్యంకాదు. ఆ మాటకు పరబ్రహ్మ అని విఖ్యాతి చెందినవాడు అని అర్థం. సరే! తినబోతూ రుచి అడగటం దేనికి? భావవివరణ అతి జాగ్రత్తగా చదవండి.

**భావ వివరణ:**

నామదిలో అనిశము (యెల్లప్పుడూ) కృష్ణుని కోరెదను. ఈయన యెటువంటివాడంటే గుణధరుడు (సకల సద్గుణములను ధరించినవాడు). అయినప్పటికీ నిర్గుణుడు (గుణాతీతుడు). ఇతడే నారాయణుడు (మానవ రూపం ధరించిన శ్రీమన్నారాయణుడు). అందుచేత విశ్వంభరుడు (విశ్వమంతా నిండియున్నవాడు. ఇన్నివిధాల పరమాత్ముడైనప్పటికీ ఈయన ప్రత్యేకతేమంటే ఈతడే నవనీతచోరుడు (వెన్నదొంగ).

ఈ స్వామి యెటువంటివాడంటే మణిమయ కుండల భూషణుడు (మణులతో నిండిన చెవి కుండలములు ధరించినవాడు). ఈయన కువలయదళవర్ణాంగుడు (నల్ల కలువదళములవంటి రంగుకల అవయవములు కలవాడు). ఈయన అండజపతి (పక్షులకు రాజైన

గరుత్మంతుని) వాహనముగా కలవాడు. అగణితభవహరుడు (అసంఖ్యాకమైన పాపములను హరించువాడు). మండన చోరక దమనుడు (చోరకళ అలంకారముగ కలవాడు). మాలాలంకృత వక్షుడు (తులసిదళముల మాలలచే అలంకరింపబడిన వక్షస్థలము గలవాడు) నిండు కృపాంబుధి చంద్రుడు (దయాసాగరమున వుద్భవించిన పూర్ణచంద్రుడు). నిత్యానందుడు (నిత్యము బ్రహ్మానందములో వుండేవాడు)

ఈ దేవదేవుడు, ఆగమ పూజ పదార్థుడు (వేదరాశికి అర్థమై భాసిల్లెడివాడు), ఆ పత్సఖసంభూతుడు (ఆపదలలో వున్నవారికి ప్రియ స్నేహితుడు). నాగేంద్రాయత తల్పుని (నాగేంద్రుడైన ఆదిశేషుని పరుపుగా కలవాడు). నానాకల్పుని అసంఖ్యాకమైన కల్పముల నెఱిగినవాడు). సాగబ్రహ్మమయాఖ్యు (పరబ్రహ్మ అని విఖ్యాతిచెందినవాడు). సంతత గానవిలోలుని (యెల్లప్పుడు మధురమైన, గానామృతమున వోలలాడువాడు). వాగీశ్వర సంస్తోత్రుడు (బ్రహ్మదేవుని చేత కీర్తింపబడువాడు). వైకుంఠోత్తమ (ఉత్తమమైన వైకుంఠమును మోక్షార్థులకు ప్రసాదించువాడు).

ఈ మహానుభావుడు ఇంకా యెటువంటివాడంటే... కుంకుమ వసంత కాముడు. (కుంకుమ, వసంతము అనిన యెక్కువ మక్కువ కలవాడు). గోపాంగనాకుచలిప్తుడు (గోపికారమణుల స్తనగిరులయందు విరాజిల్లెడి వాడు). శంకరుని సతీమణియైన పార్వతీదేవిచేత నుతింపబడువాడు. సర్వాత్ముని సముని (సర్వేశ్వరునితో సమానమైన వానిని), శంకనినాదమృదంగుడు. (మృదంగమువలె భీకరమైన ధ్వనిని వెడలించు పాంచజన్యమను శంఖము హస్తమున కలవాడు). చక్రాయుధవిదీప్తుడు (సుదర్శనము అను చక్రము ఆయుధముగా వెలుగొందువాడు). ఈయన శ్రీవేంకటాచలము నిజస్థానముగాకల శ్రీవేంకటేశ్వరుడు. విభవ విధాయకుడు (సమస్త వైభవములు విధాయకముగా కలవాడు).





సంపుటి: 7 కీర్తన : మేడలెక్కి నిన్నుఁజూచి కూడేననే యాసతోడ
సంఖ్య : 223 పుట : 237 రాగం: రేవతి

## రేవతి

108 మేడలెక్కి నిన్నుఁ జూచి కూడేననే యాసతోడ
వాడుదేరి వుస్సురందురా వెంకటేశ
యాడనుంటి విందాఁకానురా ॥పల్లవి॥

పిక్కటిల్లు చన్నులపై చొక్కపు నీ వుంగరము
గక్కన నేనద్దుకొందురా వెంకటేశ
లక్కవలె ముద్రలంటెరా ॥ ॥మేడ॥

దప్పిగొంటివని నీకు కప్పుర ముపారమిచ్చి
ముప్పిరి నీ విరహానను వెంకటేశ
నిప్పనుచు భ్రమసితిరా॥ ॥మేడ॥

నిండఁబూచిన మానిపై గండుకోవిల కూయఁగా
నిండిన నీ యెలుఁగంటాను వెంకటేశ
అండకు నిన్ను రమ్మంటిరా ॥ ॥మేడ॥

వుదయచందురుఁ జూచి అదె నీ పంజని సవి
యెదురుకోనే వచ్చితిరా వెంకటేశ
బెదరి మారుమామైతిరా ॥ ॥మేడ॥

మిన్నక కేళాకూళిలో వున్న తమ్మివిరులు నీ
కన్నులంటాఁ జేరబోఁగాను వెంకటేశ
పన్ని మరునమ్ములాయరా ॥ ॥మేడ॥

ఆనిన తుమ్మిదలు నీమేని కాంతిఁబోలునని
పూని చేతఁబట్టఁబోఁగాను వెంకటేశ
సూనాస్త్రుని వేగులాయరా ॥ ॥మేడ॥

కందువ మై చెమరించి గందవొడి చల్లుకొని
పొందనిన్నుఁ దలఁచితిరా వెంకటేశ
అంది చొక్కుమందు లాయరా ॥ ॥మేద॥

బొందుమల్లె పానుపుపై నుండి నిన్ను పాడిపాడి
నిందు జాగరము లుంటిరా వెంకటేశ
యెండలాయ వెన్నెలలురా ॥ ॥మేద॥

నిద్దిరించి నీవు నాకు వొద్దనుండ కలగంటి
చద్దివేఁడి వలపాయరా వెంకటేశ
యెండలాయ వెన్నెలలురా ॥ ॥మేద॥

నిద్దిరించి నీవు నాకు వొద్దనుండ కలగంటి
చద్దివేఁడి వలపాయరా వెంకటేశ
సుద్దులింకా నేమి సేసేవో ॥ ॥మేద॥

మల్లెపూవు కొనదాఁకి ఝుల్లనను పులకించి
వుల్లము నీ కొప్పించితిరా వెంకటేశ
కల్లగాదు మమ్ముఁగావరా ॥ ॥మేద॥

జోడుగూడి నీవు నేను నాడుకొన్న మాటలెల్లా
గోడలేని చిత్తరువులై వెంకటేశ
యాడా నామతిఁ బాయవురా ॥ ॥మేద॥

అద్దము నీడలు చూచి ముద్దుమోవి గంటుండగా
కొద్దిలేని కాఁకతోడను వెంకటేశ
పొద్దువోక తమకింతురా ॥ ॥మేద॥

పావురమురెక్కఁ జీటి నీవొద్దికిఁ గట్టి యంపి
దేవరకే మొక్కుకొందురా వెంకటేశ
నీవిందు రావలెనంటాను ॥ ॥మేద॥





బంగారు పీఁటపై నుండి ముంగిటికి నీవు రాఁగా
తొంగి చూచి నిలుచుండఁగా వెంకటేశ
యెంగిలి మోవేలడిగేవు ॥ ॥మేద॥

వున్నతి శ్రీవెంకటేశ మన్నించి కూడితివిదే
నన్ను నెంత మెచ్చు మెచ్చేవు వెంకటేశ
కన్నుల పండువలాయరా ॥ ॥మేద॥

**అవతారిక:**

అన్నమాచార్య కీర్తనా సాగరమధనం దీనితో పూర్తి అవుతున్నది. ఇది శ్రీవేంకటేశ్వరుడు నాచేత చేయించిన 1116 వ సంకీర్తనా విశ్లేషణము. నావంటి అనామకుడికి ఇంత సుకృతం కల్పించిన ఆ స్వామిని ఏమని పొగడుదును? ఏనాటి పుణ్యమో! ఇది ఏతపఃఫలమో! ఏ జన్మ ఋణమో! ఇది ఎప్పటి బంధమో! నా ప్రమేయమేమీ లేకుండానే ఈ 1116 వ కీర్తన గొప్ప జానపద కీర్తనగా రూపుదిద్దుకొన్నది. ఇది ఇలా వివరించడమే నేను చేసిన పూజాఫలం అని మనసా, వాచా, కర్మణా నమ్ముతున్నాను. వీటిని జానపదులు "ఏల" పాటలు అంటారు. నాయిక స్వామికోసం యెదురు చూచింది. ఆమె భ్రమ చెందుతున్నది. అందుకని ఏమంటున్నదో వినండి "ఓ వేంకటేశా! నిన్ను చూచి కూడెదనని ఆశతో మేడలెక్కి వాడిపోయి వుస్సురందునురా. నీవు ఇందాకా ఏడనుంటివిరా?", అని అడుగుతున్నది.

అతి మధురమైన కీర్తన. అవునా? ఇదే కీర్తనను అధ్యాత్మిక దృష్టితో చూస్తే... మేడలెక్కటం అంటే షట్చక్రాలను జాగృతం చేసికొని సహస్రారం చేరటం. అక్కడ శ్రీవేంకటేశ్వరుడు పరమాత్మవలె వుంటాడు. ఈ జీవుడు ఆ దేవుని కలయుటే మోక్షప్రాప్తి. అయితే ఇదంతా చెప్పినంత తేలిక వ్యవహారం కాదు. సాధనయే తగిన విధానము. భక్తియే యుక్తి మరియు శక్తి. శరణాగతియే, అది కూడా మరణం దాకా, సరియైన తరుణోపాయం. ఇది నిజం. ముమ్మాటికీ నిజం. అన్నమాచార్యులవారి

దారిననుసరిద్దాం. హరిని శరణందాము. కర్ణపేయమైన రేవతి రాగంలో మీరు ఈ కీర్తన మధురంగా పాడితే ఆ వేంకటరమణుడు పరవశించడా?

**భావ వివరణ:**

ఓ వెంకటేశ! (శ్రీవేంకటేశ్వరా!) నిన్ను చూచి కూడేనని (కలసెదనని) ఆసతోడ (కోరికతో) మేడలెక్కి (మేడలపైనెక్కి) వాడుదేరి (వడలిపోయి) వుస్సురందురా (ఉస్సురమని నిట్టూర్చానురా!) ఇందాకాను (ఇప్పటిదాకా) యాడనుంటివిరా (యెక్కడవున్నావురా!).

ఓ వేంకటేశ! పిక్కటిల్లు (వుప్పొంగిన) నా కుచములపై చొక్కపు (అందమైన) నీ అంగులీకమును గబుక్కున నేను అద్దుకొన్నానురా! అప్పుడేమైనదో తెలియునా లక్కమీద అంటుకొన్నట్లు ఆ ముద్రలు అంటుకొన్నాయిరా!

ఆ రోజుల్లో దారినబోయేవాళ్ళు దాహం వేస్తున్నదంటే నేటికాలంలో కొద్దిగా వక్కపొడి పెట్టినట్లు ఆ రోజుల్లో కర్పూరపు పలుకులు పెట్టేవారన్నమాట. ఇక్కడ నాయిక కూడా స్వామి దాహం వేస్తున్నదంటే కాస్త కర్పూరం పలుకులు పెట్టిందట అదే దెప్పుతున్నది. ఓ వేంకటేశ! నీవు దప్పిగొంటివని (దాహముతో వున్నావని) నీకు కర్పూరము వుపారము (నోట్లో వుంచుకోటానికి) ఇచ్చి నీవిరహమనే అగ్నిలో ముప్పిరి (మూడు దశలు పొందటం - అద్భుతము, కౌతుకము, మోదము) నేను నిప్పులో బడ్డానేమో అని భ్రమపడ్డానురా! అంతవేదన కలిగించావు.

ఓ వెంకటేశ! నిండా బూచిన, చిగురుమావి కొమ్మలపై గండు కోయిల (మగ కోకిల) కూయగా నీ యెలుగంటాను (నీ కంఠస్వరం అనుకొన్నానురా!) అందుకే నిన్ను రమ్మని పిలిచినానురా! ఓ వేంకటేశ! ఆకాశంలో చంద్రుడు ఉదయిస్తున్నాడు. వాడిని చూచి అదే నీముఖము దొంగతనంగా నన్ను తొంగి చూస్తున్నది, యెదురువెళ్ళి తీసుకువద్దామని





ప్రయత్నించానురా! కానీ తీరా చూస్తే అక్కడ యెవ్వరూ లేరు. బెదిరిపోయి మారుమోమైతిరా (పెడమొగమైనానురా!)

ఓ వెంకటేశ! కేళాకూళిలో (క్రీడా సరస్సులో) తమ్మివిరులు (పద్మములు) వుంటే, వాటిని జూచి అందమైన నీ కన్నులనుకొని నీవు స్నానం చేస్తున్నావని నేను చేరబోయానురా! కానీ ఆ పద్మములే మరుని అమ్ములాయరా (మన్మధుని బాణాలై నన్ను బాధించాయిరా!).

ఓ వెంకటేశ! ఆనిన తుమ్మెదలు (ముసురుకొన్న భ్రమరములు) నీ శరీరకాంతిని బోలియున్నవి. నేను నీ శరీరమేమో అనుకొని తాకబోయాను. అవి చివరికి యేమైనవో తెలుసా? సూనాస్త్రుని వేగులాయెనురా! (పుష్పబాణుడైన మన్మధుని అమ్ములై నన్ను తాకినవి).

ఓ వెంకటేశ! కందుప (వ) మై చెవరించగ (అబ్బురంగా నా శరీరం చెమరించింది). చెమటగావుందని నేను గంధపుపొడి చల్లి మెత్తుకొన్నాను. ఆ తరువాత నిన్ను కలుద్దామనుకొన్నానురా! అయితే ఆ గంధపు పొడి, చొక్కమందు (నేటికాలంలో లావెండర్ పౌడర్) లాగా పరిణమించిందిరా!

ఓ వెంకటేశ! నేను బొండుమల్లెపూలు పరచిన పానుపుపై పడుకొని, నిన్ను పాడిపాడి (నీపై విరహగీతాలనాలపిస్తూనే) వున్నాను. రాత్రంతా నిండు జాగారము (నిద్రలేక) వున్నానురా! అప్పుడు నాకు చల్లని వెన్నెలలే, మండే యెండలుగా తోచినాయిరా!

ఓ వెంకటేశ! నేను నిద్రించగానే నీవు నావద్దనున్నట్లు కలవచ్చిందిరా! ఇక నా వలపు చద్దివేడిదైనది (కాసేపు సంతోషపెడుతుంది కాసేపు మండిస్తుంది). ఇంకా ఆ కథలు యేమి చెప్పమంటావురా!

ఓ వెంకటేశ! మల్లెపూవు కొన (వాడియైన కొస) నాకు గుచ్చుకొని నా ఒళ్ళంతా ఒక్కసారి ఝల్లుమన్నదిరా! వెంటనే నేను పులకించిపోయాను. నా వుల్లము (మనస్సు) నీకు అర్పించానురా! నేను చెప్పేది అబద్ధం కాదురా! నన్ను రక్షించరా!

ఓ వెంకటేశ! జోడుగూడి (జతగా కలిసి) నీవు నేను ఆడుకొన్న మాటలన్నీ తగిలించటానికి వీలులేని చిత్తరువులై నిరాధారమైనవిరా! నేడు ఆ మాటలవుపయోగమే లేదు. ఇంత అయ్యాక కూడా నీవు నామతి బాయవురా! నా ఆలోచనలన్నీ నీ చుట్టూనే పరిభ్రమిస్తుంటాయి.

ఓ వెంకటేశ! అద్దములో నా ముఖము ప్రతిబింబం చూసుకొన్నాను. ముద్దులొలికే నా మోవిపై (పెదవిపై) ఆ గాట్లేమిటిరా! కొద్దిలేనికాకతోడ (విపరీతమైన కోపము వచ్చి) పొద్దువోక తమకింతురా! (నిద్దుర పట్టక చలించి పోయానురా!)

ఓ వెంకటేశ! నేను ఈలోగా ఇంకొకపని చేశాను. ఒక పావురానికి రెక్కలకు చీటీకట్టి నీవొద్దికి పంపించానురా! అయితే ఆ లేఖ నీకు సక్రమంగా చేరుతుందో లేదో తెలియదు. అది తప్పకుండా నీకు చేరాలని ఆ దేవుడికి మొక్కుకొంటూనే వున్నానురా! అది నీకు దొరకాలని దాన్ని చూచి నీవు ఇక్కడకు రావాలని నేను మొక్కని దేవుడు లేడురా!

ఓ వెంకటేశ! నీవు కూర్చుండే బంగారు పీటపైనుండి లేచి నా ముంగిటిలోనికి వచ్చావు నేను తొంగి చూచి నిశ్చేష్టనై అలాగే నిలుచుండిపోయానురా! నన్ను నేనే నీకర్పించుకొంటుంటే ఈలోగా నా యెంగిలిమోవి (పెదవి) కోసం ఆరాటమెందుకురా!

ఉన్నతోన్నతుడవైన వెంకటేశ! (పొడవుకు పొడవైన పురుషోత్తమా!) ఇదే నీవు నన్ను మన్నించి కూడితివి. నన్ను యెంత మెచ్చుకోలుతో మెచ్చుకొంటున్నావురా! నా కన్నులకు పండుగలాయెనురా! నా జీవితం సార్థకమైనదిరా! జీవాత్మనైన నేను పరమాత్మవైన నిన్ను చేరి మోక్షప్రాప్తి పొందానురా! నా జన్మ ధన్యమైనదిరా!





## మంగళా శాసనం

1. శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినామ్
   శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్
2. లక్ష్మీసవిభ్రమాలోక సుభ్రూవిభ్రమ చక్షుషే
   చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళం.
3. సర్వావయవ సౌందర్య సంపదా సర్వచేతసామ్
   సదా సమ్మోహనాయాస్తు వేంకటేశాయ మంగళమ్
4. నిత్యాయ నిరవద్యాయ సత్యానంద చిదాత్మనే
   సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్
5. వైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీతటే
   రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్
6. శ్రీమత్సుందర జామాతృమునిమానస వాసినే
   సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్
7. మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః
   సర్వైశ్చపూర్వై రాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్

**పద్మావతీ సమేత శ్రీశ్రీనివాస పరబ్రహ్మణేనమః**